Rāmācāryulu, Ke. Ke. Em. Ē

Guṇānupāna pathyubōdhini

Kākināḍa, 1928

Record no. 403

## Bibliographic Record Target

రామాచార్యులు, కె. కె. ఎమ్. ఏ.

గుణానుపాన పథ్యుబోధిని / కె. కె. ఎమ్. ఏ. రామాచార్యులు.- కాకినాడ : ఆల్బర్టు పవర్ ప్రింటింగ్ వర్క్సు, 1928.

(1), 3, 256 p. :port. ;21 cm.

Record no. 403

Rāmācāryulu, Ke. Ke. Em. Ē.

Guṇānupāna pathyubōdhini / Ke. Ke. Em. Ē. Rāmācāryulu.- Kākināḍa : Ālbarṭu Pavar Priṇṭiṅg Varksu, 1928.

(1), 3, 256 p. :port. ;21 cm.

Record no. 403

శ్రీ రస్తు.

శ్రీమద్ధన్వంతరయేనమః

# గుణానుపాన పథ్యబోధిని.

ఇందు

340 ఆయుర్వేదౌషధములయొక్క గుణానుపాన పథ్యములను
రోగ సాధ్యాసాధ్య నిరూపణమును ఆరోగ్యము లోనుగా
గల మంచినియమములను అనేక శాస్త్రోక్త ప్రమా
ణములతో విపులముగా వ్రాయబడినవి

---


కె. కె. ఎమ్. ఏ. రామాచార్యులు,

ప్రాప్రయిటరు:

శ్రీమద్వాణీవిలాస ఆయుర్వేద వైద్యశాల,
జగ్గన్నపేట, మొగలికుదురుపోష్టు, రాజోలుతాలూకా,
తూర్పు గోదావరిజిల్లా.


---


కాకినాడ
ఆల్బర్టుపవర్ ప్రింటింగ్ వర్క్సు యందు
ముద్రింపబడియె.
1928.

[ వెల 1—8—0.



# రోగనిర్ధారణ ప్రశ్నలు.

1 రోగి పడుచున్న ప్రస్తుతమందు ఉన్న వ్యాధిని సంగ్రహముగ స్పష్టముగా వ్రాయవలెను.

2 మలమూత్రములు క్రమముగా వెళ్లుచున్నవా? ఏరంగుగా?

3 రోగియొక్క శరీరప్రకృతి వాతమా? మేహమా?

4 జఠరాగ్ని సరిగా నున్నదా?

5 భుజించు పదార్థములలో ఏ పదార్థము తినిన రోగము హెచ్చుగా నుండును?

6 నిద్ర క్రమముగా వచ్చునా?

7 సుఖవ్యాధులు ఉన్నవా? ఉన్న యెడల అవి ఎన్ని?

8 జ్వరము వచ్చుచున్నదా? వచ్చిన నే యే సమయములయందు?

9 ఎప్పుడైనను అయినా కర్పూరసంబంధ రసములను సేవించినారా?

10 కయిపువస్తువులను పుచ్చుకొనుట అలవాటు ఉన్నదా?

11 రోగియొక్క తల్లిదండ్రులు రోగగ్రస్తులా? ఆ రోగము లెవ్వి?

12 శరీరమునకు శీతపదార్థములు అనుకూలమా? ఉష్ణపదార్థములు అనుకూలమా?

13 రోగి స్థూలశరీరుడా? సూక్ష్మశరీరము గలవాడా?

14 రోగి తిరుగువాడా? కూర్చుని పనిచేయువాడా?

15 ఇదివరలో నే యే మందులు సేవించియుండిరి?

16 స్త్రీ అయినచో సంతానవతియా? కాదా? గర్భిణీస్త్రీ అయిన ఎన్నో మాసము? ఋతువు సరిగా జరుగుచున్నదా? ప్రసూతి అనంతరము ఆకాలమున చూలిసములు అన్నియు జారీఅయియుండెనా? ఎ[illegible]మైనది? దేహదార్ఢ్యత ఎట్లున్నది?

17 చంటిపిల్లలైనచో పాలు సరిగా త్రాగునా?

18 చంటిపిల్లలకు కలిగే బాలపాపచిన్నె అనే వాయుసంబంధమైన రోగము ఉన్నదా?

19 కడుపునొప్పి కడుపువెంట జిగురువెళ్ళుట పాలు కక్కుట కలదా?

# విషయములు.

సవాయిరోగౌషధములు, సేవించుకాలమందు, కొన్నిమందులలో మిక్కిలి వీర్యముగల ఓషధాధులు చేరియుండుటచేతను, కొన్నితత్వము లవార్కి ఇగుళ్లు సలిపేయడల, తేనెగాని, కాచిన ఆవుపాలుగాని, గుంట కలగరాకు రసముగాని, రావిచక్క కషాయముగాని, రోజుకు మూడు నాల్గు పర్యాయములు, పుక్కిలించి వుమియుచుండవలెను. కవిరితో తములపాకులకు కొద్దిసున్నమువ్రాసి తాంబూలము వేసుకొనుచుండవలెను. తులశి ఆకులతోనైనా తాంబూలము వేయుచుండవచ్చును కప్పుతోగాని, జొగ్గు పొడుముతోగాని, పండ్లు తోముచుండిన నాల్గు మూడు రోజులలో సలుపుతగ్గి ఆరోగ్యము గలుగును.

☞ లేహ్యాను పానములు 116వ పుటలో ధాతుదృఢీకరణిలో 10 తులములకు బదులు 20 తులములు అని తెలియవలెను.

త్ర్యూషణమన శొంఠి, పిప్పలి, మిరియాలు.





శుభమస్తు.

ఓం శ్రీమద్ధన్వంతరయేనమః

# గుణానుపాన పథ్యబోధిని.

## శ్రీమద్వాణీవిలాస ఆయుర్వేద వైద్యశాల,

జగ్గన్నపేట, మొగలికుదురుపోస్టు, రాజోలుతాలూకా.

తూర్పుగోదావరిజిల్లా, చెన్నరాజధాని.

మావైద్యశాలయందు తయారు కాబడిన భస్మాదులు, వంటౌషధములు, కజ్జలీ ఔషధములు, లేహ్యములు, చూర్ణములు, తైలములు, అరఖులు, కషాయములు, మొదలగువాటికి మాఅనుభవ ప్రకారము శాస్త్ర సమ్మతమును, పూర్వులయొక్క అనుభవమును బుచ్చుకుని, గుణానుపాన, పథ్యబోధిని యను నీపుస్తకమున అష్టస్థాన పరీక్ష, శకునశాస్త్రము, జ్యోతిషము, దూతపరీక్ష, కాలజ్ఞానము, స్వరశాస్త్రము, ఛాయాపురుషము, రోగియుండు యిండ్లయొక్క పారిశుభ్రత, వాయువు, జలము, ఆహారముయొక్క నియమములు, గర్భిణీ నియమములు, శిశుపోషణము, సంభోగనియమములు, అనుపాన సాంకేతికములు ఇంకా అనేక మహద్విషయములతోను 340 రకముల ఆయుర్వేద ఔషధాదులకు యుక్త్యనుభవములతో వ్రాయబడిన అనుపానపథ్యాదులతో చేరియుండు నీగ్రంథమున వివరించిన ప్రకారము సర్వజనులు మావైద్యశాలయందు తయారగుచుండు మందులను వాడుకచేసి, తత్ఫలితమును బొందుదురు గాక యని భగవంతుని ప్రార్థించుచుంటిని.

సాధారణముగ రోగములు ఆగంతుక దోషములనియు, నైసర్గిక దోషములనియు ద్వివిధములై విలసిల్లుచున్నవి. అందు ఆగంతుకములన ఆహార, విహారాదిలోపములవల్ల కలుగు రోగములు. నైసర్గికములనగా, "పూర్వజన్మకృతంపాపంవ్యాధిరూపేణ బాధతే' అనువచనానుసారముగ జన్మాంతరములయందు జేసిన పాపకర్మలచే గల్గు వ్యాధులు. ఈరెంటిలో ఆగంతుక దోషములకు మందులు సేవించిన, తప్పక కుదురును. జన్మాంతరములయందు జేసిన దుష్కర్మలచే వచ్చు వ్యాధులు కేవలము మందులవల్లనే కుదరనేరవు గనుక "తచ్ఛాంతి రవుషధైర్దానైర్జపహోమక్రియాదిభిః" అను వచనానుసారముగ, సూర్యనమస్కారములు, రుద్రాభిషేకము, శివసహస్రనామపారాయణము, గ్రహజపములు, దానములు, శాంతులు, పెద్దలను బూజించుట, అన్నదానము మొదలగునవి జేయుటచే కర్మకొంతవరకు క్షీణించి, ఆవ్యాధులు, చికిత్సలకు సాధ్యపడగలవు.

రోగములు సాధ్యములనియు, సాధ్యాసాధ్యములనియు, అసాధ్యములనియు మూడువిధములు. సాధ్యమనగా సులభముగా వ్యాధికుదురుటయు, సాధ్యాసాధ్యమన మిక్కిలి శ్రమమీద వ్యాధి తగ్గుటయు, అసాధ్యమన మెన్నిశ్రమలు పడినను జీవించకపోవుటయు; కొన్ని రోగములు సులభసాధ్య మయినప్పటికి, సకాలమున చికిత్సజేయక యుపేక్షించుటచే నవి సాధ్యాసాధ్యము లగుచున్నవి. అట్టి సాధ్యాసాధ్యములు గూడా ఒకానొకప్పుడు అసాధ్యములగుచున్నవి. అసాధ్యమనగా మనుజుని తప్పక జంపునది.

మానవదేహికి 120 సంవత్సరములు పరమాయుర్దాయమని జ్యోతిషాదులవల్ల దెలియవచ్చుచున్నది. మనుజునకు బాల్య, యవ్వన, కౌమార, వార్ధిక్యములను నాల్గు అవస్థలు. అందు బాల్యమున జ్ఞానవిహీనముచే జేయు హింసాదికృత్యముల వల్లగల్గు పాపములు, యవ్వనమున స్త్రీలోలత్వాది విషయములవల్ల కల్గు పాపములు, కౌమారమున ద్రవ్యా



శచేతను, వాణిజ్యాది వ్యాపారములయందు వచించు అనృతలోభాదిగుణములచే గల్గు పాపములు, వృద్ధావస్థ యందు తీరని తృష్ణగలవాడై కృద్ధలోభ, విచారములవల్ల కల్గు పాపములు, మనుజుడు నాలుగు అవస్థలయందు తీరని ఆశామోహపాశబద్ధుడై అనేక పాపములు జేయుచున్నాడు. ఈపాపకారణములే యకాలమృత్యువులకు గారణము లగుచున్నవి.

మనుజునకు నూటయొక మృత్యువులనియు, అందు యొకటిమాత్రమే కాలమృత్యువనియు, మిగిలిననూరు నకాలమృత్యువులనియు, (అకాలమృత్యువు లనగా) (1) స్త్రీలు (2) పరిపాలనమొనర్చు రాజు (3) ఖడ్గములు (4) వృక్షజలాది పతనములు (5) సర్పదష్టాది క్రూరవిషములు యివియే అకాలమృత్యువు లనబడును. వత్తియుజమురుతో నున్న దీపము గాలిచే జల్లార్పబడు చందంబున, మనుజులు ఆయువున్నను, మనోనిశ్చలతలేక పాపములు చేయుటచేతను, చికిత్సాలోపముల జేతనున్నూ, అకాలమృత్యువుల వాతబడుచున్నారు. అట్టి అకాలమృత్యువులు గూడా చికిత్స, జపతపహోమాదులు, సూర్యనమస్కార; అశ్వత్థ ప్రదక్షిణ, అన్నదానాదులవల్లను తగ్గగలవని వేదములు ఘోషించుచున్నవి.

శ్లో॥ యావత్కంఠగతాఃప్రాణాః । యావన్నస్యతిచేంద్రియం ।
తావచ్చికిత్సా కర్తవ్యా । కాలస్యకుటిలాగతిః॥

అసాధ్య సన్నిపాతాది ఘోరరోగముల యందుగూడా రోగికి ప్రాణములు కంఠగతమయ్యేవరకున్ను, పంచేంద్రియములు నశించేవరకున్నూ, చికిత్స జేయుచునే యుండవలయును. గాని నూరకుండగూడదు. కాలగతి యెవ్వరికిని తెలియదు గనుక కంఠమందు ప్రాణమున్నంతవరకు, అనుభవజ్ఞుండగు వైద్యుడు శాస్త్రసమ్మతముగ చికిత్స జేయుచునే యుండిన, వ్యాధులు తగ్గగలవు. మరియు వ్యాధులు గ్రహచారదోషములవల్లకూడా కలుగునని జ్యోతిష్కులు వచించెదరుగాన గ్రహశాంతులు జేయించి, చికిత్సజేయుట కర్తవ్యము.

శ్లో॥ వైద్యావదంతికఫపిత్తమరుద్వికారాన్
జ్యోతిర్విదోగ్రహగతింపరివర్తయంతి ।
భూతాభిషంగయితి భూతవిదోవదంతి ॥
ప్రాచీన కర్మఫలవన్మునయో వదంతి॥

రోగి ఆయుర్వేదమును చక్కగా నభ్యసించిన వైద్యునిబిలిపించి, ఈరోగము యెందువల్ల జనించినదని యడిగిన, వాతపైత్య శ్లేష్మము లలో ఏదోయొకటి దూషింపబడినది; దానికి వాతరాక్షసమో, శీతాంశు రసమో లేక కాంతవల్లభ రసమో ఒకమాసమురోజులు సేవించిన తప్పక తగ్గును అని చెప్పును. జ్యోతిష్కుని రావించి యీవ్యాధి ఏమికారణము వల్ల కలిగినదని యడిగిన, గురుడో, శనియో, లేక రాహువో ద్వాదశ మందునో, జన్మస్థానమందునో యున్నాడు. అదిన్నీగాక జాతకరీత్యా అష్టమాధిపతిదశయందు ద్వితీయాధిపతిఅంతరమువచ్చినది. ఆకారణముచే యీరోగము జనించినది. ఈరోగము ఆయాగ్రహములు ఆస్థానములనుండి సంవత్సరమునకో ఆరుమాసములకో మరియొకరాశికి వెళ్ళే పర్యంతము ఇట్లనేయుండును. అంతదనుక, గ్రహజపములు జేయించి శాంతిగావించిన రోగముశాంతి జెందునని జెప్పును. భూతవైద్యమెరిగిన మాంత్రికుని ఆ రోగికడకురావించి, యీరోగమెందుచే జనించినదనియడిగిన శాకినియో, ఢాకినియో లేక ప్రతిబంధకమో, ప్రయోగమో, ఏదైన తొక్కుట చేతనో, యీరోగము సంభవించినది. దీనికి శివసహస్ర నామ పారాయణమో, మహామంత్రజపమో లేక ముగ్గులువేసి దిగదుడుపుయో తీసి వేసినతగ్గునుఅనిచెప్పును. బ్రహ్మజ్ఞానులనురావించి యీరోగము ఎందుచే జనించినది అని అడిగిన

శ్లో॥ నాభోక్తం క్షీయతేకర్మ, కల్పకోటిశతైరపి ।
అవశ్యమనుభోక్తవ్యం కృతంకర్మశుభాశుభం॥

అనునట్లు పూర్వజన్మార్జిత పాపమో, యీ జన్మార్జిత పాపమో అనుభవించు చున్నాడు. కర్మ అనుభవిస్తేనేగాని క్షీణించదు. యెన్ని



కల్పాంతములకైనా యీ జన్మమందు కాకపోతే మరియొక జన్మమం దైనప్పటికి కర్మ అనుభవిస్తేనేగాని నశించదు గనుక కర్మపరిపాకమగుట తోడనే వ్యాధి పూర్తిగా తగ్గిపోవును. అంతవరకు భగవధ్యానము జే యుచు ఏదో ఔషధమందు సేవిస్తూ యుండవలసినదని జ్ఞానులు నుడివెదరు.

గాన దీనిలో ఏప్రకారముగానైనా సరే, రోగి నిశ్చలమనస్సుగల వాడై గ్రహశాంతులు, జపములు, దానములు జేయుచు, తాను భగవ ధ్యానము జేయుచు తగు చికిత్సలను జేయించవలయును.

చికిత్సలు త్రివిధములు. అందు మొదటిది శస్త్రముల నుపయో గించుట; రెండు కషాయాదుల నిచ్చుట, మూడు లోహములతో జేరి యుండు మందుల నుపయోగించుట.

చికిత్స యన నేమి ? శరీరమున ఉద్రేకించిన వాత, పైత్య, శ్లేష్మ ములను సమత్వస్థితికి, ఔషధానుపానములతో తెచ్చుటయే చికిత్స యనంబడును.

చికిత్సకు నాల్గు అంగములు. ఒకటి రోగి. రెండు ఉపచారము జేయువాడు. మూడు ఔషధములు. నాల్గు వైద్యుడు. ఈ నాల్గుఅంగ ములయొక్క అనుకూలతయే రోగశాంతికి ముఖ్యకారణము.

రోగి తెలివిగలిగి భయపడకుండుట, తనకుండుకున్న బాధలను చెప్పగలిగి యుండుట, వైద్యుడు చెప్పినటుల నడచుకొనుట.

పరిచారకుడు రోగి అభిప్రాయమును గుర్తెరిగినవాడై, రోగియెడ మిగుల ప్రేమగలవాడై తగు నుపచారములు జేయుచుండుట.

ఔషధము, మంచి ప్రదేశములందు బుట్టిన సారవంతములగు మూలికలచేతను, క్రమప్రకారము శుద్ధులొనరించిన రస, విష, గంధకా దులతోడను, శాస్త్రానుసారముగ, సువాసనయు, అందుండు వీర్యము చెడకుండా, తయారుజేసి, సకాలమున యిచ్చుచుండవలయును.

వైద్యుడు, శుభ్రత గలవాడై, నిర్మలవస్త్రములను ధరించి భూతదయ గలిగి, గురు, దైవభక్తియే మనస్సున నిడుకొని, నిర్మలహృద

యుడై ఆ యా వ్యాధులు కర్మజములో, ఆగంతుక దోషములో, దేశకాల పాత్రలను జక్కగా దెలుసుకొని, ఔషధమును, పథ్యమును, అనుపానమును యుక్త్యనుభవములతో, దెలసి వైద్యముజేయు వైద్యులు కీర్తిని గాంచగలరు; మరిన్ని వైద్యుడు నాడీజ్ఞానమువల్లనే రోగమును గుర్తించుట కష్టము. ఎందుచేతననగా ప్రకృతి శరీరములయందు నాడులు కొందరికి చర్మగతిగా యుండి బాగుగా కనిపించుటయు, మరికొందరికి మాంసగత మగునప్పుడు నాడి కనుపడి కనపడక యుండుటయు, కొందరి నాడులు దృశ్యమే కాకుండుటచేతను, యీ నాడులు విషయమై కొందరు తర్జనీచే పిత్తనాడిని, మధ్యమ వ్రేలిచే శ్లేష్మనాడిని, అనామికముచే వాతనాడిని కనుగొనవలయుననియు, మరికొందరు తర్జనీయందే వాతనాడిని, పిత్తనాడిని మధ్యమ వ్రేలియందును, కఫనాడిని అనామికనుందు కనుగొనవలెననియు నుడివిరి. ఈ నాడీజ్ఞాన విషయమై అభిప్రాయభేదము లుండుటంబట్టియు, ప్రకృతిభేదము లుండుటచేతను, కేవలము నాడీజ్ఞానమువల్లనే రోగములను దెలసుకొని, చికిత్స జేయుట కష్టమని మనపూర్వులు అష్టస్థాన పరీక్షయని, 1 నాడీ 2 స్పర్శ 3 రూపము 4 శబ్దము 5 నేత్రము 6 మూత్రము 7 పురీషము 8 జిహ్వ వీటివలన రోగములను నిస్సందేహముగ దెలుసుకొనగలరని, నీ అష్టస్థాన పరీక్షను విమర్శగా వ్రాసిరి. అట్టి దానిని బాగుగ చదివియు, గురుముఖత గుర్తించియు వైద్యము జేయుటయేగాక, స్వప్న శాస్త్రము, శకునశాస్త్రము, దూతపరీక్ష, జ్యోతిషము, కాలజ్ఞానమును దెలసినవారైన, బంగారునకు పరిమళ మబ్బినటుల, వారి వైద్యము బాగుగా శోభించును. వైద్యుడు రోగముగల మనుష్యునియొక్క అష్టస్థానములను ముందుగా పరీక్షింపవలెను.

## నాడీ పరీక్ష.

శరీరమున వ్యాపించినట్టియు, హస్తముయొక్క బొటన వ్రేలుకు దిగువ, అనామిక, మధ్యమ, తర్జనీ రూపమగు, అంగుళత్రయము నాశ్రయించి, అందు మొదటిదియగు తర్జనీ, పైత్యనాడిని, రెండవదియగు



మధ్యమ, శ్లేష్మనాడిని, మూడవదియగు అనామిక వాతనాడిని దెల్పుచుండును. ముందుగా చేతిని బాగుగా పిసికి, మెటికలు విరచి, మూడువ్రేళ్లతోను, నాడిని పరీక్షింపవలెను.

## వాత నాడి.

వాతనాడి వక్రగమనము కలదిగా, అనగా అడ్డముగా, గమనవిశేషమున, తాబేలు, పాము నడకవలె వంకరగను, జలగవలెను, ఉయ్యాల తొట్టివలెను, నీటియందలి మత్స్యగమనమువలెను నడచుచుండును.

## శ్లేష్మ నాడి.

మందముగను, గమనవిశేషమున నెమలి, యేనుగ, హంస, కోడి వీటి నడకతో సమానముగ నడచును.

## పైత్య నాడి.

చంచలస్వభావము కలదిగను, గమనవిశేషమున కప్ప, చిలుక కాకి, లావుకపిట్ట లేక తీతువ, వీని గమనముతో తుల్యముగా నడచును.

## ద్వంద్వ నాడులు.

వాతపైత్యములు గలశిన, మొదట సర్పగతిగను, పిదప కప్పయొక్క నడకయు నడచును.

శ్లేష్మవాతములు గలసిన మొదట హంస లేక గజము వీటి నడక నడచి, పిదప కప్పయొక్క గమనమువలె నడచును.

శ్లేష్మపైత్యములు గలశిన, మొదట, నెమలి, యేనుగ, కోడి వీటి గమనమువలె నడచి, పిదప, కప్ప, చిలుక, కాకి, వీటి గమనవిశేషములతో సమముగ నడచును.

యీ విధముగనే, ద్వంద్వనాడులను, అనగా, వాతపైత్యము, పైత్యవాతము, శ్లేష్మవాతము, వాతశ్లేష్మము, శ్లేష్మపైత్యము, పైత్యశ్లేష్మము, మొదలగు నాడులను, ఆ యా గమనవిశేషములవల్ల అనుభవజ్ఞుండగు వైద్యుడు చక్కగా దెలుసుకొనవలెను.

మరియు వాతాధిక్యంబును అనామిక దిగువను, శ్లేష్మాధిక్యతను, మధ్యమాంగుళియొక్క దిగువను, పైత్యాధిక్యమును, తర్జనీ దిగువను, నాడి దృఢముగా చలించుచుండును. పైవిధముననే, ద్వంద్వనాడులు, యీ నిదానమునుబట్టి గూడా గ్రహించవచ్చును.

కరమూలే, పాదమూలే, నాడీ వహతిదృశ్యతాం।
నారీణాం వామభాగేచ, పుంసాందక్షేతు శోధయేత్ ॥

కరమూలమందు, పాదమూలమందు, నాడి సంచరించుచుండును. గాన స్త్రీలకు ఎడమచేయిని పురుషులకు కుడిచేయిన్ని పరీక్షించవలెను.

స్త్రీలకు ఎడమచేయి పురుషులకు కుడిచేయి చూచుటకు కారణము

నాభీ ప్రదేశమున, కూర్మ్మమను నాడి, పురుషులకు ఊర్ధ్వముఖముగా నుండుటచేతను, కూర్మ్మముయొక్క చేయి కుడివైపు కుండును, గాన పురుషులకు, కుడివైపు హస్తపాదములను, బరీక్షించి వ్యాధులను దెలుసుకొనవలెననియు, ఆ కూర్మ్మము అను నాడి, స్త్రీలకు, అధోముఖముగా యుండుటచేతను, అపుడు కూర్మ్మముయొక్క కుడిచేయి ఎడమవైపు తిరుగును. అపుడు నాడులు వ్యత్యస్థమగును. గనుక ఎడమవైపు హస్తపాదములను బరీక్షించి స్త్రీరోగములను దెలుసుకొనవలయునని యు పెద్దలు నుడివిరి.

## అష్ట ధాతుస్థానములు.

చీలమండలకు క్రిందిభాగమున, మూడంగుళములు పరిమిత స్థానమునందును, హస్తమందుండు నాడులు, ముంజేతికి అనగా మణికట్టు క్రిందిభాగమున మూడంగుళముల ప్రదేశమందును, ముక్కున కిరుప్రక్కల నొక్కంగుళము పరిమితిగల స్థానమును, కంఠమున కిరుపార్శ్వములయందు రెండంగుళముల పర్యంతము, నిమపుగల ప్రదేశమునందును, వుండును. గావున, యీ యెనిమిది స్థానములను ప్రాణ మాశ్రయించి యుండును. గాన వైద్యులు ఆ యా స్థానములను జక్కగా బరిశీలించి, వ్యాధులను దెలుసుకొనుచుండవలెను.



## రోగములేనివానియొక్కనాడి

ఏలుగుపాము (లేక) ఎర్ర, రాజహంస, మదించిన ఏనుగవీటిగమనముగలిగి, మిక్కిలి పుష్టి, మిక్కిలి మందము లేక, ప్రసన్నముగ, స్థిరమై బలముగలిగియుండును.

## ఆహారాది భేదనాడి.

బెల్లము, శర్కర మొదలగు తీపువస్తువులు నేయి మొదలగు తైలవస్తువులు భుజించినప్పుడు నాడి లావుగాయుండును, మాంసాహారములు దినినప్పుడు కర్రవలె బింకముగానుండును. పాలు పుచ్చుకొనునప్పుడు మెల్లగను, మధురపదార్థములు దినినప్పుడు, వాతగమనము, కూర్మ్మవ్యాఘ్రాదిగమనములతో తుల్యముగ నడచును. అరటిపండు, వడియములు అప్పళములు, దుంపకూరలు, వేపుడులు, దినినప్పుడు, పైత్యాధికము, కాకి కప్ప వీటి గమనములు కలదై యుండును.

## సన్నిపాతనాడి.

కట్టెలుమోపునడుమ, చుంచు, లేక, ఎలుక తిరిగి నట్టుగ కుటిలముగను, సిధిలముగను, మెల్లగను, సూక్ష్మముగను, అతి చంచలముగను, నడచును.

## సంశయనాడి.

అపుడు భోజనము జేసినవానికి, ఉపవసించినవానికి, త్రోవ నడచి, అలశినవానికి, బడలినవానికి, భూతావేశముగల వానికి, ఏడ్చినవాడినికి, మిథునకర్మ్మజేసినవానికి, కల్లు సారాయి గంజాయి, మద్దత్తు పుచ్చుకొనినవానికి, వెర్రివానికి, అపస్మారరోగికి, యోగాభ్యాసికి, కోడి, కప్ప కుందేలు, పాము, వీటిమాంసము దినినవానికి, చమురుబూసుకొన్నవానికి, ఆకలిదప్పిగలవానికి, నాడి స్వస్థతగాయుండదు గనుక, వారికి నాడీ పరీక్ష జేయుంజనదు.

## అసాధ్యనాడి.

వాత శ్లేష్మ పైత్య నాడులగతులు, మందముగను, శిథిలముగను, వ్యాకులముగను, ఆగి, ఆగియు, అశ్వగతిచందంబున, అతితొందరగను, యెవనియొక్క హస్తమందు గనుపించునో, ఆరోగి బ్రతుకుట దుర్లభము.

## జ్వర నాడులు.

వాతశ్లేష్మపిత్తనాడులు, మూడున్ను, తీవ్రముగ, వక్రగమనముగ నడచి, శరీరము, ఉష్ణస్థితిని జెందిన, బాహ్యజ్వరమనియు, యీ మూడు నాడులు, మందగతితో వంకరగనడచిన, అంతర్గతజ్వరమనియు, వాతపిత్త నాడులు సరిగానుండి, శ్లేష్మనాడిమందముగ నడచిన, అస్తిగతజ్వరమనియు తెలుసుకొనవలెను.

## అసాధ్యనాడీగమనములు.

మంద, మందముగను, అతిచంచలముగను, ఆగి, ఆగియును, దృశ్యాదృశ్యముగను, అతివేగరముగ నెగురుచును, మాంససంచారిగను, అతివంకరగను, అతిసూక్ష్మంబుగను, వేసవికాలంబున జల్లగను, శీతవర్షాకాలములయందు, మిక్కిలి, తాపంబుగను, మాటిమాటికి, అనేక గతులగను, చక్రముమీద కూర్చున్నవాడెట్లుతిరుగునో, అదేరీతిగను, కడు నిశ్చలంబుగను, నాడి వణకుగను, వకప్పుడు, కొద్దిగాకదలి, అంతలోన కనబడకపోవుటయును, మరల వెంటనే కనబడుటయును, మెరుపువలె కనబడి వెంటనే కనుపడకబోవుటయును, వెచ్చనై వంకరగను, సర్పగతివలె మిక్కిలి వంకరగను, పాదమందు నాడి కనబడుచును, హస్తమందు నాడి కనబడకపోవుటయును, శిథిలంబుగను, జీర్ణముగను, అత్యగ్రజ్వరము తగిలి, నాడిశీతలముగ నుండుటయును, డమరుకమువలె నుండుటయును, తర్జనవ్రేలికి పైభాగమున రెపరెపలాడుచు అతితొందరగను, అనామికకు క్రిందిభాగమున, అతిమందముగను, వాతపైత్యశ్లేష్మనాడులు గతులు



మందముగను, అశ్వగతిచందంబున. మిక్కిలి వేగముగను, ఎవరిహస్తమందు, పైన వ్రాశినగమనములలో, ఏగమనమగుపించినను, అతనికి, జీవితాశలేగనియు, కడుశీఘ్రముగ మృతిజెందుననియు నెరుగవలెను,

☞ వైద్యుడు రోగియొక్క హస్తమును జూచియు, అష్టస్థానపరీక్షలను జేసినపిమ్మట తన హస్తమును కడుగుకొనిన, నారోగియొక్క వ్యాధులు తగ్గునని మహారుషులు వచించిరి.

## స్పర్శ.

వాతరోగికి శరీరము మొద్దుబారినటు లుండి కించిదుష్ణముగా యుండును. పైత్యరోగికి మిక్కిలి వుష్ణముగాగాని, కలువకాడలవలె మిక్కిలి చల్లనైగాని యుండును. శ్లేష్మరోగికి సామాన్యమయిన చల్లగను, ద్వంద్వరోగికి అనేకవిధములుగ నుండును.

## రూపము.

వాతరోగి శరీరము నల్లగను, పైత్యరోగియొక్క శరీరము ఎరుపుగాగాని, పచ్చగాగాని యుండును. శ్లేష్మరోగియొక్క శరీరము తెల్లగా యుండును. ద్వంద్వరోగియొక్క శరీరము, ఆ యా మిశ్రమములనుబట్టి ఏదేది కలసినప్పుడు ఆ యా విధముల రంగులు గలసి కన్పట్టుచుండును. సన్నిపాత రోగమందలి శరీరము వివర్ణత జెందియుండును.

## శబ్దము.

వాతరోగియొక్క మాటలు సమముగా యుండును. పైత్యరోగియొక్క మాటలు నవ్వుచు, వదరుచు, మరుపు తెరుపుగా మాటలాడును. శ్లేష్మరోగియొక్క మాటలు కడు హీనస్వరముగా, నూతిలోనుండి మాట్లాడువాని మాటలువలె నుండును.

## నేత్రములు.

వాతరోగియొక్క కండ్లు నల్లగగాని, కొంచము మబ్బుగాగాని నీరు గారుచూగాని, యుండుననియు, పైత్యరోగియొక్క కన్నులు పచ్చగాగాని, లేక, ఎరుపుగాగాని యుండుననియు. శ్లేష్మరోగియొక్క కన్ను

లు పుసులుకట్టిగాని, తెల్లగాగాని యుండుననియు, సన్నిపాతరోగియొక్క కన్నులు ఎరుపుగాగాని, పచ్చగాగాని పలువిధము లుండుననియు, కామిలారోగియొక్క కండ్లు కేవలము పచ్చగా నుండుననియు మహర్షులు వచించిరి.

## మూత్రము.

వాతరోగికి మూత్రము తెల్లగను, పైత్యరోగికి యెరుపుగను, శ్లేష్మరోగికి తెల్లగ నురుగు గట్టియును, ద్వంద్వరోగికి అనేక విధములుగను మూత్రము వుండును.

రోగి తూర్పు తెల్లవారునపుడు లేచి, శుభ్రతగ కడిగిన గాజుపాత్రియందుగాని, మృణ్మయ పాత్రియందుగాని, మొదట ధారవిడచి. మధ్యధారను మూత్రోత్సర్జనము గావించి, అది సూర్యరశ్మియందు బూడిదవగైరా పడకుండా భద్రముగానునిచి, పుల్లతో గలిపి, అందొక తైలబిందువును విడచి, రోగమును జక్కగా బరీక్షించవలెను.

తైలబిందువు శీఘ్రముగా వ్యాపించిన వాతరోగమనియు, తైలబిందువు వ్యాపించక వేసినది వేసినటులే యుండిన, పైత్యరోగమనియు, తైలబిందువు బుగ్గలు బుగ్గలుగవిడిన శ్లేష్మరోగమనియు దెలియవలెను,

తైలబిందువు సముద్ర తరంగములుగా యుండి నురుగు గట్టిన, సన్నిపాత రోగమనియు, తెలియవలెను. తైలబిందువు మునిగిన త్రిదోషమనియు, నా రోగము గుదురుట దుర్లభమనియు దెలియవలెను.

ఆ తైలబిందువు, పద్మాకారముగ గాని, శంఖచక్రాకారమును జెందిగాని, వీణాకారముగగాని, సింహాసనాకారముగగాని, ముకుళించిన మల్లెమొగ్గాకారముగ గాని, పృథుకాకారముగ గాని, (అనగా అటుకగింజ) దర్పణాకారముగగాని, ఛత్రాకారముగ గాని, చామరాకారమును జెందిగాని, మకరకుండలాకారముగ గాని, గన్పట్టిన, నా రోగము సాధ్యమని నెరుగవలెను.



మూత్రమందు వైచిన తైలబిందువు ఖండ ఖండములుగా గాని, శస్త్రము, విల్లు, త్రిశూలము, రోకలి, నక్క, పాము, పిల్లి, బాణము, దున్నపోతు, పులి, సింహము, కోతి, ఎలుక, పంది, తేలు, పక్షి, తాబేలు, కప్ప, జల్లెడ, శిరోహీన నరాకారముగగాని, ఏనుగాకారముగ గాని, తమలపాకాకారముగ గాని యుండిన, నా రోగము అసాధ్యమని వైద్యులెరుగవలయును.

పాత్రాధోభాగమున మిగుల రక్తవర్ణముగా యుండిన, అతిసారరోగముగ గ్రహించవలెను. పాత్రయొక్క అడుగున నేతికణములవలె నుండిన, వుదరరోగమని గ్రహించవలెను. మూత్రము నలుపువర్ణముగ యుండి, నా రోగము కుదురుట దుస్తరము. మూత్రము ధూమ్రవర్ణముగానుండి కించిత్ పచ్చగా యుండిన, జ్వరరోగమనియు, మూత్రము మజ్జిగవలెగాని, క్రొవ్వువలెగాని యుండిన, ఆమవాత రోగమనియు, మూత్రము కడు రక్తవర్ణముగా నుండిన, మేహరోగముగను, మూత్రము నూతియందుండు జలమువలె నుండిన అందు రోగము లేదనియు, దెలుసుకొనవలెను.

## పురీష లక్షణము.

వాతరోగికి మలము బద్ధముగానైనా, లేక, నలుపుగానైనా వుండును. పైత్యరోగికి పచ్చగాగాని లేక, ఎరుపుగాగాని యుండును. శ్లేష్మరోగికి నురుగుతో గలసిగాని, బంకతో గలిసిగాని, మలము తెల్లగా వెడలును. ద్వంద్వరోగికి అనేక విధములుగ నుండును.

## జిహ్వ.

నాలుక కొంచము కొంచముగా పగిలి ముండ్లుకలిగి, పచ్చగా నుండిన వాతరోగ మనియు, నోట నీరూరుచు నల్లగాగాని, యెరుపుగాగాని యుండిన, పైత్యరోగమనియు, ద్రవము గలిగి జిగురుతో గలసి తెల్లగాయుండిన శ్లేష్మరోగ మనియు, ద్రవములేక ముండ్లుకలిగి నల్లగ యుండిన సన్నిపాత రోగమనియు, పైనుదహరించిన ప్రకారము ద్వంద్వ రోగములయందు మిశ్రవర్ణములు జెందియుండును.

## వైద్యమునకు దగనివారలు.

అంధుడు, చెమిటివాడు, కుష్టురోగము గలవాడు, అంగవిహీనుడు, కుత్సిత స్వభావుడు, శీఘ్రకోపి, రోగమునకు ద్రవ్యము నిష్కర్ష జేసుకొని, వైద్యము జేయువాడు, యెల్లప్పుడుమురికివస్త్రములు ధరించువాడు, బంధుద్వేషి, వికటవాది, బుద్ధిమాంద్యము గలవాడు, పనికిరాని మాటలచే కాలము గడుపువాడు, ప్రయోజనములేని వాదములు జేయువాడు, స్నాన సంధ్యానుష్ఠాన జపతపాదులను వదలినవాడు, హస్తపాదములయందు నల్లటి రేఖలు గలవాడు, మాటలాడుచుండునప్పుడు నోట తుంపురులు రాలువాడు, అపరకర్మలు జేయించువాడు, పనులయందు ఎడమచేతిని నుపయోగించువాడు, కుయుక్తిగలవాడు, సదా దుర్మార్గ చింత గలవాడు, విశ్వాస రహితుడు, అనృతవాది, ఘాతుక కృత్యము లాచరించువాడు, కఠినచిత్తుడు, మూర్ఖచిత్తుడు, సదా పరాన్నమును దిని బ్రతుకువాడు, అధర్మ నిరతుడు, పరస్త్రీలను పరిహరించువాడు, చండాలుడు, కిరాతుడు, వీరలచే బుద్ధిమంతుండగువాడు వైద్యము చేయించుకొనరాదు.

## వైద్యోపదిష్టగురు లక్షణము.

జ్ఞానవంతుడును, ఆయుర్వేదమును జక్కగా జదివిన వాడును, సత్యవంతుడును, నాడీపరీక్షను జక్కగా దెలసి సూత్రచికిత్స జేయువాడును, ఇంద్రియ నిగ్రహుడును, మంత్రయంత్ర సిద్ధుడును, జ్యోతిషజ్ఞుడును, నిత్యానందము గలవాడును, జీవబ్రహ్మైక్య సంధానపరుడును, భూతదయ గలవాడును, శ్రోత్రియుడును, ఆచారము గలవాడు నగునట్టి వైద్యశాస్త్రవేత్తయే వైద్యోపదేశమునకు తగియుండును.

వాణిజ్యము, జ్యోతిషము, యాజ్ఞికము, వైద్యము, యివి శాస్త్రమును దెలియక చేయరాదు. అటుల జేసిన బ్రహ్మహత్య పాతకము జేసిన పాపము సిద్ధించును. గనుక, సర్వప్రయత్నములచేతను వైద్యుడు శాస్త్రమును జక్కగా జదువవలయును.



## దూ త ప రీ క్ష.

దూత అనగా రోగికడనుండి వైద్యునిబిలచేవాడు. గ్రుడ్డివాడు, కుంటివాడు, మూగవాడు, బధిరుడు, చేతియందు కత్తినిధరించినవాడు, సన్యాశి, నపుంసకుడు, ఆడది, వృద్ధుడు, అంగవిహీనుడు, రోగపీడితుడు, ఆకలిదప్పికలచే పరితపించువాడు, తొందరగా మాటలాడువాడు, చిత్తశుద్ధిలేనివాడు, చిత్రవస్త్రధారుడు, తడిబట్ట కట్టుకొన్నవాడుచేతులు పిసుకుకొనువాడు, వెంటరమ్మని తొందరజేయువాడు, వంటి కాలుమీద నిలబడువాడు, కుత్సితుడు, పరాన్నము దిని బ్రతుకువాడు, బంధుద్వేషి, కొండెగాడు, దురాచారుడు, నీచకృత్యములు జేయువాడు. దుఃఖితుడు, చర్మమును చేతబట్టి యున్నవాడు, బట్టతలవాడు లోనగువారలు, దౌత్యమునకు తగినవారలుగారు సత్కులమందు బుట్టినవారలు, వాక్పటుత్వము గలవాడు, ఆచారవంతుడు, శ్వేతవస్త్రధారి, మంచి నడవడిక గలవాడు, సుఖవంతుడు, స్వజాతీయుడుగా యుండుటయేగాక, యేనుగ వృషభముగుర్రము లోనగువాటిలో యేదోయొకటి వాహనము గలవాడై, ఫలములు పుష్పములు దీసుకొని వైద్యునిదగ్గరకు వెళ్లవలెను,

శ్లో॥ పూర్వపశ్చమనైరుత్యాం ఉత్తరేవాస్థితాయది।
దూతావిభాషితాజ్ఞేయం శుభం భవతినిశ్చయం॥

తూర్పుదిక్కున, పడమరదిక్కున, నైరుతిదిక్కున, ఉత్తరదిశయందు, నిలచి పిలచినేని, రోగికి శుభముగల్గును.

శ్లో॥ యమ, ఆగ్నేయవాయువ్యే । ఈశాన్యేవాస్థితాయది।
దూతావిభాషితాతజ్ఞేయా శుభం భవతి నిశ్చయమ్॥

దక్షిణదిశయందు, ఆగ్నేయదిశయందు, వాయువ్యదిశయందు, ఈశాన్యదిశయందుండి దూత వైద్యుని, పిలిచెనేని నారోగికి అశుభము గలుగునని యెరుగవలెను.

గీ॥ చెప్పవచ్చినవాడు చేరంగబడినేని
చెప్పి ఆవలింతజేసెనేని

చెప్పుచు కూర్చున్న చేపుడక విరిచిన
హతముణొందు రోగి నాక్షణంబు.

గీ॥ నిద్రదెల్పిజెప్ప, నిశియందు జెప్పిన,
వెజ్జుగుడువజెప్ప, వెగడుపడగ,
యెంగిలియైజెప్ప, యెంగిలితోజెప్ప,
మానదండ్రు, రోగమాదిమునులు.

దూత, గోడవగ్గెరాలకు జేరబడి చెప్పినను, రోగియొక్క సంగతులు వైద్యునితో చెప్పుచు, ఆవలించినను, చెప్పుచుకూర్చున్నను, చేతితో పుడక మొదలగువాటిని విరిచినను, రోగి తక్షణమే మృతిబొందునని తెలుసుకొనవలెను.

వైద్యుడు నిద్రబోవుచుండగా, మేలుకొల్పి చెప్పినను, నిశీథమందు అనగా రెండుఝాములువేళ చెప్పినను, వైద్యుడు భోజనము జేయుచుండగా చెప్పినను, వైద్యుడు తల్లడపడుచుండగాగాని నిశ్చేష్టుడైయుండగాగాని, చెప్పినను దూత ఏదైనాతినుచు చెప్పినను వైద్యుడు ఏదైనా తినుచుండగా చెప్పినను, ఆరోగము కుదరదని మహర్షులు వచించిరి.

గీ॥ కాళ్లు మొగము, తాను గడిగినపిమ్మట,
సంధ్యదేవపూజ సల్పుమీద,
మజ్జనానంతర, మరిభోజనముమీద,
జెపవలయు దూతచేష్టలెల్ల.

వైద్యుడు కాళ్లుమొగము గడుగుకొనిన తర్వాతను, సంధ్యావందనాదికృత్యములు తీరినపిమ్మటను, దేవపూజానంతరమునందును, స్నానముజేశినపిమ్మటను భోజనమయినతరువాతను, చెప్పవలెను. అనగా వైద్యుడు, నిశ్చలబుద్ధితో నున్నప్పుడు, రోగియొక్క గుణములు యావత్తు, విమర్శగా జెప్పవలెను.

దూత, వైద్యుని ప్రశ్నించినప్పుడు, ఆప్రశ్నయందు యెన్ని అక్షరములు గలవో, వాటిసంఖ్యలో వకటిచేర్చి, ఆమొత్తమును రెండెట్టి



గుణించి, మూడుచే భాగించగా, వకటి మిగిలినేని, శీఘ్రముగా రోగము తగ్గుననియు, రెండు మిగిలిన, రోగము ఎక్కువ అగుచున్నదనియు మూడుమిగిలిన, రోగి మరణముజెందుననియు తెలియవలెను.

దూత, రోగివద్దనుంచి, వైద్యునివద్దకు వెళ్లేటప్పుడు, అశుభశకునము లయ్యేనేని రోగికి శుభము గలుగుననియు, శుభశకునము లయ్యేనేని రోగికి అశుభము గలుగుననియు, నెరుగవలెను.

శుభశకునములు.

శకునంతు బృహస్పతిః, శకునముచూచి వెళ్లవలెనని బృహస్పతిమతము

రోగిని చూచుటకు వైద్యుడు బోవునప్పుడు ఎదురుగా వచ్చునవే శకునములు.

డోలు, సన్నాయి, భేరీమృదంగాది మంగళవాద్యములు, మ్రోగుచుండుట, (లేక) ఎదురుగావచ్చుట, నవరత్నములు, బంగారు, వెండి తామ్రము, అద్దములు, గొడుగులు, అక్షతలు, ఏనుగ, గుర్రము, దూడతోగూడిన ఆవు, సపుత్రికస్త్రీ, కన్యలు, బోగముచాండ్లు, పండ్లు, కాయలు, పుష్పములు, నిరోదనశవము, పాలు, పెరుగు, క్షీరాన్నము, తెల్లని యన్నము, నీళ్లకడవల జోడు, పొగలేని అగ్నిహోత్రము, మంటసేన కల్లు,చేపలు, కర్రయుచెప్పులు గొడుగుతో కూడియున్నశూద్రుడు పసుపు, గంధము, ఒక రాజు, యిద్దరు బ్రాహ్మణులు, నల్గురు కోమట్లు మాంసము, ధౌతవస్త్రరజకస్త్రీ, వీణ, పేలాలు, ధనము, చెరుకు, గాజులుసెట్టి, తమలపాకులు, ఉద్ధృతగోమయము వీనిలో ఏవైనా ఎదురువచ్చుట, తూర్పు, దక్షిణము ఈశాన్యము, ఈదిక్కులలో గాడెదకూయుట, కాకి, చెమ్మకాకి, చిలుక, కొంగ నక్క వీనిలో నేదైనా, ఎడమవైపునుండి, కుడివైపుకు బోవుట, భారద్వాజము, డేగ, గుడ్లగూబ, ఉడతలు, దుప్పి, చుంచు, గరుడపక్షి, కుక్క, ముంగిస, వీనిలో నేదైనా కుడివైపునుండి, ఎడమవైపుకు వెళ్ళుట, బల్లి కుడివైపునగాని, నెత్తిపైగాని పలుకుట, రెండుతుమ్ములు వినవచ్చుటయు, యివి శుభశకునములుగా దెలశేది.

## అశుభ శకునములు.

తృణములు, కట్టెలు, కొత్తకుండలుపత్తి, ఉప్పు, అడుసు, దున్న చర్మములు, సర్పము, ముంగిస, ఎలుక, గూబ, తాబేలు, తొండ, ఉడుము, క్రొవ్వు, ఎముకలు, బూడిద, చల్ల, బెల్లము, పంది బట్టతలవాడు, సన్యాసి, వెర్రివాడు, ఏడ్చువాడు, జడదారి, గర్భిణీస్త్రీ, విధవది, యివియెదురగుట "భోజనము జేసి వెళ్ళవలశినది, నేను వచ్చెద, ఎక్కడకు బోయెదవు" అనుచుండగను, కొంగుపట్టిలాగుచుండగను, ఒక బ్రాహ్మణుడు ఎదురుగావచ్చినపుడు, తెలుకులువాడు, కుమ్మరి, పంచముడు, కుంటివాడు హాస్యగాడు, పోట్లాడుచున్న మనుష్యులు, బాధపడుమనుష్యులు, తలకు పట్టువేసుకున్నవారలు, నూనె, మురికివస్త్రములు, పొగతోనున్న నిప్పు బహిష్టయ్యిన స్త్రీ, వైద్యుడు రోగి గృహమునకు వెళ్ళునప్పుడు ఇవి ఎదురు పడకూడదు. మందులు సంచి క్రిందికి జారిపడినపుడు, లేచేటప్పుడు, తలకు దెబ్బతగిలిన, చతుష్పాదజంతువ తుమ్మినపుడు, పడమర, వాయువ్యము, ఆగ్నేయము, నైరుతి, యీ దిక్కులయందు, గాడిదకూయు ధ్వని వినబడుచుండగ, కాకి, చిలుక, కొంగ, నక్క కుడినుండి, ఎడమకు బోవునపుడు, గాలివానయందును, వైద్యుడు రోగికడకు జనకూడదు. అట్లు జనునేని వైద్యునకు అవమానము సంభవించును.

## జ్యోతిషవిషయములు.

అశ్వనీ నవరాత్రంతు:—అశ్వనీనక్షత్రమున జనించిన రోగము 9 రోజులు.

భరణీప్రాణనాశనం:— భరణియందు జనించిన రోగము ప్రాణమును దీయును.

కృత్తికానవరాత్రంతు:—కృత్తికా నక్షత్రమందు జనించిన రోగము 9 రోజులు.

త్రయోదశ్యాంతురోహిణి:—రోహిణీనక్షత్రమున జనించిన రోగము 13 రోజులు.

మృగశిరాపంచరాత్రంచ:—మృగశిరయందు జనించిన రోగము అయిదురోజులు.



ఆర్ద్రాయాం ప్రాణసంశయః :—ఆరుద్రయందు జనించినరోగము ప్రాణములను హరించును పునర్వ సూవింశతీచ పునర్వసునందు జనించినరోగము యిరువదిరోజులు.

పుష్యమీసప్తరాత్రయోః :—పుష్యమియందు జనించినరోగము 7 రాత్రులు ప్రాణనాశంచ ఆశ్లేష ఆశ్లేషయందు జనించిన రోగము ప్రాణములు బోగొట్టును.

మఘాయాంవింశతిస్తథా:— మఘయందు జనించినరోగము యిరువదిరోజులు

పుబ్బాయాం ప్రాణనాశంచ:— పుబ్బయందు జనించినరోగము ప్రాణములు హరించునదిగాను

వుత్తరాత్రీణి పంచకం:—వుత్తరయందు జనించినరోగము అయిదురోజులుగాని మూడురోజులుగాని, యెనిమిదిరోజులుగాని

హస్తాయాం నవరాత్రంతు:— హస్తయందు జనించినరోగము 9 రాత్రులు

చిత్తాయాం అర్ధమాసయోః :— చిత్తయందు జనించిన రోగము 15 రోజులు.

మాసద్వయంతథాస్వాతౌ:— స్వాతియందు జనించినరోగము రెండుమాసములు

విశాఖాపంచవింశతిః:— విశాఖయందు జనించినరోగము యిరువదైదురోజులు

అనూరాధా భవేన్మృత్యుః :—అనూరాధయందు జనించినరోగము మృత్యుసూచకము

జ్యేష్టాయాంఅర్ధమాసయోః :— జ్యేష్టయందు జనించినరోగము 15 రోజులు.

మూలాచమృత్యు మాప్నోతి:— మూలయందు జనించిన రోగముమనుజును జంపునది

పూర్వాషాఢాత్రిపంచకం:—పూర్వాషాఢయందు జనించినరోగము మూడురోజులుగాని అయిదురోజులుగాని 8 రోజులుగాని

ఉత్తరాషాఢవింశత్యః:—వుత్తరాషాఢయందు జనించినరోగము యిరువదిరోజులు

మాసేనశ్రవణంతథా:—శ్రవణమందు జనించినరోగము 1 నెల దినములు

ధనిష్టాచార్ధమాసంచ:— ధనిష్టయందు జనించినరోగము 15 దినములు

శతభిషామరణం ధృవం:— శతభిషమందు జనించిన రోగము ప్రాణములుదీయునదిగాను

పూర్వాభాద్రావరంమృత్యుః— పూర్వాభాద్రను జనించినరోగము ప్రాణములు దీయునదిగను

ఉత్తరాభాద్రాత్రిపంచకం:—ఉత్తరాభాద్రయందు జనించిన రోగము 3 రోజులుగాని అయిదురోజులుగాని 8 రోజులుగాని.

రేవతి మృత్యుసంప్రాప్తిః—రేవతియందు జనించినరోగము మృత్యువును జేయునదిగాను.

నక్షత్రస్యఫలంలభేత్:—పైన వ్రాసిన విధముగా నక్షత్రఫలములు పొందును.

శ్లో॥ ఉరగశత భిషార్ద్రా స్వాతి మూల త్రిపూర్వా
భరణి పితృవిశాఖా భాను భౌమార్క జానాం
ప్రతిప నవ చతుర్థి ద్వాదశీవాపిషష్టి
హరి హర విధి రేకోరోగి ణాంకాలమృత్యుః॥

ఆశ్లేష, శతభిషము, ఆరుద్ర, స్వాతి, మూల, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, భరణి, మఖ, విశాఖ, ఆదివారము, మంగళవారము పాడ్యమి, నవమి, చవితి, ద్వాదశి, షష్టి, యీ తిథివారనక్షత్రములు మూడు కూడిన దినమందెవ్వరికి జ్వరమువచ్చునో వాడు, హరిహర బ్రహ్మలు ముగ్గురు చేరి రక్షింపబడినప్పటికి తప్పక మృత్యువవాతబడును



తిథి జనితరోగములు.

శ్లో॥ నందాయాం దశరాత్రింతు భద్రాయాం మాసముచ్యతే
జయా యాంత్రి దినంప్రోక్తం రిక్తాయాం ప్రాణహానిదం
పూర్ణాయాం పంచరాత్రింతు ఇతివాశిష్ట సమ్మతం॥

నంద, భద్ర, జయ, రిక్త, పూర్ణ, పాడ్యమి, విదియ, తదియ, చవితి, పంచమి, యిటులనే పక్షమునకు మూడావృతులు మూడైదులు పదిహేను రోజులగుచున్నవి.

అందు మొదటిది యగునంద పాడ్యమియందు జనించిన రోగము పదిరాత్రములును, రెండవదియగు, భద్ర, విదియయందు జనించినరోగము నెలరోజులు, మూడవది యగు, జయ, తదియయందు జనించిన రోగము 3 రోజులు, నాల్గవదియగు, రిక్త, చవితినాడు జనించు, రోగము, ప్రాణములును హరించునదియు, అయిదవదియగు, పూర్ణ, పంచమియందు జనించినరోగము, అర్ధరాత్రులును పీడించునని వశిష్టులువారు నుడివిరి. యిటువలెనె ౬ నందతిథి ౭ భద్ర, ౮ జయ, ౯ రిక్త, ౧౦ పూర్ణ మళ్లీ ౧౧ నంద ౧౨ భద్ర ౧౩ జయ ౧౪ రిక్త ౧౫ పూర్ణ యీవిధముగనే కృష్ణపక్షమందు గూడా చూచుకొనవలెను.

శ్లో॥ షష్టి సప్త మయోర్మధ్యే । దశమేకాదశీతథా
ప్రతిపత్సర్వగండాని । తిథిగండాప్రకీర్తితాః॥

షష్టియొక్క అంత్యమందును, సప్తమియొక్క ఆదియందును, దశమియొక్క అంత్యమందును, ఏకాదశియొక్క ఆదియందును, పాడ్యమి తిథియందు పూర్తిగానున్న తక్కిన తిథులకు తిథియొక్కంటికి నాలుగేశి ఘడియలుచొ॥న గండగడియలుగా వచించిరి. యీ సమయములో కల్గు రోగములు అసాధ్యములు అని నుడివెదరు.

తిథివార నక్షత్ర జనితరోగములు.

పాడ్యమి జయవారము, కృత్తిక విదియాబుధవారము, ఆశ్లేషానక్షత్రము, తదియాగురువారము, మఖ, చవితీ శుక్రవారము, ధనిష్టానక్ష

త్రము, పౌర్ణవమి శనివారము భరణీనక్షత్రము, యీ తిథివారనక్షత్రములతో కలశియుండు సమయములో వచ్చు వ్యాధులు కుదరవని ఋషులునుడివిరి.

తిథిలగ్న జనితరోగ ఫలము.

పాడ్యమి, షష్టి, ఏకాదశి—మేషవృశ్చిక లగ్నములు.
విదియ, సప్తమి, ద్వాదశి—మిథున కన్యలు.
తదియ, అష్టమి, త్రయోదశి—కర్కాటక, సింహములు.
చవితి, నవమి, చతుర్దశి—వృషభము, కుంభము, తుల.
పంచమి, దశమి, పూర్ణిమ, అమావాస్య—ధనస్సు,మకరము, మీనము

యీవిధముగ తిథిలగ్నములు గలసినప్పుడు వచ్చురోగములు. మిక్కిలి శ్రమపొందించి కుదురునని తెలియవలెను.

వారనక్షత్ర జనితరోగములు.

ఆదివారము—భరణి, సోమవారము—చిత్త, మంగళవారము--ఉత్తరాషాఢ, బుధవారము—హస్త, గురువారము—జ్యేష్ట, శుక్రవారము—పూర్వాషాఢ, శనివారము—రేవతి.

యీ వారనక్షత్రములు కలసివున్నప్పుడు వచ్చు వ్యాధులు మారకమును జేయును.

పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, ఆశ్లేష, జ్యేష్ట, ఆరుద్ర, స్వాతి—యీసప్తనక్షత్రములలో వచ్చు రోగములు మరణమును కలుగజేయును.

(లేక) రోగియొక్క జన్మనక్షత్రమునకు, ఎన్నవ నక్షత్రమగునో అన్నిదినములు పైన, రోగము కుదురును, జన్మనక్షత్రమున జనించిన రోగము 45 రోజులు, జన్మరోజున జనించురోగము 30 దినములు, జన్మలగ్నంబున జనించినరోగము 15 రోజులు మనుజుని తప్పక పీడించును.



తిథివారనక్షత్ర యోగమువల్ల కలిగే
వ్యాధులకు ఫలము.

భరణి:నక్షత్రము—అమావాస్య యివి గూడియుండగా రోగము వచ్చిన ఆరునెలలువరకున్ను

కృష్ణపక్షమున అష్టమీతిథితో కలశిన శనివారము వచ్చినరోగము యిరువై రెండు దినములున్ను

కృష్ణపక్షచతుర్దశీ మంగళవారముకలసి వచ్చినప్పుడు వచ్చురోగము నలుబదైదు దినములున్ను

ఆదివారము కృత్తికానక్షత్రముతో కలసియుండగా వచ్చినరోగము కష్టసాధ్యముగను (లేక) యిరువది దినములైనను పీడించునది.

అర్ధ్రు, ఏడుతారలు అనగా విపత్తార, నైధనతార వారము రోజులు.

కృష్ణాష్టమిరోజున వర్జకాలమునవచ్చు వ్యాధి ఎనిమిదిరోజులు
మహాపాతయందు వచ్చిన రోగము:—పక్షమురోజులు
రాహుగుళి కాకాలములయందువచ్చురోగము-మూడుదినములు
శనియున్న, నక్షత్రమున జనించిన రోగము-పన్నెండుమాసములు
అంగారకుడున్న నక్షత్రమునవచ్చు రోగము:—45 రోజులు
కుంభలగ్నము, శన్యంశగుళికాకాలము—

భరణీ ఆశ్రేష, యీనక్షత్రములయందు సంధ్యాకాలమున వచ్చు వ్యాధులు:—తప్పక రోగిని జంపును.

జ్వరాదులకు, మతాంతర విషయములు.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ఆరు | పు | ఉ | అ | జ్యే | ధ | శ | భ | కృ |
| పు | మ | హ | వి | మూ | శ్రి | పూ భా | అ | రో |
| పుష్య. | ఆశ్రే | చిత్త | స్వాతి | పూర్వా షాఢ | ఉ | ఉబా | రే | మృ |

శ్లో॥ ఆర్ద్రాదిచంద్రభాంతంచ । మూలాత్రిష్వతి మధ్యమే । రవేందుజన్మభాన్యే రేఖాయాంచేనజీవతి॥ యీచక్రమందు వరుసగానున్న తొమ్మిది నక్షత్రములలో, జ్వరమువచ్చిన రోజున వున్నని త్యనక్షత్రమున్ను, జన్మనక్షత్రమున్ను, సూర్యుడుండేనక్షత్రమున్ను, కలశియున్నయెడల, ఆరోగి జీవించడు.

శ్లో॥ ఉగ్రాశూర్ప యమత్రిపూర్వ వరుణార్ద్రా దైత్యపిత్రానిలా
వ్యాళర్క్షాశ్చతదైవమిత్ర రవిపౌష్ణేందాశ్చసాధారణాః॥
అశ్విత్ర్యుత్తర జీవవిష్ణ్వధి తిచిత్రాజాగ్ని వస్వీందవ
స్సౌమ్యాస్తే ప్రతిపచ్చతుర్థినవమీ ద్వాదశ్యమాషష్టిభిః॥
అర్కార్కిదినైర్యుతంయదిమృతిం । బహ్వాల్పరోగాన్ క్రమాత్॥

### ఉగ్రనక్షత్రములు.

భరణి, పూర్వఫల్గుని, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, శతభిషము, ఆర్ద్ర, మూల, మఖ, స్వాతి, ఆశ్రేష, ౧-౪-౬-౧౨-౯-౩౦ యీతిథులు ఆది, శని, మంగళవారములు:—యీతిథి వారనక్షత్రములుతో గూడి యుండగా, జ్వరాద్యు పద్రవములు వచ్చినేని మరణము జేయును.

### సాధారణ నక్షత్రములు.

అనూరాధా, హస్త, రేవతి, జ్యేష్ట:—యీనక్షత్రములు ముందు చెల్పిన తిధివారములుతో కలిసియుండగా జ్వరము కలిగినేని, విశేషముగ రోగము జేయును.

### సౌమ్య నక్షత్రములు.

అశ్విని, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర, పుష్యమి, శ్రవణము, పునర్వసు, చిత్త, రోహిణి, కృత్తిక, ధనిష్ట, మృగశిర:—యీనక్షత్రములు ముందువ్రాశిన తిధివారములుతో గలసి యుండగా జ్వరము వచ్చిన స్వల్పముగ రోగము జేశిపోవుననియు తెలియవలెను.



### పాదభేదముచే జ్వరనక్షత్ర మితినినఫలములను తెలియజేసే చక్రము.

| నక్షత్రములు. | నక్షత్ర మితి-ది | ౧ పాద | ౨ పాద | ౩ పాద | ౪ పాద | నక్షత్ర భేదము | ఫలములు. |
|---|---|---|---|---|---|---|---|
| ఆశ్రే | ౭ | ... | ౧౪ | ... | ౫౪ | ఉగ్ర నక్షత్ర ములు. | ఈ నక్షత్రములు ఆదివార శనివార మంగళవారములలో నొకవారముతోటిన్ని ప్రతిపత్ నవమి-చవితి-షష్ఠి - అమావాస్య-ద్వాదశి-ఈతిథులలో నొకతిధితోటిన్ని కలసి యుండగా జ్వరము వచ్చినయెడల మరణ మొందును. |
| శతభి | ౧౧ | ౬౦ | ౯ | ౯౦ | ౧ | | |
| ఆర్ద్రా | ... | ... | ౧౩ | ౨౩ | ౧౦ | | |
| స్వాతి | ౨మా | ... | ౨౦ | ౧౭ | ౨౧ | | |
| మూల | ౭ | ౧౦ | ౨౦ | ౧౫ | ౯౦ | | |
| పుష్య | ౨మా | ౯౯ | ౧౦ | ౨౭ | ౨౨ | | |
| పూషా | ౮ | ౧౫ | ౧౮ | ౭ | ౨౦ | | |
| పూభా | ౧మా | ౧౧ | ౧౬ | ... | ౧౦ | | |
| భరణి | ౧౧ | ... | ౪౧ | ౧ | ౧౦ | | |
| మఖ | ౨౪ | ౧౦ | ౧౫ | ౩౦ | ౪౦ | | |
| విశాఖ | ౨౧ | ౨౦ | ౨౭ | ౧౩ | ౭౭ | | |
| హస్త | ౧౫ | ౧౪ | ... | ౧౫ | ౧౭ | సాధారణ నక్షత్రములు. | ఈనక్షత్రములు పైని చెప్పిన తిధివారములతోగూడినయెడల జాడ్యంచేసి అమితరోజులు గడచినపైని నిమ్మళించును. |
| జ్యేష్ఠ | ౫ | ౧౫ | ౬ | ౧౩ | ౨ | | |
| రేవతి | ౭ | ... | ౧౪ | ౧౮ | ౪ | | |
| అనూ | ౧౦ | ౭ | ౯ | ౧౬ | ౧౫ | | |
| అశ్విని | ౭ | ౭ | ౧౦ | ౧౬ | ౩ | సౌమ్య నక్షత్ర ములు. | ఈ నక్షత్రములు పైనిచెప్పిన తిధివారములతో కూడినప్పటికి విశేషమగు జబ్బు సేయదు. |
| కృత్తిక | ౭ | ౧౦ | ౧౯ | ౧౬ | ౪౧ | | |
| రోహి | ౬ | ౬ | ౭ | ౩ | ౧౦ | | |
| మృగశి | ౫ | ౧౪ | ౧౧ | ౧౮ | ౨౦ | | |
| పునర్వ | ౬ | ౨౦ | ౪ | ౬ | ౧౮ | | |
| పుష్య | ౬ | ౬ | ౩ | ౨౦ | ౧౮ | | |
| ఉత్తర | ౧౫ | ౬ | ౪ | ౭ | ౨౦ | | |
| చిత్రా | ౧౫ | ౧౨ | ... | ౩ | ౧౫ | | |
| ఉషా | ౬ | ౧౩ | ౧౮ | ౭ | ౨౦ | | |
| శ్రవణ | ౧౦ | ౧౦ | ౧౬ | ౭ | ౨౦ | | |
| ధనిష్ఠ | ౧౦ | ౨౨ | ... | ... | ౨ | | |
| ఉభా | ౮ | ౨౩ | ౧౦ | ౧౬ | ౧౧ | | |

## జ్వరనక్షత్రముల శుభాశుభములను తెలియజేసే చంద్రగర్భమనే చక్రము.




ఈచక్రమందలి త్రిశూలాగ్రములయందుండే ౧౨ నక్షత్రములలో నొక నక్షత్రమందు జ్వరమువచ్చెనేని, మరణముఁ జేసుననియు, బాహ్యప్రదేశమందున్న ౮ నక్షత్రములలో నొక నక్షత్రమందు జ్వరమువచ్చెనేని విశేషజాడ్యము చేసి నిమ్మళించుననియును, గర్భమందున్న ౮ నక్షత్రములలో నొక నక్షత్రమందు జ్వరమువచ్చెనేని జాడ్యమైనను జేయక సుఖముగా నుండుననియును దెలియదగ్గది.



శ్లో. శస్తంచామృత నాడికా, సురుచిరం, దివ్యౌషధం ప్రాశితం।
తత్ప్రియూషసమం, జ్వరామయహరం దోషత్రయఘ్నం తథా ।
ఆరోగ్య ప్రదమింద్రియ స్ఫుటకరం, చాయుః ప్రదంభేషజం ।
కార్యం తద్బుధాజగాద భగవాన్ ధన్వంతరిశ్చాబ్ధిజః ॥

అమృతఘడియలయందు క్రొత్తగా చేయు మందులు, లేహ్యములు, చూర్ణములు వగైరాయున్ను, రోగిచే సేవింపబడు ఔషధము, అమృతతుల్యమై వాతపైత్య శ్లేష్మజ్వరాది రోగములనుహరింపజేసి, ఆరోగ్యంబును అవయవములకు బలమును ఆయుర్వృద్ధిని చేయును. గనుక అమృతఘడియలలో వైద్యకర్మను ఆచరించ వలసినదని, శ్రీ ధన్వంతరి అందునుగూర్చి వర్ణించియున్నాడు. గాన నూతనౌషధాదులు చేయునప్పుడుగాని, నూతనముగా మందిచ్చునప్పుడుగాని అమృత ఘటికలలోనే చేయవలెను.

"ఔషధారంభే గురుశ్రేష్టః" అను నార్యోక్తి ప్రకారము గురువారము నూతనౌషధములు అమృతఘడియలలో సేవించిన, నది అమృతమువలెనే తప్పక పనిచేయును.

నవౌషధం బుధసోమయోః ॥

బుధ సోమవారములు, అమృత ఘటికలలోనైన మందు సేవించరాదు. అటుల సేవించిన గుణమీయదు. అని వృద్ధాచారము.

### ఔషధములు సేవించుటకు.

అశ్వని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, మూల, శ్రవణము, ధనిష్ట, శతభిషము, రేవతి, యీ నక్షత్రములును, ఆదివారము, సోమవారము, బుధవారము, గురువారము, శుక్రవారములున్ను, వీటితోచేరిన శుభతిథులయందును, మిథున, కన్య, ధనుర్మీన లగ్నములందు ఏడు, యెనిమిది, పండ్రెండు రాసులు శుద్ధి అయినప్పుడు (అనగా) ఆ స్థానములయందు ఏ గ్రహములు లేకుండుట ఆయుష్మాన్నామ యోగమందు మందులు సేవించుటకు, జేయుటకు యోగ్యముగా యుండును. మంగళవారము, శుక్రవారము విరేచనములకు మందులు దీసుకొనుట మంచిది.

## తైలాదులు సేవించుటకు.

అశ్వని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, శ్రవణము, ధనిష్ట, శతభిషము, రేవతి యీ నక్షత్రములు. ఆదివారము, బుధవారము, శనివారము, తదియ, పంచమి, సప్తమి యీ తిథులయందు, తైలములు సేవించుటకు మంచిది.

## రక్షలు వేయుటకు.

అశ్వని, కృత్తిక, ఆరుద్ర, ఆశ్లేష, చిత్త, విశాఖ, జ్యేష్ట, మూల, శతభిషం, యీ నక్షత్రములతో కూడిన ఆదివారము, మంగళవారముల యందును, క్రూరలగ్నములగు మేష వృశ్చిక మకర కుంభ లగ్నముల యందును, రక్షాకర్మ మాచరించ దగ్గది. యివే శస్త్రకర్మకును ఆచరణీయములు.

## రసద్రవ్యములు సేవించు కాలము.

అశ్వని, మృగశిర, పునర్వసు, పుష్యమి, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, శ్రవణము, ధనిష్ట, శతభిషము, రేవతి యీనక్షత్రములు, ఆదివారము, మంగళవారము, గురువారములతో గలసినపుడు పాదరసము, రసకర్పూరాది రసములు గలసిన మందులు సేవించవలెను.

## రోగనివర్తి కాలమును గురించి.

పంచాంగశుద్ధి దినమందు క్షేమతార గురు చంద్ర బలము కలిగి యుండినపుడు రోగము గలిగిన నది శీఘ్రముగా నివర్తించును.

## ఆరోగ్యస్నానమునకు.

అశ్వనీ, భరణి, కృత్తిక, ఆరుద్ర, పుష్యమి, మఖ, పూర్వఫల్గుని, హస్త, చిత్త, విశాఖ, అనూరాధ, జ్యేష్ట, మూల, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, శ్రవణము, ధనిష్ట, యీ నక్షత్రములు, చవితి, నవమి, చతుర్దశి, యీ తిథులు, మేషము, కర్కాటకము, తుల, మకరము, యీ లగ్నములు, మంగళ, శని, ఆదివారములు, యివి మంచివి.



## స్వప్న ఫలములు, దుష్టస్వప్న శాంతులు

స్వప్నమందు, జూడబడిన, వస్తువు, స్వప్నమున్నంతకాలము మాత్రముండినదైనను, వ్యావహారిక, శుభాశుభములను సూచించేదగుటయనుభవసిద్ధము, మనోగతమగు సంస్కారములను, స్వేచ్ఛచే పరమేశ్వరుడు జీవునకు జూపించుచున్నాడు. ఇదియేస్వప్నమని చెప్పబడుచున్నది.

శ్లో॥ స్వప్నోద్వివిధః । ఇష్టఫలోనిష్టఫలశ్చేతి॥

స్వప్నములు రెండువిధములు, ఇష్టఫలమునిచ్చునవి మంచి స్వప్నములనియు, అనిష్టఫలములిచ్చునవి దుష్టస్వప్నములనియు వచించెదరు.

వాతికం పైత్తికం స్వప్నం, కఫజంచింతితంత్యజేత్

వాత, పైత్యశ్లేష్మవికారములవల్లను, చింతితములు, పగటిపూట, మనస్సుననుకొనెడివిన్ని, స్వప్నమందగు చరితమును చెప్పజాలనిదానికి, దీర్ఘస్వప్నమునకు, పగలుగాంచెడు స్వప్నములకు, శుభాశుభములేమియులేవు, సామాన్యముగా వ్యాధులు, లేనివారలు గాంచెడి స్వప్నములకు మాత్రమే ఫలముగలదు మొదటి ఝామునకన్న స్వప్నము, మూడుసంవత్సరములకు మతాంతరమున నొక సంవత్సరమునకును, రెండవయామమునగాంచు స్వప్నమునకు, సంవత్సరమునకు, మతాంతరమున యెనిమిదినెలలకు, మూడవఝామునగాంచుస్వప్నమునకు, నాల్గునెలలకు నాలుగవఝామునగాంచిన స్వప్నమునకు, వకనెలలోను, ఉషఃకాలమున గాంచు స్వప్నమునకు, పదిహేనుదినములులోను, అరుణోదయంబున గాంచు స్వప్నమునకు వారముదినములలోను, సూర్యోదయకాలంబున గాంచు స్వప్నములకు ఆరోజుననులేక ఆఘడియలోను ఫలమునుబొందును, శుభ స్వప్నముగలిగినపిమ్మట నిదురించరాదు, అటుల నిదిరించుటచేత కొంతఫలము తక్కువగును, అశుభస్వప్నముకలిగి నిదిరించవచ్చును తిర్గి శుభ స్వప్నములుగాంచినయడల, జపహోమ, దానాదులుచే శాంతినిగలుగజేసుకొనవలెను.

## సుస్వప్నములు.

సూర్యచంద్రులయొక్క తేజస్సును మ్రింగినటుల స్వప్నముగాం చెడి మనుజుడు దీనుడైనప్పంటికిని సువర్ణార్ణవాదియుక్తమగు భూమికి అధిపతియగును, మనుష్యమాంసమునైనను తనమాంసమునైనను పచ్చిది, స్వేచ్ఛగాదినినట్లు స్వప్నమయినయడల, సామ్రాజ్యపదవిని, బొందును, సౌధాగ్రభాగమందు భుజించి, సముద్రోదకమును తరించినటుల స్వప్నమయిన బురుషుడు, దాసకులమునబుట్టినను, నరపతియగును, లింగముఛేదమయినటుల కలగనినవాడు, తనభార్యయొక్క సౌఖ్యమును బొందును. యోనిఛేదమయినటుల కలగనిన స్త్రీ, తనభర్తతో మిగుల సౌఖ్యమును జెందును, కత్తిచే జిహ్వాఛేద మగునటుల స్వప్నముగాంచిన క్షత్రియుడైతే రాజగును, యితరుడైతే గొప్ప ఆధిపత్యము బొందును, నరశిరోమాంసము దినినట్లయిన, రాజ్యమును, పాదముల మాంసము దినినట్లయిన, స్వర్ణ సహస్ర లాభమును, భుజములు మాంసము దినినటులయిన అయిదువందల సువర్ణలాభమును, బొందును, మద్యమును పచ్చిమాంసమును, రక్తమును, మెదడును, వీట్లను దినినట్లయినను, పైకి బూసుకొనినటులైనను, ధనవృద్ధియగును, చెరువులో తామరాకుపైని, పరమాన్నము ఘృతఖండయుక్తముగా భుజించినటులైన, పూజ్యుడై, రాజ్యమును బొందును. మూత్రమును, శుక్లశోణితములను దావి, అసహ్య పడకుండినటులయినను వంటికి బూసుకొనినటులైనను, జూచినటులైనను, వృద్ధియగును, ఫలభక్షణ మొనర్చినటుల, పుష్పములు జూచినటులైనను, వాడి గృహమున పట్టకుండునంత లక్ష్మివృద్ధియగును, ధనస్సు నెక్కుపెట్టి, గుణధ్వనిచే దిక్కులు పిక్కటిలజేయుచు, శత్రుసైన్యముల సంహరించినట్లయిన శీఘ్రముగా సంపద నొందును. మేడమీదనైనా పాలచెట్టుపయిననైనా వుండి, బంగారు వెండి పాత్రలయందు క్షీరసంబంధమగుదాని భక్షించిన రాజసంపద నొందును, నగనగర గ్రామవనసముద్రములతో గూడా భూమిని జానువులతో దాటినటులైన, నీచుడైనను రాజగును. నావపై నెక్కి యీయొడ్డునుంచి యాయొడ్డుకు సముద్రమును దాటి చేరినటులైన వకనెల ప్రవాసముజేశి, కృతార్థుడై వచ్చును. ఒకవీరుని తాను జంపబడినటులైనను, బురీషమును, విషమును, భక్షించి నటులను, నిర్భయుడై ద్రావినటులైనను, భోగాభివృద్ధిగలిగి, రోగమువలన నపుడే విడువబడును. రక్తముచే దడసిన శరీరముగలవాడైనను, పెళ్లి పెద్దయినటుల, ధనధాన్య సమృద్ధి కలుగును. రాజ్యలక్ష్మిని పొందును, రక్తనదియందు మునుగుచు రక్తపానము జేసినటులైనను, శరీరమందు రక్తము స్రవించుచున్నటులైనను, ధనధాన్య సమృద్ధియగును, తనపేరును తను జెప్పుకొనినటులైనను తనసిరస్సు పగిలినటులైనను, ధనధాన్య సమృద్ధి గలిగి, సువర్ణ సహస్రమొందును, రాజైన భూమిని, భోగములను బొందును, స్త్రీపురుషుడైనటులను, పురుషుడు స్త్రీఅయినటుల స్వప్నమైన కుటుంబవృద్ధియగును, మదించిన నేనుంగు నెక్కి యొకనితో యుద్ధమొనర్చిన భయము బొందకుండునటుల స్వప్నముగాంచువాడు, శాశ్వతమగు లాభమును బొందును, మూత్రపురీష లిప్తాంగుండై, స్మశానమధ్యమున భయములేక బవళించినటులైన, కళత్ర పుత్ర, రాజ్య, సుఖములు బొందును. తాను రాజై పిదప చోరుడై ధనమునుబొందినట్లు కలగనిన రాజుఅగును, తెల్లని గోవునెక్కి తూర్పుదిశకైన వుత్తరవైపునకైనా బోవుచున్నట్టి కలగని మేల్కొనినవాడు అధికలాభము పొందును. కేశనఖరహితమగు, సర్వావయవ సంపన్నమగు, నెవనిశరీరము స్వప్నమందగుపడునో, వాడు వృద్ధినిజెంది, వాడింటలక్ష్మి బానిసగానుండును. ప్రాతఃకాలమందు జలమందాడుచున్నటులైనను. అచటనుండి వడ్డునకు వచ్చినటులైన, వ్యసనములనుంచి నివృత్తుడై, ధనధాన్య సమృద్ధిని బొందును, సంకెళ్ళు వేయబడినవాడైనను, బాహువులు త్రాళ్ళచే గట్టబడినటుల స్వప్నముగాంచువాడు పుత్రలాభము రాజ్యలాభము గలుగును, కష్టముచే ప్రతిష్ట నొందును. లోతుగల నూతివలన నుదకము వలన, గర్తము, సముద్రము, తటాకము మొదలగు వాటివలన భయమును జెందినటుల, బుద్ధిపూర్వకముగా నందు

బడి, లేచి స్థలమును బొందినట్లైన, ధాన్యాభివృద్ధి యగును, దోమలు యీగలు మొదలగునవి, శరీరము నాచాదించినను, భక్షించుచున్నట్లైనను వాడు భృత్యుడైనను భార్యాసుఖము, ధన సమృద్ధియు బొందును, నదులు, సరస్సులు, పద్మములు, ఉద్యానవనములు, పర్వతములు. మేడలు, వీటిని. శోకార్తుడెవడు చూచునో వాడాశోకమునుండి విముక్తుడగును, నవధాన్యములు చేతను, పత్రిఫల పుష్పములుచేతను, వజ్రముల చేతను, పూర్ణములగు పాత్రలను నెవడు చూచునో వాడు గొప్పసంపదను బొందును.

పచ్చని మెర్రని ఫలము తనకొక రిచ్చినయెడల పద్మరాగయుక్త సువర్ణ లాభమును బొందును. విలాస కమలము, శుభ్రవస్త్రముగల యుత్తమస్త్రీని, జూచినట్లైన లక్ష్మీలాభ మయినను, సరస్వతీలాభ మయినను బొందును. తెల్లని గంధ మలదుకొని శ్వేతవస్త్రము ధరించి, యవ్వనముగల స్త్రీ యెవనిని కౌగలించుకొనినటుల స్వప్నము వచ్చునో వానికి లక్ష్మీప్రాప్తి యగును. కర్ణములందు కుండలములు, కంఠమందు ముత్యాలహారము, తలను కిరీటము, భుజములందు భుజకీర్తులు ఎవనికి ధరించినటు లగునో వాడు విస్తారమగు భూమిని బాలించును. తెల్లని వస్త్రముగట్టినటులున్నను, దుఃఖించినటుల, విలపించినటుల, దాను మృతిజెందినటుల స్వప్నమగువాడు సుఖమును బొందును. చంద్రనిభంగి తెల్లనైన పుష్పోపహారమును తన గృహాంగణమునందు ధరించినటుల స్వప్నమగువానికి రాజ్యలక్ష్మికిం గురియై ప్రాప్తించును. రత్నశయ్యాపైని పరుండినటుల, సింహాసనమున తగిన పురుషుడు తగు వేషముతో గూర్చున్నటుల స్వప్నమయిన సకల శుభములు చేకూరును. తాను ధరించు వస్త్రమందు, ఆసనమందు, శయ్యాపైని, మేడపైని అగ్నిజ్వాల లగుపించిన, లక్ష్మీప్రాప్తి యగును. శుభ్రమగు వస్త్రములచే జుట్టబడి, అగ్నిచే దహించి నటుల, స్వప్నమయిన, శ్రేయమును బొందును. పట్టుబట్ట, పుష్పము, ఫలము, ధరించినటుల, దినినటుల, అవి దొరికినట్లైనను స్వప్నమగు వానికి సంపద గల్గును. అధికమగు వర్షము ఛాయపుష్ప



ములుగల వృక్షములుతో గూడిన, పర్వతము ప్రజ్వలించుచుండిన అగ్నిని, జూచినవానికి లక్ష్మీవశ్యు రాలగును. పక్షినైనా, పుష్పకమునైనా నెక్కినట్లు, స్వప్నమయిన, రూపవతియగు స్త్రీని బొందును. గోవు, యెద్దు నరుడు, గజము, అశ్వము, మేక, శైలశృంగము, వీటినెక్కి జలపాన మొనర్చి నటుల స్వప్నముగాంచు వారలు, వేగమే నరపతులగుదురు, తలపైని మండుచున్న ధ్వజముండగా, గ్రామమందు దిరుగుచున్నటులు, స్వప్నమై మేలుకొనిన, అట్టివాడు వారముదినములలో సామ్రాజ్యపదవిని బొందును. పాము, తేలు, కీటకము, చిరతపులి, పక్షులు, వీటిచే కరవబడి భీతిజెందకుండినటుల స్వప్నమయిన, వాడధిక లాభమును వేగముగా బొందును. నిర్మలోదకమందు క్రీడస్నానము జేసినటులయిన, బంధుజనులతో వానికి రాజ్యధనసమృద్ధి గలుగును. తలిదండ్రులను దేవతలను, రాజులను, స్వప్నమందు జూచిన, రోగి, నిరోగియగును, నిరోగి, విజయమును బొందును. పక్షి, గుర్రము, గజము, గృహము, వీటిని, తెల్లగనున్నవిగా జూచిన, పర్వతాగ్రమును, ఫలములుగల వృక్షము నెక్కినట్లైన, చింతిత ఫలమును తప్పక పొందును. అధికమగు ఫలములు, నీడగల పాలచెట్టునెక్కి, పదములు వకిణనటుల స్వప్నమై, మేల్కాంచిన, మంచి శయ్యల నొందును. ధ్వజము, గజములు, రథములు, దేవాలయములు, మంచకాములు, వీటిని స్వప్నమున జూచిన, ధనవృద్ధి కలుగును. ప్రాకారము, యానము, స్వర్ణము, తూణీరము, శ్వేతఛత్రము, వీటినిజూచిన, ధాన్యప్రాప్తి కలుగును. ఉల్కాగ్రహములు, తారలు, మెరుపులు అధిక తేజస్సులు, గర్జితము వర్షమునుగల మేఘమును, జూచిన, శుభప్రాప్తి కలుగును. సముద్ర, నదీజలములు ద్రావినటుల, దాటినటుల, కలవచ్చిన మంగళకరము, మట్టికుండ దొరకినట్లైన, ధనప్రాప్తి కలుగును. గోవులు మొదలగువాని పాలుపితికినట్లున్ను, వేణుగాన మొనర్చినటులను, తనపక్షముగువారి, సంహారమైనట్లును స్వప్నమయిన, సంపదలు గలుగును. మిత్రులు, బంధువులు, స్వజనము, సుందరములగు, వేషములు ధరించినటుల, పుష్పదండలు వేసుకున్నవారలుగా జూచిన. యిగ

సిద్ధి గలుగును, ఉన్నతములగు, వృషభము, గోవు,గజము, గరుత్మంతుడు, వీనిజూచినట్లైనను, నెక్కినటులయినను, ధనమును, శుభమును బొందును, సింహాసనమును, రత్నమయ సౌధమును, రాజయానములు, దేవవిమానమును, వీటినిజూచినట్లైన,యెక్కినటులయిన,వృద్ధియగును, అన్నము, పెరుగు పాలు యివి జూచినట్లైన, ధనప్రాప్తి కలుగును, భక్ష్యములు పరమాన్నము దినునట్లైన ధనప్రాప్తి కలుగును. కలహంస, చముడుకాకి, సారసపక్షి, చాతకపక్షి, నెమలి, చక్రవాకపక్షి, వీటిని జూచిన, వీటిపలుకులు విన్న, ధనధాన్యప్రాప్తి యగును, చిలుక, గోరింక చకోరము, పావురము, కోడి, క్రౌంచము, వీటిని జూచిన, వీటినాదమువినినను, ధనసంపత్తి కలుగును, పగటి యందైన, రాత్రియందైన, గృహమందు, మాంసమందు, పురీషమందు పరుండినట్లైన, ధనధాన్య కనకవృద్ధి యగును. క్షేత్రము, ఉద్యానవనము, బ్రాహ్మణులు, రాజులు, గురువులు, దేవతలు, వీరినిజూచినట్లైన, అధికమగు ధనసంపత్తి గలుగును పూర్ణచంద్రుని, సూర్యుని, నుదయించిన, కాలమందు జూచినట్లైన, రాజ్యలక్ష్మిని బొందును. వృక్షమును ఫలయుక్తమగు దానినిజూచిన, నుత్తమవిత్తము లభించును, సర్వజ్ఞుండగు వానిని సిద్ధమగు పూజను, శ్రేష్ఠదేవతను జూచినట్లైన, ధనలాభము బుద్ధి సిద్ధియునగును, ఆడకోంగను, ఆడగుర్రమును గైకొని మేలుకొనిన, ధనముగలిగినదియు, ప్రియమయినదియు నగు కన్యనుగాని, మంచి గృహమునుగాని బొందును. నురుగుతోగూడిన, చిక్కనగు చక్కని పాలు, కుండయందుండగా ద్రావినట్లైన, వానికి,యజ్ఞఫలమైన, మిగుల మాంగళ్యమునైనా, బొందును. గోధుమలు దొరికినటులగాని, కనబడినగాని, ధనాగమము, యవలగుపడిన, యజ్ఞసిద్ధి, ఆవాలగుపడిన, విద్యాసిద్ధియునగును, రాజులు, బ్రాహ్మణులు, గోవులు, దేవతలు, పితరులు లింగధారులు వీరు స్వప్నమందగుపడి, ఏమిచెప్పెదరో, అది నిజమగును, భుజము లధికములు కలిగినట్లు, మందారచెట్లను, లతలను, గుల్మములను, వీటిని భూమియందు



పాతినట్లు స్వప్నమయిన నది సత్యమగును. భుజోత్పత్తి అయినటులయిన లక్ష్మీప్రాప్తి, తెల్లనగు పక్షులను గుర్రములను దేవవిమానములను నెక్కి యొకదిక్కుకు నడచినట్లయిన, సకల భూమండలాధిపత్యముగలుగును. అంతరిక్షమందు మేఘములతో గలశినటులయినను, ధూమముతోగూడినట్లైనను, జూచునో వాని కధికైశ్వర్యము గలుగును. క్షేత్రమందు దకము ప్రవహించినటులు, ఆజలము తనకు లభ్యమయినటుల కలగాంచిన, యజ్ఞశుభప్రాప్తి గలుగును. గృహములు లెఖపెట్టినట్లైన సంపత్తియు, అగమ్యాగమనము, అభక్ష్యాభక్షణ మయినటులయిన,సుఖప్రాప్తి గలుగును గరుత్మంతుని నెక్కినట్లైన భూలాభమును బొందును. పరిమళపుష్పములు,స్వప్నమందగుపడిన, దొరకిన, కంఠమందు ధరించినట్లైన, వానికి రాజ్యలక్ష్మి చేకూరును గీతము, హసితము, సింహనాదము, గుర్రము సకిలింపు, వినినట్లైన, శుభము చేకూరును. మేరుపగిరినందు, కల్పతరువందును, నివసించినట్లైనను, పచ్చిక బయిళ్ళను జూచినట్లైనను, స్వప్నముగనిన, సుఖము, ధనమును, సంపదయు కలుగును, కుసుమ, ఫలాదులచే వ్యాప్తమగు పొన్న, సంపెంగ నాగకేసరము దిరిశనము యీచెట్లను జూచినట్లైన, శోభనమగును. అరటి, రేగు, దాడిమ, నారంజ,దబ్బ, వీటిఫలములు జూచినట్లైనను, వీటికొమ్మలపై నెక్కినట్లైనను, పుష్పఫలములు గైకొనినట్లైనను స్వప్నముగాంచిన శుభమగును. ఏలకులు, లవంగములు, కర్పూరము జాజికాయ, సువాసనగల వీటిని జూచిన, వినిన, మంగళమగును. జువ్వి, మారేడు, మర్రి, వెలగ, యీవృక్షములను, పాలుగలిగిన వృక్షములను, జూచినట్లైనా వాటిఫలములు దొరికినటులయిన, దినినటులయిన శుభమగును, బొందు మల్లియలు, జాజిపుష్పములు, మదనబాణములు, నవమల్లికాపుష్పములు వీనిని జూచినను, దొరికినటులయినను, శుభమగును. చెరుకు, తమలపాకులు, వీటినిజూచిన, భక్షించిన, హస్తగతమయినట్లు స్వప్నమువచ్చిన ధనధాన్య సమృద్ధి గలుగును. పై శుభస్వప్నములుగాంచిన, రోగులు వ్యాధినుండి తొలగి, ఆరోగ్యమును గాంచుదురు. నిరోగులు సంపదలను బొందుదురు.

## దుస్వప్నములు.

తృణము, వృక్షము, పుష్పము, వీటివలన బుట్టిన చమురును, రాసుకొనినటుల, వీటి త్రాళ్లచేగట్టబడినటుల, గాడిద, దున్నపోతు, నక్కపాము, వీట్లనెక్కి, ఆడుచున్నటులను, గోమయము, చమురు, బురద వీటిచేకలుషమగు జలమందు, మునిగినట్లు, యివి వంటికి రాశినటులైన, దృష్టిచేదమయినట్లున్ను, ప్రవాహములో మునిగిపోయినట్లున్ను, పట్టిన త్రాడుతెగి, భూమియందుబడినట్లున్ను, తల్లిశరీరమును బ్రవేశించినట్లున్ను, కాకికూతలు వినినట్లున్ను, అదితలకెక్కినట్లున్ను, స్వప్నమైన, కష్టములు, రోగములు ననర్థములు, సంభవించును, ముఖములోమము, కొప్పు, గోళ్లు, మిగుల బొడవులైనట్లు, కోతి, భంగి, వికృతిగల స్త్రీని, సేవించినట్లు, యర్రనిబట్టగట్టిన, నరుడు, శరీరమును, గొట్టినట్లు, స్వప్నమయిన, రోగ, మృత్యుభయ, శోకములుకలుగును, భూమియందు, పశుమృగప్రకోపముచే, తనకు నాశనమయినట్లున్ను, వక్షులపైనెక్కి యుదకముపై తేలియుండినట్లున్ను, వర్షమునదడిచినట్లున్ను, పద్మములు, లక్కపాత్రలనుబట్టి క్రీడించినటులను, నటించినట్లును, మలినవస్త్రమునుగట్టినట్లున్ను దిగంబరుడైనట్టును, స్వప్నమయ్న్న, శోకముకలుగును, బొట్టుతుడచినట్టులైన, మిత్రవియోగమగును, హస్తములు ఛేదించినట్లును, రోగముకలుగును, మేడలు యిళ్లు, పర్వతముల, గుహలు, వీటినుండి, దిగువకుజారినట్లు కలగనిన, అరిష్టములుచేకూరును, వరలేనికత్తిదొరకినటులైన, మిత్రవియోగమగును, సర్పముకర్నమందైన, నాశికయందైన బ్రవేశించినటులైన, ఛేదమగును, గాడిద, లొటిపిట్ట, ఎనుబోతు, పంది, వీటినెక్కిదిగకుండా, మేల్కొనిన, శీఘ్రములో మృత్యువవాలగును, చోరులు కోపముగల యెద్దులు పెద్దపులులు, దున్నలు, వీటిచే బాధితులై, కేశాకర్షణమయినటులైన, వ్యాధికలుగును, లేక రాజపీడకలుగును, ముళ్లుకలిగిన శుష్కవృక్షములను, నేకాకిగానెక్కి దిగకుండ మేల్కొంచిన, మృత్యువగును, కేశములుగాని దంతములుగాని యూడినట్లును, ధనహానియు,



శరీరపీడయుకల్గును, గాడిదలకట్టిన రథమునెక్కి దక్షిణాభిముఖముగ జనినట్టులైనను, రక్తవస్త్రమాల్యానులేపనుడై, కూపమందుబడి, పంకిలాంగుడైనటులైన, రోగముపుట్టును, లేక, మృతుడగును, కొమ్ములు కోరలుగల, మృగములైన వానరులైన, పందులైన, యెదిరించి పీడించినటులైన, రాజభీతిగల్గును, తైలము ఉదకము, నేయి మొదలగువాటిచే తల అంటుకొనినట్లు స్వప్నమయిన, రోగముకలుగును, పీతాంబరగంధానులేపనయగు, నారికౌగిలించినటులైన, నిందకల్గును, ఆముదము, మోదుగ మందారము, గన్నేరు, వీటినిజూచినటులైన నరదముదాటినట్లును, పెద్దమేఘము అకాలమందగు నధికవర్షము, ఆనప, గుమ్మడి, పుచ్చ, పొట్ల మొదలగు తీగలకాయలను, వాకుడుములగ మొదలగువాటి కాయలను, స్వప్నమందుజూచిన వంశకరుడగు శిశువుమృతినందును, దేవతులు బ్రాహ్మణులు, గోవులు, లింగధారులు, పితృదేవతులు, ఎచట నృత్యము జేయుచుపాడుచు, పరుగులెత్తుచు సంచరించెడిరో ఆ దేశము నశించును, బ్రాహ్మణుడు, చంద్రుడు, మేష, వనస్పతి, రచ్చచెట్లు దేవతాప్రతిమలు కనబడినట్లు స్వప్నమయిన, రాజనాశనమగును, వనస్పతిశాఖనుభేదించినటులైన రాజవల్లభుడు నశించును, త్రాడుచేగట్టబడు గృహమునుజూచిన, గ్రామమునకు భయముకల్గును, గ్రామముపాశబద్ధమగునటులజూచిన దేశాధిపతికిగీడు, జలమందు మునిగిపోయినటుల, బోడితలవాళ్లను జూచినట్లును, యెర్రనిబట్టగట్టి మాంసమును భక్షించు మృగములనెక్కి, మాలవాళ్లతోను; గాడిదలు వంటెలతో గలసియున్నట్లును; దానునడచుచు పరులచే ననుగతుండగునట్లును, వికలమనస్కుడు; వికలారంభుడునై నిర్నిమిత్తముగా నాశింపబడినట్లున్ను; యిట్టి యుపద్రవలక్షణంబులు; గనబడిన; రాజకుమార్డు రాజ్యమునొందకపోవును; కన్యభర్తనొందకుపోవును; శ్రోత్రియుడు ఆచార్యుడుగాకపోవును; శిష్యుడధ్యయనము జేయలేకుండును; కోమటియయిన లాభప్రాప్తి బొందనేరడు; కృషిజేయు కాపులయిన; కృషిలేనివాడగును;

## మృత్యుస్వప్నములు

ఉగ్రపురుషులు తన్ను; బెదిరించినట్లున్ను; కత్తిచేతబూనినవారు తాళ్లచే గొట్టినట్లును స్వప్నమయ్యెనాడే మృతిజెందును; గాడిద; పంది; పిల్లి; నక్క; పులి; ప్రేతము; కోతి; వీనినివాహనముగా జేసుకొన్నట్లున్ను; కోతి ఎలుగుగొడ్డివాహనముగా జేసుకుని; దక్షిణదిక్కుగా వాడుచు బోవుచున్నటుల; నల్లబట్ట; లేక; ఎర్రబట్ట కట్టుకుని పాడుచు నవ్వుచు తన్నుచు దక్షిణదిక్కునకు ఈడ్చుకొని బోయినట్లున్ను; దిగంబరుడు సన్యాసి; మహాబలుడు ధ్వనిజేయునట్లును; పూర్తిగా బట్టలేక అడుసులోమునిగినవాని వలెను చక్కిలములు వగైరా తిని; మేల్కాంచి వమనముజేసినట్లును; స్వప్నమయ్యె త్వరలో మృత్యువుగలుగును; తనసామర్థ్యమును దెలియజేయుచు కోతినెక్కి దక్షిణదిక్కునకు నేగినట్లున్ను దిగంబురుని; క్షపణశ్రేష్టుని; బలిష్టుని; చూచినట్టు కలవచ్చిన; వకటిరెండుదినములలో చావుసిద్ధముగానున్నదని తెలుసుకొనవలెను.

నల్లనిస్త్రీ వీడినతలతో వచ్చిగుద్దినటులైన రెండుదినములలోను పక్షులుముఖమును పొడిచినటులైన అయిదు దినములలోను దీపప్రకాశము రెండుగా ఖండింపబడినట్లయిన యెనిమిది దినములలోను బొగ్గు; భస్మము; వెండ్రుకలను; నీళ్లులేని యేరును చూచిన పదిదినములలోను; నూనెతలతో యెర్రపువ్వులు సిగనిండాపెట్టుకొని దక్షిణదిక్కునకు పోవునటులయిన పక్షముదినములలోను నల్లనిస్త్రీని అనేక ధారములతో బంధించునట్లుఅయ్యె వకనెలలోను గూబలు కుక్కలు యివివచ్చిముఖమంత గరచనట్లయిన రెండునెలలలోను నిర్నిమిత్తముగా భూమిరెండుగా వ్రచ్చినటుల తనశరీరమును రెండుగా ఖండింపబట్లు కాళ్లు ఖండాకృతిగానుండినట్లయిన అయిదు నెలలలోను గాడిదెను; కోతిని; చూచినట్లును; లేక గాడిదనెక్కినట్లును; నూనెయంటుకొనినట్లు; అంగముచ్ఛేదమయినట్లు నీమముతో; స్వాశ్రియ; మునసుండినట్లును; పూర్వముజచ్చినవారిని;జూచినట్లును; యెండుకంటెలను; యముని; యమభటులను జూచినటులను;



యినపగుదియ; చేతభూని వివర్ణపురుషుడు తనకెదురుగా వచ్చినట్లును; వేగముగల బండినెక్కినటులను; తనతల స్త్రీయాకారమైనట్లును గాంచిన ఆరునెలలలోను; తనదేహము గంధపుష్పవస్త్ర మాంసాదులతో నలంకరించినట్లయిన యెనిమిది నెలలలోను; వృక్షమెక్కినట్లును; అన్నము భుజించినట్లును; భూతప్రేత పిశాచములను శరభ; సింహ; వరాహ; శ్వాన బక; ఖర, జంబుకాదులుచే; జీవము పోగొట్టుకొన్నట్లుయ్యె; సంవత్సరములోను దీపమారిపోయినట్లు స్వప్నమయ్యె మూడుమాసములోను; మృత్యువైనా కల్గును; లేక వివ్యాధిగ్రస్తుడగును తనతలపెద్దదిగానైనను లేక; పొడుగుగానైనా చూచిన వ్యాధివిస్తరించును; దోమలును యీగలనుచూచిన; వ్యాధినివర్తియగును; చీమలబారులను జూచిన; మరణపరియంతం. వ్యాధిస్వస్థత కానేరదు. నిమ్మపండ్లు దిననట్లు స్వప్నమయిన వకానొక సమయమును మరణమయ్యె లేక కలహములున్నా సంభవించును గాడిదను కట్టినబండియెక్కినట్లుగాని; దున్నపోతుపైనెక్కినట్లు స్వప్నమయిన మరణము సమీపించినదని తెలియవలెను.

## వ్యాధిజనక స్వప్నములు.

అవుపాలు తాను పిండినట్లు స్వప్నమయిన, కుష్టురోగము గల్గును. యీ స్వప్నము గర్భిణీ గాంచిన, వ్యాధిగలిగి నివర్తించును. సర్పములు, జలగలు, తేళ్ళు యివి జుట్టినట్టున్ను, తాను బలవంతుడైనట్టున్ను, తాను తిరుగ వివాహము జేసికొన్నట్టున్ను, వాంతిబేది అయినట్టున్ను, మురికినీళ్ళు దాగినటుల, ఆకుకూరలు దిననటుల, అకాలమందు వృక్షములు ఫలించి, పుష్పించినటుల, గూబలు గబ్బిలములు జూచినటులను, బోడితలవాని జూచినట్లును, నక్షత్రములు యింటిపైనిరాలినట్లును, తనపై సూర్యకిరణములు పడినట్లును, ఆకాశము మబ్బుగాగాని, నలుపువర్ణముగాగాని యున్నట్లును, రాళ్లవాన, గాలివాన వచ్చి దానిని చూచినట్లును, తనదేహము కాలినట్లును, స్నానము జేసినట్లును, దీపము కాగడా వగైరాలు మందమందముగా వెలిగినట్లును, కలగాంచిన, రోగములం

పుట్టును. చిన్నబిడ్డలను పురుషులను జూచిన మేలుకల్గును. స్త్రీలుం జూచిన, వ్యాధిగల్గును. చేతులు కాలినట్లుగాని, విరిగినట్లుగాని, వ్యాధిపీడ గలిగినట్లుగాని, స్త్రీలకు స్వప్నమయిన, బిడ్డయో భర్తయో మృత్యువుపాలగును. యీ కల పురుషులు గాంచిన జ్యేష్టాదేవి తన్నాశ్రయించినదని యెరుగవలెను. మెత్త గాలినట్లు గాంచిన పురుషునకు భార్య మరణించునని యెరుగవలెను. స్త్రీ గాంచిన భర్తకు రోగముగాని, మరణముగాని సంభవించును. సూర్యునిచుట్టు రక్తవర్ణముగప్పబడినట్లు కలగనిన, నేత్రవ్యాధి గల్గును. సూర్య చంద్ర గ్రహణములు జూచినటుల స్వప్నమయిన, నేత్రరోగము గల్గును. సత్రమున నున్నట్టు కలగాంచిన, తీరని రోగము కలుగును. ప్రేతలతో సారాయి త్రాగినటుల, కుక్కలచే నీడ్వబడినట్లు స్వప్నము గలిగిన జ్వరరోగమువల్ల మృత్యువు పాలగును. శిరమున తీగలు మొలచినట్లును, పక్షులు గుడ్లు పెట్టినట్లును, గ్రద్దలు మొదలగు పక్షులు తన్ను జుట్టికొనినటులను, పీనుగులు పిశాచములతో కలుసుకొని యున్నట్లును, అడవులయందు ఇరుకుస్థలములయందు వున్నట్లును, స్మశానము, పల్లము ప్రవాహము, ధూళి, ఉదకము, అడుసు, వీనిలో బడినట్లును, నృత్యవాద్యములు చేయుచున్నట్లు, పాడుచున్నట్లు రక్తగంధలేపనము, రక్తమాల్య, రక్తవస్త్ర ధారణములు చేసికొనినటుల, వార్ధిక్యముపోయి వయోవంతు డయినట్లును, శరీరము స్థూలమయినట్లును, చమురంటుకొన్నట్లు, పెండ్లిజేసుకొనినటుల, మీసము గడ్డము గొరిగించుకొనినట్లును, పాదరక్షలు పోయినట్లును, కలిపురుషుని దరిశించినటుల, నక్షత్రములు గ్రహములు దీపములు నఖములు యివి భూమిపై బడినట్లును, పర్వతములు బేదింపబడినట్లును, రక్తపుష్పము లభించినట్లును, అరణ్యములలో కిరాతాదుల గృహమందును, అంధకారమందును, కష్టస్థలమం దున్నట్లు,చింతచేనున్నట్లు, మాతృగర్భములో జొచ్చినటుల, కొండ, మేడ మొదలగు నున్నతప్రదేశములనుంచి క్రింద పడినట్లును, రక్తనేత్రులను, కృష్ణదేహులను, దిగంబరులను, దండధారులను జూచి



నట్లును, చేపలచే మ్రింగబడినట్లు కలగాంచిన, సర్వరోగములు సంభవించును. లేక మరణము గల్గును. రక్తపుష్పమాల్య ధారియై నవ్వుచుండు నపుడు స్త్రీచే నీడ్వబడి నట్లుగాను, కౌగలింపబడి నట్లుగాను స్వప్నమయిన, రక్తపిత్తరోగము జనించును. ఎనుబోతు, కుక్క, పంది, ఒంటె, గాడిద, వీనిలో దేనినేని నెక్కి దక్షిణదిశ కేగినట్లు సప్నమయిన, క్షయరోగము గలుగును. రొమ్మున తీగెలు, వెదురు, తాటిచెట్లు, మొలచినట్లు స్వప్నమయిన; గుల్మరోగము గలుగును. జ్వాలలేని అగ్నిని చూచినను హోమము చేసినవాని రొమ్మునందును; దిగంబరియొక్క రొమ్మునందును; నేతిచే తలంటుకొన్నవాని రొమ్మునందును; పద్మము జనించినట్లు కలగనిన కుష్టురోగము సంభవించును. చండాలురతోడ స్నేహము అపుమథమును పానము జేసినట్లు స్వప్నమయిన; ప్రమేహ రోగము బుట్టును. రాక్షసులతో గలసి; నృత్యముజేయుచు నీళ్లలో మునుగుచుండునట్లు కలగనిన అపస్మార రోగము కలుగును. ప్రేతలతో గలసి నృత్యముజేసినట్లు స్వప్నమయిన ఉన్మాదము; లేక పిచ్చిరోగము సంభవించును. నూనె; నెయ్యి; ఆముదము మొదలగు తైలముల బూసికొన్నట్లు కలగనిన వ్యాధులు సంభవించును. యీ స్వప్నములు వ్యాధులు లేని వారికి వచ్చిన వ్యాధియు; వ్యాధిగ్రస్తులకు వచ్చిన మరణమును సంభవించును.

### దుఃఖజనిత స్వప్నములు.

నూనె ప్రత్తిచెట్టు మొదలగునవి జూచిన ఆపదలు వాటిల్లును విహారము; రక్తవస్త్రధారణము; సూర్య చంద్ర మండలములు కాంతి తగ్గినట్లు కనపడుట; నక్షత్రపతనము; అశోకము; సాలాశము పుష్పించినపుడు జూచినట్లు కలగనిన దుఃఖము గలుగును.

### దుస్వప్న శాంతులు.

మంచిస్వప్నములు యితరులకు జెప్పవచ్చునుగాని దుస్వప్నమును దాచవలయును. ఓరులకు జెప్పరాదు. దుస్వప్న మయిన; గంగాదినదుల

యందుగాని; పుణ్యతీర్థముల యందుగాని స్నానమొనర్చి; శాంతిపఠన మొనర్చి ఉత్తమములగు బ్రాహ్మణులకు తిలదానాదులు; భోజనాదులు నొసంగవలెను. నవగ్రహజపములు; దానములు; హోమములు; దేవోపాసన జేయవలెను. వస్త్రదానము సజ్జనులకిచ్చి; వారిచేతికి దూర్వాలు నక్షతలుయిచ్చి దీవెనలుపొంది శిరస్సున ధరించవలెను. దుస్వప్న దోష శాంతికై భారతము; భగవద్గీత; గజేంద్రమోక్షము; రామాయణము; భాగవతము మొదలగునవి పారాయణ జేయించుటగాని; తాను పఠన మొనర్చుటగాని చేయవలెను.

### కాలజ్ఞాన విషయములు

మనుజుడు మృతినొందుట విషయములనుగూర్చి కొంత సాముద్రికలక్షణములవల్లను; ఛాయాపురుషమువల్లను; స్వరసాధనమువల్లను; కొన్నిరోగగుర్తులుగూడ కలవు గనుక అవి యీక్రిందబొందుపరచెదను.

మనుజునియొక్క జీవితకాలము; ఫూర్ణమధ్యల్పాయువులని త్రివిధములుగా విభజింపబడినది. 120 సం॥ జీవించువాడు పూర్ణాయుర్ధాయముగలవాడుగ, 80 సంవత్సరములు జీవించువాడు మధ్యాయువుగల వాడని 40 సంవత్సరములు జీవించువారలు అల్పాయుర్దాయముగల వారనిన్ని; మహాఋషులు వ్రాశిరి.

### (అందు దీర్ఘాయుష్మంతుల గుర్తులు)

పాదములు; హస్తములు; ప్రక్కలు; వీపు; పండ్లు భుజములు; నొసలు నోరు యివి విశాలముగానుండి; నొసలు విరుచునప్పుడు అందు అడ్డముగా అయిదుగీతలు కన్పట్టును; యెదురొమ్ము; లేక వక్షము; యిది విశాలముగానుండుటయేగాక; చేతులవ్రేళ్లు; నేత్రదృష్టి; శ్వాసము యివి పొడవుగా నుండును. కాళ్ళుఅంగము గొంతుకపొట్టిగాయుండి బొడ్డులోపలనుండి రెండు ప్రక్కల అడ్డముగా వ్యాపించుయుండువారు వృషణములు క్రిందికిజారి వ్రేలాడుచుండును; వీర్యముత్వరలో స్రవించువాడు; చేతు



లు యేనుగుతొండములవలె మోకాలివరకు ఆదోకలై యుండవలెను అరచేతులయందు అల్లిబిల్లిగా విస్తారము రేఖలు లేనివాడు చిటికినవ్రేలికి దిగవ నుండు రేఖ తర్జనీ వ్రేలు చిగురు వరకు వుండినవాడు, మీసముకన్న ముందు గడ్డముమీద వెంట్రుకలు మొలచువాడు, ముక్కు యెండినటు లుండువాడు, కనుబొమలు ఎత్తుగను విశాలముగ నుండువాడు, కర్ణములు వ్రేలాడుచున్నట్లుండి అందు రోమములుగలవాడు, శిరముపొడవుగా యుండువాడు, మిక్కిలి కండపుష్టి, దారుఢ్యవంతుడు, శాంతశమదమాది గుణములు గలవాడు రోగరహితుడై పూర్ణాయుర్దాయము గలవాడుండును.

### మధ్యాయుర్దాయ గుర్తులు.

నేత్రముల క్రింద రెండుమూడు ముడతలు, కాళ్ళు చెవులు విస్తారము కండపుష్టి గలవాడు, వృషణము విస్తారము జారకయు, బొత్తిగా పైకంటకయు మధ్యస్తముగా యుండువాడు, మిక్కిలి వెడల్పు మిక్కిలి క్లుప్తముగాని వక్షస్థలము గడ్డము మీసముమీద ఒకేసారి వెంట్రుకలు మొలచువాడు, శిరము విస్తారము పొడవుగాక మధ్యస్తముగా యుండువాడు మధ్యాయుర్దాయ వంతుడుగ నుండును.

### అల్పాయుర్దాయ గుర్తులు.

మెడ వంగియున్నవాడు, ముక్కు పొడవుగా నుండినను రొమ్ము యెత్తుగా నున్నవాడు, నాభి యెత్తుగానైన పల్లముగానైన వుండి ముడతలుకలిగి యున్నను, నడుము ముడుచుటకు నిల్పుటకు స్వాధీనము లేక యున్నను, బ్రహ్మరంధ్రము పల్లముగా యున్నను, కణతలు గుంటలుగా యున్నను, గడ్డముకన్న మీసము ముందువచ్చినను, వృషణములు పైకంటుకొని యున్నవాడు, రతియందు వీర్యము చాలాసేపటికి స్రవించువాడు, అరచేతియందు విస్తారము రేఖ లున్నవాడు, దేహచ్ఛాయ మురికిగ నల్లగ అసహ్యముగ మడ్డిగ నున్నవాడు అల్పాయుర్దాయ వంతుడుగ దెలుసుకొనవలెను.

## మరణసమీప చిహ్నములు.

1 జీవశక్తి మనశరీరంబుననుండి ఓం ఓం ఓం అని ఉచ్చరింపుచుండును. యీశక్తియే శిరస్సున వ్యాపించిన సుషుమ్నానాడిద్వారా కర్ణరంధ్ర వ్యాప్తమై పైనవ్రాసిన ఓం అను ధ్వనిని బలుకుచుండును. గనుకనే మనము రెండుచెవులు మూసుకొనిన ఓం అను ధ్వనిబల్కుచుండును. కాబట్టి సదరుధ్వని చెవులుమూసుకున్నప్పుడు ఎవరికి వినుపించదో అట్టివారికి మృత్యు వాసన్నమైనదని తెలుసుకొనవలెను.

2 కండ్లుమూసుకొమ్మని పాదములుయొక్కగాని హస్తముయొక్కగాని బొటనవ్రేలునుపట్టుకొన్నప్పుడు పట్టుకున్నాడు అనేసంగతి తెలియనివాడు ఒకసంవత్సర పరిమాణముకన్న యెక్కువకాలము జీవించడని తెలుసుకొనవలెను.

3 ముంజేతిని శీలమండను బట్టుకొన్న యడల స్పర్శజ్ఞానమెవ్వడికుండదో అట్టివాడు ఆరునెలలకన్న యెక్కువకాలము జీవించడు.

4 మోచేయి పట్టుకొన్నప్పుడు స్పర్శజ్ఞానమెవ్వనికుండదో అట్టివాడు మూడుమాసములుకన్న యెక్కువకాలము జీవించడు.

5 లింగస్థానమును కుక్షిని పార్శ్వములును తాకినప్పుడు స్పర్శజ్ఞానము యెవరికి కలుగకుండునో అట్టివాడు నెలలోగా యమసదనమునకరుగును.

6 తన నాభిస్థానము తనకుగానరాకుండునో అట్టివాడు పదిదినములలో మృతుడగును.

7 నక్షత్రములు ప్రకాశించుచుండగా గనుపించియు గనుపించకుండినట్లగుపడినవాడు అయిదుదినములు జీవించును.

నాలుకచాచినప్పుడు నాలుకచిగురు గానరాకుండునో అట్టివాడు మూడుదినములలో మరణించును.

దీపశిఖాగ్రము యెవరికి గానరాకుండునో నట్టివాడు రెండురోజులు జీవించును.



కనుబొమలయొక్కయు కంటిరెప్పలయొక్కయు వెంట్రుకలు ఎవనికి కానరాకుండునో అట్టివాడు రెండురోజులలో మృతినొందును.

సర్వప్రాణులను కాలమే పుట్టించుచున్నది; కాలమే సంహరించుచున్నది; కాలమే నిద్రను జాగ్రత్తను కలుగజేయుచున్నది. కాలమతిక్రమించుట కెవ్వరికి శక్యముగాదు. సకలజీవరాసులు దేవాసురులు కూడా కాలవశముచే నాశముజెందుచున్నారు. కాబట్టి కాలమునెల్లపుడు మనుజుడు సర్వప్రయత్నములచేతను బరీక్షించుచుండవలయును.

కాలమునుబట్టియే; వృక్షాదులు పుష్పించుట ఫలించుట; స్త్రీలు రుతుమతులగుట; వర్ష శీత; గ్రీష్మాదిఋతువులు గలుగుట; ప్రాతర్మధ్యాహ్నసాయంకాలము యేర్పడుట; జలపానము; ఆహారము; విత్తులు జల్లడము; సంధ్యాదికర్మలు; యివి కాలమువల్లనే గదా కలుగుచున్నవి! గనుక కాలము నతిక్రమించుటకు ఎట్టివానికి శక్యముగాదు.

యిహపరలోకాపేక్ష గలవార్కి విహితాహారములు విహారములు శాస్త్రీయమైనఆచారములు దీర్ఘాయుష్మంతునిగ జేయును.

చిరకాలము జీవించుటయం దిచ్ఛగలవాడు తన శరీరమునందు ఎడతెగక పొదుకొల్పుకొని యుండు ప్రబల శత్రువులగు కామము క్రోధము లోభము మోహ మద మత్సరములను అరిషడ్వర్గములను జయించి, పాపకృత్యములను వర్జింపవలయును కాలాగ్నియనునది మనుజుని జఠరమున ప్రవేశించి కాలమున ఆహారము, ఉదకము, నిద్ర, కామము యీనాలిగింటిని గోరుచుండును. అన్నవిహీనమగునపుడు ధాతువును జలవిహీనమగునప్పుడు రక్తమును, కామవిహీనమగునపుడు నేత్రములను దహింపుచుండు. దానివలన నిద్రాభంగము రోగములు గలుగును.

మరియు ప్రాణము పంచతత్వాత్మకమగు నీశరీరమును ధరియించియుండు. మనుజుడు తనశరీరమునువికృతముగా నెప్పుడు జూచునో అప్పుడు కాలముచే వీక్షింపబడినవాడై పరలోకగతుండగును.

ఎవనియొక్క బట్టలయందును శరీరమునందును ముఖమునందును

దుర్గంధపువాసనగలుగునో అట్టివాడు 15 దినములలో లోకాంతరగతుడగును.

## శరీరలక్షణము.

నగరాధిపతి నగరమును దేశాధిపతిదేశమును రధికుడు రథమును ధనికుడు ధనమును గాపాడుచందంబున బుద్ధిమంతుడగువాడు సర్వదా దేహరక్షణ కృత్యంబులయందు మిగుల జాగ్రితకలవాడై యుండవలయు ఇట్లు శరీరక్షణచేయుచుండువానికి అకాలమృత్యువు కలుగకుండుటయే గాక బలము ఉత్సాహము ఇంద్రియములు ఆయుస్సువృద్ధికలిగి సర్వశుభ కార్యములు జేయదగినవాడుగానుండును.

1 జిహ్వ 2 నాశికాగ్రము 3 భ్రూమధ్యస్థానము 4 రెండు కనుబొమలు 5 కనురెప్పలయందుండు రోమములు ఎవనికి కానరావో వాడు మృతుడుగా దెలుసుకొనవలెను.

సూర్యచంద్రబింబములు జలమునందు తూర్పు దక్షిణ పశ్చిమోత్తరదిక్కులయందు రంధ్రములు గలవిగా రోగికి అగపడిన మొదటిదియగు తూర్పుదిక్కున కాన్పించిన 6 మాసములుకు దక్షిణదిక్కున గాన్పించిన 3 మాసములు పశ్చిమదిక్కునగాన్పించిన 2 మాసములకు ఉత్తరదిక్కున గాన్పించిన వక్కమాసమునకు మృతినొందును. సూర్యచంద్రులు పొగచే గ్రమ్మబడినటుల అగుపించిన తక్షణము మృతినొందును.

## అంగ జ్ఞానము.

నోటిలోనుంచబడిన యన్నము మ్రింగజాలనివాడు శిరము నిలపలేనివాడు. దృష్టిని ద్రిప్పజాలనివాడు అనగా వకేదిక్కున జూచువాడును పిలచినను బలుకకజ్ఞానశూన్యుండగువానుడునగు రోగి తక్షణము మృతినొందును మాటిమాటికి మూర్ఛనొందు రోగి తక్షణము ప్రాణములు వదలును.



## చలన జ్ఞానములు.

కాళ్ళుచేతులు వెల్లకితల పరుండి కదల్చువాడు లేచి పరుగిడువాడునగు రోగి మృతినొందును.

## అసాధ్య వుబ్బు లక్షణము.

యితరరోగములు ఏమియులేకయె పురుషులకు మొదటపాదములయందు ఉబ్బు కనిపించిన రోగి మరణించును. ముఖమందు స్త్రీలకు వుబ్బురోగమగుపించిన మరణింతురు. స్త్రీపురుషులు ఎవ్వరికైననుసరే గుదస్థానమందు వుబ్బుకాన్పించిన మరణింతురు.

## బ్రతుకని జిహ్వారోగము.

నాలుకనలుపెక్కుట, మరిన్ని లోపలికి బోవుట నోరు కంపువేసుట యిట్టిలక్షణములు గలరోగి బ్రతుకడు.

ఉదరము మామూలుకన్న ఎత్తయి రాత్రింబవళ్ళు నీరుదాగుట యందిచ్ఛవొడమిన అట్టివాడు నాలుగు అయిదు ఆరుమాసములలో మరణము జెందును.

వర్షోదకమునందుగాని అద్దమునందుగాని యెవనియొక్క ముఖమగుపించదో అట్టివాడారుమాసములలో యమసదనమున కేగును.

## నిరోగ లక్షణములు.

హస్తపాదంబుష్ణంబుగను లేక సమముగను న్నాలుక మృదువుగను చెమటలేకుండా జ్వరమును కంఠము కపవిహీనంబుగను నిద్రసరిగా పట్టుటయు, శరీరమునం దుత్సాహమును. ఇంద్రియములు ప్రసన్నముగను కంఠస్వరము క్షీణింపకయు సర్వేంద్రియములు చైతన్యయుక్తంబులయి గంధాస్వాధన గ్రహాణశక్తి గలవిగ నుండెడినో అట్టి రోగి తప్పక బ్రతుకగలడు.

## ఛాయాపురుష లక్షణము.

నిర్జన ప్రదేశమున నిలచి తననీడయొక్క కంఠస్థలమును, నిర్మ

అమనుస్సుగలవాడై తదేకదృష్టితో జూచి పిదప ఆకాశమువంక జూచిన సాక్షాత్ శివుడగుపడును, అప్పుడును ఆమహాదేవుని పలుమారు స్తోత్రము జేయువలయును (లేక) ప్రణవ పంచాక్షరీ మంత్రమును జంపించవలెను. యిట్లు ఆరుమాసములు విఘ్నము లేకుండా జేసిన, అట్టి యోగమువల్ల ప్రాణములకు ప్రభువగును. సర్వశక్తి సంపన్నుడగును. ఎల్లప్పుడు యీ యోగాభ్యాసము జేయువానికి దుర్లభ మేదియు లేదు. నిరంతరమభ్యాసము జేయువానికి ఆకాశమందు గనుపించు నీడ నల్లగ నగుపించెనేని ఆరుమాసములలో మృతినొందుననియు.

ఎండలో తననీడ పచ్చగా గనుపించిన వ్యాధియు, ఎర్రగాగాని నల్లగాగాని కనుపించిన హత్యయు, చిత్రవర్ణము లగుపించిన మహాభయమును గలుగును. చాయయొక్క పాదములుగాని, శీలమండలుగాని హృదయముగావి విరిగినట్టుల గానుపించిన క్రమముగ ఆరుమాసములు, సంవత్సరము, రెండుసంవత్సరములు జీవించును.

చాయపురుషుని కుడిచేయి విరిగినటుల కాన్పించిన, బంధుమరణము ఎడమచేయి విరిగినటుల కాన్పించిన భార్య, మృతిబొందును. ఛాయాపురుషునకు శిరము, కుడిచేయి లేకున్న మృతికలుగును. శిరము కాన్పించకున్న ఒకమాసములోను, కంఠము లేకున్న వారము దినములలోను, పిక్కలు లేకున్న ఒకదినములోను, చాయయే కనపడకున్న నాక్షణమందే మృతికలుగును.

స్వరజ్ఞానమువల్లను శుభాశుభములు ఆయువును
దెలుసుకొను విధము.

శ్లో. రేచకం పూరకంచైవ। కుంభకంచ యథాక్రమం।
జ్ఞాతవ్యం యోగిభిర్నిత్యం। స్వదేహశుద్ధి కారణం॥

పెద్దలగువారు రేచక పూరక కుంభకములను స్వదేహశుద్ధికి ముఖ్యకారణములని యెరుంగవలయును. రేచక మనగా శ్వాసను విడుచుట, పూరకమనగా, శ్వాసను లోపలికి పీల్చుట. కుంభక మనగా నిలుపుట.



ముక్కుయొక్క కుడివైపునవచ్చు శ్వాసమునకు సూర్యస్వరమనియు, ఎడమవైపు వచ్చు శ్వాసమునకు చంద్రస్వర మనియు రెండిట్లయందు ఒక్కసారివచ్చు శ్వాసమునకు సుసుషుమ్నమనియు అగ్నిస్వరమనియు పెద్దలచే చెప్పబడినది. ఇట్టి నాడిజ్ఞానమువల్ల కూడా మరణచిహ్నములు గుర్తింప వచ్చుననియు ఆయువును వృద్ధిజేయ వచ్చుననియు గూడా వచించిరి. సంవత్సరాది అమావాశ్య చతుర్దశీలు నడుమ అనగా ఫాల్గుణ బ॥ చతుర్దశలు అంత్యమున చంద్రస్వరమును అమావాస్య ఆదియందు సూర్యస్వరము నడచిన వానికి ఆ సంవత్సరము ఆయువుసంపూర్ణమనియు వ్యత్యాసముగ నడచిన హాని మృత్యువులు గలుగును దీనికి సంధిబలమని పేరు.

సంవత్సరాది వుదయము లగాయతు ౩ రోజులు ప్రాతఃకాలమున లేచువేళ చంద్రస్వర ముండవలెను. పిమ్మట వారస్వరము అనగా ఆదివారం వుదయం సూర్యస్వరము సోమవారం చంద్రస్వరము మంగళ వారము సూర్యస్వరము బుధవారము చంద్రస్వరము గురువారము సూర్యస్వరము, శుక్రవారము చంద్రస్వరము; శనివారము వుదయము మాత్రము సూర్యస్వరము. యీ విధముగ ఉదయమున నిద్రనుండి మేల్కాంచునపు డగుపడవలెను. లేదా, సూర్యోదయ మయ్యేలోగా అగుపడవలెను. శనివారం సాయంకాలము మాత్రము చంద్రస్వర మగుపించవలెను యిటుల స్వర మెవ్వరికి అగుపడునో వారికి ఆ సంవత్సర మంతయు వ్యాధులు మృత్యువులు లేక సుఖజీవనము గలుగును.

పాడ్యమినాడు స్వరము తప్పిన కలహము, విదియయం దర్ధనాశము, తదియయందు ప్రయాసము, చవితియందు మిత్ర బంధువులకు హాని, పంచమియందు తప్పిన దేశనాశనము, షష్టియందు తప్పిన దేశాధిపతికి హాని, సప్తమియందు తప్పినయెడల మహారోగము, అష్టమియందుతప్పిన మృత్యువు కలుగును.

సంవత్సరాది విదియనాడు చంద్రోదయ కాలమున చంద్రస్వరము కనుపించిన ఆ సంవత్సరము ఆయువు దృఢమని తెలసేది.

శ్వాస లోపలికి బోవునపుడు 10 యంగుళములును, వెలుపలకు వచ్చు శ్వాస 12 అంగుళములు పరిమాణము కలిగి యుండును. యీ పరిమాణమునకు హెచ్చు తగ్గులు గలిగిన, మరణచిహ్నముగ దెలసుకొనవలెను.

సూర్యనాడియం దుదయమును; చంద్రనాడియందు నాశమును జెందుచుండిన అట్టిరోగి జీవించును; చంద్రనాడియం దుదయమును; సూర్యనాడియందు నాశమును; జెందినరోగి జీవించడు.

సూర్యనాడి సంపూర్ణవాయుపూరితమైయుండి చంద్రనాడి కనుపడకుండిన నారోగి 15 దినములలో పరలోకగతుడగును.

శ్వాసము కుడిముక్కునగాని యడమముక్కునగాని; మూడు దినములుగాని; అయిదు దినములుగాని 15 దినములుగాని మాసముగాని సంచరించిన అట్టివాడు శీఘ్రకాలములో మృత్యువవాతబడును.

శుక్లపక్షమున ఎడమ ముక్కునను; కృష్ణపక్షమున కుడిముక్కునను; ఆరోగ్యవంతునకు శ్వాసము బయలువెడలుచుండును; ఒకపక్షమునందు రెండుమూడు రోజులు; సూర్యచంద్రనాడులు; మారిన అట్టి ఆరోగ్యమునకు; విపరీతము గలుగును.

పంచభూతాత్మక; శరీరరూపదీపము; చంద్రుడను చమురుతో గూడి; సూర్యునిద్వారా గాలిచే జల్లారకుండునటుల; రక్షింపంబడుటచే జీవుడు స్థిరముగానుండును; జీవరూపదీపమునకు; ఆయువు చమురుగానున్న; కాలమనునది; దీపముయొక్క ధూమముగానున్న; దేహము వర్తిగానున్న వుండును.

(వా యు వు)

ఆకాశాద్వాయుః । వాయోరగ్నిః । అగ్నేరాపః అపః పృధివీ పృథివ్యాం ఓషధయః । ఓషదిభ్యోరన్నః అన్నాత్పురుషః॥

మొదట నిరాకారనిరంజన స్వరూపుడైన; శ్రీపరమేశ్వరుని యొక్క యిచ్ఛచేతను; ఆకాశమువాయువు; అగ్ని; జలము; పృధివి; అందు



సమస్త ఓషధులునుసృష్టించి; (యిచ్ఛామాత్రప్రభోసృష్టి) యనునటుల; తనయొక్క మనస్సుచేతను; సకలజీవరాసులను సృష్టించెను; దేహధాతులు యొక్క యీదేహములు; పాంచభౌతికములగుటచే; మనకు గాలి;నీళ్లు; తిండి; మిక్కిలి అవసరము; వాని క్రమప్రకారము ఆయావేళల్కు అమర్చినయెడల దేహమునకు పుష్టియు; మనసునకు తుష్టియు గలుగుటయేగాక, ఇహపరలోక సుఖములుకూడా కల్గును. యుక్తకాలములో తిండివగైరాలు దినకుండిన దేహదార్ఢ్యముతగ్గి, అనేకవ్యాధులు గలిగి అకాలమరణము సంభవించును.

గనుక సమస్తకర్మలు ఆచరించుటకు ఆరోగ్యభాగ్యమే ముఖ్యముగాన, అట్టి ఆరోగ్యమును బొందుటకు ఏమికావలయుననంటే, మానసంరక్షణకల్గించి మనస్సును విలాసపరచుటకు మంచివస్త్రాద్యలంకారములు, తినుటకన్నము, త్రాగుటకుజలము, పీల్చుటకు మంచిగాలి యుండవలెను. ఇన్నిటికి ప్రధానము, సుఖనిద్రయు అట్టినిద్రకు మనమునివశించు గృహములు పారిశుధ్యతగా నుండవలెను, పైవాటియందు యేలోపము లున్నను, ఆరోగ్యభంగము గలుగును. అట్టి, ఆరోగ్యమునకు ముఖ్యము వాయువు, మనుష్యుడు అన్నము నీళ్ళులేక, కొంతకాలము జీవించవచ్చునుగాని గాలిలేక, వకనిమిషమైనను జీవింపజాలడు. సుషుప్తియందు. జాగ్రత్తయందు, ఆహారవిహార సంగమాదులయందు, సర్వకాలసర్వావస్థలయందుగూడా గాలిని పీల్చివిడుచుచుండుటయే, దీనినే పెద్దలు అజప అని వచించిరి. గనుక మనజీవనమునకు ముఖ్యాధారము గాలియని తెలియుచున్నది.

నిఖిలము వాయువుచేత నిండియున్నది కనుకనే వేదములందు ‘‘నీవారసూకవత్తన్వీ పీతాభాస్వస్త్యణూపమా’’ అని వ్రాసిరి. సకల జీవులకు గాలిముఖ్యమని దెలుసునుగాని, మంచిగాలి కావలెను అను సంగతి కొందరికే తెలియును.

కట్టెలు, బొగ్గులు, ప్రవహించే పరిశుద్ధజలము, తామరలు కలువలు గలకొలకులు, మర్రి వేప విప్ప రావి మారేడు సువాసనగల పుష్పములుగల మల్లె, గులాబి వగైరాచెట్లనుంచియు వచ్చుగాలి, సుఖమును కలుగజేయును. మనముపీల్చు మంచివాయువు, రక్తముతోగలసి మంచి యర్రని కాంతిగలరక్తమును దేహమంతయువ్యాప్తముజేసి, ఆరోగ్యముకలిగించును. మురికినీళ్ళనుంచి, నీళ్ళునిల్వయుండు బోదులునుంచి, కుండ్లనుంచి, ఆకులుకుళ్ళుటనుంచి, స్మశానము, చింత, చెముడు, బాడిత, దిరిశన, మొదలగుచెట్లనుంచియు, పేడకుప్ప, గోగోష్టములు, కిటికీలు లేనియిండ్లలోనుండి వచ్చువాయువును పీల్చుటచే మనలో నది ప్రవేసించి నలుపువర్ణమైన రక్తముగాచేసి, అందునుంచి వాంతి భ్రాంతి, గలుగుచున్నవి.

మనము మంచిగాలి పీల్చుటకును, చెడుగాలిని పోగొట్టుటకు తగుప్రయత్నములు సల్పుచుండివలెను.

కిటికీలులేనిమిద్దెలు, యిరుకుగదులులోను పరుండరాదు. విస్తారముజనులు వక్కచోట నిద్రించరాదు. పశువులు మేకలు, వగైరాజంతు సముదాయములుండు స్థలంబులందుగాని, వాట్లసామీప్యములందుగాని, నివసింపరాదు. చిన్నగదులలో, గాలిచొరని గదులలో పెద్దదీపములు వెలిగించి పరుండకూడదు. జంతువులు, మొక్కలు కుళ్ళి అందుండి వచ్చు వాయువును పీల్చరాదు.

మనము పరుండుగదులుకు ఉత్తరదక్షిణములు పెద్దకిటికీలుండవలెను. దక్షిణమువైపున నూతులు మురుగుగుంటలు, పశువులనుకట్టుట పేడకుప్పలును వుంచరాదు. గదులయందు మురికితోచేరియున్న పాత్రి సామానులు, అన్నము, చెడినపండ్లు, వుంచరాదు. ముఖమునకు ముసుగువేసుకుని నిద్రించరాదు. ఇండ్లచుట్టు కుళ్లిపోయినచెత్త మురుగు కుప్పలు పేడకుప్పలును వుంచరాదు. ఇండ్లలో పశువులను కట్టివేయగూడదు.



రోగులు ఎప్పుడుగూడ, పైనవ్రాసినస్థలములందు నివసించరాదు. అట్టి ప్రదేశములయందు, నివసించిన తప్పక మృత్యువు వాతబడగలరు.

మానవదేహికి వాయువేమూలమగుటచే అట్టివాయువును ప్రాణమని మహాఋషులు స్థిరపరచిరి. గనుక ఆరోగ్యమునుగోరు ఆబాలగోపాలము మురుగుప్రవహించు స్థలములయందు కుళ్ళినవూడ్పుచేలు, పర్రిలుయందును, పేడకుప్పలు, జంతువులు వగయిరాలు, చచ్చికుళ్లి, కంపెత్తుతావులయందు, తిరుగుటమానవలెను.

జలమును గూర్చి,

శ్లో॥ జీవంతి జీవనాతీవ జగత్సర్వంతుతన్మయం । తత్రోత్యం తయా
సుజైర్నకృచిద్వారివార్యతే పానీయం ప్రాణినాంప్రాణం । విశ్వ
మేవహితన్మయం అతోత్యంత నిషేధేపి నక్వచిద్వారివార్యతే॥

ఉదకపానముచేతను, సకలప్రాణులు జీవించుటచే. ఉదకమేప్రాణస్వరూపమైనది. గావున, సర్వకాలములయం దుదకపానము జేయుచునే వుండవలయును. గనుకనే, ఉదకమునకు జీవనమని పేరుకలిగినది. అన్నములేక, మనుజుడు యిరువదివకదినము జీవింపవచ్చునుగాని, జలములేనిదే నాలుగుదినములుకూడా బ్రతుకజాలడు. ఆజలము, మనముదినుపదార్థములతో గలసి జఠరాగ్నిచే పచనముజేయబడి, దేహమందుండు సకలరక్తనాళములకు, సప్లయిచేయుచున్నది. అట్టిజలము, పరిశుద్ధమైనది గానిచో, అనేకరోగములు గలిగించుచున్నది. దాహమైనప్పుడు పుచ్చుకొనుజలమువల్ల, దేహమందుండు మాలిన్యమును చెమటరూపముగను, మూత్రరూపముగను, తొలగించుచున్నది. వర్షజలము శుద్ధమైనజలము.

అట్టి వర్షజలము యిండ్లయొక్క దోరెముల నుండియు, చూరుల నుండియు దిగినయెడల శ్రేష్టము గాదు. ఎందుచేతననగా, యిండ్లయందు కాకులు వగైరా రెట్టలు, వంటశాలలనుండి బయలువెడలు పుగచే గ్రమ్మిన కరుదూపముతో గలసియు, వేసవియందు వాయువశమున

దుమ్ము, ఆకులు యిండ్లపై చేరియుండును. అట్టియిండ్ల చూరులువల్ల దిగు వర్షకము బహునింద్యమయినది. లోతుగల బావుల నుంచియు, సూర్యరశ్మి బాగుగా తగులుచు, ఆకుమురుగు వగైరాలు లేక నిర్మలముగాయుండు సరస్సులయొక్కయు, యెల్లప్పుడు ప్రవహించెడి నదుల నుండియు గ్రహింపబడిన యుదకము బహుశ్రేష్టమయినదిగా నెరుగవలెను. శుద్ధజలమునకు ఏవిధమయినరుచియు నుండకూడదు.

నీళ్లరేవులయందు మురికివస్త్రములును వుతుకుట, పశువులును కడుగుట, మలమూత్రోత్సర్జనముజేయుట, నారా మొదలగునవి వూరవేయుట, అంట్లుతోముట, నేత్రరోగులు, కుష్టురోగులు, మశూచికారోగులు స్నానమొనర్చి శరీరమును తోమికడుగుట, చెట్లు, జంతువులు కుళ్ళుపదార్థములువుండుట, నీరుచెడి పచ్చనగుట, కుళ్ళుకాల్వలు, మురుగుబోదులు జేరియుండుట, యీప్రదేశములయందు నీరుద్రావిన, చలిజ్వరములు, చర్మవ్యాధులు, మొదలయిన అనేకవ్యాధులు జనించుచున్నవి. బరువుగానుండు నీరు పానయోగ్యముగాదు.

స్నానపానాదులకు శుద్ధోదకము ముఖ్యముగాన, కొన్నిచోట్ల అట్టిశుద్ధజలము లభించనిచో, జలమునుబాగుగా గాచవలెను. అటుల గాచిననీరుయందుండు మనకుకానరాని కీటకములు, జావడమేగాక అందుండు దుర్గంధాదులు పైకిపోవును. అట్టిజలము పానయోగ్యముగానుండునంత వేడిగలది వడపోసి పుచ్చుకొనవలెను.

బురదనీటియందు పటికారము, యిండుపుగింజగంధము, యివి చేర్చిన బాగుగా తేరును. అట్టి తేరిన యుదకమును కాచిపుచ్చుకొనిన శ్రేష్ఠము. నళికాముఖయంత్రమువల్ల దీసినయావిరినీరు పానమునకును, ఔషధాదులయం దుపయోగించుటకు చాలమంచిది. సమస్తరోగములు హారింపజేయును.

జలవిషయమై మరికొన్ని విశేషములు.

జలసామాన్యగుణము, ఉదకము, చలువజేసును. హృదయము



నకు మేలుజేసును. పిత్తము, విషము, భ్రమ, తాపము, అజీర్ణము బడలిక, వాంతి, మదము, అతిబలుపు, మూర్ఛ, మదాత్యయరోగము హారింపజేయును.

శీతలోదకమును వర్జించవలసినవారలు.

వాతరోగము, కోష్టరోగము, కంఠరోగము, నవీనజ్వరము, గ్రహణ్యతిసారరోగులు, కడుపుబ్బరము గలవారలు అజీర్ణరోగులు, హిక్కావ్యాధిగలవారలు, గుల్మరోగులు, విధ్రధిగలవారు, శ్లేష్మరోగులు, మేహము, అరుచి, వగర్పు, పాండువ, శూల, వమనవిరేచనములకు దీసుకున్నవారలు, చల్లనినీటిని బుచ్చుకొనగూడదు. కాచిచల్లార్చిననీరు ద్రాగవలెను.

నూతినీరు, శ్లేష్మమును హరించును, పిత్తమును జేసును. అగ్నిదీపనముజేసి, తేలికనిచ్చును.

చెరువునీరు, వాతమును ప్రకోపింపజేయును. పెద్ద చెరువుల నీళ్ళు, పిత్తమును ప్రకోపింపజేశి రుచిగానుండి, కఫ వాతములను హారింపజేయును.

సెలయేటినీరు లేఖనకారిగనుండి, హృదయమునకు మేలుజేశి. అగ్నిదీపమునుజేసి చులకనగా యుండును.

మడుగునీళ్ళు, చులకనగా యుండును, పిత్తమును తాపమును హారించును. విశేషముగా ఆకలిని బుట్టించును.

దొన, లేక, సొననీళ్ళు, అగ్నిదీపమును జేసును. శరీరమునకు, రూక్షజేయును, మధురముగా యుండును, శ్లేష్మమును హారింపజేయును,

వర్షోదకము, భూపతనముగాకుండ యుండునది, సకల దోషములను హారింపజేయును.

హంసోదకము, పగటియందు సూర్యకిరణములుచేతను కాగి రాత్రియందు చంద్రకిరణములచేతను చలువెక్కిన యుదకమునకు హంసోదకమని పేరు. యిది, త్రిదోషములను హారించును మలమును బంధిం

చును, ఆయురారోగ్యములును బుద్ధి వృద్ధి బొందించి నిర్దోషమై, అమృత తుల్యముగా యుండును.

గోదావరిజల గుణము, పథ్యకారి, పిత్తాదిరోగములు, రక్తదోషము, వాతము, కుష్టువు, మొదలగు దుష్టరోగ సంహారకముగాను, దాహశాంతికరముగను వుండి, అగ్ని దీపనమును జేసి, తాపమును బోగొట్టును.

కృష్ణానదీ జలము, రుచిగానుండును, శుద్ధమైనది, జడత్వమును బోగొట్టి, రక్తపిత్తమును ప్రకోపింపజేయును.

చెలమలునుండి గ్రహించిన యుదకము, శుక్రమును వృద్ధిజేశి పిత్తకఫలమును, తాపము గప్పిని బోకడచి, తృప్తిని కలుగజేయడమే గాక, నిర్మలముగ చులకనగనుండి, ఉష్ణముగానుండియు, అగ్ని దీపనమును కలుగజేయును.

భూబేదముచే వుదకబేద గుణములు.

యర్రభూమియం దుదకము, వాతరోగములను బ్రకోపింపజేయును, మలినభూమియం దుదకము, రోగములను బుట్టించుటయేగాక, దోషకారిగానుండి, అజీర్ణమును కలిగించును, తెల్లభూమియందు కలుగు యుదకము, వాతాదిరోగములు బోగొట్టును, పథ్యకారిగను, చులకనగను మధురముగాను యుండును.

నలుపుభూమిని బుట్టిన ఉదకము, ప్రశస్తమయ్యినది, త్రిదోషాదినమస్తరోగములును హరింపజేయును. వుప్పునీళ్ళు, వేడిని జఠరాభివృద్ధిని జేసును, కఫవాతరోగములకు చాలా మంచిది, మేహరోగులకు అపథ్యమయినది.

మెరకప్రదేశములయందుండు వుదకము, సకలదోషములను బోకడచి, జఠరదీప్తిని కలిగించును. పల్లపు ప్రదేశములయందుండు వుదకము జఠరమాంద్యము జేయుటయేగాక, అనేక రోగములను కలుగజేసును.



వర్జించవలసిన ఉదకములు.

ఆకులు మొదలగునవి కుళ్ళిన మురికినీళ్ళున్ను, వర్షాకాలమందు ప్రవహించు క్రొత్తనీళ్ళను వుపయోగించిన, లోపల వెలుపలి రోగములు అనేకములు పుట్టించును.

తామరాకులు, పత్సగడ్డి వగైరాలుచే గప్పబడి, దుర్గంధయుక్తమై, సూర్యచంద్రకిరణ ప్రసారము లేక, కల్మషముగాయుండు వుదకము రోగకరముగా యుండును. సర్వరోగములను ప్రకోపింపజేయును. అకాలవర్షోదకమును వర్జింపవలయును.

జలదోష పరిహారములు.

దోషయుక్తజలమును, కాచి యుండయందుంచి, అందు యర్రగా కాలచిన యినుపముక్కలువేసి కొంచం పత్సకర్పూరము, తామరపుష్పము, కచ్చూరములు, మొదలగు వాసనలచే గట్టి, బంగారు, ముత్తియములువేసి ఒకఝాము యుంచిన, చల్లనై జలము నిర్దోషతనుగాంచును.

ఉష్ణోదకము.

నురుగులేకుండా బాగుగా కాచబడి, సుఖోష్ణముగనుండు ఉదకము సకలరోగములను హరింపజేయునదిగాను, అగ్నిదీపనముజేసి, పాచనముజేయును, చులకనగా యుండును, ఉష్ణముగాయుండు జలము, దీపనకారిగను కించిదుష్ణముగా యుండుజలము అగ్నిని శోధించునదిగాను, పార్శ్వశూల, పీనస, కడుపుబ్బరము, ఎక్కిళ్ళు వాతకఫము వీటిని బోగొట్టును, రాత్రుళ్ళయం దుష్ణోదకమును పానముజేసిన అజీర్ణము పోవును.

శేరు జలము మూడువంతులు మిగులునటుల గాచబడినది, వాతరోగమును, సగంవంతు మిగుల గాచబడినది పిత్తరోగమును, నాలవ వంతు మిగులునటుల గాచబడినది కఫమును మలబద్ధమును దీసివైచి, అగ్ని దీపనమును కలుగజేయును. చులకనగా యుండును, శ్లేష్మ వాత రోగములను, బోగొట్టును.

కాగి చల్లారిన నీళ్ళు పథ్యకరమైనవి చులకనగా యుండును, త్రిదోషములను హరించును, ధాతుక్షయము, రక్తదోషము, వాతము, ప్రమేహము, విషము, గ్రహపీడ, జీర్ణజ్వరము, సంతతజ్వరము, సన్నిపాతరోగము వీనియందు కాగి జల్లారిన యుదకము మంచిది.

చల్లారినపిదప రెండుఝాములుంచిన నది పులియును, అట్టి యుదకమును, పగలు కాచినజలము రాత్రియందును, రాత్రియందు కాచిన జలము పగలున్ను, పానముజేసిన త్రిదోషాదిదోషములు కలుగజేసును. కాగి చల్లారినపిమ్మట, తిరుగ కాచబడిన నీళ్ళు విషతుల్యముగా యుండును, శీతోదకము 8 గడియలులోను, కాగి చల్లారిననీళ్ళు నాల్గు గడియలులోను, కాగి చల్లారి తేరిననీళ్ళు, రెండు ఘడియలులోను జీర్ణమగుచుండును.

పైత్యరోగులు రక్తపిత్తరోగులు, కుష్టురోగులు, లూత మొదలగు వ్రణరోగులు, మూలవ్యాధి కామిల నేత్రరోగులు, విషజ్వరపీడితులు, పాదరోగులు, గుదరోగులు, మేఢ్రవ్రణము గొంతులో రణము నోటిలో రణముగలవారలు, హాలీమకరోగులు, గ్రీష్మరుతువునందును వేడినీళ్ళు బుచ్చుకొనగూడదు.

ఆహార నియమములు.

శ్లో॥ ఆహారో బలకృత్సద్యః । ప్రాణినో దేహధారకః
ఓజ స్తేజ స్స్వరోత్సాహ । ధృతిస్స్మృతిమతిప్రదః॥

ఆహారము దేహమునకు బలమునిచ్చును వెంటనే తృప్తిని కలుగజేయును శరీరపోషకమైనది కాంతిని తేజస్సును స్వరమును సంతోషమును ధైర్యమును జ్ఞాపకశక్తిని బుద్ధివికాసమును కలుగజేయును.

పీల్చుటకు మంచిగాలియు స్నానముజేయుటకు శుద్ధమైన జలము అవసరమైయున్నవి మనుజులు జీవించుటకు ఆహారముకావలెను ఆహారములేక యిరువదివక దినముకన్న నెక్కుడుకాలము జీవింపజాలము పక్కవూటనేదియు భుజింపకున్న, కాళ్ళుచేతులు లాగుకొని వచ్చుటయేగాక, నీరసముకలుగును, మార్గాయాసముచెందుట, మిక్కుటముగా మాటలాడుట, వృత్తి పరిశ్రమజేయుట, నిద్రించుట, స్వేదమువల్లను, మలమూత్రోర్జనాదులవల్లను, నిత్యము మన శరీరము బరువు తగ్గుచుండును, మనము, భుజించెడి పదార్థములే ఆతరుగు మళ్ళీ పూర్తిచేయుచుండును కావలశినంత ఆహారము, లోభకారణముచేమనుజుడు భుజించనిచో కొంతకాలములోనే మనుజుడు జచ్చుట ఆశ్చర్యముకాదు శరీరమును ఎల్లప్పుడు కృశించిపోకుండా కాపాడుకొనుచునే యుండవలెను. మనము దిను అన్నము పప్పు మొదలగు సకలపదార్థములు జఠరాగ్నినుండి పచనముకాబడి కర్తరూపహృదయకోశమందుండు నాళములుగుండ అనేక శాఖోపశాఖలుగ, దేహమంతయు వ్యాపకుచుండును, గనుక మనము భుజించు వస్తువులు బాగుగా నమలి మ్రింగిన, సులభముగా జీర్ణమై హృదయకోశమునకు జేరి శీఘ్రముగా దేహమంతయు వ్యాప్తమగుచుండును, బాగుగా నమలకుండా మ్రింగినయెడల జలమందు పచనముగాక అజీర్ణాది రోగములు జనించును, భుజించు పదార్థములు, జీర్ణమయ్యేటప్పుడు తేనుపులు కలుగుచుండు, అప్పుడు భుజించిన అన్నాది పదార్థములు క్రిందవి మీదికిని, మీదవి క్రిందికిని కదలి, జఠరరసముతో గలశి, అగ్నిశక్తిచేతను, జీర్ణమై శరీరమును ఆవరించిన సూక్ష్మనాళములుగుండ, దేహమంతయు వ్యాప్తమగుచుండును, వ్యాప్తముకాగ మిగిలినది మల రూపమువహించిబయటికిపోవుచున్నది. రక్తవృద్ధిమేదోవృద్ధిహ స్తివృద్ధిమజ్జావృద్ధిలోనగు, మనకుకావలశివాట్లకు బలమెక్కుటకు ఆయావస్తువులయందట్టిశక్తిని సృష్టిలోనే భగవంతుడమర్చియున్నాడు। యేయేవస్తువునందే యభివృద్ధిచేయు గుణమున్నదో, దానిని తెలుసుకుని భుజించిన ఆయాఅవయములు వృద్ధిబొందుచుండును అట్టి జ్ఞానము ప్రతిమనుజునకు నుండుట కడు కష్టమని పూర్వులు, వస్తుగుణజ్ఞానము కొరకనేక గ్రంధములు రచించిరి తదనుగుణముగా మనము నడుచుకొనినచో, ఎట్టిలోపములు గలుగవు మనుజులకు మాంసాఆహారము మిగుల బలమునిచ్చునదిగా వ్రాసిరి, అట్టి

అనేక ఆహారాది వస్తువులు, వకొక్కదానియందే ఇమిడియున్నవనియు వ్రాసిరి యింతకు అనుభవజ్ఞానమెక్కుడుదిగాన, మానవుడు నిత్యము భుజించుటకు వుండి తీరవలసినసమస్తగుణములు, పాలయందేగలవనియు, పుట్టుకతోనే మనుజుడు పాలతోనే పెరుగుచున్నాడను సంగతి అందరికి విదితమే, మనుష్యులపాలకన్న ఆవుపాలయందు చిక్కదనమెక్కుడుండును, గనుక పిల్లలకు గోవుపాలు యిచ్చునపుడు సమముగాగాని, అంతకు హెచ్చుగాగాని, నీళ్ళుపోశి బాగుగాకాచి యిచ్చిన ఏవిధముయిన్ను చెరుపులేక బాలురువృద్ధి జెందుదురు, బాలురకు భోజనముపెట్టుటలో పులిశినవి, దుంపకూరలు, పప్పుపదార్థములు మొదలగు గురుకరపదార్థములు విస్తరించి పెట్టరాదు, అందువలన వ్యాధులు జనించును, చులకనగా జీర్ణమగునవియే పెట్టవలెను.

మాంసాదులు తినని జాతులువారు మినుము కందులు సెనగలు లోనగు పదార్థములు విస్తారము భుజించవలెను. తీపుపదార్థములు విస్తరించితినకూడదుమాంసమందున్నబలముకన్న పాలకన్నధాన్యాదులయందుకూడ విశేషముగలదు, మిగుల పచ్చివిగానుండునవియు విస్తారముగ్గినవియుగు పండ్లు తినరాదు పులిసిన పదార్థములు కుళ్ళిన, పదార్థములు కఫకరపదార్థములు తినకూడదు.

ఒకేవిధమగు అభ్యాసము, అనగా, అతిగా చుట్టుగాల్చుట బీడిశిగెరెట్టులను త్రాగుట, వక్కాకు, కారాకిళ్ళి, ఎడతెగక పచ్చిపోకలను బుగ్గనుంచుకుని ద్రవము మింగుచుండుటలోనగు దుర్వ్యసనముల అధికముచే జఠరముకుచెడి అనేక వ్యాధులు పాలగుచుండుట, మనముజూచు విషయమేగాన అటువంటివి తొలంగించుకొనుట కర్తవ్యము, వక్క పరియాయమే, విస్తరించి భుజించుటకంటే కాలానుసారము మితముగాదినుటయే కర్తవ్యము, మితభుక్, హితభుక్, అనునట్లు మితముగాదినువానికి హితవుచెడదు కొందరు ఉదయమునను, కొందరుపరాహ్ణమును మరికొందరు సాయంకాలము దినుచుందురు అందువల్ల మనుజులకు అనేక రోగములు గలుగును, భోజనప్రికరణమందు,



శ్లో॥ యామాంతరే భోజనభోగకారి । యామద్వయే భోజన సౌఖ్యకారీ యామత్రియే భోజనరోగకారి। చాతర్థయామే క్షయరోగకారి॥

మొదటి యామమందు భుజించిన, భోగమునిచ్చును, రెండవ యామమందు దినిన, సౌఖ్యము మూడవయామమున భుజించిన రోగమును నాలవ యామమును దినిన క్షయరోగమును జనించుననియు ప్రిమాణములు అనుభవములు కూడా గలవు భుజించిన ఝాములోపలనే తిర్గి భుజింపరాదు పదిగడియలు వ్యవధి మీద రెండవతూరి భుజింపవచ్చును వకసారే విస్తారము దినుటకంటే కొంచముకొంచము రెండుసార్లుగా దినుటమంచిది ఉదయముఝాములోపలను మధ్యాహ్నము రెండవ యామము దిరుగునప్పుడు సాయంకాలము పూర్వయామమందు భుజించుట వుత్తమము రాత్రికాలమందు మిక్కిలి పొద్దుపోయ్ను తరువాతభుజింపరాదు ప్రిథమయామమందే,లఘులరప పదార్థము భుజింపవలెను భోజనమునకు నిద్రికు 4 ఘడియలుకాలము వ్యవధి యుండవలెను ఇత్తడి మొదలగు లోహపాత్రిలయందు భుజింపరాదు వెండి భంగారు మొదలగు పాత్రిలయందున, అరటి మోదుగ మొదలగు విస్తరలయందును భుజింపవలెను యిరువది సంవత్సరములకు లోపువారు రోజుకు మూడుపరియాయములున్ను అంతకు పైబడిన వయస్సుగల వారలు రోజుకు రెండు పరియాయములు భుజించుట మంచిది భుజించు పదార్థములు అనగా కూరగాయలు వగైరాలు తత్కాలానుకూలముగా మార్చుకొనుచుండవలెను.

శ్లో॥ భుక్త్వాశతపదం గచ్ఛేద్వామ పార్శ్వేనసంవిశేత్
శబ్ద రూపరసస్పర్శ గంధాంశ్చమనసః ప్రియాన్।
భుక్త్వావాను పసేవేతా తేనాన్నం సాధుతిష్టతి॥

భోజనానంతరము నూరడుగులు నడచి ఎడమ పార్శ్వమున బరువుండవలయును మనస్సునకు హితకరములగు సంగీతాది శబ్దవినోదములను రూపములు రసములను మంచి స్త్రీలు వగైరాలను తాకుట సుగంధాది

లేపనం బొనర్చుకొనుటలోనగు వానివల్లదినిన అన్నము సాధువుగా జీర్ణమగును అని శుశ్రుతాదులు చెప్పిన ప్రకారం నడచుకొనిన మంచి ఆరోగ్యము కల్గును.

## అన్నగుణము

అన్నము దీపనకారిగను పథ్యకరమైనది మూత్రోత్సర్జనకారిగను యుండును. బియ్యమును చక్కగ గడిగి వండి గంజివార్చిన అన్నము ఉష్ణము జేయును నిర్మలముగాయుండును హితకారి పథ్యకారిగయుండును. బియ్యము కడుగక గంజి వార్చబడని అత్తెసరన్నము శైత్యమును గురుత్వమును జేసును శుక్రమును వృద్ధిజేయును కఫకారిగనుండును బియ్యమును వేపి పాకముజేయబడిన అన్నము రుచికరముగనుండికఫ హారమును తేలికగాయుండును పప్పు మాంసాదులుతో చేర్చి వండిన యన్నము గురుత్వము జేసును శుక్రమును వృద్ధిపరచును కఫమును బుట్టించును బెల్లము మొదలగు మధుర రసములతో గలశిన మిశ్రితాన్నము గురుత్వము శుక్రబలము గలుగజేయును వాతజ్వరమును హరించును మెంతి మజ్జిగతో చేర్చబడిన యన్నము గ్రహణి మూలరోగము బడలిక పోగొట్టును జీర్ణకారి అతివేడియన్నము బలమును బోగొట్టును సమశీతోష్ణముగానుండుఅన్నము దినుట మంచిది రెండు మూడు రోజులుండినది పాశినదియగు అన్నము రోగమును బుట్టించును.

వరియన్నము, రుచినిబుట్టించును, సర్వరోగ హరమైనది, నేత్రములకుహితవొసంగును, దీపనముచేసును, హృదయమునకు, మేలుజేసును, శుక్రవృద్ధి, శరీరదారుఢ్యము, వీటిని కలుగజేసును, పథ్యమయినది, దాహము నణసును, శరీరమునకు కాంతినిచ్చును, మూత్రవృద్ధిజేసును, తేలికగలది, ముదుగుబియ్యము అన్నము, అగ్నిదీపన మెక్కువ గలవారికి మిగుల శ్రేష్టమైనదిగా యుండును. సన్నరకముల బియ్యము అన్నము, దీపనకారిగానుండి, దోషములు భేదించును, ప్రశస్తమైనది రోగములను హరించును.



## పులగము గుణము

మినపప్పుగాని, నువ్వులుగాని చేర్చి వండినయన్నము పులగమందురు, బలమును కలుగజేయును, మలమును బంధించును, పెసరపప్పు, కందిపప్పు, శనగపప్పు వగైరా బియ్యముతో చేర్చి వండిన యన్నము, శుక్రమును బలమును, పుష్టినియిచ్చి, మలమును విసర్జింపజేయును వాతహరమైనది, పిత్తమును కఫమును వృద్ధిపరచును, జీర్ణముగాక యుండును.

## క్షీరాన్న గుణము.

పాలలోబియ్యము, శర్కరవగైరా చేర్చివండిన పాయసమనియు, క్షీరేయనియు, పరమాన్నమనియు అనెదరు, పాయసము త్వరితముగా జీర్ణముకాదు. బలమును, ధాతుపుష్టినిజేసి, మలమును బంధించును, పిత్తరక్తమును, దప్పి, అగ్నిదీపనము వాతము వీటిని నసింపజేయును.

## పప్పుల గుణములు.

పెసరపప్పు, వాతము కడుపుబ్బరమును బుట్టించును, పొట్టుతీసిన పెసలపప్పు, మధురముగాయుండును, దేహకాంతిని కలుగజేసును, గుల్మము; ప్లీహము; కాస; అరుచి; పిత్తము; ప్రమేహరోగము గళరోగమును హరించును. కందిపప్పు, రుచిగానుండి; మలబద్ధము; కుష్టు; జ్వరము; అతిసారమును; హరించును, శనగపప్పు హృద్రోగము; కడుపుబ్బరము కలుగజేసును, ఉలవపప్పు కఫపిత్తరోగములను; గుల్మోదరము; అర్శస్సు వాతము; క్రిమిరోగము; కాసరోగము; ఆమవాతమును హరింపజేయు అలచందలపప్పు, మధురముగనుండును; బలమును వృద్ధిజేసును, గురుత్వముగా యుండును.

కొందరు పొట్టుతీశిన పెసలుపప్పు; పొట్టుతీయని కందిపప్పు విషతుల్యమందురు; క్షారము కమ్మదనముగల పదార్థములందు; పైత్యమును పులుసు వగరుగల పదార్థములయందు శ్లేష్మమును తీపు చప్పనగల పదార్థములయందు వాతము గలదని; రుషుల అభిప్రాయమై యున్నదిగాన తత్వమును రోగమును గుర్తెరిగి పత్థ్యమిడవలయును.

## స్నానము.

శ్లో॥ అస్నాత్వా నాచరేత్కర్మ । జపహోమాదికించన।
లాలాస్వేదసమాకీర్ణశయనా యత్థితఃపుమాన్।
అత్యంతమలనః కాయో, నవచ్ఛిద్రసమన్వితః।
స్రవత్యేవ దివారాత్రౌ ప్రాతస్స్నానం విశోధనం।
ప్రాతస్స్నానం ప్రశంసంతి, దృష్టాదృష్టఫలం హితత్
సర్వమర్హతిశుద్ధాత్మా ప్రాతస్స్నాయీజపాదికం॥

స్నానముజేయుట; అనుదినము; మనము శరీరారోగ్యవిషయమై చేయుపనులలో బహుముఖ్యమయినది. ఇందునుగురించి బహువిధములుగ ధర్మశాస్త్రాదిగ్రంథంబులలో వ్రాయబడి యున్నది.

ప్రాతఃకాలమున, శయ్యనుండి లేచినపిదప; చొంగ; చమట; మొదలగునవి దేహమునందు కలిగియుండును; నవరంధ్రములుగల యీ దేహమునుండి రాత్రింబగళ్లు; దుర్గంధము స్రవించుచుండును; గావున తత్పరిహారముకొరకు ప్రాతస్స్నానము ముఖ్యముగా చేయవలెను; ప్రాతస్స్నానము దృష్టాదృష్టఫలములనంబడు; ఇహపరలోకసౌఖ్యములను కలుగజేయును; స్నానముజేయనివాడు జపహోమాదికర్మలకు అర్హుడుకాడని వ్రాయబడి యుండుటయేగాక; మన అనుభవమునుబట్టికూడా మన చర్మమునందు; అనేక సూక్ష్మరంధ్రములు గలవు; వానిద్వారా పనికిరాని కలుషపదార్థములు; చమటరూపమున బయటికి వచ్చుచుండవలెను; అటులు రాక; దేహమున నిలవయున్నయెడల అనేక రోగములు కలుగజేయును; గనుక మనపై రాత్రింబవళ్లు చమట;ధూళి వగైరాలుచే అట్టి రోమకూపములు పూడిపోవుచుండును; అట్టి సూక్ష్మరంధ్ర వికాసముకొరకయ్యే పూర్వులు ప్రాతస్స్నానము ముఖ్యమనియు; శరీరమును కాపాడు పెద్ద అవుషధము వంటిదనియు వాకృచ్చిరి; మన గృహములకు మురికినీరు వెడలుటకు తూములున్నటుల; మన దేహమున సూక్ష్మరోమకూపము లున్నవనియు; అందుండి కలుషములు బోవుననుమాట అందరికి తెలియునదే; అటులనే యింటి మురికితూములను మూశిన; మురికి



నీరు యింటిలో నిలువయుండి దుర్గంధము కలుగజేసి అనేక వ్యాధులను కలిగించుచున్నవి గనుక ఆవిధముగనే మన శరీరముననున్న రోమకూపములు కట్టుబడినయడ్ల గజ్జి దురద; చమటకాయలు లోనగు అనేక చర్మవ్యాధులను; కలిగించును గనుక మనకు నిత్యము స్నానము ముఖ్యమని తెలుసుకొనవలెను.

## (స్నానగుణము)

స్నానమువలన; వాతము; బడలిక; అలక్ష్మి; గజ్జి; చిడుము; దురద యివిబోవును; హృదయమునకు మేలుజేసును; సర్వేంద్రియములను వృద్ధిజేసును; దీపనకారిగా నుండును; కఫరోగులకు శీతోదకస్నానము శ్రేష్టముగాను, వేడినీరు స్నానము అంతగా శ్రేష్టముగాదు వుష్ణోదకముచే శిరస్నానమొనర్చిన; దృష్టిని చెరుచును; శ్లేష్మరోగులు వాతరోగులు మాత్రము ఉష్ణోదకముతో స్నానము జేయవచ్చును.

అతిసారరోగులు; జ్వరరోగులు; కర్ణరోగులు; వాతరోగులు; కడుపుబ్బుగలవారు; అజీర్ణము; అరుచిగలవారలు; స్నానమును వర్జించవలెను; భుజించినవెంటనే స్నానముజేయరాదు; దేహపరిశ్రమ చేసినవారు; చమట ఆరినపిమ్మట స్నానము చేయవలెను.

రెండు ఘడియలకన్న ఎక్కువకాలము నీటిని నానరాదు; చన్నీళ్లయిన్న యింకా తక్కువకాలములోనే స్నానము ముగించవలెను; దారుఢ్యవంతులు; మంచివయస్సులో నున్నవారలు చన్నీళ్లను స్నానము చేయవచ్చును; వారికి ఉత్సాహము సుఖము కలుగును; బలహీనులు, వృద్ధులు; వ్యాధిగ్రస్థులు వేడినీటినే స్నానమాచరించవలెను; బలిష్టులైనప్పటికి శీతవర్షాకాలములలో చన్నీళ్లస్నానము చేయుట అంతగా మంచిదికాదు గనుక వేడినీటినే స్నానము చేయవలెను; మిక్కిలి డస్సినవారు దెబ్బతగిలినవారు; ఎండకాలమున మిక్కిలి మార్గాయాసము జెందినవారు; పసిబిడ్డలు వేడినీటిని స్నానము చేయవలెను; శరీరమునకు నల్గుపెట్టుకుని స్నానమొనర్చిన; దీపనకారిగను; బలకారిగను; చర్మము

నకు కాంతిని కలుగజేయునదిగను; సుఖమును కలుగజేయునదిగా యుండును; అభ్యంగన స్నానమనగా; ఒడలంతయు జమురువ్రాసుకుని ఉద్వర్తనము జేయించుకొని స్నానముజేయుట; అట్టిదానివలన వాతరోగము హరించును; ధాతువులను సమత్వస్థితికి దెచ్చును; సుఖము నిద్ర దేహకాంతి; శరీరమృదుత్వము; దృష్టి; పుష్టి; కేశవృద్ధి; నేత్రపుష్టి; కర్ణరోగము; మలబద్ధము; మెడల నొప్పులు; అంకెళ్లుపట్లు యివి హరించును.

వాంతి; విరేచనములుకు పుచ్చుకున్న వారలు; నూతనజ్వరరోగులు; వాతరోగులు; నిరూహా; నస్థి; కర్మ తర్పణక్రియలు జేసుకొన్న వారలు అభ్యంగనస్నానమును వర్జించవలయును.

అభ్యంగనమునకు కాలవ్యవధి.

మార్గశిరపుష్యమాసములయందు రెండు గడియలు, కాలము, మాఖ, పాల్గుణమాసములయందు మూడు గడియలుకాలము, చైత్ర వైశాఖమాసములయందు అర్ధి గడియలుకాలము జ్యేష్ట ఆషాఢ మాసములయందు ఆరుగడియలుకాలమును. శ్రావణ భాద్రపదమాసములయందుమూడుగడియలుకాలము ఆశ్వయుజకార్తీకమాసములయందు, అర్ధిగడియలుకాలము అభ్యంగనము జేసుకొనవలెను, నూనె బూసుకొని అంతకాలమువర్కు శరీరమున ఇనకనీయవలెను.

శ్లో॥ ఉత్తమంతునదీస్నానం । తటాకే మధ్యమంస్మృతం
కూపస్నానంతు సామాన్యం । భాండస్నానం వృధాభవేత్ ॥

ప్రవహించెడు నదులయందు స్నానముచేయుట ఉత్తమము, చెరువులయందుస్నానము మధ్యమపక్షము కూపోద్ధృతజలస్నానము అధమపక్షము భాండోదకస్నానము అధమాధమము.

(వస్త్ర ధారణము;)

శ్లో॥ శ్వేతంవస్త్రం శీతలం దాహ హారి చర్ద్యానాహా హిద్మరోగాపహారి

అని పలుతెరంగుల వస్త్రధారణాదివిషయములు వ్రాశియుండిరి.



తెలుపుగల వస్త్రములను ధరించుటచే చలువజేసును దాహము నణచును వాంతి కడుపుబ్బు, హిద్మరోగముభ్రమ, మూర్ఛక్షయ, మొదలగురోగములను హరించును. శరీరకాంతి నిచ్చును. ఎరుపు వస్త్రధారణమువలన ఉష్ణము దీపనము గలుగజేయును. పిత్తముశ్లేష్మము, వాతము. అజీర్ణము, వాంతి, నశింపజేయును. నలుపువస్త్రధారణమువల్ల, పిత్తము విషజ్వరము, అగ్నిమాంద్యము, కాసరోగము, దుస్వప్నములను, స్వప్నస్ఖలనమును, హరింపజేయును. పసపువస్త్రధారణము, కాసరోగము కుష్టువు, అగ్నిమాంద్యము, విషజ్వరము, హరించును. బలమునిచ్చును మలమూత్రబంధముజేయును. కౌశేయము లక్కచాయపట్టు వస్త్రధారణమువల్ల వాతశ్లేష్మములు హరింపజేయును. యిది శరత్కాలమున ధరించిన సుఖముగా యుండును. నారపట్టు వస్త్రధారణమునవలన వీర్యమునకు వేడిని కలుగజేయునదిగను మిగుల పరిశుద్ధకారిగను వాతతాపములను హరించును. యిది హేమంత శిశిరరుతువులయందు ధరించుట కడు శ్రేయముగాయుండును. కాషాయవస్త్రధారణమువల్ల పిత్తమును పోగొట్టుటయేగాక, బుద్ధిని వికసింపజేయును. గ్రీష్మ శరదృతువుల యందీ వస్త్రధారణము హితకరంబుగ నుండును. తెల్పు పట్టువస్త్రము ధరించుటచేతను మృదువుగా నుండును. వర్షకాలమునందు ధరించుట మంచిది సమస్తదోషములను పరిహారింపజేయును. పసపుపట్టు వస్త్రధారణమువల్ల శ్లేష్మమును, అశీతవాతములను హరించుటయేగాక, వృష్ణకారిగను పిత్తకారిగను వుండి, అశుభములను పోకడచును, హేమంత శిశిరరుతువులయందీ వస్త్రము ధరించుట కర్తవ్యము, వన్నెవస్త్రములు కఫవాతములను, హరించును, మనోహరమైనవి. శీతపిత్తములను బోకడచుటయేగాక బలమును మేధస్సును వృద్ధిజేసును. వాత, తాపములను, రజస్సును, హరింపజేయును కాంతిని సంతోషమును శరీరపుష్టిని గలుగజేయును. పన్నీరు పత్రకర్పూరము, కస్తూరి వగయిరా పరిమళయుక్తమగు యెరుపు పట్టు వస్త్రధారణమువల్ల సమస్త గ్రహ పీడలను హరించుటయేగాక, చికిత్సా దేవపూజాదికములయందు ధరించిన, ఇష్టసిద్ధి గలుగజేయును. యర్రసకలా

తు, ఈప్సితార్థము లొసంగుటయేగాక. కఫవాతములను శీతబాధను దొలంగించు శిశిరరుతువుయందుహితకారిగ నుండును.

## వర్జనీయ వస్త్రములు

మురికివస్త్రములు, ఒరులుధరించినవి. స్త్రీలుధరించినవి. చినిగిపోయినవి. ఎలుకకాటువేసినవి కాలిన వస్త్రములు ధరింపంజనదు, మాశినవస్త్రములు అశుభకరమైనవి దురద గజ్జిలోనగు చర్మరోగములను బుట్టించును. పరులు కట్టివిడిచినవస్త్రములు ధరించిన, తాజేశిన పుణ్యముపశించును. స్త్రీలు కట్టినవి ధరించుటవలన శౌర్యహాని దుర్బలము గలుగును చినిగిన వస్త్రములు జ్యేష్టాదేవికి నివాసము గాన, వాటిని ధరించగూడదు. ఎలుకకాటు వస్త్రముధరించిన ఆపత్తులు గలుగును. కాలినవస్త్రములు ధరించిన దుర్గతి సంభవించును.

తడిగుడ్డకట్టుకొనగూడదు. మడికిగా వుపయోగపరచుదురు. పెద్దమడియని గూడా అనియెదరు. తడిబట్టకట్టుకొనుట దిగంబరత్వముతో సమానము, రోగప్రదము గనుక తడివస్త్రము ధరించగూడదు.

స్నానానంతరము స్వచ్ఛమగు ధవళవస్త్రముచే శిరోజములు శరీరాద్యంతము తుడుచుకొనవలెను, శీతవాతోష్ణములు శరీరమునంటకుండా జేసి లజ్జావహమగు నవయవములను నాచ్ఛాదించి దేహమలంకరించు నీ వస్త్రము; ధవళమయినదియు తొమ్మిది మూరల పొడవు గలదియు; జీర్ణముగానిదియు; తడి కానిదియు; బద్దితో నున్నదియు నగు వస్త్రము దక్షిణోత్తర కటుకలను కచ్ఛముడిగట్టి; యటుపైని నాభిని; వామకుక్షిని వెనుకను క్రమముగ చేలము చెంగులు రంగుగాగట్టి సకలకర్మలు ఆచరించవలెను. కాషాయ వస్త్రధారి; గోచిని పెట్టుకొనువాడు రెండుముక్కలు గూర్చబడిన వస్త్రము గట్టువాడు; బద్దిలేని వస్త్రమును గట్టువాడు యీ నలుగురు వస్త్రమునధరించని వారలే అగుదురు. కాలిన వస్త్రము; శిథిలవస్త్రము మలినవస్త్రము, ఆవు, గేదె మొదలగుజంతువులు నమలినవస్త్రములు, ధరింపరాదందురు, శ్వేతవస్త్రధారణము, మజ్జయు రక్తమును, ఓజస్సు అనగ పైత్యయుక్త హృదయరక్తమును, వృద్ధినొందించుటయేగాక, పైత్యమును శ్రమను, తృష్ణాదాహములను, శమింపజేసును. కాషాయ వస్త్రధారణము, యతులకేగాని, గృహస్థులకు దగదు, ఉత్తరీయముపైనిలేకయే పితృకర్మలను శ్రౌతస్మార్తాదినిత్య కర్మలను జేయదగదు. కౌసుంబాది రక్త వస్త్రధారణము, దాహమును, కఫమును వృద్ధిజేయును. వేడినిజేయుటచే వాతరోగ నివారకముగాయుండును. కాంతిని సుఖమును యిచ్చును. తెల్లపట్టువస్త్రము తృష్ణారోగమును, శోషను, శ్లేష్మమును, శమింపజేయును. ధైర్యమును కాంతిని నొసంగును. శుక్లవస్త్రము, మనోహరము, దోషరహితము పిత్తరోగములను బోకడచును. యుద్ధసన్నద్ధులగు యోధులకు, రక్తవస్త్రధారణము శ్రేష్టము, శ్రీ మహాభారతమున సకలయోధులు రక్త వస్త్రధారులు రక్తమాల్యానులేపనులు అని చెప్పంబడినది, ఎందుకనగా, దెబ్బలు తగులుటనుంచి రక్తస్రావము గలుగునపుడు తద్రక్తము, ఎరుపుబట్టలయందు పడిన, నొకవర్ణమైనందున దృష్టికి భయము దోపనీయదు. అందుచే యుద్ధయోధులకు తెలుపువస్త్రధారణముభయావహమని వ్రాశిరి.



నీలవస్త్రధారణము విరహశాంతికరమని కాళిదాసుడు తానువ్రాసిన మేఘసందేశమందు వ్రాశినాడు. విరహులకున్ను, శుక్లనష్ట వ్యాధులకు, నది అవుషధప్రాయము, గనుకనే, శుక్లనష్ట రోగులకు నీ గుడ్డ ముఖ్యముగ కౌపీనముగ ధరిచవలశినదిగా ముందు వ్రాశియుంటిని, శ్రీమద్రామాయణమునందు, నీలవస్త్రము చండాల ధారణాయోగ్యమైనదిగా వ్రాశిరి. మృగపక్ష్యాది జంతువులకు శరీరరక్షణకొరకు, బొచ్చువిస్తారమున్నది. మనకట్లు లేనందున మనకువస్త్రధారణ మావశ్యకము యీవస్త్రములు దేశకాలభేదములను బట్టికూడామార్చుకొనుచుండవలెను. మంచుచే చలి విస్తారముగల దేశములందు నివశించువారలు బొచ్చుతోతయారగు వస్త్రములను, వేడెక్కువగల దేశములందు నివశించువారలు, నూలుబట్టలును, సుకుమార శరీరులుగా యుండువారలు సన్నరక

ములు నూలుబట్టలను పట్టుబట్టలను, గట్టుకొని శరీర సంరక్షణ మొనర్చు
కొనవలెను. అట్లుగాక వ్యతిరేకముగా నడచుటచేతను జ్వరాదిరోగము
లు కలుగును, ఎండలో నడచునపుడు తలకు పాగాగాని, టోపిగాని
యుండి తీరవలెను. (పవిత్రం, కేశ్యముష్ణీ, వాతాతపరజోపహం, వర్షానిల
రజోఘర్మ హిమాదీనాంనివారణమితి శుశ్రుతే' శిరమందుంచు పాగ మొ
దలయినవి. వాతము, ఎండను, ధూళివగయిరాలను, బోగొట్టి వర్షము
యొక్కయు మంచుయొక్కయు, బాధలను తొలంగించును అని శుశ్రుతు
లువారి అభిప్రాయము తలకు ధరించునవి మిక్కిలి బరువుండగూడదు.
యెంతచులకనదైతే అంతమంచిది. మనశరీరమున నుండు, వూపిరితిత్తుల
ను తదాశయములకు వెట్టబుట్టుటకు ఫ్లానలు, టోపీలు, బొచ్చువగయి
రాలుతోను పట్టుతో తయారగు వస్త్రములనే ధరించుట కర్తవ్యము.
చెమటబట్టలను విడిచివేయుచుండుట మంచిది. తడివస్త్రములను ధరించ
కూడదు. అందువలనే దేహమందుండు వేడి తగ్గి ఆరోగ్యము చెరుచును
బాలకులతత్వమతిసున్నితముగాన, మనకన్న ఎక్కువ మార్దవముగల
వస్త్రములు ధరింపజేయవలెను. శీత వర్షాకాలములయందు బాలురకు
మొదట నూలుచొక్కాయలను తొడిగించి పైనవున్నిబట్టలను తొడి
గించునది, అట్లు తొడగనియెడల శీతల మెక్కువగుటచే నీళ్ళవిరేచన
ములు జలుబు జ్వరము వగయిరాలను కలుగజేయును. విద్యార్థి విద్యను,
పుత్రార్థి పుత్రులను, జయార్థి జయమును, పొందుటయేగాక సర్వసంపదలు
వస్త్రములువలనే బొందుటకు కాశ్రేని, యెరుకల, పుత్రి సత్తునా
గుల యెద్దంచుల సర్వవశీకరణ, సర్వజయకరణ సర్వపుత్రి పుత్రీకరణ
మొదలగు నీవస్త్రములలో ఆయావస్త్రధారణాదులవల్ల ఆయాఫలము
లను బొందగలరు.

(గృహములు.)

సాధారణముగా యిండ్లు మూడు నాల్గు అడుగులు మనమునడచు
భూమికన్న యెత్తై వుండవలెను. ప్రాకారం గోడలకన్న యింటిగోడలు
యెత్తై యుండవలెను. గాలి బాగుగా లోనికి వచ్చునటుల మంచి మంచి



కిటికీలను దక్షిణోత్తరములయందు పెద్దవిగా చూచి పెట్టవలెను. అటుల
పెట్టుటచేతను మంచిగాలి లోనికి సొరగి మంచిఆరోగ్యము ఏర్పడును.
కుళ్లుగుంటలు మురికిబోదులు పాడుపడిపోయిన చెరువులప్రాంత్యముల
యందు, గాలి చొరనీయని స్థలములయందు యిండ్లు కట్టరాదు. అట్లు
కట్టిన, మలినవాయువులోపల ప్రవేశించి వ్యాధులను కలిగించును. గదు
లు పెద్దవిగా యుండవలెను. తేమగల ప్రదేశములయందు అనగా పాటి
పెరడులు ఉప్పు చవిటి నేలలోను కట్టినయిండ్లు యెల్లప్పుడు తేమగా
యుండును. గనుక అట్టిప్రదేశములయందు కట్టిరిండ్లు గుణావర్తము
అనగా యిల్లుకట్టె ప్రదేశమందు 6 అడుగులు మన్ను తీసివేశి నల్లమన్ను
గాని యిసుకచేగాని పూడ్చి కట్టుకొనవలెను, సాధారణముగా యిండ్లు
గోడలకు సంవత్సరమునకు వకటి రెండుసార్లు అయినను సున్నము గొట్టు
చుండవలెను. సున్నము కొట్టుటచేతను చాలా శుభ్రమేర్పడి ఆరోగ్యము
గలిగించును, యిండ్లుఅలుకుటకు మనవారలు వట్టిగోమయముచేఅలుకు
ట వాడుకై యున్నది. దానియందు కొంతచెడువాసన యుండుటచే
ఆరోగ్య భంగకరము గావున అందువిశేషము పత్సనున్న యర్రమన్ను
ను జేర్చి అలకుట చాలామంచిది. యింటియందుండి మురుగుపోవు కాల్వ
లు కుళ్ళు వగయిరాలను శుభ్రపరచుచుండవలెను. యింటియందు సాలె
గూళ్లు భ్రమరగూళ్లు వగయిరాలు లేకుండాచేయుచుండవలెను. యింటి
చుట్టు గుంటలు పెట్టి మట్టి తీయరాదు. అందువల్ల వర్షకాలమున గుంట
లలోనికి మాలిన్యములు జేరి దుర్వాసన వగైరాలను కలుగజేసి దేహారో
గ్యము జెరుచును.

మనముభుజించి విడుచు బెరళ్ళు వగైరా ఎంగిలులు యింటిసామీ
ప్యమున బోయరాదు. పేడకుప్పలు పెంటకుప్పలు యిండ్లకడ నుంచ
రాదు.

వ్యాయామము

వ్యాయామము జేయకయున్న శరీరపాటవము జెడుటయేగాక
అజీర్ణ మతిశయించి మలబద్ధము కలిగించి సమస్తరోగములను కలుగజే

యును. గనుక దేహపరిశ్రమ ఆరోగ్యమార్గమునకు ముఖ్యమయినదిగా నెరుగునది వ్యాయామము పలుతెరంగులు. దేశకాలభేదములుచేతను, శరీరబలదారుఢ్యమ నకుకొద్దిపరిశ్రమముఖ్యముగాచేయతగినది. సూర్యోదయమునకు ముందులేచి దైవమును ప్రార్థించి, బయలకువెళ్ళి మలమూత్రోత్సర్జనము గావించి దన్తధావనము జేసుకుని, మంచిగాలి వచ్చుప్రదేశమందు బిగ్గరగా నడచుట, లేక తోటవగైరాలు త్రవ్వుట దండెములు కసరత్తు, మొదలగు పనులు, శరీరదారుఢ్య మెక్కుడుగలవారలు ఎక్కువగను తక్కువ బలముగలవారలు తక్కువగను జేయుచుండవలెను. ఉదయముననే గాక సాయంకాల సమయములో గూడా జేయవచ్చును. దారుఢ్య వంతులు రెండుటయిములలో సాధారణబాలులు ఉదయమును జేయవలెను. అటులజేయుటచే మనశరీరమున రక్తము బాగుగా ప్రసరించుచుండును. సకలావయవములకు బలము హెచ్చుటయేగాక, ఉత్సాహము, మనస్సంతోషము విస్తరించును. పరిశ్రమచే వూపిరిని హెచ్చుగా విడుచుట సంభవించును. అందుచే గాలిని మనము విస్తరించి లోపలికి పీల్చుదుము. అట్లుగాలి హెచ్చుగా పీల్చుటచేతను, మనశరీరమందుండు రక్తము, అతిత్వరగా బాగుపడుచుండును. పరిశ్రమాధిక్యముచేత చెమ్మట విస్తారము పట్టును. అందుండి లోపల విసర్జనీయ పదార్థములు బయటికి బోవుచుండును. వ్యాయామము జేయనివారు గురుత్వపదార్థములను జీర్ణించుకొనజాలరు. హిమంత రుతువునందు మంచు ఎక్కువగు దినములలో సాయంకాలమే పరిశ్రమ జేయునది, సదా రెండుగంటల కాలము వ్యాయామ మాచరించవలెను. అటుల ఆచరించుటకు శక్తిచాలనివారు కొద్దికొద్దిగా ప్రారంభించి క్రమక్రమముగా హెచ్చింపవలెను. దేహపరిశ్రమ జేయుటచే మనశరీరము చాలా తేలికగా యుండుటయేగాక, చురుకుతనము,అవయవములకుబలమును, జీర్ణశక్తినికలుగజేయును; బుద్ధిమాంద్యము బద్ధకము వగయిరా పూర్తిగాపోవును. బలకరపదార్థములు క్రొవ్వుపట్టించు పదార్థములు మాంసాదులు దినువారలకు, దేహపరిశ్రమముఖ్యావసరము, శక్తికిమించిన పరిశ్రమ ఎన్నడు చేయకూడదు. అటులచేసిన



యెడల కీడు మూడును, భోజనమునకు బోవునప్పుడు ముందున్ను భోజనానంతరమున్ను ఒకగంటవరకు వ్యాయామము చేయుటవల్ల చాలా చెడుగు సంభవించును. నీకు నీవు వృథాయాసము బుట్టించుకొనకుము. ఆయాసము మనుజును జంపునది. గృహస్థులు భార్యతో కలశినరోజున, దానికి మరుచటిదినమున వ్యాయామము విస్తరించి చేయ కూడదు. ఆస్తమా, గలవారలు క్షయరోగులు హృద్రోగముగలవారలు, కాసరోగులు, నేత్రరోగులు వ్యాయామమును విడువవలెను.

## శయనాది విధి

శ్లో॥ నిద్రాస్సుఖకరస్వప్తి, శ్రమనేత్రరుగాపహా॥

నిద్రించుటచేతను సుఖముగలుగును, శ్రమము, నేత్రరోగము మొదలగునవి హరించును. నిద్రలేమిచేతను, శరీరమునందు పోట్లు, గురుత్వము, ఆలస్యము ఆవలింతలు, బుద్ధిమాంద్యము, ఆయాసము బడలిక, తంద్రి, వాతరోగములు, గల్గును కావున నిద్రను శరీరానుగుణ్యముగా. క్రమముగా సేవించవలెను. రాత్రి జాగరణము చేయువారలు పగలు నిద్రించిన దోషముగలుగజేయదు.

సర్వర్తువులయందు పగలు నిద్రించుట తగదు. జ్యేష్ఠాషాఢ మాసములయందు మాత్రము వుష్ణమధికమగుటచేతను, రెండు గడియలు కాలమునిద్రింపవచ్చును, మేద,స్వేద,కఫ,రక్తమోక్షణులు అజీర్ణఅతిసారతృష్ణ హిక్కా-శిశువులువృద్ధులు మత్తులురోగులు మాత్రము, స్వల్పకాలము పగలు నిద్రింపవచ్చును. రాత్రి నిద్రలేకుండు కాలములో, సగముకాలము పగలు నిద్రింపవచ్చును. పగలు నిద్రవలన, స్వయంకృపికిహానికలుగుటయే గాక, కాసరోగము, శ్వాసరోగము, శిరోరోగము ప్రతిశ్యాయరోగము, అనగా ఎడతెగక తుమ్ముట, అర్ధాంగవాతము అరోచకము, జ్వరము, అగ్నిమాంద్యము, మొదలగు పలురోగములను బుట్టించును. గనుకనే రోగోద్భవప్రకరణమునందు, దివాశయా జాగరతౌచరాత్రౌ, అని వ్రాశియున్నారు. అనగా పగలు నిద్రించుట రాత్రి

జాగరణము జేయుటయు, రాత్రియందు విస్తారముటయము మేల్కాం
చెడివారలకు వాతపిత్తరోగములు బుట్టును, గనుక రాత్రిజాగరణము
పగలు నిద్రించుట విసర్జింపవలెను, తెలిసిన బుద్ధిమంతులు, ఉచితముగ
నిద్రింపవలయునని ఆయుర్వేద గ్రంధాదులయందు వ్రాసియుండిరి.
సాయంకాలమున స్నేహితులతో మితముగాదిని, శయనించవలయునని
యు అట్టిశయనించు మంచమువిరిగనిదియు దృఢమైనదిగానునల్లులు వగై
రా లేకుండునదిగాను విశాలమయినది గాను, మలినముగా నిదియు
గాను, నుండవలెను. నల్లులు వగైరాయున్న నిద్రాభంగము
గలుగుటయే గాక, రోగగ్రస్తులుకూడా కాగలరు, శయ్యయిరుకుగా
యుండిన, వర్తిగిలుటకు, ఉపయోగించదు. విషమమైన శ్రమకలుగు
ను, మలినమైన రోగముకలుగును. ఆస్తరణ లేకుండిన అనగా, మంచ
మందు పరుపై నామెత్త అయినా లేకుండిన శరీరమువత్తును, గాన మంచి
శయ్యయందు పరుండవలయును, రాత్రి మొదట ఝామునువిడచి,నిద్రిం
చవలెను, నాల్గుఘడియల తెల్లవారుననగా మేల్కాంచవలెను.

రాత్రి పరుండబోవునపుడు సుఖశాయులగు,

శ్లో॥ అగస్త్యోమాధవశ్చైవ ముచికుందోమహామునిః।
కపిలోమునిరాస్తీకః తంచైతేసుఖశాయనః॥

అగస్త్య, మాధవ, ముచికుంద,కపిల, ఆస్తికులను స్మరించి, పరమాత్మను
ధ్యానించి, నమస్కరించిబుద్ధిని నంతర్యామితోగలపి నిద్రింపవలయును.

అట్టినిద్ర చేసర్వావయవములు సంపూర్ణముగా విశ్రాంతిని జెందు
చుండును, శరీరపరిశ్రమసరీగా జేయువారలకు నిద్రసరీగా పట్టుచుండును
అట్లు నిద్రగలుగుటచే మనము భుజించు పదార్థముకూడా జీర్ణించును
దానిచే దేహబలమధికమగును, రాత్రులు త్వరితముగా జీర్ణముకాని
పదార్థములు దినరాదు, అధికముగా భుజించరాదు, అట్లుచేసిన హానిచే
కూరును. గాలి రాకుండు స్థలములందు, జన బాహుళ్యము గల
చోట్లయందు, ఎక్కువ దినుటలలో నగువాట్లచే, నిద్రకు భంగము గలు
గును, మనము నిద్రించు స్థలములందు గాలిబాగుగా వీచుచుండవలెను



గాలికి ఎదురుగను చలిగాలియందు బరుండరాదు. అట్లుపరుండుటచే
శరీరవేడితగ్గి వ్యాధిని కలిగించును. చంటిబిడ్డలకు నిద్రయెక్కువకావలె
ను, గనుక రాత్రింబగళ్లు వారు నిద్రించవచ్చును, 8 సం॥ వయసు లగా
యతు 10 పదునారేండ్ల ప్రాయమువార్లకు 12 ఘంటలకాలము నిద్ర
కావలెను, వయసు ముదిరినకొలది. నిద్రతక్కువగును గానవారికి 8 గం
టలునిద్రచాలును. రాత్రి 8 గంటలుకుపరుండి తెల్లవారంజామున 4 గం
టలకు నిద్రనుండి లేచెడివారికి ఆరోగ్యముగలుగును.

## తాంబూల చర్వణము.

తమలపాకులు శోధనముజేసును. రుచిగాయుండును. శీఘ్రముగ
కాకజేసును. వగరుగ, చేదుగను, కొంచెము ఉప్పగనునుండును. వేగము
గలది. కాసము, రక్తపిత్తముజేసును, తేలికనిచ్చును, బలమునిచ్చును.
శ్లేష్మము నోటికంపు, మలదోషము, వాతము, బడలిక, బోగొట్టును.
కారముగపుల్లగ, చేదుగానుండు తమలపాకులు, ఆమవాతమును బోగొట్టి
కాకచేసును. ముఖపాకముజేసి అతితాపము, పిత్తరక్తము, వీటిని వృద్ధి
జేసి, మలబంధము, వాతముబోకడచును. కొంచెము మధురముగను,
తీక్షణముగను కారముగనునుండు తమలపాకులు, కాకజేసును. పాచన
ముజేసును. గుల్మము, ఉదరము, కడుపుబ్బరము వీనిని బోకడచును.
రుచినిబుట్టించును, అగ్నిదీపనముచేసును. యేడునరములుగల తమలపా
కులు, అధికరసము గలవైయుండి, రుచినిబుట్టించును, సువాసనగల తమ
లపాకులు, తీక్ష్ణముగను పుల్లగను, మధురముగవుండి హృదయమునకు
మేలుచేసి, అగ్నిదీపనముచేయును. శరీరపుష్టిని, బలమును వృద్ధిచేయుట
యేగాక, గుల్మము అగ్నిమాంద్యము, హరించి శరీరపుష్టిని బలమును
వృద్ధిచేసును. శాల్మరసయను తమలపాకులు తీక్ష్ణముగ మధురముగ
నుండి, రుచినిబుట్టించును, చలువచేసును, తాపమును పిత్తప్రకోపము
ను, బోకడచుటయేగాక, అగ్నిదీప్తినిచ్చి బలమునుచేయును, సుఖము
నిచ్చి, మైకముచేయును, సంపత్తుకాంతిని వృద్ధిచేసును, తుమ్మెదలవలె
నల్లగనుండు తమలపాకులు, ప్రియముగాను, గుల్మము కడుపుబ్బరము
మలబద్ధము హరించును, ఆంధ్రపుక్కిలియను తమలపాకులు, వగరుగ
కారముగనుండును, కాకచేసి, మలబద్ధముచేయును, కంఠపీడముఖపిత్త

ముచేయును, వాతమును హరించును, యీ ఆకులును నాల్గు అయిదు
రోజులు వడలినిచ్చి వుపయోగించిన, హృదయమునకు మేలుచేయును,
నిడివైనతమలపాకులు కఫవాతములనుహరించును, రుచినిగలుగచేయు
ను, గురుత్వముచేసును, దీపనమును పాచనమును చేసును, దానిని
కొంచెముసేపు ఎండలోనుంచి వడిలినతరువాతను ఉపయోగించిన, ము
ఖరోగమును జడత్వమును బోగొట్టును, త్రిదోషహారి, తాపముఅరుచి,
రక్తదోషము, మలబద్ధము, వాతమువీటిని కలుగచేయును, దప్పినికలుగ
చేయు యీఆకులు అంత శ్రేష్ఠమయినవి కావు. ఉత్తమమయిన తమల
పాకులు రుచిని, శరీరవర్ణమును కలుగచేయును, త్రిదోషములను హరిం
చును. కమ్మెరాలనుతమలపాకులు, చేదుగావగరుగాయుండును, కాక
చేసును. తాపమునోటికి రసజ్ఞానము లేకుండుట మలవిసర్జనము వీటిని
కలుగచేయును, తెల్లనితమలపాకులు, శ్లేష్మము, వాతరోగమును హరిం
చును. పథ్యకారి, అరుచినివదలించి, అగ్నిదీపనము, పాచనముచేయును.,
తమలపాకులయొక్క నరములుఅనగా అందుండు యీనిలువంటివి శరీర,
వర్ణమునకు భంగముచేయునుగాని, ఆనరములను తొలగించి తాంబూల
ముచేయవలెను. దానికాడలు జీర్ణముచేయునుగాని, త్వగ్దోషము కలిగిం
చునుగాన దానినిగూడ దీశివేయవలెను. అపుడుగోసిన తమలపాకులు
పసరుగాయుండుననియు, వేసుకొనుటచేతను సుఖరోగమును, జాడ్య
మును, దాహమును, అరుచిని, రక్తదోషమును, మలబద్ధమునుచేసి
కాంతినడచునుగాన, తమలపాకులుకోసినపిమ్మట నాల్గుఅయిదురోజులు
పండమారనిచ్చి, వేసుకొనుచుండవలెను. కర్పూరవల్లీదళమను తమల
పాకులు, సంతోషముచేయును, మధురములఘువు, కారముకలిగి దపనము
ఉష్ణము, శ్లేష్మహరము, రుచికరము, వుప్పన, వర్రియును, సౌభాగ్యసంప
త్కరము, దేహకాంతి, ప్రీతివర్ధనము, లఘుతరము, ముఖరోగశకునము
కామోద్దీపనము, సుగంధము, పథ్యము, వాతకఫహరము, విశదీకరము
యిట్టికర్పూరవల్లిదళములు మహారాజులు భోగవంతులచే సేవింపబడును.
ఎర్రభూమియందు పుట్టినతమలపాకులు, దళసరికలిగి, తెలుపు సువర్ణ



కరమైన కర్ణాకారమై, సౌకర్యమై అనేకరోగములను హరించునవిగా
యుండును. పోకలు గురుత్వముచేసును. శీతలముగావగరుగానుండును.
కాకచేసును, కఫపిత్తములను బోకడచును, సొక్కునుపుట్టించును. అగ్ని
దీపనమును, రుచినికలుగచేయును. దుర్గంధనుము బోకడచును. పచ్చిపోక
గురుత్వముచేసును. శ్లేష్మకారి, అగ్నిమాంద్యమును, దృష్టికిచెరుపును
చేసును. పండినపోకలు, జిగటగనుండును, త్రిదోషములను హరించును.
మంచిస్వరమును కలుగచేయును, ఎండినపోకలు, వాతముచేయును, మధ్య
భాగము గట్టిగానుండిన, పోక శ్రేష్ఠమయినది. దేశభేదముచేతను, పాక
భేదముచేతను, నున్నగనానావిధములుగ నుండుపోకలు సమస్తదోష
ములను బోకడచును. చలువచేసును, కొంకణదేశమందు జనించినపోకలు
యింగళియనిచెప్పబడును. అవిసువాసన గలవియైయుండును. శ్లేష్మమును
హరించును, దీపనమునుచేయును, బలము పుష్టినిచ్చును, మిక్కిలిరసము
కలదైయుండును, ఆంధ్రదేశమున జనించుపోకలు, రసమునందు వగరుగ
మధురముగ,కొద్దిపులుపుగాయుండును. వాతముకఫము, వర్ణదోషము
హరించును. లేతపోకలు, వగరుగనుండి నోటియందున్నంతకాలమును,
శమింపచేయు ను. కంఠశుద్ధిచేయును, రక్తరోగము, ఆమరోగము, శ్లేష్మ
ము, చీముకారుట, ఉదరరోగము, కడుపుబ్బరము శమింపచేయును.

తాంబూలముపట్టీ పత్సకర్పూరము గంధోదకముచే దడిపి, కం
చుడబ్బాలో యుంచుట శ్రేష్టము, యుత్తరాభిముఖుండై తాంబూలా
చర్వణము జేయవలెను. సున్నముంచిన ఆకును భక్షించిన, లక్ష్మీహాని
యును కలుగును, వాడిపోయినవియు, చినిగిపోయిన తమలపాకులు
భక్షించుటవలన రోగముచేయును, పర్ణమూలము వ్యాధికరము, పర్ణా
గ్రము, పాపజనకము, చూర్ణపర్ణము ఆయుష్యమును హరించును
పర్ణమందగు న ర ము లు బు ద్ధి నా శ క ర ము లు, స్వచ్ఛమగు తమలపా
కులు, చక్కగా శోధించిన పోకచెక్కలు, పరిశుద్ధమగు సున్నమును
గూర్చబడిన తాంబూల మనబడును, ఒకపోకనైదాకులు ననపగింజంత
సున్నములో సగము పత్రకర్పూరము, మూడు తక్కోలములు లవంగము

నాల్గు, సున్నములో నాల్గవపాలు జాజికాయ గలశిన తాంబూలము, సకలదోషహరము గావున యీవిధముగా భక్షింపవలెను. పోకచెక్కలో పురుగుండిన గళగండాదిరోగములను, పర్నమందుండు కీటకము ముఖరోగమును, సున్నమందుండు రాయి, అశ్మరీరోగమును బుట్టించును, గనుక పర్నాది శుద్ధినిగావించవలయును, భోజనమునకు పూర్వమందైన, పరమందైనను నేడేశిపత్రములను భక్షింపవలయును. రాత్రులయందు పదునాల్గు ఆకులను సేవించవలయును. చెక్కలధికముగ పూర్వాహ్నమందును, సున్నమధికముగ మధ్యాహ్నమందును, ఆకులధికముగ రాత్రియందును, తాంబూలమును భక్షింపవలయును, చక్కలాకులు సమముగానుండిన రక్తికలుగును, చక్కలధికముగానుండిన రక్తిమలేకుండును. సున్నమధికమైన, సుగంధము పోవును. పర్నాధికముచే సుగంధము హెచ్చును. మూడు సమముగానుండిన రుచికలుగును, యీ తాంబూలము ప్రాతఃకాలమున సేవించిన, వేడిని, రుచిని, అగ్నిమాంద్యమును వీర్యహానిని పీనస, శ్వాస, పాండు, మూత్రకృఛ్ర, ప్రమేహము యీరోగముల కలుగజేయును. విస్తరించి, తాంబూలమును వేయుటచేతను శరీరము తెల్లబడును, దంతపట్టును తగ్గును, చెముడు, నేత్రరోగము, వాతపైత్యము కలుగజేయును, తాంబూలము నమలి, మొదటిరసము విషసమము గావున, నుమియవలెను. మధ్యరసము, పాచనము అంత్యరసము అమృతతుల్యము, మలబంధమును, శూలను, క్రిములను, హరించును, హృద్యము. ముఖసుగంధకము, దంతములకు ఓష్టములకు, రక్తిమను, రోగాతురులకు దీపనకారిగాయుండును, కామోద్దీపకము రూపప్రకాశము, సౌభాగ్యము, సుగంధకారి, కఫాదిరోగహరి కావున తాంబూలము మిక్కిలి శ్రేష్టమయినదియు గుణకరమయినదియు నగును, తాంబూలము నోటియందుండగా నిద్రించరాదు. నిద్రించిన, చొంగబడుటయేగాక, ముఖము పాండురవర్నముగను, దంతదౌర్బల్యమును జేయుటయేగాక, ముఖరోగమును సెగకలుగ జేయును, తాంబూలదానముచే త్రిమూర్తులు తృప్తులగుదురు గావున, మంచియాకులు మంచిచెక్కలు చూచి వృత్తములకు, యిచ్చి తాంబూలము వేయవలెను.



సభలయందు, శయనమందు, వివాహాది శుభకార్యములయందు యజ్ఞాదిక్రతువులయందు, పుత్రాదిజన్మమందు, యుద్ధమందు, ప్రయాణమందు, గ్రామాదిప్రతిష్ట కాలములయందును, దేవతాకార్యముల యందును, తాంబూల దానము ముఖ్యము.

పాలు, వెలగపండు, పనస, మామిడి, అరటిపండ్లను, చెరుకులను కల్లును, పప్పులుతో చేయబడిన కట్టులును రసాయనము, కషాయము నేయి, తేనె, కొబ్బరినీళ్ళు, యివి బుచ్చుకొనిన వెంటనే తాంబూలము సేవించిన విషసమము అగును గావున పై విభుజించినపుడు వకగంటకాలముండి తాంబూలము వేయవలెను.

శంఖములవల్లను, రాళ్లవల్లను, గుల్లవల్లను, ముత్యపుచిప్పవల్లను ముత్యపుచూరువల్లను, బుట్టునది సున్నమని పేర్కొనబడినది. శంఖసున్నము క్షారలవణములు కలిగి, జఠరాగ్నిని వృద్ధిజేయును, మేధస్సును శోషించును, క్రిములను జంపును, శూలనణచును, రాతిసున్నము మిక్కిలి వేడిజేయు, తీక్షణముగ, కటువుగ, లఘువుగ, పైత్యాభివృద్ధిగా కారముగ, నుండి విశేషించి శ్లేష్మమును బోకార్చును.

గుల్లసున్నము, విరేచనకారి, కారము, శ్లేష్మనాశము జేయును ముత్తియసున్నము తీక్ష్ణము ఉష్ణము, రోచనము, లఘువు, దీపనము, జేయును, ముత్తియపుసూరసున్నము, వాతపైత్య శూలలను దునుమాడును. పచ్చకర్పూరమును, అశ్వారోహణమందు, మార్గము నడచు వేళలందు, రతిసల్పునపుడు, ఆకలిదప్పులచే నున్నప్పుడు, తాపరోగమందును, తాంబూలముతో గలపి సేవింపవలెను.

కస్తూరి, సర్వాంగవాతమందును, శోఫరోగమందును, మందాగ్నియందును, మేఘము లావరించియుండు దినములలోను, దవడలుపట్టుగాయున్నప్పుడు, శిరోరోగమందును, తాంబూలముతో బుచ్చుకొనిన, నవి తగ్గును.

మరిన్ని, కుష్టు, మధుమేహము, మూత్రరోగము, నేత్రరోగ

ము, క్షయ, తరుణజ్వరము, ఉబ్బరోగము, మూత్రకృచ్ఛ్రము, కుసుమరోగము, పాండువ, త్రిప్పు, పిచ్చి, మనస్తిమితము లేకుండుట, శోష, మూర్ఛ, శ్వాస, వమనము హృద్రోగము, రక్తపైత్యము, దేహతాపము, విసర్పిచర్మరోగములు, అపస్మారము, గ్రహణి అతిసారము, మిక్కిలి శుష్కించినవారలు, గాయము తగిలినవారలు, క్షుత్పిపాసాపీడితులు, సర్పదష్టులు విషదోషము లున్నప్పుడు, తాంబూలమును చేయకూడదు. అటులజేసిన హానిని కలుగజేయును,

మా వైద్యశాలయందు తయారగు రాజతాంబూలవటి, కస్తూరి కుంకుమపువ్వు, పన్నీరు వగైరాలుతో శాస్త్రానుసారము తయారై యెప్పుడు సిద్ధముగా యుండును. అవి తాంబూలముతో సేవింపుచుండిన,లావణ్యము కలిగి యుందురు. స్త్రీలకు మనోహరుండగును, ధాతువృద్ధిని జేయును గనుక సదా తాంబూలముతో సేవించుచుండవలెను.

ప్రాగ్దిశగా, లేక దక్షిణదిశగా, శిరస్సునుంచి పరుండుట మంచిది, ఉత్తరపశ్చిమదిశల శిరస్సునుంచి పరుండిన రోగప్రదము, ప్రయాణే పశ్చిమేశిరః అనినందున, ప్రయాణములో పశ్చిమమున శిరస్సునుంచి యెప్పుడు పరుండరాదు, ఎందుచేతననగా, దిక్సాధన యంత్రమువలె ధృవనక్షత్రాకర్షణ సిరస్సునందుండు బుద్ధికిని కలుగుచున్నందున్న, వెర్రివాడగుచున్నాడు, తరుచు వెర్రివాళ్ళు ఉత్తరముగానే శిరస్సునుంచి నిద్రించెదరు.

### దారోపగమనము.

రాత్రియందు భార్యలలంకరించుకొనవలెను, స్నానముజేసి చందనాది సుగంధద్రవ్యంబులు ధరించి, ప్రీతితో, మిక్కిలి ఆకలిగొన్నవాడును, అత్యాహారముచే కడుపుబ్బినవాడును, సురతమును సలుపరాదు, కామముగలవాడును, నైనపురుషుడు, సురతక్రీడ ననుభవించవలెను.

రాత్రులయందు స్త్రీలు శయ్యకు బోవునపుడు లఘుకరపదార్థములు పాలు బహు స్వల్పముగా దీసుకొనవలెను. అట్టి స్త్రీలు పురుష



సంపర్కము జేసిరేని మగసంతానమును బడయగలరు. చతుర్దశి,అష్టమి అమావాస్య, పౌర్ణమి, రవిసంక్రాంతిని, వర్జించి, రుతుకాలమందు స్త్రీసాంగత్యము జేయవలయును, స్త్రీయొక్క శోణిత మధికమయ్యిన్న స్త్రీ సంతానమును, పురుషుని శుక్ల మధికమయ్యిన్న పురుషసంతానమును బడయుదురు గావున, శుక్లహీనమగు పురుషులు, శుక్లవృద్ధికొరకు, మా వైద్యశాలయందు తయారగు ధాతువృద్ధీకరణి, అశ్వగంధాది లేహ్యము ఖర్జూరాది లేహ్యమును, శతావరి లేహ్యమునుగాని, విడువక మండలము రోజులు కాంతాభ్రకసింధూరమును కలపి సేవించిన, మిక్కిలి వీర్యవృద్ధి కలుగుటయేగాక- స్త్రీలయెడ మన్మథునివలె నుండుటగూడా తటస్థించును,గానహీనవీర్యులుముఖ్యముగామామందుభుజింపవలయును.

స్త్రీకి షోడశర్తు నిసిస్త్రీణాం అని, చెప్పియుండుటచే, బహిష్టయిన దినము లగాయతు 16 దినములు మాత్రమే రుతుదినములు గనుక, ఆ రుతుదినములు 16 రింటిలో మొదటిదినములు నాల్గున్ను ౧౧ వ దినము ౧౩ వ దినమున్ను వదలివేసి మిగిలిన పదకొండు దినములు ప్రశస్తంబులు గావున, ఆదినములలో స్త్రీనొందుట ప్రశస్తము.

రజస్వలాస్త్రీని పొందినవాడు, దృష్టి, ఆయువ, తేజమును నశించునని, శుశ్రుతమున వ్రాశియున్నది. స్త్రీలు సంతానముకొరకే, సృజింపబడిరి, స్త్రీ క్షేత్రభూతురాలు, పురుషుడు, బీజవంతుడు. గాన, బీజముగల పురుషునకే, క్షేత్రముగల స్త్రీని నివ్వవలెను, నిర్వీర్యునకు, యివ్వగూడదు. సంతానోపయోగమగు కామము, ప్రపంచాభివృద్ధికై యగుచున్నది, అట్టి ప్రపంచము స్త్రీపురుషులచే నిష్పన్నమగుచున్నది. అట్టికామము, పితృరుణ విమోచనహేతువగుటచే, సంతతము, మహాపురుషులుచే, నాచరింపబడుచున్నది. పురుషార్థమని మహానుభావులు నుడివిరి.

మరియు రతిప్రదీపమందు- పశుపక్ష్యాది జంతువులకు, మైథునము సాధారణము, మనుష్యుల కట్లుకాదు, కామకళాజ్ఞానముచే నానం

దాతిశయమును బొందుదురు. అందువలన నన్యోన్యానురాగముచే స్త్రీలు పతివ్రతలున్ను, పతులేక పత్నీవ్రతులు నగుదురు. అట్టి నైపుణ్యములేని స్త్రీపురుషులు, మృగాదులువలె యథేచ్ఛావ్యాపారము గలవారగుదురని చెప్పబడియున్నది. గాన కామశాస్త్రప్రవీణుడైన, భర్తయందే స్త్రీలనురక్తలగుదురు. గాన పతివ్రతలగుదురు. భర్తవలననే, భోగపరితుష్టి యగుచుండును. యీకారణముచే బురుషుడు కామకళాశాస్త్రములను అవశ్యము జూడవలయును. యీ శాస్త్రము ననుసరించి, రత్యానంద మొందుటకు, ఎవడు నిశ్చయించునో, కాలబంధాది సౌష్టవజ్ఞానముచే, వాడు మనోవేగమును అరికట్టును, అందువలన స్వాధీనచిత్తము గలవాడై, క్రమముగా జితేంద్రియుడగును. కావున నీహేతువచే, కామకళాజ్ఞానములను దెలుపునట్టి శాస్త్రములను దెలియదగినదని, మనంబున దెలుసుకొనినవాడై, క్రమంబుగా బురుషార్థచతుష్టయాధికారి కాగలడు.

స్త్రీ, దోషహరము, దీపనకరము, అధరామృతము పైత్యహరము, ఆలింగనము వాతహరము సురతము కఫహరము, బాలస్త్రీ సంభోగము, ఇంచుక వెట్టను మనోహర్షమును, దీపనము, లఘుత్వమును, నాడీనిర్మలత్వమును జేయును. యవ్వనస్త్రీ సంభోగము బలమును, పుష్టిని, పంచేంద్రియములకు బ్రీతిని, సౌఖ్యము, దోషత్రయ నాశమును, నెమలివంటి నాడీప్రచారమును జేయును. ప్రౌఢస్త్రీ సంభోగము జ్ఞానమును దీపనమును, మన్మథోద్రేకత్వమును లఘుత్వమును, రాజహంసవంటి నాడీప్రచారమును జేయును. వృద్ధస్త్రీ సంభోగము, మాంద్యమును, జడత్వమును మంధాగ్నిని, అరుచిని, వాతరోగమునుమహిషగతివంటి నాడీప్రచారమును జేయును. బాలయన 16 సం॥ పరియంతము, ఆపైని యిరువది సం॥ వర్కు తరుణియనంబడును, నామీద యేబది సం॥ పరియంతం ప్రౌఢ, అని పిలువబడును. అటుమీదట వృద్ధయని చెప్పంబడును.

యిష్టమగు ఆభరణములను, విచిత్ర వస్త్రములు నిచ్చి, మృదు



మధుర వచనములుచే మచ్చిక జేయుచు రతిశాస్త్రవేదియగు ధీరుడు, ముగ్ధాంగనా సంగమ మొనర్చవలెను. మన్మథకళాభిజ్ఞుడై, విచిత్ర సురతములుచే, సుఖమును కలుగజేయుచు. మధ్యనాయకను వశపరుచుకొనవలెను. హాస్యోక్తులచేతను, ముష్టిఘాత, దంతక్షతనఖక్షతాదులచేతను, విశ్వాసవాక్యములచేతను. రతికూజితములుచేతను ప్రౌఢను వశపరుచుకొనవలెనని, రతిరహస్యమందు వ్రాయబడియున్నది. చక్షుఃప్రీతి, మనస్సంగమము, సంకల్పము, జాగరము, కృశించుట విషయనివృత్తి, లజ్జాత్యాగము, ఉన్మాదము, మూర్ఛ, మృతి, శ్రవణము యివి మన్మథావస్థలని చెప్పంబడును.

పరస్త్రీసంగము, కీర్తిని, స్వర్గమును, ఆయుష్యమును, నశింపజేయునని ఆయుర్వేదమందు వ్రాసియున్నది. తనభార్యవిషయమై తానెట్లు జాగరూకుడై యుండునో అట్లు అన్యాంగనలు గూడా రక్షింపంబడవలయునని, తెలిసి, పరదారాగమన బుద్ధిని, విడువవలయును, పురుషుడు దానెట్లు స్వదారయందున, తృప్తి జెందక, నితరస్త్రీలను నిచ్ఛయించునో అట్లే స్త్రీగూడా, పురుషునివలన తృప్తి లేకుండిన, పరపురుషుని పరిగ్రహించునని, తనసామ్యమునే తలంచి, పురుషుడు ఎల్లప్పుడు, స్వదారాపరుడై యుండవలెను,

భూమివలె స్త్రీ పవిత్రురాలు గావున దూషించరాదందురు, జాత్యంధుడు, దుష్టముఖముగలవాడు, ముదిమిచే జీర్ణమగు సర్వావయవములుగలవాడు, నాగరీకుడు కానివాడును, కులహీనుడును, కుష్టాదిఘోరరోగపీడితుడు, యిట్టి హేయస్వరూపులగు, నెట్టి నీచపుజనులుకైన మనోహరమగు, తనశరీరమును, ఉబ్బుయందుగల నాసచేతను, నమ్ముకొను, పణ్యాంగనా సంగమము మిక్కిలి నింద్యమయినదిగా వచించిరి, మరిన్ని, చండాలి, జార, రజస్వల, కన్యక, స్వగోత్ర స్త్రీ, వేశ్య వీరలు వృషలీశబ్ద వాచ్యుల నిస్కంద పురాణమున వ్రాసియుండెను. అనేకమారు లట్టివారల సంసర్గజేసినవారలకు ప్రాయశ్చిత్తమే లేదని వ్రా

సిరి. గాన వేశ్యయుగూడ వృషలీ యనిపించుకొనును, అట్టివేశ్య కళేబరము, ముదిమి, రోగము మొదలగు వాటిచే వ్యాప్తమై పైత్య శ్లేష్మాది దూషితమై, దేహదూషణ రోగముగలిగి, ఆపదలకును, ఆశ్రేయమునకును నాలవాలమై యుండును. రోగములచే దేహనాశమును, వ్యసనములచే ధననాశనమును, ధర్మహానిచే పరనాశమును, సాంకర్యముచే, కులనాశమును, యీనాల్గు వేశ్యాశ్రియముచే లభించు, గాన వేశ్యాసంగమము, మిక్కిలి యనర్థకము, గనుక అట్టి దానిని త్యజించి, పురుషుడు సర్వదా స్వదారానిరతుడై యుండవలెను.

ధర్మాధర్మ జ్ఞానముగలవాడు, సదాచార సంపన్నుడు, జితేంద్రియుడు, పుణ్యాత్ముడు నగువాడు, హిమంతరుతువునందు, పరిమెళ సహితమగు సౌంధాంతరములయందును, శిశిరరుతువునందు ఉద్యానవనమధ్యమందు, వసంతగ్రీష్మరుతువులయందు, ధారాది జల గృహములందు, వార్షికదినములందు,పరిమళ ధూపయుక్తమగు, వేడిగల గృహములందు శరదృతువునందు, నిర్మలమగు చంద్రికళలచే నంతటా వ్యాపింపజేయు, గవాక్షములుగల గృహములందును, మంగళయుక్తులగు స్వస్త్రీలతో నిర్మలుడును, సమబుద్ధిగలవాడునునగు నాయకుడుకూడి యుండవలెను,

నియమించబడిన యింద్రియములుగల మనుజుడు, విశేషముగ స్త్రీలయొక్క సంబంధమువలన, దనను, సంరక్షించుకొనవలెను. స్త్రీలను సర్వదాగూడి యుండుటవలన, శూల, దగ్గు, మేహము, వగర్పు, యెండిపోవుట పాండురోగము, క్షయరోగము సంభవించును, స్త్రీలతో నియమముగా కలుసుకొనువారలకు, ఆయుర్దాయము పెరుగును, ముసలితనము వేగముగా రాకుండును, తేజసు బలము దృఢమైనవృద్ధి బొందించబడిన మాంసముగలవారుగ నగుదురు. తెలసినవాడు, వేసవికాలమున పక్షముదినముల కొకతూరిన్ని, తక్కినకాలములందు మూడురోజులు, కొకపరియాయము స్త్రీని పొందవలెను. రజస్వలా స్త్రీని కామము లేని దానిని మలినముగానున్న దానిని తనయందిష్టములేని స్త్రీని, అధికవర్ణ



స్త్రీని ద్వేషబుద్ధిగలదానిని తనకన్న వయస్సెక్కువగల స్త్రీని రోగపీడుతురాలుని అవయవ లోపముగలదానిని, గర్భిణీ స్త్రీని యోనిరోగముగలదానిని స్వగోత్రి స్త్రీని గురుభార్యను యోగినీ స్త్రీని చలచిత్తముగలదానిని రజస్వలకాని కన్నియలను పొందరాదు. సంధ్యాకాలములయందు పర్వదినములందు మధ్యాహ్న వేళయందు సిగ్గుదోచే స్థలములందు అశుభ్రిమయిన స్తలములందును, ఆకలిగొనియున్నప్పుడు మలమూత్రిము వేగముగా యున్నప్పుడు వాట్లనుఅడ్డగించియువాతరోగియు జ్వరముగలిగి యున్నప్పుడు కృపించినవారలు దుర్బలుడు వీరలు రతి సల్పరాదు. పశ్వాదియోనులను కామాతురుడై రమించరాదు. వెల్లకిలపరుండి క్రీడసల్పియు, రేతస్సు పడిపోవునప్పుడు వదలక దానిని అడ్డగించుటయు విశేషముగా రేతస్సు వదలివేయుటయు యివి అప్రిశస్తంబులు డాత్యవృత్తిచే వేషములు ధరించు స్త్రీలను గురుపత్నిని సగోత్రి స్త్రీని వయోధికను సంధ్యలయందున బర్వములయందున రతియొనర్చిన యాయువు క్షీణించును. గర్భిణీ గమనమువల్లన గర్భమునకు హానియు వ్యాధిచే పీడింపబడు దానియొక్క గమనమున బలము క్షయించిపోవుటయు హీనావయవములుగలదానియొక్కయు మాలిన్యముగలదియు ప్రతికూలిని కేవలవంధ్యను ఆవరణ లేకున్నచోట్లయందు అపవిత్రిస్థలములందు గూడినయడల మనోశుక్ల క్షయములు అగును.

ఆకలితోను, చలచిత్తముతోనున్న, మధ్యాహ్న వేళలందును, రతియొనర్చినవాడు, దాహరోగముగలిగి బలములేనివాడగును, (వున్నశుక్లమునకు హానికలిగి) అనగ, శుక్లమేహరోగముగలవాడగును, వాతప్రికోపముగలుగును, అతిమైథునముచేతను, శుక్లక్షయకరమైన శోషపుట్టును, వ్యాధితుడు సురతమొనర్చిన, ప్లీహరోగము, మూర్ఛ, మృతి, గలుగజేయును, ప్రాతఃకాలమందు, అర్థరాత్రియందు రతిజేసిన, వాతపైత్య ప్రకోము జేయును, పశ్వాదియోనులయందును, రజస్వలకానికన్యకను, రోగయుక్తమయ్ని యోనులయందునరతిసల్పిన, సవాయిరోగములును, వాతప్రకోపమును, శుక్లనష్టమున్ను గల్గును.

విశేషముగ రేతోత్సర్జనము జేయుట, విస్తారము మూత్రమువిడుచుట, రతియందు స్ఖలనమునుఆపుట, వెల్లకిలపరుండి, రేతస్సునువిడచుట వల్లనున్ను, శుక్లమురాళ్లవలె ఘనీభువించి, అశ్మరిరోగమును పుట్టించును, గన్క పైనచెప్పినవన్నియు, ఇహపరసౌఖ్యములు గోరువాడు విడువవలెను మోహమధికముగా యున్నప్పుడు ఆవాంఛను ఆపరాదు, హృద్యముగా అలంకరించుకోబడి, హృష్టురాలైయున్న స్వస్త్రీతో రమించవలెను, శుక్లవృద్ధికరములగు నౌషధాదులు సేవించినవాడు పైనవ్రాసిన తీరుననే ఆచరించవలెను. సంగమానంతరము, పంచదారతోగల పిసపాలును, పంచదారతోగలసినరసద్రవ్యములైనను, బుచ్చుకొనవలెను స్నానము, విశినకర్రగాలి, నిద్రయు, యివి హితకరంబులు మరియు పశుపక్ష్యాదిజంతువులను, దిలకించిన, మనకు కొంతజ్ఞానములవడుటకు సందియములేదు, పశుపక్ష్యాదిజంతువులు, రుతుకాలమందు తప్ప ఇతరకాలములయందు రతిసల్పవు,గనుకనే,ఆజాతులు,గాలిజలమువాయువుఆహారము నిద్రాలోపాదులు వాట్లయందు ఎన్నివున్నప్పటికి దృఢముగను బలము గనువుండి, యున్నవి, రుతుకాలాభిగమనమే శ్రేయమని దలచువారలెల్లప్పుడు ఆరోగ్యమును జెడకయుందురు అట్లుగాని స్త్రీపురుషులు కామవికారముచే దాసత్వముజెంది, విషయభోగలంపటులైయుండువారలు అమూల్యమగు బలమును ఆయువు నశియింపజేసుకుని, అకాలమృత్యువులపాలబడుచున్నారు, గనుకనే రోగోత్పత్తికరణమున, అతిమైధునేచ్ఛయా, అని వ్రాసియున్నారు. అతిమైధునేచ్ఛచే సకలరోగములు మనుజులకు కలుగుచున్నవని వ్రాసియున్నారు, ముప్పైసంవత్సరములు పూర్తికాకమును పే, అనేకరోగములచే బాధనొందు జనులను అనేకమందిని దిలకించుచున్నారము, గనుకనే ఎడతెగనిమైధునేచ్ఛ ఏమనసుకుకలిగినదో ఆమనస్సునుమరల్చి క్షమాభ్యాసములోనికి తీసుకునివచ్చి, యుక్తనిద్రయుక్తాహారాదులను కలిగి ప్రవర్తించుటయేగాక, యింద్రియములను స్వాధీనముజేసుకొని, సత్ప్రవర్తనకలిగి, సత్సంతానముకొరకు, రుతుకాలమున, రతియును, జీవించుటకు తగిన ఆహారమును పొందవలెను.



చతుర్విధపురుషార్థములలో, అర్థము, కామము రెండున్ను విశేషించి ఇహలోకసౌఖ్యములు గావున, బహుజనులకిష్టమగుచున్నది, తక్కిన, ధర్మము, మోక్షము, యివి రెండున్ను, నిరాలంబమైన, బ్రహ్మానందరసమునకు, ఆశ్రయములగుచున్నవి, స్రక్చందనాది భోగములను, ధ్యానింపుచుండెడి, చిత్తమెవ్వరికిని శక్యముగాదు, అట్టి మనస్సును, అభ్యాసకౌశలముచేతను, మదగజమునువలె, కాలక్రమముచేతను, వశ్యముగా జేయవలెను, మొదట కామ, భోగార్థమై, తన్మయుడైన పిమ్మట, వైరాగ్యముగలిగి, జ్ఞానమయుడుగావలయును, ఆత్మమనస్సుతోనున్ను, మనస్సుఇంద్రియములుతోనున్ను, నేత్రములు మొదలగు, ఇంద్రియములు స్వార్థములైన, రూపాదులుతోనున్ను, శీఘ్రముగానుక్తక్రమముచేతను, సంబంధించును,తత్తదింద్రియములద్వారా, సకలపదార్థములుతోనుసంబంధముకలిగియుండును, గానమనస్సునకుఅప్రాప్యములేదు మనస్సెచటికి నడుచునో, తద్వారా ఆత్మయున్ను, అచటికేచేరును, శరీరమందలి హృదయప్రదేశగతమైన, యతిసూక్ష్మమగు, ఆత్మనిశ్చలమైన మనస్సుచేతను సంతతయోగాభ్యాసమువల్లను గ్రహించతగినది, ఎవరేపదార్థమును చింతించుదురో, వారు తన్మయత్వమును బొందుదురు, గాన గృహస్థునకు, కామము, యజ్ఞమని, మహర్షులుచే చెప్పబడినది. ఇట్టి కామయజ్ఞముచేతను గృహస్థులు, సంసారసముద్రమును తరింపజేసే, పుత్రులను, బొందుచున్నారు. శృంగారావస్థయందు ఉత్పన్నమైనరాగముచేతను, బాహ్యాభ్యంతరసంభోగాదిజన్య, రససేవనము, స్వర్ణముయొక్క, వర్ణాతిశయమును దెలియుకొరకు, ముందుగా గీటురాయిపైని గీటుపెట్టి బరీక్షించుటవంటిదిగాన ధర్మావిరుద్ధమయ్యిన కామముచేతను ముందుగా అనిత్యరసానుభూతికలవారై పిమ్మట నిత్యమయ్యిన బ్రహ్మరసానుభవమునందు ప్రవర్తించుచున్నారు. అటుపైని యానంద స్వరూపమైన బ్రహ్మముయొక్క సాక్షాత్కారముచేతను ధన్యుడనైతినను భావనాపూర్వకముగా శాశ్వతమయ్యిన బ్రహ్మానందాస్వాదన సౌఖ్యమును బొందుచున్నారు.

## దన్తధావనము.

దన్తకాష్ఠము పన్నెండు అంగుళములు పొడవు. చిటికినవ్రేలుతో సమమగు వలమును, కలిగి తిన్ననది గుణపులు పుప్పిలేనిది, చేసి గుణపులుగలది, క్రొత్తది మంచిభూమిని బుట్టునది, రుతువును, దోషమును, రసమును, వీర్యమును యోచించి, గ్రహించవలెను, వగరు చేదు మధురము, కారముగల కాష్ఠమయి వుండవలెను. చేదుగలవాటిలో వేపపుల్లశ్రేష్టము. వగరువాటిలోకి చండ్రశ్రేష్టము తీపురకములలో యిప్పపుల్ల మంచిది. కారముగలవాటిలో, కానుగుశ్రేష్టము.

మా వైద్యశాలయందు తయారగు దంతరంజనమను పొడరుతో, మృదువగు కుంచిచేత దంతములను దోమిన, దంతదుర్గంధము నశించుటయేగాక, శ్లేష్మమును హరించును, ముఖకాంతినిగలుగజేయును. రుచి నిబుట్టించును, మనస్సు నిర్మలముజేయును, కంఠరోగములు దంతరోగములు, పెదవులను జనించురోగములు, నాలుకను జనించురోగములు తగ్గును, ముఖరోగము, శిరోరోగము, విదాహము, అలసట, కర్ణశూల, పుప్పిదంతములయొక్క బాధ, యివిగలవారలకు, మిక్కిలి వుపయోగముగా యుండుటయేగాక మంచి ఆరోగ్యమును నిచ్చును.

బంగారుబద్దతోనైనా, వెండిబద్దతోనైనా, వేపమొదలగు చెట్లపుడకలయొక్క బద్దలతోనైనా, నాలుకనుగీసి ఆపాచిని పరిహరించవలెను, నాలుకగీయుబద్ద 10 అంగుళములు పొడవును, నునుపై యుండవలెను, ఇందువలన, ముఖమందుగల నరుచిని, దౌర్గంధ్యము, పొంగును నశించును, పాలచెట్టు కషాయముతోనైనా, నేలవేము, వట్టివేళ్ల ఉశిరికపప్పు, వీటికషాయములలో, పాలుగలపి, పుక్కిలించి వుమిశినయడల దంతదారుఢ్యము కలుగజేయును. రుచిపుట్టును, ముఖమును నేత్రములు చల్లని జలముచే గడగినవుశియును, ముఖశోషమును, ముఖమునందలి పొక్కులను, రక్తపిత్తమును, హరించునని, శుశ్రుతమున వ్రాయబడినందున, సర్వజనులు అటులాచరించుట చేతను తత్ఫలమును పొందగలరు.



నైరుతిదిక్కునుంచి పళ్ళుదోముపుల్లను తేకూడదు. పుడకను శుభ్రముగ కడిగి మరిపండ్లు తోమవలెను. పిమ్మట పుల్లనుత్రిర్గి కడిగి పారవేయవలెను, అమావాస్య, షష్టి నవమి, యీతిథులయందును ఆదివారమును, దంతములను, పుల్లతో తోమరాదు, అప్పుడు, 2 పరియాయముల మాత్రమునీళ్లు పుక్కిలించవలెను, కనిష్టాగ్రపరిమాణము, చర్మము కలిగియుండి, గంటులు, పుప్పి, వంకరలేనిది, పదిరెండు అంగుళములు పొడవుగల, మామిడి, అంబాలము, పుసిరిక, చిట్టిఅంకుడు, చండ్ర, జమ్మి, ఉత్తరేణి, ఖర్జూర, నెరిడి, గుమ్మడి, వరగోగు, పాల, నారంజ చేదు, వగరు, ముళ్లు, పాలుగలిగిన చెట్లపుల్లలతో దంతధావనము ప్రశస్తము, అమావాస్య, ఏకాదశి, తృణపర్ణములచేదంతశోధనము జేయవచ్చును. ఆ రెండు దినములుకూడా నేరేడు జువ్వి మామిడాకులతో దోమవచ్చును. అని చెప్పియున్నది మాట్లాడకుండా దంతధావనము జేయవలెను. రోగవశుడైతేనేతప్ప, సూర్యోదయించిన పిమ్మట దంతధావనముజేసిన మునులుమంత్రములు పితృదేవతలు పరాఙ్ముఖులగుదురు, తూర్పుముఖముగా దంతధావన మొనర్చిన, రోగియును, పశ్చిమముఖమున నిర్ధనుడున్ను, ఉత్తరాభిముఖుండై దంతధావనమొనర్చిన భోగియునగును.

మామిడి, దిరిశనము, ఆరోగ్యమునిచ్చును. కదంబము జ్ఞాపకశక్తిని హెచ్చించును, మల్లెదుస్వప్నములను రానీయదు. ఉత్తరేణి వోర్పును, యోచనాశక్తిని కలుగజేయుననియు, దాడిమసౌందర్యమునొసంగుననియు చెప్పియున్నది.

శ్లో. దంతధావనముద్దిష్టమాస్య వైశద్యకారకం
ప్రసేవారుచి, దౌర్గంధ్యమల పిత్తకఫాపహం॥

దంతధావనము, నోటిని శుద్ధిజేసును, నోటి నీరూరుట అరుచి, దుర్గంధము, మురికి, కఫపిత్తములు బోకడచును.

## దంతధావననిషేధము.

శ్లో॥ మదాతురః కృశశ్రాంతో దంతతాల్వోష్ఠ, రోగవాన్
హిక్కాఛర్దిశిరఃపీడా మూర్ఛాశోషీ నతచ్చరేత్॥

మదాత్యయ రోగము గలవారలు, కృశించినవారలు, బడలికజెందినవారలు దంతములు దవడలు పెదవిలు, వీటియందు రోగముగలవారలు, ఎక్కిళ్లు, వాంతి, తలనొప్పి, మూర్ఛ శోష యివిగలవారలు దంతధావనముజేయరాదు. అటుల జేసిరేని, ఆరోగము వృద్ధిజేయును.

## గర్భిణీనియమములు.

స్త్రీణాంప్రసవేతథా॥ అనుటచే స్త్రీలు ప్రసవమందు కొందఱు కష్టమును జెందుచుండుట మనము జూచుచున్న విషయమే॥ అయితే జంతుసముదాయములు పక్షిసముదాయము వగైరా ప్రసవకష్టమనుభవించి యుండుటలేదు. అటువలెనే మనలో ఆరోగ్యవంతులుగా యుండువారలు కూడా అట్టికష్టమనుభవించుటలేదు, కొన్ని ప్రదేశములయందును, పట్టణములయందు నివశించు స్త్రీలయొక్క ఆహారము, బట్టలు వాయువు, జలమువారి ఆరోగ్యమార్గమునకు, విరుద్ధముగా యుండుటచేతనున్న ఇంతియేగాక, గర్భముధరించు వయస్సురాక మునుపే వారు గర్భిణీలయ్యెదరు యిందు స్త్రీపురుషభారము, వయస్సును బట్టి బూర్వులుస్థిరపరచిన దానికివిరుద్ధముగ సంచరించుటచేతను.

శ్లో॥ భారార్ధతనుస్సుతభా కీర్తులితో, దుఃఖబాగ్భతతూ్యనః।
భారోతివాధ్యానాం మధ్యర్ధసర్వధరణీశః॥

అనగా, పదితులములు భారముగల పురుషుడు, పుత్రలాభమును పొందువాడగును, దీని కంటె తక్కువ భారముగలవాడు, దుఃఖియగును, పదితులములకన్న ఎక్కువభారముగలవాడు, చక్రవర్తియగును.

శ్లో॥ వింశతి వర్షానారీ పురుషఃఖలుపంచవింశతి
రచః, అర్హాతిమానోన్మానం జీవితభాగేచతుర్ధేవ॥

యీా చెప్పిన తులాభారము స్త్రీకి యిరువది సంవత్సరములు



పురుషునకు యిరువదైదు సంవత్సరములు తగినకాలము లేనియడల వారి వయస్సులో నాల్గోభాగము చెల్లినమీాద పరీక్షింపవలయును అను ఆగ్యోక్తి ప్రకారము యిదివరకు స్త్రీకి యిరువై సం॥ మీాదటయు పురుషులకు 25 స॥ మీాదటను తులాభాగము సమముగ నుండునను పరిమాణమును దెలసి అప్పటివారు లెప్పుడు ఆవయస్సులో సగువారలకు పరస్పరము ప్రేమించి భోగించుటకు చోటిచ్చుచుండెడివారలు కాదు. ఆహేతువచేతనే అప్పటికాలమందు జనులయొక్క జీవితములకు ఆహారజలవాయువు మొదలగు ఆరోగ్యమార్గములు వారికి అవసరములేకయే మంచిజఠరముండుటచే పిడుగులువలె నుండెడివారలు శ్రమకోర్చెడివారలు ఇప్పటివారలైతేనో 10 సం॥ స్త్రీకి పది సం॥ వరుడు అక్కడక్కడ స్త్రీమానముకన్న పురుషమానము సం॥, రెండు సం॥, ఆరుమాసములు తక్కువకూడా నుండవచ్చును. వారు పరస్పరము 13 సం॥ లోనో 14 సం॥ లోనే వారికి బుల్లిచ్చుట మనము చూచుచున్న విషయమే అట్టి లోకజ్ఞానమన నెద్దియో తెలియని ముగ్ధరాండ్రప్రసూతికష్ట మనుభవించి తీరవలసినదేగాని వేరేమున్నది వారికి గలుగు సంతానము గూడా అల్పాయుర్దాయవంతులు రోగవంతులును కృశాంగులుగాను సత్వములేక పనిపాటలయందిచ్ఛలేనివారలై జనించి పడమరగాలికిపుట్టి తూర్పుగాలికిఎండిపోవు కంబళిపురుగులువలె గన్పట్టుచున్నారు. ప్రసవానంతరము వెంటనే తిర్గిపురుషసంపర్కముజేసి గర్భిణులయ్యెదరు. యీాదురభ్యాసము ప్రస్తుతకాలమున చాలాదురాచారముగ నున్నది ప్రసవానంతరము అధమము మూడునాల్గు మాసములైన గతించనిదే పురుషసంపర్కము జేయరాదు యిదిన్నిగాక గర్భవతిఅయినపిమ్మట మూడుమాసములువరకే పురుషసంపర్కము జేయవలెనుగాని అటుతరువాత చేయంజనదు అటులాచరించితేనేగాని సుఖప్రసవము గలుగక పోవడమేగాక వారికి గల్గు సంతానము బలహీనముగను తేజోవిహీనముగను బొడగట్టును యిటువంటి దురవస్థ తప్పించుకొనుటకు స్త్రీపురుషులిరువురుకుకూడా విధిఅయియున్నది

ప్రతిస్త్రీపురుషులు విధి ప్రకారము ఆచరణలో యుండిన లోకాభివృద్ధి కాగలదు.

స్త్రీ గర్భమును ధరించియుండగా లక్ష్మణాపంజిగాని వటాంకురముగాని సహదేవిగాని విశ్వదేవిగాని అనువానిలో దేనినేని ఆవుపాలతో నూరి కుడిముక్కులో మూడుచుక్కలు వేశిన పుత్రుడు కలుగును అని శుశ్రుతమున వ్రాయబడియె.

చిత్తమునందాయాసము బడలిక దాహము తొడలయందు బలము లేకుండుట శుక్ల శోణితము బయటికి వెడలకుండుట యోనిస్ఫురించుట అను నీలక్షణములుండిన గర్భధారణకలిగినది అని యెరుగవలెను గర్భముధరించిన స్త్రీ శ్రమకరమైన పనులుమైథునము అతృప్తికరమైన పదార్థసేవనము విస్తారముదినుట పగటియందు నిద్రించుట రాత్రిమేలుకొనియుండుట యేడ్చుట బండి గుర్రము మొదలగు వాహనములపై నెక్కుట భయహేతుకమైన పదార్థదర్శనము కాళ్లుచేతులు వంకరగనునిచి కూర్చుండుట మిట్టపల్లములుగల ప్రదేశములందు కూర్చుండుట రక్తమోక్షముజేయుట మలమూత్రనుమానము కలిగినప్పుడు వెంటనేవెళ్లకపోవుట యివి విడుచుటయేగాక గర్భమునుధరించిన స్త్రీ శరీరశుభ్రమును బాగుగా నెరుగుండి మంచిగాలినిపీల్చుచుండవలెను ఎంతవరకూజీర్ణమగునో అంతవరకే తేలికగా జీర్ణమగు పదార్థములను దినుచుండవలెను మలబంధాదిదోషములున్న తిండిలోనే సరిపుచ్చుకొను చుండవలెను మలబంధము కలిగినప్పుడు ఆముదమును తినుబండములలో చేర్చుకొను చుండవలెను వేవిళ్లలో వాంతులుకలిగినయడల శుభ్రమయ్యిన జలమందు నిమ్మపండు రసము పిడచిపుచ్చుకొనవలెను విస్తారముకారము గురుకరద్రవ్యములు దినరాదు సాధారణముగ గర్భిణీస్త్రీలుకూన్ దొరగారి తొట్టిస్నానమున అచ్చటచ్చట ఆరోగ్యముగా ప్రసవమగుచున్నారు గాన అభ్యసించెడివారలను దెలుసుకొని ముఖ్యముగ నటులాచరించుట శ్రేయము గర్భిణీతో నున్న వారలకు ఉపచారములు తప్ప వేరౌషధ



ములు ఈయరాదు కష్టమయ్యిన పనులు చేయింపరాదు ప్రతిదినము మంచిగాలిలో కొద్దికాలము దిరుగుచుండవలెను.

వాతాదిదోషములవలనగాని క్రిములు మొదలగువానియొక్క దెబ్బలువలనగాని గర్భిణీస్త్రీకియే అవయవములయందు వేదనకలుగుచున్నదో గర్భస్థశిశువునకు నాయాఅవయవములయందు వేదనకలుగును గాన అట్టి విచేరకుండాచేయవలెను గర్భిణిస్త్రీకియే పదార్థములందు ఇచ్ఛపొడముచుండునో ఆయాపదార్థములు నొసంగుచుండవలెను. స్త్రీగర్భమును ధరించినది మొదలుకొని, ఎల్లప్పుడు సంతోషము శుచి ఆభరణాద్యలంకారములు ధరించుకొనుట శ్వేతవస్త్రధారణము, శాంతికరమైనట్టియు మంగళకరమైనట్టియు కార్యములను జేయుట దేవబ్రాహ్మణగురువులయందు భక్తి మలినశరీరులను, వికృతశరీరులను నీచులయొక్క శరీరమును తాకకుండుట దుర్గంధవాయువును పీల్చుట భయంకరమగు పదార్థసందర్శనము వర్జించవలెను భయంకరమగు కథలను చరిత్రలను వినరాదు. ఎండిపోయిన అన్నమును చద్ది అన్నమును పాశినయన్నమును తడిసినయన్నమును భుజించరాదు బైట సంచారము పాడైపోయ్యిన గృహములందు శ్మశానమునందు బౌద్ధాలయములయందు దేవతలు పిశాచములు నివసించు స్మశానమందుండు వృక్ష ప్రదేశములందు సంచరించుటగాని వసించుటగాని వదలివేయవలెను క్రౌర్యమునకు ఆధారమగుపనులు భయమును బుట్టించుపనులు వర్జించవలెను విస్తారము బరువును మోయకూడదు గట్టిగా మాట్లాడరాదు గర్భనాశహేతువులగు మైథునముభారవహాదికర్మలనుత్యజించవలెను ప్రతిరోజున తైలాభ్యంగనము నలుగుపెట్టుకొనుట ఆయాసకరమైన పనులు దివాస్వాపము యివి వర్జించవలెను మరియు గర్భిణీస్త్రీ మృదువైన పరుపులు బాలీసులు దిండ్లు విశాలమగు మిక్కిలి పొడవుకాని శయనాసనములు కలదైయుండవలెను మరిన్ని ప్రియమైనటువంటివిన్ని ద్రవయుక్తమైనటువంటివిన్ని మధురమైనట్టివియును అగ్నిదీప్తినిజేయు ద్రవ్యములతో సంస్కరించిన యన్నాదులను దినుచుండవలెను. ప్రసవమయ్యేవరకు యిటులనే ఆచరించదగినది.

గర్భిణీస్త్రీ ప్రథమ, ద్వితీయ, తృతీయమాసములయందు, విశేషించి మధురములైనట్టివియు, శీతలముగనుండునట్టియు, ద్రవకరమగు నాహారములను విశేషముగ సేవించవలెను. అరువదిదినములలో ఫలించు గరికిసన్నము దాళవాధాన్యాదులుయొక్క అన్నము మూడవమాసమందు విశేషముగా పాలతో బుచ్చుకొనవలెను. నాలగవమాసమునందు పెరుగుతోడను, అయిదవమాసమున పాలతోడను, ఆరవమాసమున నేతితోడను చేర్చి భుజింపవలెను. అనియు, నాలవమాసమున, పాలువెన్నతో మిశ్రమయినట్టియు, జాంగలమాంసమనగా, అడవిమృగాదులనియు, మరికొందరు, మేకమాంసమనియు, వచించుదురు. యుక్తమయినట్టి ప్రియమగు అన్నమును, అయిదవమాసమున, పాలు నెయ్యి, వీనితోకలసిన యన్నమును దినవలెను. ఆరవమాసమునందు, పల్లేరుకషాయమునందు సిద్ధము జేయబడిన ఘృతము, యవాగులుతోను పానము జేయించవలెను, ఏడవమాసమున, ముయ్యాకుపొన్న, కోలపొన్న, చిన్నములక, పెద్దములక పల్లేరు, మారేడు, తక్కలి, దుందిలము, నేలగుమ్ముడు, కలిగొట్టు, అను వాని వేళ్లయొక్క కషాయములో సిద్ధముజేయబడిన ఘృతపానము జేయించవలయును, యీ యుపచారములచే గర్భము వృద్ధిజెందును. యెనిమిదవమాసమున, గుమ్ముడు, ఇప్ప, గోధుమలు పాలు నెయ్యి వగైరా యవలు, మినుములు, దోస, నక్కదోస, పుచ్చ, టెంకాయి, పంచదార మొదలగు ద్రవ్యములు సేవించుటచే సుఖప్రసవము కలుగును, తొమ్మిదవమాసమున, యవాగులు, జాంగలమాంసరసము, వీనితో ప్రసవకాలము వరకునుపచరించిన యడల, గర్భిణీస్త్రీకి బలము హెచ్చి, యుపద్రవములు ఏమియులేక, సుఖముగ బ్రసవించును. మరియు గర్భిణీస్త్రీలకు గల్గుజ్వరము వమనము అజీర్ణము మొదలగు సమస్త గర్భిణీవ్యాధులను మావైద్యశాలయందు యథాశాస్త్రీయముగ తయారుచేసిన గర్భవిలాస రసమును సేవించిన గర్భిణీవ్యాధులన్నియు పటాపంచలైపోవును.



## శిశు సంరక్షణము

### అపుడు జనించిన శిశూపచారము

శిశువు జనించినతోడనే వానిపైనుండు మావిని తొలగించి, సైంధలవణమును నేతితోగలపి శిశువుయొక్క నోటియందు వ్రేలితో రుద్దవలెను అందుండు కఫమును తొలగించి నేతియందు కర్పూరమును నానబెట్టి దానిలో ప్రత్తిదడిపి శిశువుయొక్క శిరమునందునిచి పిదప నాభినాడి నాళమును బాగుగాసిడ్చి యెనిమిదంగుళములకుపై దారముగట్టి మిగిలిన నాళమును భేదించి నాళమునందు గట్టబడియుండు దారముయొక్క మరియొకకొనను శిశువుయొక్క కంఠమునందు బాగుగా కట్టవలెను తరువాత శిశువును శీతోదకముచే దుడిచి జాతకర్మజేయించి తేనెనెయ్యి వీనిని ఏకముజేసి అందులో నల్లసుగంధపాల మాండూకబ్రహ్మి వీనిరసములులో బంగారు భస్మముగలిపి అనామిక వ్రేలితో, ననగా (చిటికినవ్రేలు తరువాతవ్రేలు) నాకించిచిట్టాముదముతో బాలునకభ్యంగనము జేయించవలెను.

యుక్తమయిన కాలమందు వాతాదిదోష ప్రకోపానుగుణముగ మర్రి మొదలగు క్షీరవృక్షములుయొక్కకషాయములుగాని కచ్చూరాది సుగంధ ద్రవ్యములుతో గాచబడిన యుదకమునుగాని బంగారు వెండి పాత్రలతో గాచబడిన యుదకమునుగాని సుఖోష్ణముగా జల్లార్చి దానినే విధవానుసారముగ స్నానము జేయించవలయును.

జాతకర్మానంతరము పెద్దపాపర శఖపుష్పి వస వీనికలకమందు తేనినెయ్యి కలపి అందులో గురిగింజంతతీసుకుని దర్భకర్రతో అభిమంత్రించి సువర్ణ భస్మమును గలపి రావియాకుతో శిశువుయొక్క నోటియందు నాకించినను లేక మాండూకబ్రహ్మి వస సువర్ణభస్మము చల్లపిల్లి గెడ్డలు అను వానిలో దీనిచూర్ణమువేసి తేని నెయ్యి వీనిలోగలపి నాకించినను బుద్ధి ఆయుస్సు బలము గలుగునని వృద్ధవాగ్భటమునందు వ్రాయబడియేయున్నది. కావున ప్రథమదినమందు తేని నెయ్యి వీనిలోనల్లసుగంధి పాల

చూర్ణముకలపి శిశువునకు మొదటిదినమునందు మూడుకాలములయందు
నాకించవలెను.ద్వితీయ తృతీయదినములయందు లక్ష్మణపంజితో గాచబ
డిన నెయ్యిని త్రికాలములయందు నాకించవలెను. తొలుతపాలనువిడిచి
శుద్ధమైన పాలనుపురిశెడు గ్రహించి అందులో తేనెను నెయ్యినుగలపి
ప్రాతస్సాయంకాలములయందు త్రాగించవలయును.

అటు పిమ్మట బాలునిపై పట్టువస్త్రముగప్పి పరుపుపై పట్టువస్త్ర
మునుబరచి తూరుపుశిరస్సుగాపరుండబెట్టేది. గోగు రేగు వేప వేగిస అ
నుచెట్ల యొక్క కొమ్మలతో విసరుచుండవలెను చమురులోదడపినప్రత్తి
ని ప్రతిదినము శిరమునందునుంచుట భూతప్రేతరాక్షసోచ్చాటనార్థము
ధూపములువేయుచుండుట యోషధులను చేతులకు కాళ్లకు శిరము
కంఠమునకు గట్టుచుండవలెను ప్రసవించిన గృహమునందు నువ్వులు అ
గిశివిత్తులు ఆవాలు పిప్పళ్ళుగలపి జల్లవలెను. సూతికాగృహమున అగ్నిని
ప్రజ్వలింపజేయవలెను పురుడువెళ్లిన పిమ్మట తల్లియొక్క పాలుసరిపోక
పోయినను సౌందర్యభ్రాంతిచేతస్కురాండ్రు నకఉపమాతనుకుదర్చవలె
ను అనగా దాది అట్టిది మిక్కిలి పొడవుపొట్టిదిగాక యుండునదియు మ
ధ్యవయస్సుగలదిగాను రోగములేనిదిగను మంచినడతగలదిగ చాపల్యము
ఆశయులేనట్టిదిగ మిక్కిలి స్థౌల్యము మిక్కిలి కృశించినదిగాక ఎల్లప్పుడు
మంచిక్షీరములు గలదిగ నీచకృత్యములు చేయనదిగా సత్కులమందు
జనించినదిగా యుండవలెను అట్టిదాదిచే శుభనక్షత్రముతో గూడు మం
చితిథివారములయందు పాలునిప్పించవలెను. వక్కదాదిచేతనే పాలుని
ప్పించవలెనుగాని అనేకులచే నిప్పించగూడదు అటుల యిప్పించుటచేతను
పాలుయిమడకపోవుటయేగాక శిశువునకు వాతాదిరోగములు కలుగును
క్రోధము శోకము అప్రీతి కాలాతిక్రమణము మొదలగువానివలన పా
లుతగ్గిపోవునుగాన పాలువృద్ధిజెందుటకు మాతోపమాతలలో నెవరైనను
నూతనవస్త్రాద్యలంకారాదులు యవలు గోధుమలు బియ్యము అరువది
దినములకు ఫలించెడి ధాన్యములు మాంసము మద్యము కలి తెలక



పిండి, వెల్లుల్లి మత్స్యములు, తామరదుంపలు నేలగుమ్మిడి దుంపలు అతి
మధురము, పిల్లితేగలు, రేణుకలు ఆనపకాయ, పొలముబచ్చలి మొదలగు
వానిని భుజించుచుండిన యిటుల భుజించిన మంచిస్తన్యము విస్తారము
గలుగుచుండును. యిట్టి స్తన్యపానముచే శిశువుయొక్క శరీరము ఆరోగ్య
బలవృద్ధులు గాంచగలదు. ఆకలిబాధతో నున్నవారలయొక్కయు, శో
కార్తులగువారల యొక్కయు, గర్భిణీలు, జరితులు మిక్కిలికృశించినవా
రలయొక్కయు అతిస్థూలకాయులు మాటుపోయిన మత్స్యాద్యాహార
సేవజేసినవారల యొక్కయు దీర్ఘరోగులు యొక్కయు స్తన్యము శిశు
వుకు త్రాగింపంజనదు. శిశువుకు ఔషధము సేవింపజేసినపిదప అది
జీర్ణించకనే స్తన్యమివ్వకూడదు. వాతపిత్తాది దోషములు విరేచనము
లగుచుండునప్పుడు స్తన్యపానము యివ్వంజనదు. వకవేళ యిచ్చినయెడల
మామూలుకన్న బహు తక్కువగా యివ్వవలెను. చంటిబిడ్డల తల్లులు
విరుద్ధ వాతాదిదోష ప్రకోపకరములైన యాహారములను భక్షించుట
వలన మిథ్యాహార విహారములవలన వాతాదిదోషములు ప్రకోపించి
స్తన్యమును జేరుచును కావున అట్టి స్తన్యపానమువలన శిశువులకు
నానావిధరోగములు గలుగజేయును గనుక బుద్ధివంతులగు వైద్యులు
బాగుగా పరిశీలించి చికిత్స జేయవలయును మావైద్యశాలయందు తయా
రగు క్షీర ప్రవర్ధనీయను నౌషధమును సేవించిన సమస్తస్తన్య రోగము
లను బోకార్చుటయేగాక పాలు కుంభవృష్టినలె కలుగును. శిశువు అంగ
ప్రత్యంగములయందు వేదనగల స్థలములందు పలుమారు స్పృశించు
చుండును. యెవ్వరైనా ఆస్థలములందు జెయివేశిన నేడ్చుచుండును. శిశు
వునకు రోగము తలయందుండిన కనులు మూసుకుని తలయెత్తకుండును.
మూత్రస్థానముననున్న మూత్రము వెడలక వేదన దాహము మూర్ఛ
కలుగుచుండును. మలస్థానమగు గుదస్థానమున దూష్యమున్న మలమూ
త్రప్రతిబంధమై ముఖము శరీరము వివర్ణమగును. కడుపుబ్బరము ప్రేగు
లరుచుట యివి కలుగును. సర్వశరీరమందు వేదనకలిగియుండిన మిక్కు

టముగా నేర్పుచుండును గనుక వైద్యుడు చక్కగా గమనించి పైరోగములకు తగుమైనమందులు రోగమునకు తగినంత ప్రమాణము పాలలోగాని నేతిలోగాని కలిపి పాలుత్రాగు పిల్లకు పాలిచ్చే తల్లుల కొసంగవలెను. పాలు అన్నము తిను పిల్లలైన తల్లులకు పిల్లలకు కూడా యివ్వవలెను. కేవలము అన్నముదిను పిల్లలైన పిల్లలకే అవుషధ కషాయాదులు నిప్పించవలెను. ఏకమాసము వయసుగల పిల్లలకు తేనె నెయ్యి చక్కర పాలు వీనియందొకపదమును, గుంజా(ప్రమాణముకల్కాదులునియ్యవలెను. ఏకసంవత్సర ప్రమాణములో ప్రతిమాసమునకు కల్కాదులు గురిగింజంత చొ॥ హెచ్చించి యివ్వవలెను. సంవత్సరము లగాయతు 16 వత్సరములు వరకు గుంజెత్తు చొ॥ హెచ్చించుచుండవలెను. యీమందులు రసగంధక విషాదులు గలశినవిగాక వట్టి కల్కాదులకే, యిట్టిపరిమాణము మరియు మాచే చిరకాలమునుండి మిక్కిలి అనుభవముతో క్రమప్రకారము శాస్త్రసమ్మతముగ తయారుచేసిన గోరోజనమాత్రలు సంజీవగుటికలు బాలరోగ సుధార్ణవము బాలామృతము అమృతార్ణవము బాలామృత సంజీవి బాలరోగ రాజేశ్వరం స్వచ్ఛముగు రసభస్మం బాలరక్షాతిలకము శిశుసంరక్షక ధూపము బాలగ్రహరక్ష రక్షోత్పలాది చూర్ణము. బా బావచిన్నియను నీమందులు ఆయా బాలరోగములయందు ఉపయోగపరచినయెడల సమస్త బాలవ్యాధులు తొలగజేసి దివ్యతేజోవంతులుగ జేయును శరీరమునకు బాధకలుగకుండగ శిశువును మెల్లగ నెత్తుకొనవలెను. శిశువులను భయపరచరాదు శిశువులు నిద్రపోతూవుండగా అకస్మాత్తుగా లేపిన భయపడును గావున అటుల లేపక నెమ్మదిగా లేపవలెను శిశువును అకస్మాత్తుగా నీడ్చరాదు శిశువుల నెగరవేసిన నాతాదులుగ వైకల్యము గావున నెగురవేయంజనదు ఎల్లప్పుడు కూర్చుండబెట్టి యుంచరాదు. అటుల చేయుటవలన బొక్కిరొమ్ముగలవాడగును. సర్వకాలములయందు సంతోషకరమైన ఆడుకొనుటకు తగుమైవినిచ్చి శిశువును సంతోషపరచుచుండవలయును, ఇటులనెప్పుడు జేయుటచే



శిశువునకు అధికమైన బలమును ఆరోగ్యము మనస్సునందు సంతోషము కలిగి బాగుగా వృద్ధిజెందెదరు మరియు గాలి ఎండ మెరుపు వృక్షములు తీగెలు పాడుపడిన యిండ్లు పల్లము గోడలు నీడ దుష్టగ్రహములుండు తావులు వీనిసంబంధము శిశువులకు కలుగకుండా చేయుచుండవలెను.

అశుభ్రప్రదేశములందు, యెత్తుప్రదేశములయందు మిట్టపల్లములుగల స్థలములందు ఎండ గాలి వర్షము దుమ్ము పొగ ఉదకము వీనియందు శిశువులను విడువరాదు తల్లిపాలులేకుండిన శిశువులకు తృప్తి కలుగువరకు శరీరానుకులముగ మేకపాలను గాని ఆవుపాలనుగాని ప్రమాణము నెరంగి పానముజేయించవలయును. ఆవుపాలుగాని మేకపాలుగాని విస్తారము చిక్కదనముగా యుండిన పాలకు రెండురెట్లు నీళ్ళుకలిపి అందు వాము తులముగాని అరతులముగాని శుభ్రమయిన తెల్లటిగుడ్డను మూటగట్టి పాలయందు వేశి మూడుభాగములలో ఏకభాగము తరుగునటుల జాగ్రత్తగ కాచి అవి బాలురకిచ్చిన తేలికగా జీర్ణమగుటయేగాక మంచి జఠరాభివృద్ధినిబలమును యిచ్చి నిరోగవంతులుగ జేయును ఆరవమాసమున లఘువుగ హితకరముగ నుండునట్టి యన్నమును శిశువున కొసంగి బైటికి దీసుకునివెళ్ళకుండా గృహములో జాగ్రతగా కాపాడుచుండడమేగాక బాలగ్రహాది పీడ కలుగకుండ కడుప్రయత్నముతో సంరక్షించుచుండవలెను. క్షణక్షణమునకు ఉలికిపడుట భయము పడ్చుట మూర్ఛ నఖదంతములచే తనశరీరమును తల్లిశరీరమును గీచుట పండ్లు కొరుకుట వికారముగా కూయుట ఆవలించుట కనుబొమ్మలు విరుచుట పైకిజూచుట నోట నురుగుకారుట పెదవి కొరుకుట వికారముగ గనుపించుట అపక్వముగ మలము వెడలుట హీనస్వరము రాత్రులు నిద్రపోకుండుట దుర్బలముగా నుండుట శరీరము వాడియుండుట చుంచు చేపలు నల్లులు వీనిగంధముతో సమానమైన గంధము గలుగుట పాలయందు యిష్టముగనుండుట మొదలగు లక్షణము గలిగిన బాలగ్రహచిన్నియని నిశ్చయించి అందుకుతగిన ప్రతిక్రియ లాచరించుచుండవలెను.

## దేహస్థితి.

మఱిన్ని తల్లుల దేహస్థితినిబట్టి పిల్లలదేహస్థితి యుండునుగనుక సదా తల్లులు ఆహారవిహారములు అభ్యాసములు సరియైన మంచిమార్గములోనుంచవలెను బిడ్డ అసౌఖ్యముగానుండిన తల్లియొక్క దేహస్థితిని బాగుగా పరిశీలించవలెను బిడ్డలకు మందులు విస్తారముగానియ్యంజనదు పాలు త్రాగు బిడ్డల విషయములో తల్లులకే మందులిప్పించిన అందలి మంచిగుణములు పాలనుంచి బిడ్డలకు చేరిపోవును పశికూనలకు మందేయివ్వకూడదు బిడ్డలకు నులివెచ్చనీళ్లతో స్నానముచేయించవలెను కొన్నినెలలువఱకు శిశువులకు బట్టలు తొడుగకుండుటయే శ్రేష్టము సంవత్సరమునకు పిమ్మట శరీరమునకు. ఉష్ణమునిచ్చు ఉన్నినారలుతో తయారగు చొక్కాయలను తొడుగుచుండవలెను బిగువగానుండకుండాయుండవలెను మురికిలేని బట్టలుపైని బిడ్డలను పరుండబెట్టవలెను పైనికూడా అటువంటి గుడ్డలనే కప్పవలెను మంచముక్రింద శీతవర్షాకాలములు అయిన యడల పొగలేనినిప్పులు సామాన్యమయిన వేడి బిడ్డల దేహవేడిమి తగ్గకుండానుంచుచుండవలెను వేసవియందును నుష్ణకరమగు రోజులలో మంచముక్రింద కుంపటినుంచరాదు మొలత్రాడు బిగువుగకట్టరాదు బిడ్డకు తల్లిపాలు సంపూర్ణముగానున్నంతవరకు యితర ఆహారము లొసంగరాదు తల్లికిపాలుతగ్గిన ఆవుపాలు మేకపాలులోనగు వాట్లను అంతకు మూడుభాగములునీళ్ల చేర్చిబాగుగాకాచి అందుపటికిబెల్లముగలపి యివ్వవచ్చును పండ్లు తినిపించుచుండవలెను బిడ్డలకు కాపి టీ వగైరాలు యంతమాత్రము మొసంగరాదు ఆహారమందు తేలిక జీర్ణమగు పదార్థములు పెట్టుచుండవలెను పొట్టచీలునట్లు ఎన్నడు పెట్టరాదు తల్లిదండ్రులనడవడిక బిడ్డలకు ఏర్పడును గావున తల్లిదండ్రులు ఎల్లప్పుడు మంచివాక్యములనే బలుకుచుండవలెను అవేవారికి అభ్యాసమగును చెడ్డమాటలు చెడ్డ అలవాట్లు తల్లిదండ్రులకుండిన బిడ్డలునువాట్లను నేర్చుకొనును. చెడ్డనడవడికలోనేయుండును పెద్దలు చేయుపనులే బిడ్డలు చేయుటకు ప్రయత్నిం





చెదరుగాన తల్లిదండ్రులు యీవిషయమై బిడ్డల యడలకడు జాగరూకతనువహించవలెను బిడ్డలుపుట్టినది మొదలు తెలివియెక్కువగుటకు ప్రారంభించునుగాన బిడ్డలుసత్యవంతులుగా మంచినడవడికకలవారలుగ యోగ్యులుగా జేయుట తల్లిదండ్రులదేఅయివున్నది గనుక యీవిషయములో తల్లిదండ్రులు తమవిధులను దిట్టపరచుకొనవలెను అంతేగాని తల్లిదండ్రులు విటులుగాను షోకేళాలుగాను అయోగ్యులుగాను సోమరులుగాను తిండిపోతులుగను లోభులుగాను అపరిశుద్ధముగను నుండిన యివియేవారికి అలవడును గనుక పైనవ్రాసినవిషయములయందు భద్రముగానుండవలెను మనమటులనడచిన వారు సహితము బలహీనులుగా సోమరులుగా దుర్మార్గులుగ కామేచ్ఛగలవారలుగానుండుట యందాశ్చర్యమేమున్నది బిడ్డలను తల్లులు పరిభ్రముగాను చూచుటకు రంజకముగానుంచిన అట్టి బిడ్డలు అందరిని ఆకర్షించగలరు అట్టి బిడ్డలను ప్రతివారు ఎత్తుకుని ముద్దిడకమానరు చూచుటకు చీముడముక్కుతో చిడుముతో పాలిపోయి బలహీనులుగను చూచుటకు అసహ్యకరముగను రోతగనునుండు బిడ్డలను దగ్గరకువచ్చినను అవతలకు పొమ్మని కసరుదురుగాన తమబిడ్డలను పరిశుభ్రముగానుంచుట మంచిది ప్రతిదినము బిడ్డలకు స్నానముజేయుంచుట చాలామంచిది సబ్బుగాని నలుగుబిండితోగాని వడలుతోమవలెను స్నానమాడినవెంటనే శుభ్రమగు గుడ్డతో బిడ్డనొత్తవలెను బిడ్డలకు నువ్వులనూనె కొబ్బరినూనె ఎల్లప్పుడు సామాన్యముగా రాయుచుండుటమంచిది భోజనముజేయుటకు ముందు కాళ్లుచేతులు శుభ్రపరచుచుండవలెను బిడ్డలు మలమూత్రోత్సర్జనమొనర్చినపుడు వెంటనే ఆగుడ్డలను దీసివేయుచుండవలెను బిడ్డలకు బొందుతోనుండుచొక్కాలు తొడిగెడువారలు మెడవద్ద బిగించిముడివేయరాదు చొంగకారెడు పిల్లల చొక్కాయులు నానినవెంటనే తీసివేయుచుండవలెను అటులచేయకపోయిన జలుబుజేయుచుండును సర్వవిధముల తల్లిదండ్రులు బిడ్డలువిషయమై కడుజాగరూకతతో మసలుచుండవలెను.

## స్త్రీరుతుమతీనియమములు

శ్లో॥ మాసేమాసే రుతు స్త్రీణాందినసంఖ్యాచతుష్టయే

ప్రతిమాసమునందు రుతువుకలిగినప్పుడు మూడుదినములు నియమముతోనుండి నాలగవదినమందు.

శ్లో॥ స్నానంకుర్యాదుషఃకాలే విధివత్సమ్యగాచరేత్
వస్త్రమాచ్ఛాద్యగోప్యేన యావత్సూర్యోదయావధి॥

సూర్యోదయముగాక మునుపే నిద్రమేల్కాంచి విధిప్రకారము రహస్యస్థానమందు స్నానమాచరించి రుతువస్త్రమును ఒరులకగపడనీయక రహస్యస్థానమునదాచవలెను.

శ్లో॥ తతోభానుంసమాలోక్య తత్పరంపతిదర్శి
సం పవంనారదనారీణాం సాధ్వీనాంధర్మనిర్ణయః॥

సూర్యోదయమయిన తరువాతను సూర్యుని చూచి నమస్కరించవలెను పిమ్మట పతిభక్తిగలదై పెనిమిటిని దర్శించి తరువాతను యావత్కార్యములను నెరవేర్చుకోవలెను యీవిధముగా బ్రహ్మనారదునితో పతివ్రతా స్త్రీల ధర్మములను ఉపదేశించెను.

## విశేషాంశములు

ఆయుర్వేదాదిగ్రంథములను వ్రాసిన స్త్రీరుతువైన ప్రథమదినము మొదలుకొని మూడుదినములవరకు బ్రహ్మచర్యంతమును పరిపాలించవలెను నియమముగలదైయుండవలెను పగటినిద్ర కన్నులకు కాటుక పెట్టుకొనుట రోదనము స్నానము చందనాదిలేపనము అభ్యంగనము గోళ్లు తీసుకొనుట గంతులువేయుట దుముకుట నవ్వుట అధికసంభాషణము అధికశబ్ధశ్రవణము చిత్తరవులు వ్రాయుట మిక్కుటమైన గాలియందు విహరించుట ఆయాసకరమైన పనులు వర్జింపవలెను. ఎందుచేతననగా పగటియందు నిద్రించుటవలన సదానిద్రించు స్వభావము అంజనమువలన అంధత్వము రోదనమువలన వికారమగు దృష్టి స్నానాను లేపనములవలన సదాదుఃఖించు స్వభావము అభ్యంగనమువలన కుష్ఠురోగము నఖ



చ్ఛేదమువలన పుప్పిగోళ్ళు పరుగులిడుట దుముకుట వీనివలన చంచలస్వభావము నవ్వుటవలన దంతములు పెదవులు దౌడలు నాలుక వీనియందు శ్యామవర్ణము అతిసంభాషణమువలన వదరుస్వభావము అధికశబ్ద శ్రవణమువలన చెవిటితనము చిత్తరువులు వ్రాయుటవలన దుష్టచర్మము గాలిసేవవలన ఆయాసకరములగు పనులువల్లను ఉన్మాదము ఇవి గలిగి శిశువులు జనించును గావున రుతుసమయమునను నీపనులు వర్జనీయములుగా నుడివిరి. రుతువైన స్త్రీ దర్భచాపపైగాని తుంగచాపపైగాని శైనించవలెను. ఆకులోగాని మూకుడులోగాని శాల్యన్నమును ఘృతక్షీరాదులలో దేనిలోనైనాచేర్చిభుజించవలెను. రుతుదినములు తెరోజులులో భర్తను చూడరాదు పైనచెప్పిన ప్రకారము మూడుదినములు గడచినపిదప ప్రాచీనశోణితమునశించి నూతనమైన ఆర్తవము ఉత్పత్తియగుటవలన స్త్రీ పరిశుద్ధురాలగుచున్నది. నాలవదినమున పరిశుద్ధురాలై స్నానముజేసి నవీనవస్త్రమును ధరించుకుని ఆభరణాదులుచేతను పసపుకుంకుమాదులుచేతను అలంకృతురాలై తొలుత భర్తను జూడవలెను ఎందుచేతననగా రుతుస్నానముజేసిన స్త్రీ మొదటనే పురుషుని చూచుచున్నదో అట్టిపురుషునివంటి పుత్రుడు జనించును. గాన తొలుత భర్తనే జూడవలెను. రుతువైనస్త్రీ నాలుగు ఆరు యెనిమిది పది పండ్రెండు యీదినములలో ఏదైనా నొకదినము యొక్క రాత్రియందు మంచిముహూర్తమున పుత్రేచ్ఛగలవాడు సంభోగము జేయవలెను. పైనజెప్పిన ప్రకారం నాలవదినమందు సంభోగము జేసిన ఆయుష్యము ఆరవదినమందు ఆరోగ్యము యెనిమిదవ దినమందైనయడల సంతానము పదియవ దినమందయినయడల సౌభాగ్యము. పండ్రెండవ దినమందైనయడల ఐశ్వర్యము గల పుత్రుడు జనించును. స్త్రీ సంతతియందిచ్ఛగల పురుషుడు అయిదు ఏడు తొమ్మిది పధకొండు యీదినములలో దేనిరాత్రియందైనా సంభోగము జేయవలయును పదమూడు మొదలగు దినములు నిందితములు గావున వానియందు సంభోగము జేయరాదు రుతువైన స్త్రీతో ప్రథమదినంబున సంభోగము

జేయు పురుషునియొక్క ఆయువు క్షయించుటయేగాక యీదినమునధరించిన గర్భముకూడా ప్రసవమగునప్పుడే మృతిజెందును. రెండవదినమున ధరించిన గర్భము ప్రసవమయ్యినతోడనే గాని పదిదినములులోగా గాని మృతిజెందును మూడవదినమందు ధరించినగర్భము ప్రసవమైనతోడనే మృతిజెందును. లేక అసంపూర్ణావయవములు గలదిగానైన నగును నాలవదినమందు ధరించిన గర్భము సంపూర్ణావయవములు కలదై దీర్ఘాయువుగలదిగా నుండును. కాబట్టి ఋతునియమము ననుసరింపుచుండు స్త్రీతో మూడురాత్రిలు సంభోగము జేయరాదు.

ఋతుమతీ లక్షణములు ముఖముబ్బి ప్రసన్నముగా నుండును. శరీరము ముఖము దంతములు విస్తారము చల్లగా యుండును. పురుష సంబంధమందును కామ సంబంధమైన మాటలయందు ఇచ్ఛగలిగి యుండును. కడుపు నేత్రములు వెండ్రుకలు జారియుండును. భుజములు స్తనములు నడుముక్రింద తొడలమీద్ధభాగము నాభి తొడలు కటిప్రదేశమునకుపైన పిర్రలు యివి అదురును. అతిసంతోషము మైథునేచ్ఛ విస్తారముగా నుండును. ఇట్టిలక్షణములున్న స్త్రీయే ఋతుమతిగా దెలుసుకొనవలెను. అట్టి సమయముననే బీజప్రదేశమగుటయును యితర టయములలో బీజప్రవేశము కాజాలదు. స్త్రీకి పండ్రెండవసంవత్సరమున రజోప్రాదుర్భావమై వృద్ధిజెంది ప్రతిమాసమునందు బయట వెడలుచుండును. యాబది సం॥ ఆనంతరము రజస్సు క్షయించుచుండును.

ఆహార. జీర్ణ కాలము

చల్లని నీళ్ళు ఝాములోనుఉష్ణోదకము అర్థఝాము నకును అన్నము ఆరుఘడియలులోను మినపరొట్టి గోధుమరొట్టి బియ్యపుపిండి రొట్టి యింకా శనగపిండితోను జొన్నపిండితోను యితరపిండిలుతోను జేయు రొట్టెలు పదిఘడియలులోను గోధుమరవ్వతోను చోడిపిండితోను సగ్గుబియ్యముతోను బియ్యము విశిరిన నూకతోను చేయు పదార్థములు రెండుఘడియలు కాలములోను ఆకుకూరలు కాయగూరలు వకఝాము



లోపలను కంద పెండలము బంగాళాదుంప చేమ మొదలగు దుంపజాతులతో జేయబడిన పదార్థములు పది పండ్రెండు ఘడియల కాలములోను జీర్ణమగుచుండును.

మాంసాదులు గ్రుడ్లు జున్ను నెయ్యి నూనె మొదలగు తైలములు పదిఘడియలు కాలములోను మధురపదార్థములు ఝాములోను పిండివంటలు పిష్టపదార్థములు కాయధాన్యాదులు పదిఘడియలలోను జీర్ణమగును.

కషాయాదులు కల్కములు పచ్చిసర్కులనుండి తీయు రసములు క్వాథాదులు హిమము పాంటము పుట పాకాదులవల్ల తీయు రసములు యూషము మొదలగునవి రెండుఘడియలు కాలములోను లేహ్యాదులు షర్బత్తులు నాల్గుఘడియలు కాలములోను బంగారు ఉక్కు రాగి లోనగు లోహాదులువల్ల తయారగు భస్మాదులు మూడుఘడియలు కాలములోను వసంతకుసుమాకర పూర్ణచంద్రోదయాది వంటవుషదములు రెండుఘడియలు (లేక) మూడుఘడియలులోను పాషాణాది గరళము మొదలగు చేరినమందులు వగైరాలు వకఘడియ లేక అరఘడియలోను యితర కజ్జలీ అవుషధములు మొదలగునవి నాల్గుఘడియలులోను ఉప్పు సైంధ లవణాది క్షారాదులు వకఘడియలోను జీర్ణమగుచుండును గనుక ఆయా ఆహారములు మందులు కషాయ రసాదులు యిచ్చుచుండునప్పుడు అంతవరకు చూచి గుణమును కనిపెట్టి మందులను అనుపానాదులను పత్యాదులును పెట్టుచుండవలెను. అంతేగాని వెంట వెంటనే మందులనుగాని పత్యమునుగాని విడరాదు.

2. దేహారోగ్యమునకై ఆచరించవలసినవి ఆహారనిద్రా మైథున విహారములయందు

3. మితిమీరి యుండరాదు ఒకరోజుననైనను వేళతప్పి భుజింపకుము.

4. సుకుమార దేహులు శ్రమపడి పనిజేయనివారలు జీర్ణశక్తి

సరిగలేనివారలు చులకనగా జీర్ణించు పదార్థములు మిగుల తక్కువగా భుజించుట చాలామంచిది.

5. భోజనమైన వెంటనే ప్రయాయణము జేయుట తరుచు మాట్లాడుట పురాణాదులు జదువుట వ్రాయుట పాడుట నిద్రించుటలోనగు కార్యములను మానవలెను. మానరేని రోగముల పాలగుదురు.

6. మలబద్ధమున్న యెడల దానిని తొలంగించు ఉపాయములను కనిపెట్టుచుండవలెను. అటుల తొలగింపజేయనిచో ప్రాణహాని కరములగు వ్యాధు లనేకములు పుట్టించును.

ఔషధ సేవాకాలమందాచరించవలసిన విధులు రోగి అవుషధము సేవించునపుడు వైద్యునియందు నమ్మకము భక్తి శ్రద్ధలు గలవాడై యుండవలెను.

ఔషధమును దినుటకుముందు విరేచనములకు మందు తీసుకొనవలెను.

అనేకవైద్యులదగ్గర మందును సేవించుట అనుచితము.

దేశ కాల పాత్రలనుబట్టి ఔషధముల కనుపానములు మార్చుచుండవలెను.

కషాయములు రసములు యూషములు మంచినీళ్ళు వగైరా రోగికిచ్చు సకలపదార్థములు మట్టిపాత్రలతోనే కాచడము వంటలు జేయుచుండుట బహు మంచిది.

మట్టిపాత్రలను ఎల్లప్పుడు పరిశుభ్రముగా నుంచవలెను.

అనుపానమునకు రసాదులు కషాయాదులు దొరకనప్పుడు మందులు వేడినీళ్ళతో నుపయోగించుచుండవలెను.

క్షయరోగులు.

యెల్లప్పుడు మేకలమందలుండుచోట్ల నివశించుట రాత్రిభాగమున మందలలోనేపరుండుట మేకమాంసమును దినుటపాలను ద్రావుచుండుటచే యంతకఠినమగు క్షయవ్యాధిఆయిననూ శీఘ్రమందే తొలగును.



అజీర్ణ రోగులు

ప్రవహించెడు నదులయందుగాని కాలువలయందుగాని స్నానము చేయుట మంచిది.

శ్లేష్మోదర, గుల్మశూలా, జీర్ణరోగులు

అభ్యంగనము, తేలికగజీర్ణమగు లఘుకరపదార్థసేవనము, పాలు కాచినజలము, గోధుమజావత్రాగుట, ప్రాతస్సాయంకాలములయందు, వ్యాయామమొనర్చుట, పొలముపనులు (అనగా) గునపము, పారతో త్రవ్వుట, నాగలిదున్నుట, గుర్రపుసవారిజేయుట, సముద్రనదీప్రాంతముల యందు దిరుగుట చాలామంచిది.

వాతరోగులకు

అగ్నికాపడము, ఆవిరిపట్టుట, విరేచనము జేయించుట, నస్యము జేయుట, వెల్లుల్లి, ఆవాలు, నూరి శరీరమునకు రాయుటయు, లంఖనము కట్టుటమంచిది.

పత్యనియమములు

వాతరోగులకు కించదుష్ణపదార్థములను, కఫరోగులకు నుష్ణముగా నుండు పదార్థములను, పైత్యరోగులకు, చల్లనిపదార్థములు సేవించుట మంచిది. భోజనకాలమందు ద్రవపదార్థములను బుచ్చుకొనవలెను, భోజనకాలములో మంచినీళ్ళు ద్రావవలయును, ద్రవపదార్థసేవనము చాలా మంచిది.

జ్వరరోగులు లఘుకరపదార్థములు సేవించుట చమటబట్టించు నుపాయములను జేయుట విరేచనౌషధములు దీసుకొనుట, కాగి చల్లారిన యుదకమును వడపోశి ద్రావుటమంచిది. జ్వరప్రారంభదినమందే, విరేచనమునకు ఎన్నడు మందీయంజనదు, అటులిచ్చిన జఠరదూష్యముతప్పక గల్గును జ్వరము ప్రారంభించిన మూడవదినమందు గాని నాల్గవదినమందుగాని, విరేచనములకు మందు దీసుకొనవలెను. స్త్రీసాంగత్యము స్త్రీలతోగలసియుండుట మార్గముననడచుట, చింత, ఆయాసకరమగు పనులు

పగలునిద్రను విడువవలయును దగ్గు వగర్పు ఉదరరోగములుగలవారలు పీనసరోగులు, గుల్మము, గుండెజబ్బు, రొమ్మునొప్పి, పడిశము, గొంతురొంప, హీనస్వరముగలవారలు మంచినీళ్లను విస్తారము త్రాగగూడదు, మేకకాళ్లు వగైరాతో జేశిన చారువాగాని, పాలనుకాచి, అందు పటికబెల్లను చూర్ణము మిర్యపుపొడిజేర్చి పానమొనర్చుట చాలామంచిది.

కుష్ఠురోగులు వారమునకొకసారి విరేచనములకును, 15 దినములకొకసారి వమనములకు పుచ్చుకొనుచుండిన వ్యాధిత్వరలో నిమ్మళించును వ్యాయామము, స్త్రీసంభోగమును వర్జింపవలెను.

లోహాదులు సేవించునప్పుడు, శోఫ, ఉబ్బు, పాండువగలవారలు పెరుగు మజ్జిగ విసర్జింపవలెను, యీ భస్మాదులే, లేహ్యములు వగైరాలలో గలుపుకు తినునపుడు, తత్వానుకూలతనుబట్టి పెరుగుమీగడ, మజ్జిగ సేవింపవచ్చును. యూషములనగ, కందులు గోధుమలు, పెసలులోనగునవి యుడకబెట్టితీయు నీళ్లు, పులుపులనగా పండ్లు వగైరాలునుండి తీయునవి, యివి చెప్పబడుచోటను, తత్వానుకూలమును బట్టియు హితవునుబట్టియు కావలసినటుల మోతాదు నిర్ణయించి యివ్వవలెను. రాత్రులు ఆవుపాలు బుచ్చుకొనిన ఆయుర్యశోబలసంపన్నతగలవారగుదురు, పాలుపుచ్చుకొని, వెంటనే నిద్రించరాదు వకగంట తాళి పరుండవలెను.

రసములు కషాయము దీయువిధములు

నిజరసము.

పచ్చివస్తువులను దంచి బట్టలోవేసిపిండిన నందుండి వచ్చురసము నిజరసమనియు స్వరసమనియు జెప్పంబడును.

కల్కము.

ఎండినవస్తువులను నీళ్లతో మెత్తగానూరి యందుండు తీయురసమునకు కల్కమని పేరు.

కషాయము.

కషాయమునకు చెప్పబడిన ద్రవ్యముల నన్నింటిని తులమెత్తు



చొప్పున గ్రహించి నలగగొట్టికుండలోవేసి వేసినవస్తువులకు పదహారురెట్లునీళ్ళుపోసి కుండపైని మూతవేయకుండా చిన్నమంటచే యెనిమిదవవంతుమిగులునటులగాచి కొంచము వేడిగాయుండగ వడపోసి యివ్వవలెను కషాయాదులయందు బెల్లము తేనె చక్కెర చూర్ణములు వగైరాకలుపమని వ్రాసినప్పుడు అచ్చోట యంత పరిమాణముండునో అంతేకలుపుకొనుచుండవలెను కషాయము రెండవున్సులకు తక్కువనీయగూడదు

హిమము.

ఓషదీద్రవ్యములను ఫలమెత్తుచొప్పున నలగగొట్టి కుండలోవేసి అంతకారురెట్లు నీళ్ళుపోసి బాగుగాపిసికి వకరాత్రివుంచి ఆనీటినివడకట్టి సేవించవలెను అట్టిది రెండవున్సులుగాని అవున్సుగాని యుండవచ్చును.

పుటపాకము.

పచ్చివస్తువులను దంచి ముద్దగజేసి మర్రి నేరేడు రావి వీట్లలో యేయాకులతోనైనాపొదగి దానిపైని వకఅంగుళము ప్రమాణము శీలమన్నుయిచ్చి పురమువేసి పైమన్ను కావిలోపలిదివుడుకు నప్పుడు అందుండితే లోపలముద్దను గ్రహించి బిసికిగుడ్డనువడకట్టి రసమును గ్రహించవలెను యేడువస్తువులైన యెడల నీళ్లతో బాగుగానూరి పైప్రకారము రసమును గ్రహించవలెను.

పానము.

ఓషధిద్రవ్యములను దంచి వకఫలము కుండలోవేసి 64 ఫలములుయుదకముబోసి అర్ధభాగమువరకు గాచి వడియకట్టి దప్పియగునప్పుడు పుచ్చుకొనునది పానమనంబడును.

చూర్ణవిధి.

బాగుగానెండిన ఓషధులను దంచి చూర్ణముజేసి వస్త్రఘూళితమొనర్చిన నది చూర్ణమనియు రజమనియు చెప్పుదురు చూర్ణములో బెల్లము గలపవలసినప్పుడు సమముగను చక్కెరపటికిబెల్లము తేనె నెయ్యి వెన్న మొదలగునవి గలపవలసినప్పుడు చూర్ణముకు రెండంతలుగలిపి సేవించుచుండవలెను.

### గండూషము.

కషాయము పానము మొదలగునవి నోటినిండ బోసుకుని పుక్కిలించి వుమివేయుట గండూషమందురు.

### భావన.

యేరసాదులలో వస్తువులు వేయుచుంటిమో ఆరసమునందు ఇగురువరకు నానవేయుట భావనయందురు.

### లేపనము.

మందులు వగైరానూరి పట్టువేయుట లేపనమందురు.

### అంజనము.

శీతాంశు రసాదిమందులు కాటుకలు కండ్లకు కాటుకపెట్టినట్లు వేయుట అంజనమందురు.

### నస్యము.

ఔషధములు రసములు వగైరాముక్కులలో పిండుట లేక పీల్చుట లేకముక్కులలో మందు వేసి గొట్టముననూదుట.

### వస్తి.

పిచ్చికారిగుండానీళ్ళు తైలములు రసములుపాలు వగైరానెక్కించి పిచ్చికారిజేయుట లేక చిమ్మనగొట్టుట యిది వస్తికర్మయందురు

### కాపడము.

వాము ఉప్పు ఇటుకపొడుము ఇసుకలో నగు వాట్లనువేయించి మూటగట్టి గాని సీసాలులో వేడినీళ్ళుపోసిగాని వేడినీళ్లలో కంబళిగుడ్డవేసి పిడిచిన దానితోగాని నొప్పులు వగైరా గల చోట్ల నొత్తుట కాపడమందురు.

### చురకలు.

లోహసంబంధమయిన కాడనుకాల్చిగాని నూనెముంతను కాల్చిగాని జీడిగింజ నిప్పుశెగను కాల్చిగాని నొప్పిగలచోట్లలో గాల్చుట చురకయందురు.



### ఔషధమును సేవించుకాలములు

అవుషధము జ్వరము బడలిక శీతము మొదలగు సామాన్యరోగములయందు ప్రాతస్సాయంకాలములయందును సన్నిపాత సూతికావాతాది ఘోరరోగములయందు శ్వాసకాసరోగములయందు ప్రాణోపద్రకరమగు వ్యాధులయందు జాము లేక ఘంటకొకమారు చొప్పున మేహరోగములు పైత్యరోగములు దీర్ఘరోగములయందు మూడుదఫాలు అనగా ప్రొద్దుట మధ్యాహ్నము సాయంకాలమున్ను వమనవిరేచనములకు పుచ్చుకొనునప్పుడు సూర్యోదయకాలమందును కలికాదులు వేయవలసివచ్చినప్పుడు సాయంకాలమందును ప్రశస్తము.

### ఔషధోపయోగములు.

వివరముగా మోతాదులు వ్రాయనిచోట చిన్నమొత్తుచొప్పున మోతాదు పుచ్చుకొనవలెను మందులు తు 1 కి 35 లగాయతు 45 పొట్లములవరకు రోగబలము ననుసరించి హెచ్చుతగ్గులుగాకట్టుకొనవచ్చును

### తూనికలు.

తులమనగా రూపాయియెత్తు, అణాయెత్తుఅనగా రూపాయిలో పదహారవవంతు, చిన్నమనగా రూపాయిలో ముప్పదవవంతు, (లేక) నాల్గు గురిగింజలయెత్తు, అడ్డిగయత్తుఅనగా, రెండు గురిగింజలయెత్తు, పరకెత్తనగా రెండు ధాన్యపుగింజలయెత్తు వీసమెత్తు అనగా ఒక వడ్లగింజయెత్తు పాతికయెత్తు అనగా ఒకగురిగింజయెత్తు (లేక) నాల్గుధాన్యపుగింజలయెత్తు, అర్ధణాయెత్తు అనగా రూపాయిలో ముప్పదిరెండవవంతు.

అవుషధము రాజు, అనుపానము, మంత్రివంటిదిగాన, అనుపానబలమును బట్టి, ఔషధమునకు బలముగలుగును. గాన ఔషదములకు, భస్మములకు అనుపానచూర్ణము జేర్చవలశివచ్చినపుడు ఔషధముకు రెండురెట్లుచూర్ణము జేర్చుకొనుచుండవలెను, అవుషధము యొక్క తూనికనుబట్టి మోతాదు నిర్ణయించుకొనవలెనుగాని అనుపానచూర్ణమును బట్టి మోతాదు నిర్ణయించగూడదు, మోతాదులు వయస్సునుబట్టియు,

రోగమునుబట్టియు, హెచ్చుతగ్గులుగా పొట్లములు గట్టుచుండవలెను. శ్వాసకాసాదిరోగములయందు అనుపానముగా జెప్పిన రసాదులుతో మాత్రగాగట్టిగాని, ఆయారసములలో సానమీదనరుగదీసిగాని యిచ్చుచుండవలెను. మాత్రపరిమాణము జెప్పనిచోట ఆయారోగములకు తగినట్టుగా మాత్రలుచేసుకొనవలెను.

చిలుంపట్టే పాత్రలలో కషాయముంచరాదు, లోహపాత్రలతో కషాయమునీయరాదు, గాజుపాత్రలతోగాని, మృణ్మయపాత్రలతోగాని స్వర్ణరజతపాత్రలతోగాని నొసంగుట శ్రేష్టము.

రసములు పొంగించవలశినచోట్ల మృణ్మయపాత్రలలో వేశి బాగుగా పొంగువచ్చేవరకు కాచి వడపోసుకొనుచుండవలెను.

అల్లము మొదలగు రసములు దీశి కాచినప్పుడు అడుగునదిగు సత్తుసుదీశివైచుకుని పైరసములనే ఉపయోగపరచుకొను చుండవలెను.

అనుపానచూర్ణము చేసుకొనువిధము.

అనుపానములకు జెప్పిన ప్రతివస్తువును, వేరువేరుగా, ఎండించి చూర్ణించి వస్త్రఘూళితమొనర్చిన చూర్ణములను ఆయావస్తువులకు నిర్ణయించిన తూనికెలప్రకారము కలుపుకొని, కలియనూరుకోవలయును.

అనుపానవస్తువులయొక్క తూకములువేరువేరుగ జెప్పనిచోట అందు జెప్పినవస్తువులను వేరువేరుగా చూర్ణించి, సమపాళ్లుగలపి, కలియనూరుకోవలెను.

అనుపానమునకుచెప్పిన వస్తువులు సమముగా తూచి ఏకముగా కలియగొట్టుకుని కూడా వస్త్రఘూలితమొనర్చిన చూర్ణములను మందులయందు చేర్చి కలియనూరుకుని పొట్లములు గట్టుకొనవచ్చును. అనుపానవస్తువులన్ని యెండయందు ఎండించవలెను. ఎండలేని కాలములలో మంగళముచే సాధారణముగా వెచ్చజేయించి చూర్ణములు కొట్టుకొనవచ్చును.



అనుపాన సాంకేతికములు. చూర్ణములు.

నెం 1 రు అనుపానచూర్ణము జీలకర్ర నల్లజీలకర్ర సోపు శొంఠి మిరియాలు ధనియాలు యాలకులు లవంగాలు దాచినచెక్క ఆకుపత్రికం, తాళిసపత్రికం జాపత్రి జాజికాయ తవాక్షీరి యీతవాక్షీరి బిళ్లా తీదిగాని మామూలు రకముగాని వేసుకొనవచ్చును. పైవస్తువులు సమభాగములుగ వేటికవిగాని కలిపిగాని బాగుగా యెండించి చూర్ణించి వస్త్రఘూళిత మొనర్చుకొనవలెను.

నెం2 రు అనుపాన చూర్ణము శొంఠి పిప్పళ్ళు మిరియాలు కరక్కాయ తాడికాయ ఉశిరికవర్గు యివి లోపలగింజలు తీశివేశి పైబెరడులు మాత్రమే చేర్చుకొనవలెను. యాలకులు లవంగాలు దాచినచెక్క వాయువిళంగాలు యివి సమభాగములు తూచుకుని యెండించి చూర్ణముచేసుకొనవలెను.

స్థాలీచూర్ణము

కరక్కాయలు, తాడికాయలు ఉశిరికవర్గు గింజలు తీసివేసినవి. శొంఠి, పిప్పళ్లు, మిరియాలు జీలకర్ర, లవంగాలు, ఏలకులు, ఆకుపత్రికం దాచినచెక్క లవంగాలు, సమభాగములు.

త్రిజాతకములు.

ఆకుపత్రికము, దాచినచెక్క, ఏలకులు సమభాగములు.

చాతుర్జాతకములు

ఏలకులు, లవంగాలు, దాచినచెక్క, నాగకేసరాలు, సమభాగములు.

త్రిఫలములు

కరక్కాయ, తాడికాయ, ఉశిరికవర్గు.

త్రికటుకములు

శొంఠి, పిప్పళ్లు, మిరియాలు.

త్రిసుగంధము

జాపత్రి, ఏలకులు. దాచినచెక్క.

త్రిక్షారములు

సజ్జక్షారము, యవాక్షారము, పొంగించిన వెలిగారము.

పంచలవణములు.

సైంధలవణము, సముద్రలవణము, కాచలవణము, బిడాలవణము, సౌవర్చలవణము.

లవంగపత్రి

దీనినే ఆకుపత్రికమందురు.

సన్నరాష్ట్రము

యిదే కళింగరాష్ట్రమందురు.

పంచకోలములు

పిప్పళ్ళు, పిప్పలమోడి, చవ్యము, చిత్రమూలము, శొంఠి,

జీరపిప్పలిచూర్ణము

తెల్లజీలకర్ర, పిప్పళ్ళు దేనికదే మంగళమున దోరగా వేపించి చూర్ణముజేసి వస్త్రఘాళితమొనర్చుకొనునది.

సమూలచూర్ణము, జెప్పినప్పుడు, ఆకు, కాయ, పువ్వు, వేరు, పట్ట, వీటినన్ని ఎండించి కొట్టిన చూర్ణము సమూలచూర్ణమని, పంచాంగచూర్ణమనియు, అందురు.

గొడిశపాలాది చూర్ణము.

గొడిశచెక్క, వాము, జాజికాయ, బిల్వశొంఠి, పొంగించిన వెలిగారము, బాలింతబోళ, ఖర్జూరపుకాయ, యివి సమభాగములు, యెండించి చూర్ణించునది.

వకవస్తువునే జెప్పినపుడు దానినే చూర్ణించి వేసుకొనుచుండవలెను.



అహిపత్యచూర్ణము

ఉశీరికపప్పు, వాయువిళంగాలు, ఏలకులు దాచినచెక్క, ఆకుపత్రిక, తుంగముస్తలు శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, కరక్కాయలు, వక్కొక్కటికి తులము చొప్పున తెల్లతెగడ మూడుతులములు యెండించి నలగగొట్టి చూర్ణించునది.

సాంకేతికములు.

వెన్నగాని, నెయ్యిగాని, అనుపానముగ జెప్పబడినచోట్ల, ఆవునెయ్యి, ఆవువెన్న ఉపయోగించుకొనవలెను.

ఔషధపొట్లములలో నెంతఔషధముండునో, దానికి రెండింతలుగా పంచదారగాని, పటికబెల్లము చూర్ణముగాని కలుపుకొనుచుండవలెను. తేనె, నెయ్యి, రసములు చెప్పినప్పుడు, పల్చగా నగునంతవరకు కలుపుకొనుచుండవలెను. అల్లము, శొంఠి, మిరియాలు, వగైరా రసములు చెప్పబడినచోట పొట్లము కలియునంతవరకు రసముతో గలపి, సేవించినపిమ్మట పైగా రెండు మూడు తులముల యెత్తు రసము బుచ్చుకొనుచుండవలెను. రసములతో నౌషధములు సానపై నరగదీసి యిచ్చినప్పుడు, పైగా వకతులముగాని, రెండుతులములుగాని రసమిచ్చుచుండవలెను.

తేనె యనుపానము జెప్పినపుడు పొట్లము బాగుగా కలియునంతవరకే, వేసుకుని కలుపుకొనవలెను. గాని ఎక్కువగా వేసుకొనగూడదు. తేనె పటికిబెల్లము, తేనె అల్లపురసము, తేనె తమలపాకుల రసము, మొదలగు గ్రాహిలు చెప్పినప్పుడు రెండు సమముగా యుండవలెను. గాని, హెచ్చుతగ్గు లుండరాదు.

తేనె, పులిసిపోయినది, నీళ్ళుకలసినది. చిరకాలమునాటిది వుపయోగించరాదు.

చూర్ణాదులకుగాని, కషాయాదులకుగాని చెప్పేవస్తువులు, సమముగానే కలుపుకొనవలెను. వర్ధమానము హెచ్చుతగ్గులు కానలసినప్పుడు అనుపానము వ్రాయుచోటనే వ్రాసియుంచును.

పథ్యాదులువ్రాయని మందులయొక్క యుపయోగములు అందునుగురించియుండు విశేషాంశములు, పథ్యము మొదలగునవి దెల్పు నోటీసులు మందులతోనే చేరియుండును.

# 1 లేహ్యానుపానములు

## 1 ధాతుదృఢీకరణి 20 తు డ 1 కి 2_0_0

సమస్తమేహ రోగములను స్త్రీరోగములను బోగొట్టుట యందమూల్య ప్రజ్ఞగల నీలేహ్యము 10 తులములయందు 4 గు రూపాయలు కిమ్మతుగల కాంతాభ్రిక సిందూరము వేశి చక్కగా కలసేలాగున కల్వ మందుగాని పింగాణీప్లేటులోగాని పిసకి డబ్బిలోయుంచుకొని ప్రొద్దుట సాయంకాలము భోజమునకుముందు అరతులమెత్తు తూచుకుని సేవించిన వెంటనే ఆవుపాలుగాని గేదెపాలుగాని కాచినవిగాని పితికినవెంటనే పచ్చివిగాని తీసుకొనవలెను. అటులభుజించిన వెంటనే శరీరమున బాగుగా వ్యాప్తమై సమస్తమేహపైత్య జనిత రోగములను కాళ్లులాగుట మొదలగు బలహీనములను కారమురోజులలో గుదిర్చి మిగుల వీర్యవృద్ధిని జేసి సకలరోగములను బోగొట్టును. సకలక్షయలు రక్తపైత్యములు ప్రమేహాది సమస్తమేహములు మూత్రములో షుగరుపోవుట మధుమేహము మూత్రాఘాత మూత్రకృచ్ఛ్రాది సకలమూత్ర రోగములు అరుచి అత్యుగ్రమైనవాంతి సకలవిధశల్య గతాదిజ్వరములు దగ్గు వగర్పు గుండెయొక్క బలహీనత పీనసవ్యాధులు అనగా ముక్కునుంచి దుర్వాసన బయలువెడలుట పడిసెము ప్లీహస్థానమున జనించురోగములు ఉదరరోగములు ఆవలపైత్యాది యిరువదినాల్గు పైత్యరోగములు మూలవ్యాధులు పాండురోగము కామిలరోగము రొమ్ములో ఎడతెగనిమంట నొప్పి కడుపుబ్బరము తలనొప్పి శరీరమున బయలుదేరు నల్లటిమచ్చలు దురదలు మలమూత్ర బద్ధకము కాళ్లుపాదములు మంటలు వీటిని శీఘ్రకాలమందే ద్రుంచుటయేగాక వృద్ధులుసహా పుత్రులను బడయుటకు దగినంతవీర్య



వృద్ధిగలవారగుదురు మరియు స్త్రీలకుగలుగు సోమరోగము అసృగ్ధరము బహిష్టునందువచ్చు కడుపునొప్పి అధికముగా రక్తముస్రవించురోగమును బోకార్చును మూడవ నాల్గవ మాసాదులయందు గర్భస్రావము గలుగు వ్యాధులు చనిపోయిన బిడ్డలనుగను స్త్రీలు సేవించిన దీర్ఘాయువుగల పుత్రులను బడయుటకు సందియములేదు. గొడ్రాళ్లు సహా నీయవుషధ సేవవలన తప్పక పుత్రులను బడయును పైవ్రాసిన వ్యాధులను సంపూర్ణముగ నిశ్శేషము జేయదలంచు కొనదలచు వారలు నీలేహ్యమును సింధూరమును నాలుగుమండలముల రోజులు అనగా నూటఅరువది దినములు సేవించవలెను. వృద్ధులుసహా దీనిని సేవించుటచే గుర్రముతో సమానమైన గర్వము ఏనుగుతో సమమగు బలమును నంది పరాక్రమముగల వారయ్యెదరు దీనినిసదా సేవించువారలకు సమస్తబలములు చేకూరును సమస్తసుఖవ్యాధులువల్ల తప్పించుకొనెదరు రోగములు ఏమియులేక బలమునే కోరువారు యిరువదితులముల ధాతుదృఢీకరణి యందు నెం 203 రు రజతభస్మము తులమెత్తుగలుపుకొని సేవించవలయును రోగానుసారముగ యీలేహ్యము 20 తులముల యందును వంగభస్మము అయస్కాంత సింధూరము షడ్గుణము శతపుటక్రిష్ణాభ్రిక భస్మము దీనిలో ఏదైనావకటి తులముచొ॥ కలుపుకుని భుజింపవచ్చును. భస్మాదులుగాని కాంతాభ్రిక సింధూరముగాని కలిపి సేవించుటచే రక్తశుద్ధిని త్వరితముగా జేయునిమిత్తమున్ను లేహ్యమువల్ల కలిగేబలమును శీఘ్రకాలములో తగ్గకుండగను నుండగలందులకు సేవించవలయునేగాని రోగోపశాంతికై నయెడల వట్టిలేహ్యము భుజించినను భుజింపవచ్చును ఇందు దేశకాలపాత్రభేద మేమియు లేకయే నడచునటుల తగుమయిన ఔషధీవర్గను భస్మాదులు చేర్చడమయినది.

## 2 సుగంధాది లేహ్యము తు 20 డ 1 కి 1_8_0

శగసవాయి బిళ్లలు మొదలగు సుఖవ్యాధులు తగిలినపిమ్మట గానిస్వతస్సిద్ధమగు శరీరమున కలిగే మేహకారకములు సమస్తపైత్యము

లు పైత్యకారకములు మేహపైత్యములు సవాయిమేహములు పైనవ్రా శ్ని వ్యాధులవల్ల కలిగే శుక్లనష్టములు సవాయి మేహారణములు మేహ నొప్పులు మేహాధికముచే గలుగు నీరు (లేక) నంజు ధాతుపుష్టి లేక నిస్త్రాణగాయుండుట రక్తవిహీనమగుట నిస్సత్తువ మూత్రముతో శుక్లముకలశి పడిపోవుట మేహపైత్యదారుణములవల్ల కలిగే సమస్తవ్యాధులను ఖండించును పూటకు అరతులమెత్తు చొ॥ ప్రొద్దుట సాయంకాలము సేవించవలెను యిరువైతులముల లేహ్యమునందు కాంతాభ్రకసిందూరము వకతులమెత్తు గలుపుకునిగాని నాలుగురూపాయలు కిమ్మతుగల అయస్కాంత సిధూరమునుగాని కలుపుకుని భుజించిన రెండుమూడు రోజులలోనే శరీరాద్యంతము మందుయొక్క గుణము వ్యాపించి వంటిదురదలు మచ్చలు బగ్గిలు గజ్జిదద్దురులు పళ్లికలు పోడలు కీళ్లనొప్పులను బోగొట్టి శరీరమును వజ్రదేహముగా జేయును.

## 3 ఖండార్ద్రక లేహ్యము.

తు 20 గ డ 1కి రు 1—8—0

యిది పూటకు అరతులమెత్తు చొ॥ ప్రాతస్సాయంకాలముయందు సేవించిన, తలదిరుగుట, కండ్లు పచ్చబారుట, శరీరము, పాదములు, చేతులు మంటలు, చెవులు ఘుడియలుపడుట, శరీరము పొట్టువలె రాలుట, దురదలు, కండ్లుమంట, కణతలు ఎల్లప్పుడు నొచ్చుచుండుట, మొదలగు ఇరువదినాలుగు పైత్యములవల్ల వచ్చే సమస్త దుర్గుణములను మొదలంటా ఖండించి, మంచి జఠరాభివృద్ధిని జేయును, మరియు నిందు రెండు రూపాయలు కిమ్మత్తుగల సిందూరభస్మమునుగలపి సేవించిన, కడుపులోనుండు పుపుకు పైత్యాధికము చేయగల్గు శుక్లనష్టమును గట్టి మంచి బలమును, బుద్ధికి చురుకుదనమును కలుగజేయును.

## అశ్వగంధాదిలేహ్యము.

తు 20 గ డ 1కి రు 2—0—0

యిందు సారవంతములగు ననేక మూలికలు, భస్మాదులు కలసియున్నవి. మోతాదు పూటకు అర్ధరూపాయియెత్తు చొ॥ ప్రొద్దుట సా



యంకాలము సేవించవలెను, ఆమ్లపైత్యము, రక్తపిత్తము, హస్తిగాత్రజ్వరాదులు, సుఖసంబంధములు జీర్ణించుటచే గల్గు సకల విధబాధలు, కండ్లు, కాళ్లు, చేతులు మంటలు, పొత్తికడుపు నరములు బిగదీయుట సకల విధశుక్లనష్టములను, రక్తక్షీణరోగమును, శరీరమెల్లప్పుడు అతివేడిగా యుండుట, ఆకలి లేకపోవుట, తినిన అన్నమరగకపోవుట మొదలగు అనేక రకముల వ్యాధులను బోగొట్టును. యిరువైతులముల గల నీ లేహ్యపు డబ్బాయందు, నాల్గు రూపాయీలు కిమ్మత్తుగల కాంతాభ్రకసిందూరమును గాని, మూడు రూపాయిల కిమ్మత్తుగల, తులమెత్తు బాలసూర్యోదయముగాని, గలపుకొని సేవించిన, మేహపైత్య, వాతపైత్య, శ్లేష్మపైత్యము మొదలగు సఖిల ద్వంద్వ వ్యాధులను, ఉబ్బస దగ్గులయందును రక్త మాంస క్షీణవ్యాధులు సకల క్షయలు పూర్ణవీర్యములు మేహాశూలలు, శ్వాసకాసలు నందును బాగుగా పనిజేయును శగరోగము జీర్ణించుటవల్ల వచ్చు శుక్లనష్ట సమస్తదుర్గుణములను మొదలంటా ఖండించును లఘుస్ఖలనము, ఇంద్రియము నీళ్ళవలె పలుచనగుట మొదలగు రోగములను గుదుర్చుటయేగాక స్త్రీలకు గల సమస్తకుసుమరోగములను, దీసివైచి ఆయుర్యశో బలసంపన్నులుగ జేయును.

## 5 మదన కామేశ్వరీ లేహ్యము.

తు 20 గ డ 1కి రు 4—0—0

యింద్రియమును పూరించునవియు, మనస్థిమితము జేయునట్టియు మంచివీర్యముగల యనేకమూలికలు చేరియున్నవి, ప్రాతస్సాయంకాలములయందు అరతులము చొ॥ తూచి సేవించవలెను క్షయరోగములు, శ్వాసకాసలు, సకల మేహములు దీర్ఘకాలమునుంచి బాధించు గ్రహణి అతిసారరోగములు, అన్నమరగకపోవుట మూత్రముతో గలశిపోయే శుక్లరోగమును బోగొట్టును 20 తులములు గల నీలేహ్యపుడబ్బాయందు నాల్గు రూపాయిలు విలువగల కాంతాభ్రకసిందూరమునుగాని, అయస్కాంత సింధూరమునుగానికలిపి సేవించిన పలుచనైన యింద్రియమును

గట్టిపరచి, సవాయి మొదలగునవి జీర్ణించుటచేతనున్ను, శూలాములవల్లను కలిగే నడుమునొప్పి, కాళ్ళుచేతులు లాగుట కీళ్ళనొప్పులను నివారణచేయుటయేగాక యీ మందును సేవించిన యెడల ఎంత బలహీనులుగనున్న స్త్రీ పురుషులకైన మంచి వీర్యవృద్ధికలిగి తేజోవంతమైన సంతానముగల్గును, సంసార సుఖేచ్ఛగలవారలు తప్పక దీనిని సేవించవలెను మంచి ఆలోచనశక్తియు మంచి సౌందర్యమును గలుగజేయును,

## 6 ఫిరంగాదిలేహ్యము తు 20 గల డ 1 కి రు 3

సవాయి మేహములు కుష్టులు యెనుబదివాతములు సవాయిరోగములు మేహారణములు మచ్చపొడ బగ్గి కీళ్లనొప్పులు క్రిమిరోగముగండమాలలుతోనగు ననేకరోగములను గుదుర్చును ఉదయము సాయంకాలము అరతులమెత్తు చొ॥ సేవించవలెను. యీలేహ్యమునందు కాంతాభ్రికసింధూరము తులమెత్తు గలిపి రెండు మండలములు సేవించినయడ్ల కుష్టురోగములను నిర్మూలించును చిరకాలమునుంచియుండు మేహారణములను బోగొట్టి వజ్రికాయమును జేయును.

## 7 కూష్మాండలేహ్యము తు 20 గల డ 1 కి రు 3

అగ్నిబలానుసారముగ పూటకు అరతులమెత్తు లగాయతు తులమెత్తువరకు ఉదయసాయంకాలములు సేవించవలెను రక్తపైత్యరోగములు క్షయవ్యాధి దగ్గువగరపు దాహరోగము తాపయుక్తమగు జ్వరములును బోగొట్టును మరియు దీనియందు నాల్గురూపాయిలు కిమ్మత్తు గల తులమెత్తు షడ్గుణమునుగాని రూపాయినరకిమ్మత్తు గల తులమెత్తు శ్వేతాభ్రికభస్మమునుగాని కలపి సేవించిన మంచి తారుణ్యమును శరీరమునకు మంచి సౌందర్యమును రొమ్ము పుష్టియు మంచి వీర్యవృద్ధినిగలుగజేయుటయేగాక మతిస్థిమితములేనివారలు అనగా మెదడునందు విస్తారము వేడిగలవారలు ఉన్మాదరోగులకు సేవించిన మంచి ఆలోచనశక్తియు మెదడుకు పుష్టిని కలిగించును.



## 8 ఖర్జూరాదిలేహ్యము తు 20 గల డ 1 కి రు 3

రక్తపిత్తవ్యాధులు ఆమ్లపిత్తము శిరోభ్రమణపైత్యము స్ఫోటకపైత్యము మొదలగు ఇరువదిపైత్యరోగములను సకలవిధజ్వరములు పదకొండు క్షయరోగములను ఉన్మాదము పిచ్చిరోగములను మేహశూలలు అతితాపము అరుచి అగ్నిమాంద్యము సకలాజీర్ణములు దాహము కంటమెండుటలోనగునవి అతిశీఘ్రముగ బోగొట్టును మరియు నీలేహ్యమున ఆరురూపాయీలకిమ్మత్తుగల లోహాభ్రికసింధూరమును తులమెత్తుగలిపిగాని నాల్గురూపాయీలకిమ్మత్తుగల తులమెత్తు కాంతాభ్రికసింధూరమును గలిపి సేవించిన మంచి రక్తవృద్ధి వీర్యవృద్ధియు జేసి అపరిమితమగు సంభోగశక్తిని నొసంగును.

## 9 శైలూషాదిలేహ్యము తు 20 గల డ 1 కి రు 3

యిందు సారవంతములగు అనేకమూలికలుచేరియున్నవి ప్రాతస్సాయంకాలములయందు అరతులమెత్తు చొ॥ సేవించిన రక్తమేహము సురామేహము శుక్లమేహాది యిరువది మేహరోగములు మేహపైత్యాదులవల్ల కలిగే కడుపులో దారుణమంట పుడుకులోగునవి కాళ్లుచేతులు మంటలు రక్తపైత్యాది యిరువది పైత్యములను కడుపులోనుండు గ్రంథులు బిళ్లలు వాతమేహము మొదలగు ద్వంద్వజనితరోగములు దాహరోగము కంఠముయెండినటులుండుట హృద్రోగము దగ్గువగరపు కఫరోగములు మూర్ఛరోగములు క్షయరోగములను నాలుక నోరు ఇగురుట విద్రధిరోగము మేహపిటికా రోగము నివర్తింప జేయుటయేగాక స్త్రీలకుగల ఋతుదోషములు అనగా ప్రతినెల బహిష్టు హెచ్చుతగ్గులుగా వారమురోజుల వెనుక ముందుగ కనుపించుట కనుపించి ఝూరీకాకపోవుట అయ్ని విస్తారముగా అగుట వారంపదిరోజులువరకు ఋతుస్రావముగలుగుచుండుట ఋతువుమాసాంతరములు ఎగించివచ్చుట యుక్తవయసులో ఋతులేశూన్యముగుట ఋతువునందు కడుపునొప్పి మొదలగు సమస్త

రుతుదోషములును కుసుమ మొదలగు రోగములను దెగటార్చును యిందు నాల్గురూపాయీలు కిమ్మత్తుగల కాంతాభ్రికసింధూరమునుగాని అయస్కాంతసింధూరమునుగాని కలిపి సేవించిన అపరిమితపారావారమగు ఆకలిబుట్టి మిక్కిలి వీర్యవృద్ధిని రక్తశుద్ధినిజేసి అమితబలమును గలుగజేయును.

## 10 శతావరిలేహ్యము తు 20 కి రు 3-0-0

ఇందు యింద్రియవృద్ధికరములగు ననేక మూలికలు భస్మాదులు చేరియున్నవి. ప్రాతస్సాయంకాలములయందు అరతులమెత్తు లగాయితు, తులమెత్తువర్కు శేవింపవచ్చును. దీనిని వకటిరెండు రోజులు సేవించినంతలో గుణము బాగుగాగాన్పించును; యిరువది మేహరోగములు, యిరువది పైత్యరోగములు, కామిలారోగము, పాండువ సమస్త మూత్రరోగములు, శుక్లనష్టాది అనేక ఘోరరోగములను బోగొట్టును, స్త్రీలకు గలిగే అసృగ్ధరరోగము, నానావిధ కుసుమరోగములను సమస్తక్షయరోగములనుంచి విముక్తులనుజేయును, గొడ్రాలుసేవించి తప్పక గర్భము ధరించి, మంచిపుత్రుని బడయును, నపుంసకులు సేవించిన, అనేకస్త్రీలను రమించుటకు తగిన వీర్యబలమును కామోద్దీపనమును కలుగజేయును, శుక్లమేహము వీర్యము పలుచనగుట, లఘుస్ఖలనము, స్వప్నస్ఖలనము, శుక్లస్రావమును బరిమార్చి, అనేకస్త్రీలను బొందుటకు తగుమయ్యిన శక్తిని పురుషులకును అనేక పురుషులతో క్రీడించినను బలముజెడకుండా స్త్రీలకును ధారుఢ్యమిచ్చుటయేగాక, ఆయుస్సును వృద్ధిజేసి, మిక్కిలి బలమును గలుగజేయును. యిరువైతులములుగల నీలేహ్యపు డబ్బాలో రు 6-0-0 కిమ్మత్తుగల లోహాభ్రికసింధూరమును గలిపి సేవించినవెంటనే దేహమందు వ్యాప్తమై, మంచి రక్తవృద్ధిని వీర్యవృద్ధిని కలుగజేయును.

## 11 మధుస్నుహీలేహ్యము తు 2 ) డ 1 కి రు 3.

మేహరోగములు, పైత్యజనితరోగములు, వాతరోగములు, కుష్టు



రోగములు సవాయిరోగములు గుల్మరోగములు, మేహవాతాదులవల్ల జనించు రోగములను, నిరాఘాటముగా గుదుర్చుటయేగాక, సప్తధాతువులు వృద్ధిజేయును, ఆయుర్యశో బలసంపన్నులుగా జేయును.

మరియు నీ యిరువైతులముల లేహ్యమునందు ఆరురూపాయీలు కిమ్మత్తుగల తులమెత్తు లోహాభ్రికసింధూరమును గలిపిగాని నాల్గు రూపాయీల కిమ్మత్తుగల కాంతాభ్రిక సింధూరమునుగాని కలిపి సేవించిన, శరీరమున త్వరితముగా వ్యాపించి, రణములు, బగ్గి, మచ్చ, పళ్ళిక, పొడవగైరా చర్మవ్యాధులను మండలమురోజులు సేవించిన దివ్యతేజోవంతులుగ జేయును.

లేహ్యములలో భస్మాదులు కలుపుకొని భుజించువారలు విభవానుసారముగను తత్వానుసారముగను సువర్ణాదిభస్మములు కలుపుకుని కూడా భుజించవచ్చును, సాధారణజనులు భస్మములు అక్కరలేకయే సేవింపవచ్చును, భస్మాదులు కలిపినయెడల రెండింటిగుణములు గలసి మాఅనుభవమువల్ల విశేషగుణ మగుపించుచుండుటచే, వ్రాసితిమి. పట్టిలేహ్యమును కూడా సేవించిన మంచిగుణములు యిచ్చుచునేయుండును, లేహ్యాదులయందు భస్మాదులు కలుపవలసివచ్చినప్పుడు, తులమెత్తు వక్కసారిగా యిరువైతులములు లేహమున్ను ఖల్వముపైవేసి కలియులాగున నూరుకుని, చెప్పిన మోతాదుప్రకారము సేవింపవచ్చును, అటులుగానిచో, తులమెత్తు నలుబది పొట్లములు సమముగాజూచి కట్టుకుని, సేవించుకాలమున మోతాదుతీసుకుని, అప్పుడే కలిపి సేవించుచుండవలెను, లేహ్యములయందు నీళ్లు పాలు వగైరా కలిసినయడ్ల చెడిపోవునని, తైలాదులుతోను ఘృతాదులుతోను।వండెదముగాన, అవి యెప్పుడైన ఆరిపోయినటులున్న సేనించుకాలములో అందు ఆవునేయిగాని, తేనెగాని. ముద్దగునంతమట్టుకు వేసి కలిపి డబ్బాలో యుంచుకొనవలెను, డబ్బాలయందు కూడా చిరకాలముంచిన త్రుప్పువగైరా వాసన కలుగుచుండును గాన వచ్చినవెంటనే పింగానియందుగాని, గ్లాసునందుగాని, లోహపాత్రిలుగాక మరి యితరపాత్రిలు దేనియందైనసరే యుంచి ఘాటుపోకుండా మూతవేసి భద్రముగా కాపాడుకొనుచుండవలెను.

## లేహ్యాదులకు పత్యములు.

లేహ్యములుసేవించుకాలములో స్త్రీసాంగత్యముపూర్తిగావర్జించుట మంచిది. అటుల వర్జించలేనివారలు, వారమునకు వకసారి మితిగా సంభోగము జేయవలెను. యిదివరలో మీకు భర్జించని పదార్థములను పూర్తిగావదిలివేయవలెను. ఆవ, నూని, గుమ్మడి, బత్సలి, చింతపండుపులుసు, ఎండుచాపలు, దుంపకూరలు, అత్యుష్ణముజేయు పులిహారన్నము, పనస కాయకూర కందకూర వగైరాలు మానివేయవలెను. అతిశీతలపదార్థములగు కరుబూజ దోస అనాసలోనగునవి మానివేయవలెను. మిగత సకలపదార్థములు దినవచ్చును. కాఫీ, టి, కోకో, అలవాటుగలవారలు, మందు సేవించినపిమ్మట పుచ్చుకొనవచ్చును. క్షౌరమునకు, నిత్యస్నానమునకు, అభ్యంగనస్నానమునకు అభ్యంతరములేదు. అభ్యంగనము జేయునపుడు, శరీరమునకు, నేయిగాని, ఆముదముగాని వుపయోగించవలెను. పులుపు పదార్థములు కావలసినయడల నిమ్మకాయరసము, నారింజకాయరసము, ఆలుబకారకాయలు చారు, నిమ్మరసముతో చేసిన చారు పుచ్చుకొనవచ్చును. పైరసములు సమస్తపదార్థములలోను అవసరమును బట్టి చేర్చుకొనవచ్చును. మాంసాహారులు విరివిగా మేకమాంసమును, పిట్టలుయొక్క మాంసములను దినవచ్చును. లేహ్య సేవాకాలములో జీర్ణమయినంతవరకేభుజించుచుండవలెనుగానిఅజీర్ణముచేయులాగున అధికముగా తినరాదు. అందువిస్తారము, పాలు, మీగడ గోధుమతోను మినుముతోను జేయు పాయసాది సకలవిధ పదార్థములును తీపిగల లడ్డు హల్వా, బూంది వగైరాలు, సకలవిధములగు ఫలములును, భుజించవచ్చును. అరటిపండుమాత్రము విశేషముగా దినరాదు. చుట్ట శిగరెట్టు, బీడిలను కాల్చు నలవాటుగలవారలు అధికముగ గాక, సాధారణముగ గాల్చవచ్చును. నల్లమందు సారాయి గంజాయి లోనగు కైపు వస్తువులు అలవాటుగలవారలు లేహ్యములే కాదు ఏమందు సేవించు కాలమునందైననుసరే మానివేయుట వుత్తమము, మా లేహ్య సేవవలన



పైదురభ్యాసములు సునాయాసముగ తప్పించుకొనవచ్చును. ఏలననగా కైపువస్తువులు అలవాటుగలవారలకు దానినిపూ తగ్గుటతోడనే, కాళ్ళు, చేతులు లాగుట, కడు బలహీనము వచ్చుట, ఆవలింతలు బడలికలోనగు గుణములు పుట్టుచుండును. అందుచేతనే, తిర్గి మళ్ళిపుచ్చుకొనుట తటస్థమవుచున్నది. యీలేహ్య సేవాకాలములో అట్టివికృతగుణములు ఎన్నడు రావు గనుక మానుకొనవచ్చును, భ్రాంతిని పట్టజాలనివారలు మునపటిదానిలోనాలవవంతైన అర్థభాగమునైనా స్వీకరించవచ్చును. భస్మాదులు గలుపుకుని సేవించునప్పుడె యీపత్యములుముఖ్యముగా ఆచరించవలెను. వట్టిలేహ్యములు సేవించుకాలములో సామాన్యపత్యమాచరించవలెను. వకానొక సమయమున పత్యము సేయకపోయినను వికృతమేమియు కలుగనేరదు.

## 12 జ్వరాదిరోగములకు మందులు

అగద మా 25 గల శీ 1కి రు-0-6-0 పే 3 కి రు 1-0-0 యిది సకలరోగ నివారణియని చెప్పుటకు సందియములేదు. యిది మూలికాసారములతోను భస్మాదులతోను శిద్ధముజేయబడినది. గ్రహణి, అతిసారము కలరాయందు తప్ప, తక్కిన వాతపైత్య శ్లేష్మాదిరోగాదులయందు ద్వంద్వరోగములు, మలమూత్రబద్ధములు, సన్నిపాతాది ఘోరరోగముల యందు, బాగుగా పనిచేయును. మన్యప్రాంతముల వారు యీమందును విడవకుండా వాడుచు దీనిప్రభావమును కొనియాడుచున్నారు. రోగానుమానము గలిగి భారముగాయున్నప్పుడు ఒక్కమాత్ర సేవించిన ఏరోగమును రానివ్వదు. ఎంతధనమిచ్చినను, యింతగుణముగల మందు దొరకదని, మందును సేవించినవారెల్ల అనుకొనకమానరు. యీమందును ఉదయముమాత్రమే సేవించవలెను. సాయంకాలము జ్వరహారిగాని అమోఘాస్త్రము మాత్రలుగాని, వాడుకచేయవలెను. ఎందుచేతననగా అగద మందులో వేడిజేసి విరేచనముజేయుగుణము గలదు గనుక రెండవ పూట వాడరాదు. వైద్యులకు, వైద్యేతరులకు, పెన్నిధివంటిది. మాత్ర

ను తేనిలోముంచి సేవించిన, సకలజ్వరములు, జ్వరముతో సంబంధించిన సకలవ్యాధులున్ను, ప్లేగు, ఇన్ ఫ్లుయన్ జాజ్వరము మొదలగునవి వకటి రెండు రోజులులో పటాపంచలై పోవును. తలదిరుగుట కండ్లు పత్సమారుట, పసరు గ్రక్కుటలోనగు పైత్యముతో సంబంధించిన సకలపైత్యవ్యాధులయందు, మాత్ర మెత్తగా నలిపి, అందు అరతులమెత్తు, ఫేక్టరి పంచదారగాని, బనారసు చక్కెపంచదారగాని అరతులమెత్తువేసి కలిపి సేవించవలెను. అల్లపురసముతో నిచ్చిన, సన్నిపాతాది రోగములు, వాతరోగములు, శ్లేష్మరోగములు, ద్వంద్వరోగములు, సూతికాది సమస్తరోగములను బరిమార్చును, ఏవ్యాధియందైనను వక్కమాత్ర వ్యాధిప్రారంభసమయమున నిచ్చిన, ఆరోగము రోగిని ఏమిచేయక సుఖముగ తగ్గిపోవును. ఆరోగికి అపాయ మెన్నడు నుండదని మా అనుభవమునుబట్టి రూఢిగా జెప్పెదము, విరేచనము త్వరితముగా గావలసియున్నప్పుడు, ఏవ్యాధియందైనను తేనితోనే ఇవ్వవలెను.

## 13 జ్వరహారిమాత్రలు 50 గల పె 1 కి అ 8

చలిజ్వరములయందు పిప్పళ్ళు జీలకర్ర రసముతోను, ఆహ్నికజ్వరాదులయందు అల్లము జీలకర్ర రసముతోను, తాపజ్వరములకు ధాచిన చెక్క రసముతోను సంతతజ్వరమునకుపిప్పలి మోడి రసముతోను శ్లేష్మజ్వరమునకు మిరియాలు రసముతోను, వాతజ్వరమునకు పిప్పళ్ళరసముతోగాని పిప్పలమోడి రసముతోగాని సేవించవలెను.

## 14 జ్వరవైరిమాత్రలు 1[illegible]0 గల పె 1 కి రు 1

తాపము ఉడుకుగల జ్వరములకు చన్నీళ్ళతోను, (లేక) దాసిన చెక్క ధనియాల రసముతోనైనా యివ్వవలెను. శ్లేష్మజ్వరములయందు లవంగాలు రసముతోగాని, మిరియాల రసముతోగాని యివ్వవలెను. పైత్యజ్వరములు మేహజ్వరములయందు, జీలకర్ర అల్లము గలిపి నూరి తీసిన రసముతోనియివ్వవలెను.



## 15 శింహప్రతీపాలనం మా 200 గల సీ 1కి రు 1.

చంటిబిడ్డలకు వకటి చొ॥ పెద్దవారలకు రెండు చొ॥ ప్రొద్దుట సాయంకాలము సేవించవలెను, చిన్నవారలకు అనుపానమక్కరలేకయే, ప్రాలుత్రాగు బిడ్డలకు పాలతోచేర్చిన్ని, పాలుత్రాగని బిడ్డలకు ఉష్ణోదకముతోను మాత్ర నీయవలెను. 12 సం॥ దాటినవారలు అనుపానవిశేషములతో సేవించిన వ్యాధులు శీఘ్రముగా దొలగగలవు, అల్లపురసముతోనిచ్చిన వడలునొప్పితోనుండు జ్వరములు విషమజ్వరములు, మిరియాలరసముతోనిచ్చిన శ్లేష్మజ్వరము దగ్గు వగరపు, తగ్గును. పిప్పళ్లుగాని, పిప్పలమోడి రసముతోయిచ్చిన వాతాదిజ్వరములు తగ్గును. సన్నిపాత సూతికాది జ్వరములయందు నీయనుపానమునే నీయవలెను.

## 16 కస్తూరిమాత్రలు 200 గల సీ 1కి రు 1.

ప్రాతస్సాయంకాలములయందు చంటిబిడ్డలకు ఒకటి చొ॥ పెద్దవారలు రెండు చొ॥ సేవించేది చంటిబిడ్డలకు అనుపాన మక్కరలేదు. పిప్పలమోడి రసముతోనిచ్చిన ఒడలునొప్పులు జ్వరముతగ్గును, అల్లపురసముతోనిచ్చిన పైత్యజ్వరము, మిరియాల రసముతోనిచ్చిన శ్లేష్మజ్వరము, పిప్పళ్ళు జీలకర్ర రసముతోనిచ్చిన చలిజ్వరము తగ్గును.

## 17 అమోఘాస్త్రముమాత్రలు 150గల సీ1కి అ12

మూడు సీసాలు వకేసారి తీసుకొనువారికి రు 2-0-0 లు మాత్రమే.

పిన్నవారికి ఒకటి చొ॥ పెద్దవారలకు రెండుచొ॥ ప్రాతస్సాయంకాలములయందు సేవించవలెను. రోగ ప్రాబల్యమునుబట్టి రోగికి రాత్రింబవలు ఝామునకు వక మోతాదు చొ॥ కూడా యివ్వవలెను.

సన్నిపాత సూతికావాతాది ప్రబలదోషములయందు ఝాముకు వక్క మోతాదు నిర్ణయించవలెను. జీలకర్ర పిప్పళ్ళు రసముతోనిచ్చిన జ్వరములు, అడ్డసరము, శొంఠి, పిప్పళ్ళు, మిరియాలు, కటుకరోహిణిలు అరతులమెత్తు చొ॥ కషాయముబెట్టి యిచ్చిన సకలవిధజ్వరములు, చిన్న

ములక, సీమనేలవేము, కటుకరోహిణి, శొంఠి, తిప్పతీగి, ఆముదపువేళ్ళు వీటి కషాయములతోనిచ్చిన, అష్టవిధజ్వరములు, నేలగుమ్మిడ, సుగంధపాల, దాక్షపండు, గానుగవేరు, తిప్పతీగి, వీటికషాయముతో నిచ్చిన వాతజ్వరములు, పర్పాటకము, అడ్డసరపాకు, కటుకరోహిణి, సీమనేలవేము, దురదగొండివేళ్ళు, పేక్షిణపువేళ్ళు, వీటికషాయముబెట్టి, అందు తులమెత్తు చక్కరగలపి యిచ్చిన, తాపము, పిత్తరక్తము, పైత్యజ్వరము తగ్గును, అల్లపురసముతో నిచ్చిన పిత్తజ్వరము, మిరియాల రసముతో నిచ్చిన శ్లేష్మజ్వరము, పిప్పలిమోడి రసముతోనిచ్చిన, సూతికావాయువులు, సన్నిపాతజ్వరములు, శొంఠి వాము రసముతోనిచ్చిన అజీర్నజ్వరములు, పిప్పళ్ళరసముతోనిచ్చిన విషమజ్వరాది సకలదోషములు తగ్గును.

## 18 2 అమోఘాస్త్రము మాత్రలు

150 గల సీ 1 కి 0-8-0.

మూడు సీసాలు వక్కమారుగా తెప్పించుకొనువారికి 1-2-0 మాత్రమే.

శొంఠి, వాముసముతోనిచ్చిన, అజీర్నజ్వరములు, మిరియాల రసముతోనిచ్చిన, శ్లేష్మజ్వరములు, పిప్పళ్ళు, జీలకర్ర రసముతోనిచ్చిన సకలవిధ జ్వరములు తగ్గును, పెద్దలకు రెండు చో॥ చిన్నలకు ఒకటి చో॥ సేవించవలెను, యివి చిరకాలాజీర్నములుమీద బాగుగా పనిజేయును.

## 19 కీర్తికాముకరసము మా 100 గల వే 1 కి రు 1.

వక మాత్రను శొంఠిరసముతోగాని వేడినీళ్ళతోగాని ఉదయమే సేవించినయెడల మలబద్ధము, జ్వరములు జీర్నజ్వరములు తగ్గిపోవును.

## 20 త్రిభువనకీర్తి రసము మా 200 సీ 1కి రు 1-8-0

కీర్తికాముకరసము ఉదయముననే సేవించిన పిమ్మట నీమాత్ర ఝామునకు వకటి చో॥ అల్లపు రసముతోగాని, పర్పాటక కషాయముతోగాని సేవించిన, ఆహికజ్వరము, మలేరియాజ్వరము, సంతతజ్వరము,



పైత్యజ్వరము, వాతజ్వరము, శ్లేష్మజ్వరము, లోనగు సకలజ్వరములు వకటి లేక రెండురోజులలోనివర్తికాబడి సంపూర్ణారోగ్యము గలుగును.

## 21 సర్వజ్వరం మాత్రలు 200 సీ 1 కి రు 1-0-0

మిరియాలరసము, అల్లపురసము, జీలకర్రరసము, దాచినచెక్కరసము, దీనిలో నేదైనావకరసముతో ప్రొద్దుట సాయంకాలము ఒక్కొకమాత్ర చో॥ సేవించిన, మలేరియా, ఏకాహికద్వ్యాహిక, త్ర్యాహికము మొదలగు ఆహికజ్వరములు విషమజ్వరములు, ఇన్ఫ్లూయంజా జ్వరము లోనగు కఠినములైన సకలజ్వరములు తగ్గును.

## 22 జ్వరాష్ట గజకేసరి, మాత్రలు 200 గల సీ 1 కి 1-8-0.

ప్రాతస్సాయంకాములయం దొక్కొక్కమాత్ర చో॥ సేవించవలెను, చిన్నములక, సీమనేలవేము, కటుకరోహిణి, శొంఠి, తిప్పతీగి, ఆముదపువేళ్ళు,వీటికషాయముతోనిచ్చిన,సమస్తజ్వరములు పటాపంచలైపోవును, అల్లపురసము మిరియాలరసము పిప్పలమోడి రసము, జీలకర్ర పిప్పలిరసము, వీట్లలో దేనితోనైనా యిచ్చిన సకలవిధ జ్వరములు తగ్గును.

జ్వరాదులకు మందులు సేవించునప్పుడు రసాదులు కషాయాదులు చిక్కనప్పుడు వేడినీళ్ళతోనే సేవింపవచ్చును మోతాదులురోగము హెచ్చుగానుండియున్నయడ్ల, రోజుకు నాలుగయిదు మోతాదులువక్కయివ్వవచ్చును. కీర్తికాముకరసము, అగద యీరెండుమందులు, ఉదయమే వేయవలెనుగాని రెండుపూటల వేయరాదు (పథ్యములు) తరుణజ్వరములయందు, లంకణ ముండుట, వాంతిజేయించుట, పలుచనైన పదార్థములను దినుట, చమటబట్టుటకు, ఆవిరిపట్టుట, కారము, చేదుగల పదార్థములు సేవించుట, తేలికగా జీర్నమగు పదార్థములు దినుట,

కన్నులయందు కలికము వేయుట, నస్యమును బీల్చుట, కషాయాదులను పుక్కిలించుట, పాతబియ్యపు అన్నము, లేతవంకాయలు, మునగకాడలు, కాకరకాయ, పొట్లకాయ, దోసకాయ ముల్లంగి, పెసలు, కందులు, పులవలు, చిరుసెనగలు, అడవిపెసలు వీట్లకట్టులు, చిరికూర, పాలకూర, కాచికూర, ద్రాక్షపండ్లు, వెలగపండ్లు, దానిమ్మపండ్లు, పెరుగుతోటకూర, కొయ్యతోటకూర, వేపపువ్వు, కరివేపాకు పొడుము, పులిచింతాకు, పీకాయాకు, నల్లయిరి కాటుకపిట్ట, మేకమాంసము, వంగపండ్లు, దోసపండు, పొట్లపండు, కాకరపండు, నూనె, సంవత్సరము, రెండు సంవత్సరములు గడచిన పాతధాన్యముయొక్క బియ్యపుఅన్నము, గోధుమజావ, యివి సేవించుట, విష్ణు, శివసహస్రనామ పఠనము, వేదమునువినుట దేవతలను బ్రాహ్మణులను గురువులను బూజించుట, దానములు జేయుట, తపస్సు జేయుట, మతానుసారములగు ఆచారములను నొందియుండుట, సత్పురుషుల దర్శనము జేయుట, శుభమునుకలిగించు సమస్తకర్మలు చేయుటయు, హితకరంబులుగా యుండును.

## అపథ్యములు

స్నానము జేయుట సంభోగము జేయుట జ్వరారంభదినమందే విరేచనము జేయించుట వగరువస్తువులనుదినుట దేహపరిశ్రమ అభ్యంగనము పగలు నిద్రించుట పాలు నెయ్యి మజ్జిగ కల్లు తీపిపదార్థములు గురుకర పదార్థములు విస్తారమగు గాలిలోపరుండుట విశేషముగనడచుట కోపబడుట కొంగ నెమలి కోడి యీపక్షులమాంసములు సువాసనద్రవ్యములనురాచుకొనుట యెరుపువస్త్రములు ధరించుట వాంతినిబైటకు వెడలనీయక అడ్డగించుట దంతధావనము అభ్యాసములేని పదార్థములుదినుట పరస్పరవిరుద్ధములగు క్షీరమాత్స్యాదులొక్కమారుదినుట పుచ్చకాయ తెలకపిండి తాంబూలము పిండివంటలు యివి అన్నియు జర్వములనందు అపథ్యములుగాన విడువవలెను.



# అజీర్ణములకు ఔషధములు

విస్తారము భ్రాంతిచేతను మనుజుడు జ్ఞానశూన్యుండై మిగుల భుజించుటచేతను సమస్తరోగములకు మూలమగు అజీర్ణరోగము జనించును యీఘోరవ్యాధిని నుపేక్షించిన తుదకు ప్రాణహానిని సహాకలుగుజేయును.

## 23 మధుసుధా సీ 1 కి రు 2

ప్రాతస్సాయంకాలములయందు అరతులమెత్తు లగాయతు తులమువరకు సేవింపుచుండిన అగ్నిమాంద్యము అహితవు మలబద్ధము సర్వపైత్యములు శూలలు శిరోరోగములు వమనము వికారము ఆమశూల మొదలగునవి నివర్తించును.

## 24 సకలరోగవిదారహరీతకి డ 1 కి రు 2

పూటకు పావుతులము లేక నాల్గుఅణాలు యెత్తు చొ॥ ప్రొద్దుట సాయంకాలము ఆవునేతితోగాని పటికబెల్లము చూర్ణముతోగాని సేవించిన సకలాజీర్ణములను తొలిగించి మిక్కిలి ఆకలినికలిగించి సర్వరోగములను హరింపజేయును.

## 25 అజీర్ణామృతము డ 1 కి రు 1

పూటకు అరతులమెత్తు చొ॥ ప్రాతస్సాయంకాలములయందు నోటియందు వేసుకుని చప్పరించిమ్రింగవలెను సకలాజీర్ణములు కడుపుబ్బరము పులితేన్పులు వాంతి అరుచి హృద్రోగము కాస శ్వాస పాండువ గ్రహణి ప్లీహము జ్వరము వాపు అతిశస్సులు అతిసారము శూలమూఢవాతము నశించి అమితమగు ఆకలిని కలుగజేయును.

## 26 జీర్ణామృతము డ 1 కి రు 1

ప్రాతస్సాయంకాలములయందు నాల్గుఅణాలు యెత్తు చొ॥ ఉష్ణోదకమునందుగాని పెరుగుమీద తేరిననీళ్లయందుగాని బ్రాందిలోగాని వా

ముకషాయముతోగాని శొంఠి రసముతోగాని కలిపి సేవించవలెను. సకలాజీర్ణములు ప్లీహము అవయవములు శుష్కించుటవిషభక్షణమువల్లకలిగిన దోషము మూలవ్యాధి శూలరోగములు గుల్మరోగములు దగ్గు వగర్పు క్షయ మొదలగు రోగములను బోగొట్టి అగ్నిదీప్తినిచ్చును.

## 7 అజీర్ణరసాయనము మా 25 కి రు 2

ప్రాతస్సాయంకాలములయం దొక్కొక్క మాత్ర చొ॥ శొంఠి వాముకషాయముతో నిచ్చిన సకలాజీర్ణములు బిల్వశొంఠి అతివస వీటికషాయముతో నిచ్చిన కష్టసాధ్యములగు గ్రహణ్యాతిసారరోగములు అరటిసారగు కాల్చినమసి కషాయముతో నిచ్చిన జలోదరములు త్రిఫల కషాయముతో నిచ్చిన పాండువులు వుబ్బురోగములు నేలవేము పిరంగిచక్క సుగంధి వీనికషాయములతో నిచ్చిన విద్రధి సవాయిరోగములు భగంరము శొంఠిరసముతో నిచ్చిన మలదోషములు మిరియపు రసముతో నిచ్చిన వాత శ్లేష్మరోగములు వేపజిగురు ఉసిరికవర్గుకషాయముతో నిచ్చిన శుక్లనష్టములు ఉసిరికవర్గు వేపచక్క కషాయమునందు పసపు పావుతులమున్ను అరతులమెత్తు తేనె కలిపి నిచ్చిన శిగవ్యాధులు జీలకర్ర పిప్పలీరసములతో నిచ్చిన విషమజ్వరములు పిప్పలమోడిరసముతో నిచ్చిన సన్నిపాతరోగములు నీలివేళ్లకషాయమునందు పాలు వకవున్సు చేర్చియిచ్చిన ఏకాదశక్షయరోగములు అనుపానవిశేషములతో నిచ్చిన సకలరోగములను బరిమార్చును.

## 28 అజీర్ణహరిమాత్రలు 30 గల డ 1 కి రు 1

ప్రాతస్సాయంకాలములయం దొక్కొక్క మాత్ర చొ॥ ఉష్ణోదకముతో సేవించినయడల సకలాజీర్ణములు అజీర్ణవాతములు అపత్య దోషములు అన్నము వెళ్లిపోయే రోగము కడుపుబ్బుట తొలగును. ఆకలిపుట్టించును.



## 29 భాస్కరలవణము

తు 20 గల సీ 1 కి 2-0-0 తు 40 గల సీ 1 కి 3-8-0

ప్రాతస్సాయంకాలములయందు పెరుగుమీద తేరినసీళ్ళు వక అవున్సులో వక అణాయెత్తు చొ॥ భాస్కరలవణమును కలిపి సేవించిన సకలాజీర్ణములు బియ్యము కడిగినసీళ్లతో నిచ్చిన శర్కరామేహము అశ్మరీరోగమున్ను పెరుగుపై మీగడతో గలిపి సేవించిన గ్రహణి హృద్రోగమును యీతకల్లుతోనైనా కొబ్బరికల్లుతోనైనా కలిపి సేవించిన వాతగుల్మము శూలలు అరిశస్సులు మలదోషములున్ను మేకకాళ్లచేరువాతో నిచ్చిన వాతరోగములు ఆమదోషములు ఉదరరోగములు ప్లీహమున్ను వాయువిళంగాలరసముతో సేవించిన క్రిమిరోగములున్ను మిరియాలరసముతో సేవించిన శ్లేష్మరోగములు త్రిఫలకషాయముతో సేవించిన పంచపాండువులు భగంధరములు మూలశంకవ్యాధులున్ను శొంఠి రసముతో సేవించిన సర్వవిధములగు శూలరోగములు బోకార్చును.

## 30 భావనశొంఠి తు 1 కి రు 0_2_0

ప్రాతస్సాయంకాలములయందు పావుతులము చొ॥ బాగుగనమలి వేడిసీళ్లు గుక్కెడు త్రాగిన అజీర్ణము మలబద్ధము కడుపుబ్బరము కడుపునొప్పి ఉదరరోగములు శ్లేష్మపైత్యజ్వరములు ఆమవాతరోగము హరించును.

## పత్యములు

శ్లేష్మమువలనబుట్టిన అజీర్ణమునకుతొలుత వమనమునకు నీయవలెను. పిత్తాధిక్యముచే జనించిన అజీర్ణరోగమునకు ముందు విరేచనము లంఘనంగవలయును వాతముచే కల్గిన అజీర్ణమునకు ఆవిరిపట్టవలెను. ప్రాతవియగు పెసలు మెర్రిబాలు బియ్యము పల్చగా కాచబడిన గంజి గోధుమజావ పేలాలుగంజి పెసరకట్టు జింక నెమలి కుందేలు వీటిమాంసము చిన్నచేపలు లేతముల్లంగి ఉల్లిగడ్డలు ముదురుగుమ్మిడకాయ లేతల

రటికాయ మునగకాయలు పొట్లకాయలు వంకాయలు నక్కదోసకాయలు కాకరకాయలు అల్లము పులిచింతాకు షీకాయాకుఉశిరిక పచ్చడి, నారింజపండ్లు దానిమ్మపండ్లు బార్లీజావ నిమ్మకాయలరసము మాదీఫలము తేనె నెయ్యి వెన్న మజ్జిగ కడుగునీళ్లు తరవాణి ఆవనూని ఇంగువఉప్పు వాము శొంఠి ఓమముమిరియాలు మెంతులు ధనియాలు జీలకర్ర తాంబూలము వేడినీళ్లు కారము చేదుగలవస్తువులు యివిఅన్నియు హితకరంబులుగా యుండును వ్యాయామము జేయుటయు చాలామంచిది.

## అపత్యములు

విరేచనములకు దీసుకొనుట మలమూత్ర వేగమునాపుట అధికముగా భుజించుట తిన్నది జీర్ణముకాకుండ మరలదినుట రాత్రులయందు జాగరణము రక్తమోక్షణము జేయుట కందులు బఠానీలు మొదలగు శింబీధాన్యములు చేపలు బత్సలికూర విస్తారముగ జలపానము జేయుట దుంపకూరలు పిండివంటలు పెరుగు మాంసము జున్ను నూతనముగాయీనినగేదె ఆవు వీట్లయొక్క పాలు మజ్జిగ తాటిబుర్రగుంజు బెల్లము పానకము చెడిననీళ్లు పరస్పరవిరుద్ధములగు నివియు శరీర తత్వమున కిమడకుండు పదార్థములు మలమును బంధించు పదార్థములు నేరేడుపండ్లు వీటిని అగ్నిమాంద్య అజీర్ణరోగులు విడువవలెను.

## శ్లేష్మరోగ ఔషధములు

### 31 శ్వాసకాసాంతకము సీ 1 కి రు 1_0_0

సీసాలో మందంతయు సమముగ 25 పొట్లములుగట్టి ప్రాతస్సాయంకాలములయందు ఒక్కొక్కపొట్లము చొ॥ ద్రాక్షపండ్లు తులము శొంఠితులము తిప్పతీగి తులమున్ను నలియగొట్టి కషాయము బెట్టి సదరు కషాయము రెండుభాగములుగ జేసి ఒకపొట్లము ప్రొద్దుటయు సాయంకాలము వకపొట్లము. సేవించవలెను (మరిన్ని) శొంఠి గంటుభారంగి



అరతులము చొ॥ రసముదీసి దానితోనైనను యిప్పిమథుకం అరతులం వస అరతులం రెండు కలియనూరి పొంగించివడబోసిన రసముతోనైనను అల్లపు నిజరసము అరతులమెత్తు తేనె అరతులమెత్తు కలిపి అందులోనైనను కలిపి సేవించిన దగ్గు వగరపు పొడిదగ్గు గొంతుకులో గురగుర ఉబ్బసదగ్గులు అస్థిగతజ్వరములు శోఫలు పాండువులు క్షయరోగములు విష్ణుచక్రము పాపులను బరిమార్చు పగిది బరిహరించును.

### 32 కఫహారి ద్రావకము సీ 1 కి 1_0_0

ప్రాతస్సాయంకాలములయందు జీలకర్ర రెండరతులములు కషాయంబెట్టి ఆకషాయమున నీద్రావకం 30 చుక్కలు లగాయితు అరువది చుక్కలవరకు వేసి సేవించిన దగ్గులు కురందగ్గులు కఫంకుళ్లిపడేదగ్గులు నజ్జువుబ్బసదగ్గులు రూఢి యివిమానును.

### 33 దగ్గుమాత్రలు 100 గల సీ 1 కి రు 2-0-0

ప్రాతస్సాయంకాలములయందు రాత్రి పండ్రెండుగంటలకు ఒక్కొక్క మాత్రచొ॥ సేవించేది నాలుగురోజులు సేవించినంతలో దగ్గుతగ్గనియడల అల్లపునిజరసం నీరుల్లిపాయలరసం నిమ్మకాయలరసం మూడుసమం మూడుతులములు కలిపి మాత్రవేసుకొని మూడుకలిసిన రసముపుచ్చుకొనిన వెంటనే దగ్గుతగ్గుటయేగాక ఎగశ్వాసపిల్లికూత వూపిరితిత్తులయందలి నొప్పి మొదలగునవి నివృత్తిలమగును.

### 34 శ్లేష్మభంజనీమాత్రలు 25 గల పే 1 కి అ 4

ప్రాతస్సాయంకాలములయం దొక్కొక్క మాత్ర చొ॥ లవంగాల రసముతోగాని మిరియాల రసముతోగాని సేవించిన పడిశభారము గొంతురొంప కుర్మదగ్గులు కఫముకుళ్లి దుర్వాసనగాపడుటలోనగుసామాన్య కఫవ్యాధులు యావత్తు నివృత్తిలమగును.

## 35 కఫకులాంతకము సీ 1 కి అ 4

ప్రాతస్సాయంకాలములయందు చిన్న మెత్తు చొ॥ తేనె తమలపాకులరసము అకుజెముడు రసముతోను సేవించవలెను తేనెముఖ్యము.

## 36 గోరోచనమాత్రలు 25 గల సీ 1 కి రు 1

ప్రాతస్సాయంకాలములయందును రోగము విస్తారముగనున్నట యినులలో 3 గంటలకొక తూరిన్ని యివ్వవచ్చును చంటిబిడ్డలు పెద్ద వారలు వృద్ధులు గర్భిణీస్త్రీలులోనగు సర్వజనులు సేవింపవచ్చును సామాన్యవ్యాధులకు వకటి రెండు మాత్రలతోను ఘోరమగు సన్నిపాత సూతికావాతాదిరోగములయందు మూడు నాల్గు మోతాదులతోను గుణముతప్పకజెప్పును శ్లేష్మమెదుర్కొని జీవితాశలేదని నిస్పృహజేసుకొన్న వారలనేకులకు యీ మాత్రలనిచ్చి పేరందితిని. శ్లేష్మజాతులయందు ప్రాణాపాయకరమగు యగశ్వాస సమయమందును, ఝామునకు వకమాత్ర చొ॥ చనుబాలలో అరగదీశి అందు తులమెత్తువర్కు చనుబాలువేసి కలపి యిస్తూవచ్చిన వకటి రెండు మోతాదులు సేవించుటతోడనే శ్లేష్మమును దించివైచి రోగికి ప్రాణదానము గావించును అసాధ్య సన్నిపాత రోగములందు చనుబాలతోనే యివ్వవలెను. చనుబాలతో మాత్రను సేవించుటయేగాక, రోగికి కావలసినన్ని చనుబాలు యిచ్చుచుండవలెను, అసాధ్య సూతికావాతాదులయందు అక్కలకర్రరసముతో యివ్వవలెను, చనుబాలతో సేవించుటకును, చనుబాలు పుచ్చుకొనుటకును యిష్టపడనివారలు లవంగాలు రసముతో సేవించవలెను. చంటిబిడ్డలు పురిటిలో బిడ్డలు అయ్యేయడల్ల చనుబాలతో మాత్ర అరగదీసి వుగ్గుపెట్టు ఆముదమునుకలపి యివ్వవలెను. వేయేల కపాలమందు అడచుకునియుండు కఫ, శూలలు, సమస్తశ్లేష్మవ్యాధులు, పదమూడు సన్నిపాతరోగములు, జలుబుదోషములు, మేహా, శ్లేష్మవాతజనితములగుఒడల బరువు నొప్పులు కీళ్ళునొప్పులు, జ్వరమునల్ల కలిగే వడలునొప్పి కాళ్ళుచేతులు నడుములాగుట, మొదలగు సమస్తవ్యాధులు ఆశ్చర్యముగనివారణమయిపోవును, వైద్యులకు పెన్నిధి సామాన్య వైద్యజ్ఞానము కలవారలయినను యీమందును దగ్గరనుంచుకొనిన, కీర్తినిగాంచుటయేగాక, అనేక బహుమానములు సన్మానములు పొందగలరు.



## 37 కఫహారి చూర్ణము డ 1 కి రు 0-6-0.

యీచూర్ణము చిటికెడు వక చిన్న పళ్ళెమందుగాని పెంమీదయందుగాని యురిచి అగ్గిపుల్లగీచి అంటించిన పొగ బయలువెడలును ఆ పొగను బట్టముసుగువేసి ఆఘ్రాణించినను లోపలికి పీల్చినను, (లేక) బొప్పాయికాడ గొట్టముతోగాని, కర్రగొట్టముతోగాని, చీరాకు గొట్టముతోగాని నిప్పు పైకి యెగరకుండా నెమ్మదిగా పొగ లోనికి పీల్చిన వక్కక్షణములో ఎగరొప్పు, ఆయాసము, పిల్లికూత బలిష్టమగు దగ్గు, వూపిరితిత్తులయందలిపట్టు, తత్కాలీతమందే తగ్గును.

## 38 భావనమిరియము తు 1 కి రు 0-2-0.

ప్రాతస్సాయంకాలములయందు 15 మిరియాలు చొ॥ బాగుగానూరుకుని, తేనితో కలపి సేవించవలెను, సమస్తవిధములగు దగ్గువ్యాధులు కుదుర్చును.

## 39 ఆస్తమాక్యూర్ ద్రావకము సీ 1 కి రు 5-0-0.

సీసాయందు నిర్ణయింపబడియున్న మోతాదుప్రకారం ప్రాతస్సాయంకాలములయందు, గిద్దెడు ఆవుపెర్గునందు కలపి సేవించవలెను, యిందునుగురించి విశేషాంశములు, పథ్యాదులు తెలుపు నోటీసు మందుతోను చేరియుండును, అటులాచరించిన, సకలవిధ వుబ్బసరోగములు బలిష్టములగు దగ్గు దగద్పువ్యాధులు సమస్త క్షయరోగములు మొదలంటా రూపుమాపును, మరల నెన్నటికి జనించదు.

## 41 క్షయరోగకుఠారము బుడ్డి 1 కి రు 4-0-0.

ప్రాతస్సాయంకాలములయందు చిన్నమెత్తు చొ॥ నీలిమందు చెట్లయొక్క వేళ్ళరసము, నిజరసము రానియెడల కొద్దిగా నీళ్ళుచేర్చి నూరితీసిన రసము తులమెత్తు రెండవున్నులు ఆవుపెర్గుకలపి అందు నౌషధమును చిన్నమెత్తు గలపి సేవించ్ని సమస్త వుబ్బసవ్యాధులను, బలిష్టములగు దగ్గు వగరపువ్యాధులను బోకార్చును, ఆవుయొక్క గుమ్మపాలనందు కలపి సేవించిన, సమస్తక్షయవ్యాధులున్ను, శొంఠిరసమునందు కలపి సేవిచ్ని ఆమవ్యాధులున్ను, పిప్పలమోడి రసముతో సేవించిన మెదడును జనించు రోగములు కొండపిండివేళ్ళ కషాయమందు అరతుల మెత్తు పంచదారకలపి సేవించిన, మూత్రరోగములు తెలకపిండి, వెల్లుల్లిపాయలు, పూటకు నాలుగుతులములు చొ॥ శేరునీళ్ళుపోసి అష్టావశేషముగ కషాయముగాచి వడకట్టినదానితో సేవించిన వుబ్బురోగములు నిస్సందేహముగ మానును. పథ్యాదులు మందుతో చేరియుండును.

## శ్లేష్మరోగాదులయందు పథ్యములు.

శరీరమున చమటబుట్టించుట, విరేచనములకు మందుపుచ్చుకొనుచుండుట వమనముజేయించుట, చుట్టవగైరా పొగద్రాగుట, ప్రాతవియగు ధాన్యాదులుయొక్క బియ్యముచే దయారగు అన్నము, గోధుమలు, సామలు, యవలు, బార్లీబియ్యము జావ, ఆరికెలు, మినుములు, పెసలు, ఉలవలు, వీట్లయొక్క కట్టులు, చేపలు, మేకమాంసము, కల్లు, పాతదియగు నెయ్యి, మేకపాలు, మేకనేయి, చక్రవర్తికూర, లేతనంకాయ, లేతముల్లంగి, ములకకాయలు, చెంచలికూర, ద్రాక్షపండు, దొండకాయలు, ఉల్లిపాయ, వేడినీళ్ళు, తేనె, పేలాపుగంజి, పగలునిద్ర, శీఘ్రముగ జీర్ణమగు పదార్థములు, వుచ్చింత, వాకుడుకాయలు, పొట్లకాయ, బీరకాయ, నిమ్మకాయ, ఎండలోను మంచిగాలియందు వుండుట; వుప్పువిస్తారముభుజించుట, పొన్నగంటికూర, ఆవుమజ్జిగ, నారింజమొదలగు



ఫలములు, యివి శ్లేష్మము వగర్పుగల రోగులకు పథ్యములుగా యుండును.

### అ ప థ్య ము లు.

నస్యము; రక్తమోక్షణము, దేహపరిశ్రమజేయుట, పుల్లలతో దంతములు దోముట, దుర్గంధయుతవాయువును బీల్చుట, ముక్కురంధ్రములయందు దుమ్ముచేరుట, మార్గమునడచుట, మలబద్ధకరములగు, గురుత్వపదార్థములు బక్షించుట, మలమూత్రములు వాంతి త్రేనుపులు, వీట్లను అడ్డగించుట, దుంపకూరలు సొరకాయ, బత్తలికూర, చెడిననీళ్ళు ద్రావుట, పరస్పరవిరుద్ధములగు క్షీరమత్స్యాదులను భుజించుట, తినినది జీర్ణముకాకమునుపే తినుట, చల్లారిపోయినవియు పాసిపోయినవియునగు నన్నపానాదులు సేవించుట, భారము మోయుట, అధికముగ స్త్రీసంభోగమొనర్చుట, తాపకర పదార్థములను దినుట, నూనిలో పక్వమగు పిండివంటలు అనుములు, తూర్పుగాలి, జలపానము అధికముగాజేయుట, గొర్రెపాలు గొర్రెమాంసము, ఆవ, అజీర్ణకర పదార్థములు మానవలెను.

## బా ల రో గౌ ష ధ ము లు.

## 41 బాలరోగ సుధార్ణవము డ 1 కి రు 0-8-0

నీమూలికాసంబంధమగు పరమౌషధమును పెద్దవారలు బాలురు పసిపిల్లలు గర్భిణీస్త్రీలు, ప్రసవించిన సూతికాస్త్రీలుకూడా సేవింపవచ్చును.

పసిపిల్లలలకు, పూటకు గురిగింజెత్తు చొ॥ ప్రాతస్సాయంకాలములయందు వుగ్గులో కలపిగాని చనుబాలులో గలపిగాని సేవించవలెను. సంవత్సరముదాటిన పిల్లలకు రెండు గురుగింజలెత్తు చొ॥ పై అనుపానముతో యివ్వవలెను, రోగము హెచ్చుగా నున్నయెడల నాల్గు గురిగింజలమెత్తు వరకు నీయవచ్చును. చనుబాలు, ఆముదము సందర్భము కాని సమయములయందు వేడినీటిలో గలపి యివ్వవలెను. యీతీరున 5 సంవత్సరముల వయసు నిండేవరకు యిచ్చిన బాలురకుగల్గు జ్వరములు

శ్లేష్మము వాతములు తగ్గును. పెద్దవారలకు గర్భిణీస్త్రీలు సూతికారోగలు రెండణాలు యెత్తు మోతాదు చొ॥ ప్రాతస్సాయంకాలములయందు వేడినీటియందుగాని, చన్నీటియందుగాని కలపి సేవించవలెను. యీచూర్ణమునకు సమముగా పెన్నేరుచూర్ణమును జేర్చి పంచదారలో సేవించిన మిక్కిలి వీర్యవృద్ధి గలుగును, యీచూర్ణమునకు సమము సుగంధిపాలచూర్ణము కలపి, తేనెతోగాని, పటికబెల్లము చూర్ణముతోగాని సేవించిన మంచిరక్తమును బట్టును.

## 42 సంజీవగుళికలు 25 గల వే 1 కి రు 0-6-0

బిడ్డలకు పెద్దవారలకు గలుగురోగములయందు బాగుగా పనిజేయును పేరుకొనిన ఆవునేయి అరతులమెత్తులో మాత్రవకటివుంచి వుదయసాయంకాలములయందు సేవించిన బంకవిరేచనములు కడుపునొప్పితోనగు విరేచనములు రక్తవిరేచనములు మొదలగు సకలవిధగ్రహణ్యాతిసారములను బోకార్చుటయేగాక విడవక వకమాసము రోజులుపై అనుపానముతోనే స్త్రీలు సేవించిన సకలవిధకుసుమరోగములను దెగటార్చును సమస్తమేహములను నీరసము కాళ్ళులాగుట ఎండిపోవుటలోనగు వ్యాధులను బారదోలును గర్భిణీలకు గల్గు వమనములు ఎక్కిళ్ళు అహితవు జ్వరములోనగు సమస్తవ్యాధులకు నిమ్మకాయరసములో గలపి సేవించిన తక్షణమే తగ్గును అల్లపురసముతో సేవించిన గుండెలయందలి వికారము పసరువెళ్లుట మేహపుడుకు శీతపైత్యము అజీర్ణము మొదలగు రోగములు గుదురును. జీలకర్రరసముతో నిచ్చిన పైత్యమేహజనితజ్వరములు గుండెలయందు మంట తలతిర్పుట మొదలగు సమస్తపైత్యరోగములను బారదోలును విడువక వకపక్షము రోజులు అల్లపునిజరసముతోనైనా తమలపాకుల రసముతోనైనా సేవించిన నరుతుశూలలు తగ్గును, యీ మందు సేవించు కాలములో అదివరకు తనకు సరిపడని పదార్థములను వదలి వేయవలెను పత్యమవసరమే లేదు వేనవేలు విక్రియమగుచున్న ప్రతిగ్రహస్థు దగ్గరనునుచుకొని వట్టిదే వకటిరెండు మాత్రలు సేవింపుచుండిన ఏ రోగమును రానివ్వక మంచిరక్తపుష్టిని యింద్రియపుష్టిని కలుగజేసి ఆరోగ్యవంతులుగ జేయుచుండును.



## 43 బాలామృతము సీసా 1 కి రు 0-8-0

బాలరోగములను గుదుర్చు సారవంతములగు మూలికలు వేసికాచబడిన ఆముదము యిది బిడ్డలకు భారముగానున్న దినములలో రోగము తగ్గేవరకు ప్రొద్దుట సాయంకాలము తులము చొ॥ గాని అరతులము చొ॥ గాని వుగ్గుగపెట్టిన మందము కడుపున జిరుగువెళ్లుట శ్లేష్మము జ్వరము పాలుమాలి క్రిమి ఆయాసము ఆకలి లేక పాలుపుచ్చుకొనక పోవడములోనగు సర్వదుర్గుణములను ఖండించును.

## 44 అమృతార్ణవము డ 1 కి రు 1

యిది వకవిధమయిన లేహ్యపాకము యిది చంటిబిడ్డలు (అనగ) ఆరుమాసములు లగాయతు పదిసంవత్సరములు వయస్సుగలవారు, ప్రాతస్సాయంకాలములయందు 6 మాసములు లగాయతు 4 సం॥ వయస్సునుండు వారలు ఇండుపుకాయంత(లేక)పూటకుపావుతులము చొ॥ అంతకు పైబడిన వయస్సుగలవారలకు ఆరుఅణాలు యెత్తులగాయతు అరతులమెత్తువరకు తూచి భుజించిన పొట్ట పెరిగి అస్తమానూ విరేచనలగుచు మిక్కిలి నీర్సించిన బిడ్డలు రెండుమూడు డబ్బాలమందు సేవించిన సమస్తవ్యాధులు తొలగి చూచుటకు ఆనందమగు రూపుగలిగి విరాజిల్లెదరు సదరు బలమెన్నటికి చెడకుండా యుండుటయేగాక కాలప్రవృత్తిసరిగాఅగుచు మంచి ఆకలిని బుట్టించును యీమందును లంఖణములుచేసినవారలు నీరసమును పొందిన గర్భిణీస్త్రీలు సేవించిన ఆజీర్ణము పాలుమాలిక మందమును తగ్గించి మంచి రక్తమును బలమును గలుగజేయును బాలురకు వరప్రసాదమువంటిది.

## 45 బాలామృతసంజీవి సీసా 1 కి రు 1

ప్రాతస్సాయంకాలములయందు రెండు గురిగింజలెత్తు చొ॥ ఆముదము తులమెత్తులో గలపి ఉగ్గు బెట్టిన బాలురకు గల్గు శ్వాసకాసజ్వరము జ్వరబిళ్లలు మందము తగ్గును ఆముదము ఏకారణముచేతనైనా

వాడుకచేయని పిల్లలకు చనుబాలతో యివ్వవచ్చును రోగబలమును బట్టి చిన్నమెత్తు మోతాదువరకు యివ్వవచ్చును.

## 46 బాలరోగరాజేశ్వరం తు 1 కి రు 1

బాలురకు ప్రాతస్సాయంకాలములయందు రెండు గురిగింజలెత్తు చొ॥ ఆముదము నిచ్చిన వెంటనే వకటి రెండు విరేచనములు అయిశ్వాసకాస వాతభారము తగ్గిపోవును దాచినచెక్కరసముతోగాని చనుబాలతోగాని యిచ్చిన వుడుకు జ్వరములు వికారము వాంతి కట్టును తమలపాకులరసములో నరగదీసి ఆముదములో కలపిపోసిన ఎగరొప్పు ఆయాసము శ్లేష్మోద్రేకము తగ్గించి సుఖవంతులుగ జేయును.

## 47 స్వచ్ఛమగురసభస్మము తు 1కి రు 0-8-0

చంటిబిడ్డల నిమిత్తము సరియగు శుద్ధులొనరించి శాస్త్రానుసారముగ లవణయంత్రమున తయారగు నీభస్మమును కొన్ని దేశములయందు బాండవయనికూడా అందురు చిన్నమెత్తు లగాయతు రెండణాల మెత్తువరకు రోగబలమును గుర్తెరిగి మోతాదు నిర్ణయించి ఆముదముతో గలపి పాలుత్రాగు బిడ్డలకు వారమునకొకసారి పోయుచుండిన శ్లేష్మము కుట్రవగైరామాంద్యములను విరేచనమార్గముగా దీసివేయుటయేగాక జ్వరము వాతము నరములు రోగములు బాలబాపచిన్నియను రోగము మొదలగు దారుణమగు బాలకుల రోగములను బారదోలును.

## 48 బాలరక్షాతిలుకము రు 1

సాధారణముగా చంటిబిడ్డలకు దృష్టి దోషము బహిష్టు స్త్రీలు అంచుచిగలవారలు తాకుటచేతను పాదదూళిచే గల్గు దోషములు విస్తారము తగులచుండును యీ స్వల్ప దోషమువారికి ఎందుకు చేరును అని సందేహము కొందరికి కలుగవచ్చును ప్రతిమనుజునియందు వకవిధమయిన శక్తివుండును (అదిమెస్మరిజము) అట్టి శక్తి పసివారు దృఢకాయులుగా



కపోవుటచే విస్తారముగా నుండకపోవుటచేతను స్వల్పదోషములకు బద్ధులైయుండుట తటస్థించుచుండును గనుక ఔషధులయందు కూడా అట్టిదోషములను బోకడచు గుణములుకలవిఅనేకములున్నవి మాఅనుభవమునుబట్టి నీకాటుకను తయారుచేయగలిగితిమి దీనిని చనుబాలతో నూరి శిశువులయొక్క కనుబొమల నడుమ తిలుకముంచిన పైదోషములు వారినంటజాలవు.

## 49 శిశుసంరక్షక ధూపము డ 1 కి రు 1-0-0

యిది పులిగోళ్ళు వగైరాతో చేయబడు ధూపద్రవ్యము యిది పురుటియిండ్లలోను బిడ్డలు నిదురించు యిండ్లలోను నిప్పులుపైని వక అణామెత్తు వేసిన, యీవాసన బయలుగ్రమ్మినంతవరకు ఏగ్రహములు నిలువజాలక పారిపోవును.

## 50 బాలగ్రహారక్ష 1 కి రు 1-0-0

యిది గ్రహాణసమయములో తీయబడిన మూలికలు మిగుల వీర్యముగలవి, చేదరించుట ఇది బాలురకుగల్గుసమస్తగ్రహబాధలు పలాయనమగుచుండును. యీరక్ష గ్రహాణములయందు పర్వములయందు ఆవుపాలను తడిపి ధూపదీపనైవేద్యములొసగి, తిర్గికట్టుచున్న ఎన్నటికిపటిము చెడకుండును.

## 51 పిట్టరూపుకు, రక్తోత్పలాది చూర్ణము.

డ 1 కి రు 1—0—0.

నీచూర్ణమును వెన్నలో గలపి 3 రోజులుగాని 5 రోజులుగాని బూసిన, పిట్టరూపు దానివలన కలిగే కండ్లు గుంటలుపడుట తల సొట్టలుపడుట, యెండిపోవుట లోనగు సకలదుర్గుణములు పోయి దృఢకాయులగుదురు.

## 52 బాలబాపచిన్ని బుడ్డి 1 కి రు 2—0—0

ప్రాతస్సాయంకాలములయందు, నిర్ణయించి పంపబడు మోతాదును, అరతులమెత్తు ఆవునేతిలో కలపి సేవింపజేయవలెను. గుణము

వచ్చిన రోజులగాయతు ౩ రోజులు మాత్రమే, వకదఫాతోనే పూర్తిగా తగ్గిపోవును, మళ్లికనుపించిన ఆరోజు లగాయతు మూడురోజు లిచ్చిన బాల బాపచిన్ని యను బాలురకు స్ఫుహను తెలియకుండా వచ్చే వ్యాధి, మరల నెన్నటికి రాదు.

## బాలరోగ మందులకు పథ్యములు.

తల్లిపాలువల్లజీవనము జేయుపిల్లలు విషయములో, తల్లులుతినిన ఆహారమునం దేగుణముండునో ఆగుణమే పాలయందు ఏర్పడునుగాన, తల్లులే పత్యములాచరించవలెను. ఆవుపాలు, డబ్బాపాలు, ఆర్లికప్సు లోనగు వాట్లనల్ల జీవించువారలకు పత్యము ఎవరు చేయనక్కరలేదు. ఆహారము నేతి పిల్లలయినయెడ క్రిమమయిన పత్యమునే విడుచుచుండవలెను, బాలురకు జ్వరరోగము కలిగినప్పుడు, జ్వరరోగములయందు చెప్పినపథ్యమునే ఆచరించవలెను. ఇటులనే ఆయారోగాదులయందు ఆయాచెప్పబడిన పత్యములనే ఆచరించునది బుద్ధిమంతులగు వైద్యులు బాలరోగములయందు బహు తేలికగ జీర్ణమగులాగున పదార్థములను జేయించి పత్య మిడుచుండవలెను.

## 53 నెం 1 కలరా మాత్రలు సీ 1 కి రు 2—0—0

విషూచికారోగమందు దీనిని, తేలికయగు నేదైనా ఆహారము నిచ్చి, ఆహారముతీసుకున్న అయిదునిమిషములు అయిన తరువాతను, వకమాత్ర అనుపానమేమియు నక్కరలేకయే, వేడినీళ్లతో వకమాత్ర వేసిన, తత్క్షణం, విషూచినివర్తించుటయే గాక అగ్నిదీపనము, పాచనము మనోల్లాసము జేయును. అసాధ్యవిషూచిరోగములయందు, నాలుగైదు, మోతాదు లీయవలసివచ్చినప్పుడు మాత్రకుముందు, పేలాపుగంజిగాని, చోళ్లుజావగాని శుద్ధమయ్ను పాలుగాని కొంచముగాయిచ్చి, మాత్ర వేయుచుండవలెను.



## 54 నెం 2 రు కలరామాత్రలు సీ 1కి రు 0—8—0

కలరావ్యాధియందీ మాత్రలు వ్యాధికట్టే పర్యంతము, ఝాముకొకమాత్ర చొ॥ సేవించవలెను. వాము 4 తులములు తోకమిరియాలు రెండుతులములు, కొద్దిగా మాడులాగ్ను మంగళమున వేయించి, అవితీసి మరివక క్రొత్తకుండయందు శేరునీళ్లుపోసి పావుశేరు వర్కు మరుగనిచ్చి దించి వడపోసి పింగాణిలోగాని గాజుపాత్రయందుగాని వేసి వుంచుకొనవలెను. కలరావ్యాధియందు మాత్రవేశినపుడు వక అవున్సుగాని అర అవున్సుగాని ఇచ్చుచుండవలెను కషాయము సందర్భముకానిటయిములలో మాత్రవేసి బ్రాంది అరవున్సుచొ॥ ఇచ్చుచుండవలెను. వ్యాధిసామాన్యముగా యున్నప్పుడు రెండు ఝాములకొక తూరిన్ని కఠినముగా యున్నయెడల ఝామునకొకపరియాయము మోతాదు నిచ్చుచుండవలెను. దాహము జనించినయెడల యెండుమిరప గింజలు అయిదు తులములు కొట్టుపసపు తులము క్రొత్తకుండలోవేసి శేరునీళ్ళుపోసి రెండు పొంగులు వచ్చువర్కు కాచి దించి వడపోసి దాహమిచ్చుచుండవలెను. మూత్రము వెళ్లక కడుపుబిగబట్టిన యెడల సీమఆవపిండిగాని దేశవాళీ ఆవపిండిగాని గుడ్డను నీళ్లతో పట్టించి పొత్తికడుపుమీద వేసి మూత్రము వెంటనే తీసివేయుచుండవలెను (లేక) కర్పూరతైలమును కంబళీగుడ్డను తడపి నాభిని వేసి కట్టినను మూత్రము ఝారియగును కాళ్లుచేతులు లాగుట ప్రారంభమయిన యెడల వెల్లుల్లిపాయలు చితగగొట్టి రాయవలెను. (లేక) కర్పూరతైలమును మర్దనాచేయవలెను. బ్రాంది కషాయము తటస్థించనిటయిములలో మాత్రను వేడినీటితో వేయవచ్చును.

55 గ్రహణి కవాటము మా 30 గల పే 1కి రు 0-4-0.

ఈమాత్రలను ప్రాతస్సాయం కాలములయందు సామాన్యవ్యాధులయందును రోగము కఠినముగానున్నప్పుడు పగలు మూడు మోతాదులు రాత్రులయందు మూడుమోతాదులు ఇచ్చుచుండిన వకటి రెండురోజులలో దుస్తరమగు గ్రహణ్యతి సారములు కట్టును దాడిమబెరడు

కొడిశపాలచెక్క వీనిని సమభాగములు కషాయముబెట్టి అందు అరతులము తేనె కలిపి మాత్రి వేసినపిమ్మట వీనిని అనుపానముగా పుచ్చుకొనిన రక్తాతిసారము రక్తగ్రిహణి కట్టును. శొంఠి తిప్పతీగె అతివస తుంగముస్తెలు యివి సమభాగములు కషాయముపెట్టి మాత్రివేసి నదరుకషాయము సేవించిన గ్రిహణి రక్తగ్రిహణి ఆమాతిసారము యివి హరించును. గ్రిహణిఅతిసారములకు నల్లమందు మాత్ర స్వరూపమువంటిది గాన ప్రతి మాత్రికు ఆవగింజంత నల్లమందును మాత్రికు నటించి సేవించుచుండవలెను నల్లమందు పడనితత్వముల గలవారు వట్టిమాత్రినే సేవించుచుండవలెను.

## 56 వాముమైనము బుడ్డి 1కి రు 0-12-0.

పూటకు శనగగింజంత మయినమును రోగబలమును బట్టి రోజుకు నాలుగు అయిదు మోతాదు లీయవచ్చును పాలుత్రాగు బిడ్డలకయినను కందిగింజంతచొ॥ రోజుకు మూడు పర్యాయములు ఇయ్యవలెను, ప్రొద్దుట సాయంకాలము సేవించు మోతాదులలో, నల్లమందు శరీరతత్వమున కనుకూలముగా యుండేవారలు పెసరగింజంతచొ॥ నల్లమందు చేర్చి సేవించవలెను. పాలుత్రాగు బిడ్డలకైనా దానిలోనగము మోతాదే నల్లమందు చేర్చుచుండవలెను. అనుపానములు అక్కరలేకయే వేడినీళ్ళతో సేవించవచ్చును అనుపానమవసరమనితో చేయుడల గ్రిహణికవాటమునకు చెప్పిన అనుపానములనే వాడుకచేయవలెను.

## గ్రిహణ్యతిసారరోగములయందు పథ్యములు

వమనము,లంఖణము నిదురించుట ప్రాతవియగుధాన్యాదుల బియ్యముయొక్క అన్నము, పేలాపుగంజి కందికట్టు, చిన్నచేపముల జేవలు, నూనె మేకలయొక్కయు ఆవులయొక్కయు నెయ్యి, పాలు, పెరుగు మజ్జిగ, ఆవువెన్న, అరటికాయలు లేతవి. అరటిపువ్వు, తేనె, నేరేడుపండు, అల్లము, శొంఠి, వెలగపండ్లు మారేడుపండ్లు, తియ్యదానిమ్మ



పండ్లు, పుల్లదానిమ్మపండ్లు, పులిచింతాకు, అగ్నిదీపనముజేయునవియు, శీఘ్రిముగా జీర్ణమగునవియు, యీరోగమునందు హితకరంబులుగ యుండును. దుర్ఘటమగు గ్రహ్యాతిసారములయందు నాభికికుదిగువరెండంగుళములుక్రింద రాగిశలాకచే రక్షవేయుట ఇదియె కొందరు బొడ్డునాభిఅని కొందరందురు. పెసరకట్టు, చిర్రికూర, పొట్లకాయ, బీరకాయ, యివి హితకరంబులయి యుండును.

## అపథ్యములు

రక్తమోక్షముచేయుట రాత్రులయందు జాగరముజేయుట అధికముగా నీరుద్రావుట, స్నానముజేయుట సంభోగముజేయుట మలమూత్రాది వేగములను అడ్డముజేయుట పొడుముపీల్చుట కలికములేయుట పొగపీల్చుట చమటబుట్టించుట ఆయాసముగలిగించుట పరస్పర విరుద్ధములను క్షీరమత్స్యములను భుజించుట కటువు తిక్తము చేదు కలపదార్ధములను కలిపి భుజించుట క్రొత్తబియ్యపు అన్నము దుంపకూరలు తాంబూలము యెండుచేపలు బెల్లము మునగకాయలు ఆకుకూరలు అజీర్ణముజేయు పదార్ధములను విడిచి, జఠరమును కలుగజేయుపదార్ధములనేభుజించవలయును

విరేచన అవుషధములు

## 57 భావనవాము తు 1 కి 0-2-0.

ఒకఅణాయెత్తు ఓమమును నీళ్ళతో నమలకుండా మిర్రింగిన ఒకగంటకాలములో నాలుగు అయిదు సుఖవిరేచనములు అవును. బిడ్డలకిచ్చు మోతాదు దీనిలో సగముగా యుండవలెను. వుదయమునకే కాలవిరేచనము సరిగా అవవలయును అని కోరువారు రాత్రి భోజనము చేసి పరుండబోవునపుడు గురిగింజంత ఓమమును నీళ్ళతో మిర్రింగి పరుండిన తెల్లవారు లేచుసరికి కాలప్రివృత్తి సరిగా అగును అదివరకు మలబద్ధము విస్తారముగా నుండి యెన్నిమందులు పుచ్చుకొనినను విరేచనము సరిగా

కానివారలకు రెండుఅణాలయెత్తు ఓమమును సేవింపవలయును. ఓమము పుచ్చుకొన్నపూట విరేచనము లయినపిమ్మట కారము కందిపప్పు పాలు పొట్లకాయ మేకమాంసము చేదుదబ్బకాయ పూరగాయ మిరియపు చారు వగయిరా వేడిని గలుగజేయు పదార్థములు భుజింపవలయును. ఉబ్బు,వుదరము, యీవ్యాధులుగలవారు,మోతాదుయెక్కువగాతీసికొన వలయును.ఓమముపుచ్చుకొన్నప్పుడుఒకటిరెండుగంటలలోవిరేచనముగాని యెడల మిరియములుచారు పుచ్చుకొనవలయును. రెండు మూడు సుఖ విరేచనములయి దేహమునకు తేలికయిచ్చును. కొన్నితత్వములయందు విరేచనములు యెక్కువ అవుచున్నయెడల చెరుకుబెల్లం తు 1 ము ఆవు నెయ్యి తు 1 ము యీ రెండు కలపి పుచ్చుకొనినను లేక పెరుగుఅన్నము తినినను కట్టును.

## 58 సుఖభేది మాత్రలు 25 గల పే 1 కి రు 0-2-0.

వుదయంవకమాత్రి వేడినీళ్ళతో సేవించిన వకగంట టయిములో రెండుమూడు సుఖవిరేచనములయి క్రిమిజ్ఞిగురు ఆమము కుట్రివగయిరాలను తీసివేయును. సఖభేది మాత్రిను రాత్రి పరుండబోవునపుడు నీళ్ళతో సేనించిన వుదయమునకు కాలవిరేచనము బాగుగా నవును.

## 59 చండభాను తైలము సీ 1 కి రు 0—8—0

ఒక పింగాణిలో ఒక ఔన్సు కాచిన ఆవుపాలను వేసి అందుపైని పది చుక్కలు లగాయతు పదిహేను చుక్కలువరకు వేసి, సేవించవలెను. యీతైలమును మిక్కిలి మలబద్ధము గలవారలు సేవించిన, కడుపులో మలసంబంధమైన రాళ్లను, నాభియందువుండు శీతలము, గుల్మమును, ఆమమును ఖండించివైచును. కడుపులో జలోదరము, వుదరము, జ్వర సంబంధమయిన బిళ్ళలు,నున్నవారలు వారమునకు రెండుపర్యాయములు వుదయవేళల, పయినవ్రాసిన్న విధమున రోగబలమునుబట్టి రెండు వారా సములవరకు సేవించిన, తగ్గును.



## పథ్యములు.

విరేచనములకు మందులు తీసుకొన్నప్పుడు ఆరోజునకే మను జుడు శీతలపదార్థములను భుజింపరాదు. శీతలపదార్థములనగా గరుబా జాకాయ, దోసకాయ. ఆనపకాయ, శీతాఫలము, అరటిపండు. చల్లనవి యగు పదార్థములు, పులిసిన పదార్థములు, పాసిన పదార్థములు; భుజింపరాదు. కారము, కందికట్టు, పొట్లకాయ, కరివేపాకు పొడుము, మేకచేరువ, లోనగు, ఉష్ణకర పదార్థములను భుజించవలెను, పెరుగు మజ్జిగ, ఆపూటమాత్రిమే, విసర్జింపవలెను.

## 60 ద్రాక్షాఫల రసాయనము తియ్యనిమందు.

డ 1కి రు 0—12—0.

రోగబలానుగుణముగా యిండుపకాయంతగాని, పావుతులమెత్తుగాని, సేవించిన అన్నివిధములగు మలబద్ధములు తొలగించును. విరేచన మగుటలో వికారము కడుపునొప్పియు లేక, సుఖవిరేచనము జేసును. దేహారోగ్యమునకు చాలా మంచిది రాత్రి పరుండబోవుచపుడు ఒక్క మోతాదు పుచ్చుకొనినయెడల సూర్యోదయమునకు కాలప్రవృత్తి క్రిమముగా, విరేచనము జరుగును.

## నేత్రరోగములకు ఔషధములు.

## 61 నేత్రామృతము, డ 1 కి రు 1-0-0.

నేత్రిరోగములకు కాటుకలు, మర్దనములకు తైలములే గాని, లోపలకు సేవించుమందుల యోగములు, యెచ్చటను కానరావు, యీ యోగమును మేము, పూర్వగ్రింధయులనుండి సంపాదించి, యోగ మును తయారుచేసి అనేకులకు అంజనములు అవసరములేకయే, యీ నేత్రామృతమును, సేవింపజేసి, ఆయా నేత్రిరోగములనుంచి, అనేకు లను విముక్తులనుజేసి, కృతార్థుడ నయితిని. యీ మహాయోగమున

మిక్కిలి సారవంతములయిన, అనేకమూలికలు, భస్మములు చేరియున్నవి. యిది ప్రాత్ససాయంకాలములయందు నాల్గు అణాలయెత్తు చొప్పున, సేవించిన నేత్రములు సూదులతో బొడిచినటులుండుట, గరగరలాడుట, పువ్వు పొరదురద, కూన, మంటలు, కండ్లయందు మెరుపు, రేచీకటి, నొప్పి మొదలగు సర్వనేత్రరోగములు హరించుటయేగాక, కణతలయందును, నుచ్చినగుంట చెవులు, కనుబొమలు పీట్లయందు గలుగు పోట్లను ఖండించును. శ్వాసము, కాసము, విషమజ్వరము, చల్ది, అతిసారము, శూలలను బరిమార్చును. స్త్రీలకు గలుగు కుసుమాదిరోగములను బోగొట్టి రుతువును క్రమపర్చును, యెంతకఠిన నేత్రరోగములయందునయినా, వారమురోజులకు గుణము అగుపించును. యీ లేహ్యమును, నిశ్శేషముగా రోగమును పోగొట్టుకొనువారలు, నలువది దినములు సేవించవలయును. యీమందును సేవించుతూ, నేత్రామయాంజనమును కంటిలో వేయుచూ, శిరస్సుకు భృంగామలక తయిలము మర్ధనాజేసేది, యెటువంటి నేత్రరోగములునయినా, కుదుర్చును.

## 62 నేత్రామయాంజనము సీ 1 కి రు 1-0-0

సీసాయందుండు మందును, రాగికాడతోగాని, వెండికాడతోగాని, వేలిమీదకు కొంచము తీసుకొని, రెండుకండ్లయందును వుంచవలెను, పొద్దుటసాయంకాలములయందు మాత్రమే, కండ్లు మెరుపు, పోటు, నీరుకారుట, మసక, మెసుగుట, పుసిగట్టుట, పొరరు, దుర్మాంసము, రెప్ప దళసరియగుట, పువ్వులులోనగు సమస్త నేత్రరోగములు నయమగును. యిది కంటియందుంచుతూ, నేత్రామృతమును లోపలికి, పుచ్చుకొనిన త్వరలో గుణమగును.

## 63 పత్సకర్పూరం కాటుక డ 1 కి రు 0-4-0.

దీనిని ప్రాతస్సాయంత్రములయందు కాటుకవలె కండ్లకు వుంచుకొన్నయెడల, కారకములు దురదలు, మంటలు, నీరుకారుట మొదలయిన వ్యాధులను తగ్గించి, కండ్లకు చలవజేయును.



## 64 గరుడాంపనము వర్తులు

12 వర్తులు గల సీ 1 కి రు 1-0-0

ఇందు నేత్రరోగహాలములగు నలువది వస్తువులు గలసియున్నవి దీనిని చనుబాలతో అరగదీసి నేత్రములయందు కాటుకవలె పెట్టుకొనుచుండిన పువ్వు, పొర, కూన వగయిరా కఠినమగు నేత్రవ్యాధులయందు మంచిపనిజేయును మంచి తేజస్సుగల దృష్టిని నొసంగగలదు.

## 65 చలువసుర్మాబుడ్డి కి 1 రు 1

ప్రాతస్సాయంకాలములయందు కండ్లకు వుంచిన మేహాకారము వల్ల కలిగిన మెరువు పోటు నీళ్లుకారుట పుసులుకట్టుట యెండనుచూడనీయకపోవుట లోనగు నేత్రవ్యాధులను హరించుటయేగాక కండ్లకు మంచిచలువయును దృష్టిని కలుగజేయును.

## 66 నేత్రరోగహాదకషాయము డ 1 కి రు 2

డబ్బాయందుండు చూర్ణమును తు 4 లు యెత్తు తూచి ఒక క్రొత్తకుండయందు వేసి శేరు నీరుపోసి అష్టావశేషము మిగుల నటుల గాచి వడించి చల్లారినపిమ్మట పడపోసి అందు తులమెత్తు ప్రాతబెల్లమును తరగి వేసి బాగుగాకలపి వుదయమువ్రాట సేవించవలెను సాయంత్రము అవసరములేదు యిటుల వారముదినములు సేవించిన కండ్లపొరలు రేచీకటి వాపులు వువ్వులు పార్శ్వపునొప్పి తలకనుబొమలు శంఖస్థానము చెవులు వీనియందలి పోట్లు దంతరోగములు పోవును.

## 67 భృంగామలకతైలము సీ 1 కి రు 1

దీనిని సదా శిరమునకు బూయుటచే సకల నేత్రరోగములను శిరోరోగములవ తలనొప్పి వంటి తలనొప్పి మెదడున జనించు రోగములను దీస్కివైచి మెదడకు చలవజేసి మంచిఆలోచనశక్తిని దివ్య తేజముయిన దృష్టిని నొసంగును నేత్రరోగములకు లోపలకు మందులు పుచ్చుకొను

చు కండ్లకు కాటుకలు వుపయోగించే సమయములయందు దీనిని శిరస్సునకు బూయుచుండిన మంచిగుణమును కలుగజేయుచుండును.

## 68 నేత్రబిందు సీసా 1 కి అ 8

ప్రాతస్సాయంకాలములయందు వెల్లకిలాపరుండి కండ్లుబాగావిప్పి అయిదు చుక్కలు చొప్పున కండ్లలోవేయుచుండిన రెండుమూడు రోజులలో సమస్తమయిన కండ్లకలక రోగములు మెరుపు రెప్పదళసరి మెండనుజూడక నీయకపోవుట పువ్వులు మొదలగు రోగములను గుణపర్చును.

## 69 సకల నేత్రరోగహరి కాటుక డ 1 కి రు 1-8-0

యీకాటుకను నువ్వుగింజంత తీసి కండ్లయందు ప్రాతస్సాయంకాలములయందు నించిన రెప్పదళసరి చుర్మాంసము పువ్వులు పొరలు దురద రేచీకటి కోతి రెప్పలు నీరుకారుట లోనగు కఠినమగు నేత్రరోగములు హరించును.

## సర్వనేత్రరోగములయందు పథ్యములు

ప్రాతవియగు మెత్రిజాలు వరిబియ్యము అన్నము గోధుమజావ పెసరకట్టు ఆవునేయి ఆవుపాలు పంచదార తేనె పొన్నగంటికూర చిర్రికూర అడవి వులవలకట్టు వుల్లిగెడ్డలు పొట్లకాయ బీరకాయ వంకాయ దోసకాయ కాకరకాయ లేతఅరటికాయ లేతముల్లంగి సైంధవలవణము చలకనగా జీర్ణమయ్యే సకలపదార్థములు రొల్లప్పుడు పాదుకలు తొడగి సంచరించుట వారమునకు వకతూరి విరేచన ఔషధమును తీసుకొనుట రక్తమోక్షము జేయుట పట్టువేయుట మనస్సు చింతలేకుండా యుండుట యివి అన్నియు సకల నేత్రరోగములయందు పథ్యములుగాయుండును.

## అపథ్యములు

క్రోధము దుఃఖము స్త్రీసంభోగము వాతపదార్థములను భుజించుట మలమూత్రాదివేగములను అడ్డగించుట నిద్రపోవుట వాంతిపోవుట



మిక్కిలి సూక్ష్మములగు వస్తువులను జూచుట దంతధావనము జేయుట స్నానము రాత్రిలయందు అధికముగా భుజయించుట అధికముగా మాటలాడుట ఎండలోను పొగయందు అగ్గిదగ్గిరదిరుగుట అధికముగా నీరు త్రాగుట పుచ్చకాయలు తెలగపిండి ఆకుకూరలు చాపలు కల్లు తాంబూలము పులుపు విదాహకర పదార్థములు అజీర్ణపదార్థములు అధికముగు వుప్పును వీటి నన్నింటిని నేత్రరోగముకలవారు విడిచిపెట్టవలెను.

## సారస్వత ఔషధములు

## 70 సరస్వతీఘృతము

7 దినములకు రు 4 లు 15 దినములకు రు 7 లు 30 దినములకు రు 13.

యీనిరుపమానఘృతమును ప్రాతస్సాయంకాలములయందు అరచేతి గుంటయందు యిమిడినంత చొప్పున (లేక) తులముయెత్తుచొప్పున 7 దినములు సేవించిన కంఠము కిన్నరవలె పాడును 15 దినములు సేవించిన బృహస్పతితో సమమగు బుద్ధినికలుగజేయును 1 మాసము సేవించిన అష్టావధానము జేయుక వితాధోరణికలుగును యిప్పటికాలములో విద్యనేర్చు బాలురకు మెదడును చక్కగా బాగుజేసి జ్ఞాపకశక్తిని బుద్ధిబలమును వాచాలత్వమును కలుగజేయును సమస్త వున్మాదరోగములను (లేక) పిచ్చరోగములను బోకార్చును నెలదినములు సేవించిన 18 కుష్ఠువులు చర్మవ్యాధులు మూలవ్యాధులు వుదరములు జలోదరములు శ్వాసకాస పైత్యములు పంచగుల్మములు సమస్త మేహములు సవాయిరోగ మొదలగు సుఖవ్యాధులు కుదర్చుడమేగాక సంతానమునులేని వంధ్యాస్త్రీలు సేవించిన తేజోవంతమగు సంతానమును సంతానము కలిగి కొద్దికాలమే జీవించి చనిపోవు బిడ్డలను గను స్త్రీలు సేవించిన దీర్ఘాయుష్మంతులగు పుత్రులను బడయగలరు.

## 71 సారస్వతవటి 7 రోజులకు 1-8-0

యీమాత్ర వకదానిని రాత్రియందు భోజనముచేసి పరుండబోవునపుడునోటియందునుంచుకొనిప్రాతఃమింగుచు నిద్రించి వుదయము లేచిన

తరువాత నోటియందున్న మాత్రను ఉమియుచుండవలెను. అట్లు చేయుటచే సంగీతపాఠకులయొక్కయు తదితరులయొక్కయు కంఠమందుండు జీర జిగురు కంఠముబొంగురు బోవుట కీసుగానుండుటలోనగు సమస్తకంఠస్వర సంబంధమయిన వ్యాధులు తగ్గించి జనులువినుటకు నెంతయు నానందముగానుండునటుల పాడించును సంగీతపాఠకులు యెంతకాలముగానము జేసినను కంఠము సులభముగా పలుకుటయేగాక తనకు పాడుటకు సుఖముగలిగియుండును.

## 72 బ్రాహ్మీరసాయనము డ 1 కి రు 2-0-0

మరియు నీరసాయనమును ప్రాతస్సాయంకాలముల యందు అరంతులం యెత్తుచొ॥ 15దినములు సేవించినసరస్వతిజింహ్వాగ్రిమందునివాశించుటయేగాక మెదడకు చలువజేయును పిచ్చరోగములను బోగొట్టును బుద్ధిని బాగుగ వికసింపజేయును. జ్ఞాపకశక్తిని కలుగజేసి రక్తశుద్ధిజేయును కుష్టాది చర్మరోగములుసవామేహముపాండువమేహములను బోకడచును.

## సారస్వతఔషధములకుపథ్యములు

సంగీతవిద్యా పాఠకులు పైమందులు సేవించునప్పుడు పథ్యము లేదు గాని రోగముగలవారు మాత్రిము యీమందులను సేవించునప్పుడు ఆయారోగములకు జెప్పబడిన పథ్యములు ఆచరిస్తూ సేవించవలెను.

—:అర్శరోగఔషధములు (అనగా) మూలవ్యాధులు:—

## 73 అర్శరోగహరి డ 1 కి రు 1-0-0

ప్రాతస్సాయం కాలములయందు ఒక్కొక్కమాత్రి చొ॥ సేవించవలెను. మాత్రిదిగుటకు నీరుకావలసినయడల వేడినీరును పుచ్చుకోవలెను యీమందుకు వారమురోజులు పెసరపప్పువేసి వండిన పాతబియ్యము అత్తెసరుఅన్నములోఆవుపెరుగువేసిభుజింపవలయునుమరియేయితరపదార్ధములు పనికిరావు రోజుకు యెన్నిపరాయములు కావలసినను పైనవ్రాసి



నవిధముగనెభుజింపవలయును తరువాత జేయుపత్యమును యీక్రిందవ్రాయు విధముగా ఆచరించవలయును 3 మాసములలో వ్యాధిశుభ్రముగా తగ్గిపోయి మరల నెన్నటికి అగుపించదు. వుప్పు వేసుకొనగూడదు

## 74 అర్శరోగలేపము డ 1 కి రు 0-8-0

ఆసనముచుట్టు దొండపండ్లువలె కోడిజుట్టువలె ఖర్జూరపుకాయలవలె మరిన్ని ఆవాలువలెనుండి పులిసిల్లి చీము రక్తము స్రివించు సర్వవిధముల మూలశంకలకు పైన లేపనముజేసిన పటాపంచలయిపోవును. రోజుకు 2, 3, పర్యాయములు వ్రాయుచుండవలయును. మూల వ్యాధులకు మందులు లోపలకు పుచ్చుకుంటూ యీమందు వ్రాయుచుండవలెను మందు ఆరిపోయినయెడల నువ్వులనూనితో కలుపుచుండవలెను.

## 75 అర్శరోగములకు అమృతాభ్రకము

పదిరోజులకు సరిపోమందు ఖరీదు రు 4-0-0

ప్రాతస్సాయంకాలములయందు తులముయెత్తు కొడిశపాలవిత్తుల రసముతో నయినా పంచదారతోనయినా సేవించిన యెంతకఠినమయిన మూలశలకలనయినా కుదర్చడమేగాక లోమొలకలను రక్తపైత్యములను రక్తాతిసారములను బోకడచును.

## 76 అర్శరోగ ధూపము డ 1 కి 1-0-0

యీధూపద్రివ్యముతో పంపబడిన వేరుయొక్క గంధమును ఆసముచుట్టూయుండె మొలకలకు పట్టించి ధూపద్రవ్యమందు నాల్గువంతులు వుసుక కలపి రోగిని వకనులమంచముపై కూర్చుండబెట్టి ఆసనముకు బాగా పొగతగులునట్టుగా వేయవలెను. లేక వకరోటిలో నిప్పులువేసి నిప్పులపై ధూపద్రివ్యము వేసి అందుపై తిరగటిరాయిబెట్టి ఆరాతియొక్క బెజ్జమునకు ఆసవమును సమముగా నమర్చి కూర్చున్నయడల ధూపము బాగుగా తగలి మొలకలు వూడిపోవును. యీవిధముగా

పదినములు ఆచరించవలెను. యెటువంటిదుస్సాధ్యమగు మూలవ్యాధులైయున నిశ్శేషముగా హరించును.

## అర్శ రోగములయందు పథ్యములు

గుదస్థానమందు పట్టువేయుట రక్తమోక్షణము జేయుట క్షారములచేతను అగ్నిచేతను శస్త్రములచేతను గుదాంకురములను నశింపజేయుట ప్రాతవియగు యర్రివడ్లు బియ్యపుఅన్నము పొట్లకాయ కంద నిమ్మకాయ కల్లు వెన్న మజ్జిగ వుశిరికాయపచ్చడి వెలగకాయలు ఆవనూనె కడుగునీళ్లు బీరకాయ పాతచింతకాయపచ్చడి పెసరపప్పు ఆవుపెరుగు మేకమాంసము పిట్టమాంసాదులు జఠరాగ్నిని దీపింపజేయు నానావిధ అన్నపానంబులు మూలవ్యాధిగలవారికి పథ్యకరముగా యుండును.

## అపథ్యములు.

చాపలు తెలగపిండి పిండితోచేయబడిన భక్ష్యములు మినుములు అనుములు సొరకాయ బచ్చలికూర మామిడిపండ్లు దుంపకూరలు అజీర్ణపదార్థములు యెండలోతిరుగుట విశేషజలపానము తూర్పుగాలి మలమూత్రాది వేగములను నిరోధించుట స్త్రీసంభోగముజేయుట గుఱ్ఱము మొదలగు వాహనములనెక్కి స్వారచేయుట పగటి నిద్రియివి వర్జింపవలయును.

## స్త్రీరోగములకు ఔషధములు

## 77 స్త్రీ సంజీవనము డబ్బీ 1 కి రు 1_0_0

ప్రాతస్సాయకాలములయందు వక్కొక్కమాత్రి చొ॥ మానివసుపు రసాంజనము తుంగముస్తలు అడ్డసరపు ఆకులు నేలవేము జీగిజింజలు వీనిని సమభాగము కషాయం కాచి సదరు కషాయమునందు అరతులం తేనికలిపి మాత్రివేసుకొని సదరుకషాయమును సేవించిన యెరుపు తెలుపు ఆకుపత్సలోనగు సర్వకుసుమరోగములు హరించును. చిర్రికూరవేళ్ళు



రసాంజనము యివితులం తులం యెత్తు చొ॥ బియ్యపుకడుగుతో నూరి రసంతీసి అందుపై పంచదారవేసి మాత్రికు అనుపానముగా సేవించిన అసృగ్దరరోగమును ఆవువెన్న తామరపువ్వులోని పుప్పొడియు పంచదార యివిమూడు సమముగా కలిపి మాత్రికు అనుపానముగా వేసుకొనిన, మిశ్రిమరకములగు కుసుమరోగములను వెలగాకురసము వక అరఔన్సునందు పావుతులం జీలకర్ర చూర్ణము అరతులం చీనాపంచదార కలిపి అనుపానముగా సేవించిన తెల్పుబట్టరోగములును సోపుచూర్ణం అరతులం తేనితో బాగుగ కలిపి సదరుమాత్రను దానిలో కలిపి సేవించిన పోటుతోకూడియుండురక్తకుసుమరోగమును మరియు ఆవువెన్నతో నయినను రెండుతులములయెత్తు వెలగచెక్క ఆప్పుడుకడిగిన బియ్యపుకడుగుతో నూరి 2 తులములయెత్తు రసముతీసి అందు తులముయెత్తు తేనికలిపి మాత్రివేసుకొని పుచ్చుకొనినను దర్భగడ్డివేళ్లు తు 2 లు బియ్యపుకడుగుతోనూరి 2 తు యెత్తు రసంతీసి సదరుమాత్రి వేసుకొని రసముపుచ్చుకొనినను (పైరసమును కాచనక్కరలేదు.) సమస్తకుసుమరోగములు హరించును.

## 78 అబలానందము పె 1 కి తు 0_8_0

స్త్రీ బయిష్టయిన దినములగాయితు వుదయము మాత్రమే సదరు మందును సేవించవలెను. తు 5ల యెత్తు ధనియాలు నీళ్లతో నూరి రెండుపున్సులు (లేక) గిద్దెడురసముతీసి వడకట్టి అందుతులముయెత్తు పేర్కోరీ పంచదార కలిపి మాత్రివేసుకొని రసముపుచ్చుకొనవలయును రసము కాచనక్కరలేదు. వకదఫాతో తగ్గనియడల రెండవనెలలోకూడా సేవించవలెను. మరల నెన్నటికి జనించదు.

## 79 రుతుబద్ధ నివారణి సీసా 1 కి రు 2

ప్రాతస్సాయం కాలములయందు వక్కొక్క మాత్రి చొ॥ వెదురుఆకు తు 2 నల్లనువ్వులు తు 2 లు అందు అర్థశేరు జలముపోసి అష్టావ

శేషము మిగులువరకు కాచి సదరు కాషాయము మాత్రవేసుకొని సేవింపవలయును. మందారపువ్వులు 5 న్ను రేకలుగా విడదీసి క్రొత్తకుండయందు వేసి తు 1 యెత్తు దాల్చినచెక్క పొడుము గూడా వేసి సోలడు నీళ్ళుపెట్టి అష్టావశేషముగా కాచి మాత్రవేసుకొని యీకషాయమును సేవించినను కన్నికోమలి రసముతోనయినను పాలసుగంధివేళ్ల రసముతోనయినను సేవించిన ఋతువు జారీఅవుటయేగాక మధ్యకాలమందు నశించిన ఋతువుగల స్త్రీ సేవించిన తిరిగి బయిష్టులగుదురు. చాలకాలమువరకు రజస్వల అవ్వని కన్నియలు సేవించిన క్రమమయిన రజస్వల అవుదురు.

## 80 సంతాన చింతామణి డబ్బా 1 కి రు 3

స్త్రీకి ఋతుస్నాన మయినపిమ్మట వుదయము లగాయితు 13 పూటలు వునయము సాయంత్రమును ఆవునేతితో కలపి సేవించి వెంటనే ఆవుపాలయినను గేదెపాలయినను అరసోలడు పుచ్చుకొనవలెను. పాలు కాచినను పచ్చివయినను పనికివచ్చును డబ్బాలో మందంతయు 13 పొట్లములునుగా కట్టుకొనవలెను. మందు సేవిస్తూ పురుషసమాగమము చేయవలెను. పాలు అన్నము మధుర పదార్థములు భుజించవలెను.

## 81 రక్తకుసుమ హారి సీసా 1 కి రు 2

ప్రాతస్సాయం కాలములయందు వేడినీటితో వక్కొక్కమాత్రచొ॥ సేవించవలెను. యెంతదుర్ఘటమయిన రక్తకుసుమ రోగములనయినా బరిమార్చును. 15 దినములు సేవించేది.

## 82 సుఖప్రసవ చూర్ణము, డ 1 కి రు 1—0—0

యీమందును తులమెత్తు వసకొమ్ములు కషాయంబెట్టి ఆ కషాయమునందు అరగదీసిన గంధము, ప్రసమవేదన నొందుచున్న స్త్రీకి నాభికిచుట్టు, పట్టువేసిన, అతిసులభముగా ప్రమాదమేదియులేక, కష్టము లన్నిటిని దొలగి తక్షణమే సుఖప్రసవమును జేయును. సదరు పట్టువలన ఒకటిరెండు గంటలలో ప్రసవము గానియెడల యష్టిమధుకము దంచి, వస్త్రఖాళితముచేసిన చూర్ణము పావుతులమెత్తు అరసోలడు ఆవుపాలయందు వేసి యిచ్చినతక్షణము సుఖప్రసవము నగును.



## 83 గర్భవిలాస రసము, సీ 1 కి రు 2--0—0

ప్రాతస్సాయంకాలములయందు గర్భిణీస్త్రీలు రెండు గురిగింజలయెత్తు మందును, తమలపాకునుజుట్టి యయినను, పటికిబెల్లము చూర్ణములో గలపియయినను, సేవించిన గర్భదోషముల నన్నిటిని హరించి, గర్భస్థపిండమును బాగుగా గాపాడుచు వృద్ధిపరచుచు, సుఖప్రసవము గలుగజేయును.

## 84 మేధికాది చూర్ణము డ 1 కి రు 3

యీచూర్ణమును ప్రాతస్సాయంకాలములయందు వక ఔన్సు నిమ్మపండ్లరసములో తులమెత్తు చీనాపంచదార చేర్చి అందు ఔషధ చూర్ణమును 2 అణాలయెత్తు కలపి సేవించవలెను యీవిధముగా 15 దినములు సేవించినయెడల సూతికా స్త్రీలయొక్క ఇగుళ్లు చలుపు రక్తము స్రవించుట వాపు పోటు చీముస్రవించుచుండు యిగుళ్లజబ్బును శరీరము బరువు తిమ్మెరు నరములయొక్క బలహీనత శరీరము మొద్దుబారియుండుట జీర్ణశక్తిచెడుట లోనగు యిగుళ్లజబ్బువల్ల వచ్చె సకల దుర్గుణములను మొదలంట ఖండించును.

## 85 కపిత్థాదిఘృతము సీసా 1 కి రు 3

యీనిరుపమానఘృతమును ప్రాతస్సాయంకాలములయందు ది 15 నదిములు సేవించిన స్త్రీలకుగల్గు తెలుపుయెరువుపసుపులోనగుకుసుమవ్యాధులను మొదలంట నశింపజేయును మరిన్ని సకల మేహములున్నూ త్రిరోగములు అరోచకము వమనము మొదలగు అనేకమయిన స్త్రీరోగములను నిర్మూలనము జేయును.

## 86 అబలానందసింధూరము సీసా 1 కి రు 1

ఋతువయిన స్త్రీ ప్రాతస్సాయంకాలములయందు రెండు గురిగింజలయెత్తు భస్మమును అరతులముయెత్తు బెల్లములోకలిపిగాని తేనెతోగాని సేవించి వెంటనే కాచిన ఆవుపాలు అరసోలడు ద్రావుచుండిన ఆసుదినములలో ఎంతటి దుర్ఘటమయినరుతుశూలలైనాబోకడచుటయెగాక యీఔషధము సేవించినందు రుతుబద్ధమెన్నడును లేకుండా దేహమును కాపాడుచుండును.

## 87 సూతికమాత్రలు బు 1 కి రు 2

ప్రాతస్సాయంకాలములయందు వక్కొక్క మాత్ర మంచినీరుతో సేవించుచున్నయడల సూతికవల్ల కలిగే!మంటలు తిమ్మిరలు మొదలయిన రోగములను బరిమార్చును.

## 88 క్షీరప్రవర్ధని బుడ్డి 1 కి రు 2

ప్రాతస్సాయంకాలములయందు పావు తులముయెత్తు చూ॥ అరసోలడు ఆవుపాలతో కలిపి సేవించేది 7 దినములు చంగల్వకోష్టుపెన్నేరు గజపిప్పిలి సుగంధి వేళ్ళు యివిసమభాగములు దంచి వస్త్రఘాళితముచేసిన చూర్ణమును నీళ్లలోగలపి స్తనములకు పూయుచుండవలెను అట్లు అచరించిన నిర్దోషమయిన స్తన్యము కుంభవృష్టిగా గలుగును.

## స్త్రీరోగఔషధములకు పథ్యములు

ప్రాతబియ్యపుఅన్నము ఆరికలు కొర్రలు ఎవలు గోధుములు పెసలు కందులు పాఫురము లేడి జింక కొంగ మేక గొర్రె వీట్ల మాంసములు ఆవుపాలు మేకపాలు ఆవుపెరుగు మేకపెరుగు అరటిపండ్లు చిర్రికూర పొట్లకాయ బీరకాయ ముదురు గుమ్మిడిపండు తాటికల్లు తియ్యదానిమ్మపండ్లు పుల్లదానిమ్మడ్లువం కర్జూరపండ్లు పుసిరపచ్చడి లేతవంకాయలోని నీరుగుంజు కంద పెండములోనగు దుంపకూరలు వెలగపండ్లు అన



టకాయ పుచ్చకాయ పెలాపపిండి ద్రాక్షపండు చక్కెర తేనె చెరుకు చన్నీళ్ళు అభ్యంగనస్నానము చల్లగాలిలో తిరుగుట చందనము బూసుకొనుట వెన్నెలలోపరుండుట పట్టుగుడ్డలు ధరించుట చల్లనిప్రదేశములలోదిరుగుట మొదలగునవి సకల స్త్రీరోగములయందును పథ్యకరముగాయుండును సూతికారోగమందు సూతికామాత్రలు సేవించునప్పుడు మాత్రము వేడిజేయు మేకమాంసము కందిపప్పు కందకారములోనగు పదార్థములు భుజించవలయును.

## అపథ్యములు

దేహపరిశ్రమ జేయుట త్రోవనడచుట యెండలోదిరుగుట శరీరమునలయించుట మలమూత్ర వేగములను అడ్డగించుట ఏనుగ గుర్రములోనగు జంతువులనెక్కి స్వారీజేయుట చమట బుట్టించుట చుట్టత్రాగుట సంభోగము జేయుట పులుపులు బెల్లము వంకాయలు నువ్వులు మినుములు అవాలు పెరుగునవి సూతినీళ్లు! తాంబూలము వెల్లుల్లిఅధికమగు కారము తాపము గలిగించు మిరపకాయ మొదలగు పదార్థములను భుజించరాదు.

## శూలరోగములకు ఔషధములు.

## 89 శూలకుఠారము, 20 దినములకు డ 1 కి రు 3

ప్రొద్దుట సాయంకాలము, పావుతులము (లేక) నాల్గు అణాలయెత్తు చూ॥ అరతులమెత్తు చెరకుబెల్లములో గలపి, తులమెత్తు ఆవునేయి వేసి బాగుగా కలపి, సేవించవలెను, ఇట్టుల 15 దినములు సేవించిన, ఏమందువల్లతీరని, పరిణామశూల (అనగా) తినిన అన్నము జీర్ణమయ్యేసమయములో వచ్చు కఠినమగు శూల, పార్శ్వశూల, వాతశూల, లోనగు సకలశూలలు నిశ్శేషముగ తగ్గును, అనేకులకిచ్చి దీని అనుభవమున పరిశీలింపబడినది.

## 90 శూలమారి, మా 25 గల వే 1 కి రు 0—8—0

ప్రాతస్సాయంకాలములయం దొక్కొక్కమాత్ర చొ॥ అల్లపు రసముతోగాని, మిరియాలరసముతోగాని సేవించిన సర్వశూలలు, విష్ణు చక్రము అసురుల నాశనముజేయుభంగి సర్వశూలలు, నాశనముజేయును.

## 91 శూలరోగ సంహారిణి సీసా 1 కి రు 2—0—0

ప్రాతస్సాయంకాలములయందు నాల్గు చిన్నములు చొ॥ నిమ్మకాయరసం అరఔన్సులో గలపి సేవించిన పైత్యజనితశూలలు, శ్లేష్మజనితశూలలు, పరిణామశూరలు తత్క్షణమే తగ్గును. శూలలకు యిది అమోఘమయిన క్రియ.

## 92 పంచభూతి సీ 1 కి రు 2—0—0

పూటకు శనగగింజంత చొ॥ ప్రొద్దుట సాయంకాలము వకటి రెండు రోజులు అల్లపరసంతో గాని, మిరియము కషాయముతోగాని, సేవించిన వాతశూల, శ్లేష్మశూల లోనగు సర్వశూలలు గుదురుటయే గాక, వాతరోగములను, శ్లేష్మరోగములను ఖండించును. యీమాత్ర వేసుకొనిన, వకటిరెండు గంటలలో, వకటిరెండు విరేచనములు అవుచుండును. సాధారణముగా విరేచనములకు కూడా వాడుక చేయవచ్చును.

## శూలరోగములయందు పథ్యములు.

వమనముజేయించుట, ఆవిరిబట్టి చమటతీయుట, విరేచనము జేయించుట, నిదురించుట, కాగినపాలు, పొట్లకాయ, మునగకాయ, కాకరకాయ, వంకాయ, మామిడిపండ్లు, వెలగపండ్లు, ద్రాక్షపండ్లు, సైంధవలవణము, ఆకుకూరలు, సముద్రలవణము, ఇంగువ, వుల్లి, గడ్డలు, వేడినీళ్ళు, నిమ్మకాయరసము, శీఘ్రముగా తేలికగా జీర్ణమగు, సర్వపదార్థములు, శూలరోగమందు పథ్యకరములుగా యుండును.



## శూలరోగములకు అపథ్యములు.

పరస్పర విరుద్ధములగు అన్నపానాదులు, రాత్రి జాగరణను, హెచ్చుతగ్గులు భుజించుట, రూక్షపదార్థములు, శీతలపదార్థములు, అజీర్ణపదార్థములను భుజించుట, దేహపరిశ్రమ జేయుట, సంభోగము జేయుట, కల్లుత్రాగుట, కందులు పెసలు మినుములు మొదలగు పప్పు పదార్థములను భుజించుట, నువ్వులు తెలగపిండి తినుట, మలమూత్రములను అడ్డగించుట, దుఃఖపడుట, కోపపడుట, యివియన్నియు శూలరోగములయందు అపథ్యములు గావున, విడువవలయును.

## కుష్టురోగములకు ఔషధములు

## 93 సిద్ధౌషధము—నెల దినములకు

60 పొట్లములు రు 4—0—0.

ప్రాతస్సాయంకాలములయం దొక్కొక్క పొట్లము చొప్పున

మొదటినెలయందు ఆవుమజ్జిగ గిద్దెడు (లేక) రెండు అవున్సులు గ్లాసులోవేసి, పొట్లమొకటికలపి పుచ్చుకొనవలెను. రెండవ నెలయందు జొన్నలు తవ్వెడు తీసుకొనివచ్చి, కుమ్మి పొట్టుతీసివేసి, ఒక తప్పేళాయందు వేసి, శేరు నీళ్ళుపోసి బాగుగ కడుగవలయును. గింజలు తీసివేసి, నీళ్ళువడబోసి, సీసాయందుగాని క్రొత్తకుండయందు గాని భద్రపరచి, పూటకురెండుఅవున్సుల నీళ్ళలో పొట్లముకలిపి పుచ్చుకొనవలెను. జొన్నకలి పై విధముగ వారమునకు వకసారి చేసుకొనుచుండవలెను. మూడవ నెలయందు ఆవుపాలు గిద్దెడులో కలిపి, ప్రాతస్సాయంకాలములయందు ఒక్కొక్కపొట్లము చొ॥ పుచ్చుకొనవలెను. నాలుగవ నెలయందు ప్రాతస్సాయంకాలములయందు తేనెతో కలిపి సేవించవలెను. అయిదవ మాసమందు పూటకు తులమెత్తు చీనాపంచదారలో కలిపి ప్రొద్దుట సాయంకాలములయందు సేవించవలెను. ఆరవ నెలయందు ఆవునేతితో సేవించవలయును. ఇట్లు ఆరుమాసములు సేవించిన

అవుదుంబరకపాలమండల, పుండరీక, ఆలసక శ్వేత శైపాదికాది, పదునెనిమిది కుష్టువ్యాధులు, వంశానుగతముగావచ్చే కుష్టువ్యాధులు, కుష్టువల్ల కలిగే మెరుపు నలుపు లోనగు, సమస్త మచ్చలు పొడలు, తీరని కుష్టురణములు, సవాయి, మేహకుష్టులు, సవాయి మేహమువల్ల కలిగే మచ్చలు యేమందువల్ల తీరని సమస్తసవాయిరోగములు, సకల విధములగు మోహపైత్య శ్లేష్మరోగములు గుదుర్చడమేగాక, ఆరుమాసములు విడువక సేవించిన శరీరమున యేదోషముచేత జనించిన రోగములనయినను బోగొట్టి దూరదృష్టి, దూరశ్రవణ, శిద్ధియు, భీమసమానబలమును, దీర్ఘాయుష్యమును జేయును.

## 94 కుష్ఠకులాంతకము నెల దినములకు రు 2

ప్రాతస్సాయంకాలములయందు ఒక్కొక్క పొట్లము చొ॥ గిద్దెడు (లేక) రెండు అవున్సుల బియ్యము కడిగిననీళ్ళు వడబోసి, అందు కలిపి పుచ్చుకొనవలెను.

## 95 గురుభస్మ తులం బుడ్డి 1 కి రు 4

ప్రాతస్సాయంకాలములయందు వడ్లగింజంత యెత్తు మోతాదు చొ॥ జొన్నలు కడిగిన కడుగు ర్నతోగాని ఆవువెన్నతోగాని లేతకొబ్బరికాయ నీళ్ళతోగాని ఆవునేతితోగాని కలకండ పానకముతోగాని చెరుకు రసముతోగాని సేవించిన సమస్తమగు కుష్టువ్యాధులను మాలకంకిణీ విత్తుల చూర్ణము అణాయెత్తులో కలిపి ఆముదముతో సేవించిన సమస్తనంజువ్యాధులును వాయువిళంగము రసముతో సేవించిన క్రిమివ్యాధులును అల్లపురసముతో సేవించిన దద్దురురోగమును భావంతివిత్తుల కషాయముతో సేవించిన సమస్తసవాయి రోగములును పచ్చిపులుసుతో సేవించిన శూలరోగములును కొడిసపాలవిత్తులు రసంతో సేవించిన గ్రహణి అతిసారరోగములును మిరియాల కషాయముతో నిచ్చిన శ్లేష్మరోగమును పిప్పలిమోడి కషాయతో నిచ్చిన వాతరోగములును బరిమార్చును. బుద్ధిమంతులగు వైద్యులు యీగురుభస్మమును యింకా విశేషమయిన అనుపానములతో వాడుకొనినయెడల సర్వరోగములయందు సదరు భస్మము అమోఘమయిన పనిజేయును.



## 96 సర్వేశ్వరాది భస్మము సీ 1 కి రు 4

ప్రాతస్సాయంకాలములయందు గురుగింజయెత్తు చొ॥ ఆవునేతితో సేవించిన పదునెనిమిది కుష్టువులు సవాయి మేహములు మేహరణములు కీళ్ళనొప్పులు మచ్చపొడ బగ్గిలోనగు సుఖవ్యాధులు సకలవిధములయిన జ్వరములు శ్లేష్మవాతరోగములు నిర్మూలముజేయును.

## 97 గంధక భస్మము తు 1 కి రు 2

ప్రాతస్సాయం కాలములయందు రెండుగురుగింజలయెత్తు చొ॥ ఆవునేతితో సేవించిన కుష్టురోగములు మేహరణములు సవాయి మేహములు సకల సుఖవ్యాధులు బగ్గి మచ్చ పొడ పల్లిక శుక్లనష్టము 20 మేహములు మొదలగు అనేకరోగములను బరిమార్చును.

## 98 గంధకపుష్పము 1 కి రు 3

గంధం భస్మమునకు చెప్పిన అనుపానముతోనే సేవించిన సకలవిధ శుక్లనష్టమునను కీళ్ళనొప్పులు తీరని సవాయిరోగములు మచ్చలు బగ్గిలు పొడలు కరిమేహములు మహారణములు సమస్తపుండ్లరోగములు సూలవ్యాధులను బోకార్చుటయేగాక శరీరమును వజ్రమువలే ఘట్టిపరచి అసమానబలమును మిక్కిలి వీర్యవృద్ధిని జేయును.

## 99 కుష్టకులాంతక తైలము సీ 1 కి రు 4

## కుష్టకులాంతక లేహ్యము డ 1 కి రు 4

ప్రాతస్సాయంకాలములయందు 10 చుక్కలు లగాయతు 15 చుక్కలవరకు వక అవున్సు వేడినీరు నందుగాని తులమెత్తు పటికిబెల్లము

చూర్ణమునందుగాని వేసి సేవించేది తైలము సేవించిన వెంటనే పావుతులముమెత్తు కుష్ఠుకులాంతకలేహ్యమును సేవించవలయును వెంటనే పెసరపప్పుగాని కందిపప్పుగాని యూగాణిమెత్తు నమలిమిగ్రింగవలయును యెప్పుడు అయినావాంతి అగుచుండును యిటుల మండలదినములు సేవించిన యేమందులవల్లను తీరని కుష్ఠురోగములు మహారణములు మచ్చ బగ్గిసవామేహములోనగు సకల వ్యాధులు సటాపంచలైపోవును.

## కుష్ఠురోగౌషధములకు పథ్యములు

వారమునకు వకసారి వమనమునకు పక్షమునకు వకసారి విరేచనములకు తీసుకొనుచుండవలెను నస్యములు చేసే యష్టమూరు రోజులకొకతూరి చేయవలెను ఆరుమాసములకు వకతూసి రక్తమోక్షణము జేయుట యీపనులు కుష్ఠురోగములకు తప్పకుండా చేయుచుండవలెను శరీరమున నెయ్యిబూయుట పాతవియగు గోధుమలు బియ్యము పెసలు కందులు చిరుశెనగలు తేనె మేకమాంసము పేముచిగురు పొట్లకాయ మునగకాయ కాచి కూర వేపచిగురు వుల్లిగెడ్డలు గలిజేరు తగిరసపు ఆకు తాటిపండు పాతనెయ్యి బీరకాయలు గానుగనూనె నువ్వులునూనె వేపనూనె శీఘ్రముగా జీర్ణమయ్యే పదార్థములు ఆవుపాలు ఆవుమజ్జిగ చామలు కొర్రలు పచ్చపెసలు కాకరకాయ వుచ్చింత మొదలగు చేదుగల కూరలు వేపపువ్వు నేలములగపండ్లు యివి కుష్ఠురోగములయందు పథ్యములుగాయుండును.

## కుష్ఠురోగములయందు అపథ్యములు

పరస్పరవిరుద్ధములగు అన్నపానాదులను సేవించుట యెండలోనుండుట హెచ్చుతగ్గులుగా తినుట చమట పుట్టుట-సంభోగముచేయుట వమన వేగమును అడ్డగించుట చెరుకురసమును దాగుట పులుపుగలపదార్థములను సేవించుట నువ్వులు మినుములు మొదలగు గురుకర పదార్థములు ద్రవకర పదార్థములు కొత్తబియ్యపు అన్నము విదాహకరంబు



లను మలమును బంధించునవియు నగువస్తువులను సేవించుట చక్రవర్తికూర మల్లంగి జలప్రాంతములందు జంతువులయొక్క మాంసములు చాపలు పెరుగు పాలు కల్లు బెల్లము అధికమగు వుప్పు కారము అరటియాకులో భోజనము అరటికాయ మొదలగు పదార్థములను పరిత్యజించవలెను.

పాండురోగాదులను గుదిర్చే రక్తమును శుద్ధిజేయుమందులు.

100 లోహరాజసిందూరము తులము బుడ్డి 1 కి రు 1—0—0

ప్రాతస్సాయంకాలములయందు చిన్నమెత్తు చొ॥ తేనెతోగాని పటికిబెల్లము చూర్ణముతోగాని అల్లమురసము తేనె కలపి గ్రాహిచేసిన దానితోగాని సేవించిన సమస్తమగు పాండురోగములుగుండెజబ్బులు అధికమగు ఆయాసము తగ్గును. మిరియము కషాయముతో సేవించిన శ్వాస కాస వుబ్బసము యెగరొప్పు పిల్లికూత సమస్త వుబ్బురోగములు ఆమరోగములు నశించును. పిప్పలిమోడి కషాయముతో సేవించిన సకలశిరోవ్యాధులు మెడలు కణతలు లాగుటలోనగు దుర్గుణములు తగ్గును. త్రిఫల కషాయముతో సేవించిన పంచపాండువులు వుబ్బులు తగ్గును త్రికటుక కషాయముతో సేవించిన పురాణజ్వరములు ఆమరోగము శూల అరుచిని బోకడచును. మరియు యేవిధమయిన గుండెరోగములు వున్నప్పటికి మండలదినములు సేవించిన తగ్గి మంచిబలము నిచ్చి రక్తశుద్ధిని వీర్యవృద్ధిని గలుగజేయుటయెగాక సకలఅజీర్ణములను బోకడచును.

101 క్షయపాండు శిందూరము బుడ్డి 1 కి రు 3—0—0

ప్రాతస్సాయం కాలములయందు చిన్నమెత్తు చొ॥ తేనెతో సేవించిన పాండువులు సకలక్షయలు గుల్మరోగములు తిమ్మిరివ్యాధులు నరములయొక్కబలహీనతసకలాజీర్ణములుకామిలమోమొదలగురోగములను గుదుర్చును. మిరియాల రసముతో సేవించిన శ్వాస కాస కఫములోనగు అనేకవ్యాధులను గుదుర్చుచు రక్తశుద్ధిని ఆయుర్వృద్ధిని కలుగజేయును.

102 రక్తశుద్ధి మాత్రలు 30 కి రు 1—0—0

ప్రాతస్సాయం కాలములయందు ఒక్కొక మాత్ర చొ॥ వేడినీళ్ళతో సేవించిన పంచపాండువులు పాండు జ్వరము కన్ను కాలు చేతులు గోళ్లు తెల్లగాయుండి అన్నముయందు హితవులేక యేమియు రుచియింపక యుండు పాండుశోభలోనగు అనేకవ్యాధులను పరిమార్చి రక్తశుద్ధని జేయును.

103 భావన కరక్కాయ తు 20 గల డబ్బి 1 కి రు 2—0—0

పూటకు అరతుల చొ॥ ప్రాతస్సాయంకాలములయందు నమలిమ్రింగిన పాండురోగములు అజీర్నరోగములు గుల్మరోగములు శూల మలబద్ధము శ్లేష్మము వగయిరాలను ఖండించడమేగాక మంచి ఆకలిని బుట్టించి రక్తశుద్ధిని జేయును.

రక్తశుద్ధి మందులకు పథ్యములు.

వమనవిరేచన కర్మలను జేసుకొనుట పాతబియ్యపుఅన్నము పెసలు కందులు చిరిశనగలయొక్క కట్టులు పొట్లకాయ గుమ్మిడిపండు లేత అరటికాయ పొన్నగంటికూర చిర్రికూర వంకాయలు మామిడిపండ్లు దొండకాయలు వుశిరపచ్చడి మజ్జిగ నెయ్యి తరవాణిచారు వగరుగల పదార్ధములు యివి రక్తశుద్ధి మందులయందు పథ్యములుగా యుండును.

అపథ్యములు

చుట్టత్రాగుట వాంతిని వెళ్ళనియ్యకుండా అడ్డుజేయుట శరీరమునకు చమటపుట్టించుట స్త్రీ సంభోగముజేయుట బటాణీలు ఆకుకూరలు యింగువ మినుములు నీళ్ళను విశేషముగా త్రావుట తెలగపిండి తాంబూలము కల్లు చింతపండు మామిడిలోనగు పులుపుగల పదార్ధములు చెడిన పదార్ధములు పులిసిన పదార్ధములు పగటియందు నిద్రించుట మిక్కుటముగా వుప్పుకారము భుజించుట దుంపకూరలు పిండివంటలు మొదలగు అజీర్న కర పదార్థములను భుజించుట కడుపులో మంటను బుట్టించు పదార్ధములను దినుట యివి రక్తశుద్ధి ఔషధములకు అపథ్యములు గావున వర్జింపవలెను.



శుక్ల మేహాదులను బోగొట్టి బలమును కలుగజేయు ఔషధములు.

104 శుక్లమేహ సంజీవనము సీ 1 కి రు 1—0—0

ప్రాతస్సాయం కాలములయందు ఒక్కొక్క మాత్ర చొ॥ అరతులంయెత్తు ఆవువెన్నలోవుంచి సేవించిన శుక్లమేహాది 20 మేహములు మంటగా వెడలు శుక్లము మేహపిటికలు మేహరణములు మేహనంజువీట్లయందు గ్యారంటీగా పనిజేయును.

105 అమృత వర్షిణి తు 20 గల డబ్బా 1 కి రు 3—0—0

ప్రాతస్సాయం కాలములయందు తులంయెత్తు చొ॥ నోటియందు వేసుకొని చప్పరించి మ్రింగునది యితర అనుపానములు యేమియు అక్కరలేదు మందు దిగనివారలు కాచిన ఆవుపాలు అరసోలడు పుచ్చుకొనవలెను. యిటుల మండలముదినములు సేవించిన సెగసవాయిలోనగు సుఖవ్యాధులు జీర్నించుటచే కలుగు సకలవిధములయిన శుక్లనష్టములు యీవ్యాధివల్ల కలిగే, కీళ్ళనొప్పులు కీళ్ళు పడిపోవుట జ్వరము ఆకలిలేకపోవుటలోనగు సకల దుర్గుణములును ఒకవారము దినములలో ఖండించును. మంచిరక్త వృద్ధిని నరములకు బలమును నొసంగి ఆయుర్య శోబల సంపన్నులనుగా జేయును.

106 రజత నవనీతము మాత్రలు బుడ్డి 1 కి రు 3—0—0

ప్రాతస్సాయంకాలములయందు ఒక్కొక్క మాత్ర చొ॥ ధనియాలు రసముతోనయినా తులం వుశిరికవరుగు అరతులంయెత్తు వేపజిగురు రెండున్ను కలిపి సోలడునీళ్లుపోసి గిద్దెడు నీళ్ళవరకు మరగనిచ్చిన కషాయముతోడనుగాని ద్రాక్షపండు రసముతోగాని సేవించిన సుఖవ్యాధులు జీర్నించుటచేకలుగుశుక్లనష్టములు యింద్రియముమూత్రముతోకలిసి పడువ్యాధులు కీళ్ళు పిక్కలు నొప్పులు వింశతి మేహములును హరించుటయేగాక రక్తవృద్ధిని శుక్లవృద్ధిని నరములకు మంచిసత్తువను యిచ్చిమంచి రూపమును గలుగజేయును.

107 వజ్రతైలము సీసా 1 కి రు 1—0—0.

యిది పచ్చకర్పూరము మూలికాసారముతోను చిట్టాముదముతోను తయారగును. ఇది శుక్ల నష్టమువల్లను మేహవాతము వల్లను సవాయి మేహాదులవల్లను రసదోషము వల్లను నొప్పులు చేసిన లేక పడిపోయిన కీళ్ళకు పైని రుద్దుటవల్ల కుదురుటయే గాక నరములు బిగిజేయుట జిల పోటులు వాపులు పక్షవాతములు మూతివంకర వాతములకు నాలుగయిదు రోజులు మర్ధనా జేసిన తక్షణమే నివారణ మగును. సందియము లేదు. రోజుకు రెండు మూడు పర్యాయములు మర్ధనా చేయుచుండవలెను. పూటకు తులం యెత్తు చొ॥ ప్రొద్దుట సాయంకాలము లోపలకు పుచ్చుకొని చప్పిడి పథ్యమును ఆచరించిన నరములయొక్క జిల, కీళ్ళ వాయవులు మేహ వాయునొప్పులు పోవును.

108 శుక్లస్తంభన మాత్రలు. 10 గల పే 1 కి రు 0—6—0.

సూర్యాస్తమాన టయిమునందు రెండుమాత్రలు అరతులము యెత్తు చీనా పంచదారలో గలిపి తేనెవేసి రంగరించి భుజింపవలయును. రాత్రి 7-8 గంటలకు మధుర పదార్థములతోను ఇగురు కూరలతోను భుజించేది. పులుసు గూడదు. కాఫీ టీ వగైరా పుచ్చుకొనవచ్చును. తాంబూలము వేసుకొనవచ్చును.

109 పంచబాణవటి ది 40 లకు సరిపడుమందు డబ్బీ 1కి 4-0-0.

సాయంత్రమందు భోజనముచేసి పరుండునపుడు ఒకమాత్రను పలగగొట్టి రెండవున్సులు కాచిన ఆవుపాలయందు కలిపి సేవించి పరుండిన నానావిధ శుక్లనష్టములను లింగనరములయొక్క బలహీనతయు లేపనశక్తి తగ్గుట లోనగు వ్యాధులను నిశ్శేషముగా కుదుర్చుటయే గాక శ్వాసకాస క్షయము అజీర్ణమును దునుమాడి సంపూర్ణముగ వీర్యవృద్ధి రక్తవృద్ధిని కలుగజేయును.

110 మదనబాణ చూర్ణము 20 దినములకు సరిపడుమందు
డబ్బీ 1 కి రు 5—0—0.

ప్రాత స్సాయంకాలములయందు రెండు అణాల యెత్తు చూర్ణ



ము చొ॥ పావుతులము పంచదారలో చేర్చి బర్రె నెయ్యితోగాని, బర్రెపాలు గాచినవి అయినను కాచనివి అయినను సరే గిద్దెడు (లేక) రెండు అవున్సులలో కలిపి పుచ్చుకొనవలెను. పాలు నెయ్యి దొరకనియెడల బెల్లము పానకముచేసి గిద్దెడు పానకములో కలిపి పుచ్చుకొనిన సకలవిధ నపుంసకత్వదోషములు అంగనరములయొక్క బలహీనత లేపనశక్తియు సంభోగేచ్ఛయు లేకుండుట లోనగు దుర్గుణములను బోకడచి విశేష వీర్యవృద్ధిని గలుగజేయుటయే గాక శతసంఖ్యాకమగు స్త్రీలయొక్క మద మడంపుజాలునంత సంభోగశక్తిని గలుగజేయును.

111 లింగలేపన తైలము సీసా 1 కి రు 3—0—0.

యీ తైలమును తమలపాకుమీద చిన్న పుడకతో బాగుగా వ్రాసి అంగపుష్పమును విడచి అంగముమీద కట్టవలెను. ఇట్లు 7 దినములుచేసిన మధ్యనువచ్చిన నపుంసకత్వమును తొలగించి జన్మషండులకు కూడాపుంస్త్వమును కలించును. అంగము సన్నగిలుట లోనగు అంగదుర్గుణములను బాపి అంగపుష్టి నొసంగును. అంగపుష్పము అనగా లింగాగ్రమున నుండు పోక.

112 అమృతవల్లీ రసాయనము. డబ్బా 1 కి రు 3—0—0.

ప్రాత స్సాయంకాలములయందు పావుతులము చొ॥ సేవించవలెను. సేవించిన వెంటనే కాచిన ఆవుపాలు అరసోలడులో తులముయెత్తు పంచదార వైచి అనుపానముగా పుచ్చుకొనవలెను. యిట్లు 40 దినములు సేవించిన లఘుస్ఖలనము స్వప్నస్ఖలనము నీరుడుతో యింద్రియము కలిసి పోవుట 20 మేహములు రతియందు యిచ్ఛలేక కడు నీరసముగాయుండుట. మొదలగు సకల దుర్గుణములను పోగొట్టి దేహపుష్టిని వీర్యవృద్ధిని కాంతిని కలుగజేయును.

శుక్లమేహాదులను బోగొట్టి బలమును గలుగజేయు
ఔషధములకు పథ్యములు.

గోధుమరొట్టె గోధుమజావ ప్రాతబియ్యపు అన్నము పులవలు పెసలు కందులు లోనగు కట్టులు నువ్వులు పేలాలు మజ్జిగ మీగడ

నేయి కుందేలు నెమలి జింక మేక పిట్లయొక్క మాంసములు మునగ కాయలు కాకరకాయలు దోసకాయలు అత్తికాయ వుల్లిగడ్డలు లేత అరటికాయ పొన్నగంటి కూర యెలుకచెవిఆకు వుసిరికాయ పచ్చడి వెలగపండు నేరేడుపండు మొదలగు సమస్త ఫలజాతులు తామరదుంప లు కలువ దుంపలు పెండలము చేమ సారకంద ఖర్జూరపుకాయ టెంకా య పాయసము మధురపదార్థములు మినపపప్పు పాయసము గుజ్జము మొ దలగు వాటినెక్కి స్వారిచేయుట విశేషముగా తిరుగుట దేహపరిశ్రమ చేయుట యివి యన్నియు మేహరోగములయందు పైమందులకు పథ్య కరములుగా యుండును.

అ ప థ్య ము లు.

మలమూత్ర వేగములను అడ్డగించుట పొగత్రాగుట రక్తస్రావ ముచేయుట యెల్లప్పుడు కూర్చునియుండుట పగలు నిద్రించుట క్రొత్త బియ్యపు అన్నము క్రొత్తవియగు కందులు పెసలు సెనగలు మినుములు లోనగు వాటి కట్టులు జలప్రాంతమున సంచరించు జంతువుల మాంస ములు అనుములు పిండితో జేయబడిన పదార్థములు నూనె సొరకాయలు పరస్పర విరుద్ధములగు అన్నములు పాచిన జలము అజీర్ణకరములగు నానావిధ పదార్థములు యివి అపథ్యములు.

వాతరోగములకు ఔషధములు.

113 అమృతస్రావ 15 దినములకు బుడ్డి 1 కి 5-0-0.

పూటకు పావుతులం యెత్తు చొ॥ ప్రొద్దుట సాయంకాలము అయిదు తులములయెత్తు ధనియాలు చితుకగొట్టి అర్థశేరు నీరు పోసి అష్టావశేషముగా కషాయము బెట్టి సదరు కషాయము నందుకలిపి సేవించవలెను. ఇట్లు 15 దినములు సేవించినపక్షఘాతవాతముమూతివంకర వాతము పూర్తిగా తగ్గిపోయి ఆ వాతమువల్ల కలుగు మాటరాకుండుట నీరు లోపలకు వెళ్ళకుండుట ఒక నేత్రమెలోనికి పోవుట లోనగు సకల దుర్గుణములను ఖండించి యధాప్రకార స్థితికి తీసికొని వచ్చును. యీఅ



మృత స్రావను లోపలకు సేవిస్తూ పైకి అర్కక్షీర తైలముగాని వజ్ర తైలముగాని మర్ధనాచేసిన ఒకటిరెండు పూటలలో గుణమిచ్చును. చిరకాలమునుంచి బాధించు వ్యాధులకు 30 దినములు తాత్కాలిక వ్యాధులకు 15 దినములు సేవించవలెను.

114 వాతభంజని 25 మాత్రలు పే 1 కి రు 0—4—0

ప్రాతస్సాయం కాలములయందు ఒక్కొక్క మాత్ర చొ॥ మిరి యపురసంతోగాని (లేక) మిరియపు చూర్ణము పావుతులం ఆవునేతిలో కలిపిగాని మాత్రవేసుకొని యివి అనుపానముగా సేవించిన వురుస్తంభ వాతము అంగుళ్యవాతము బాహుకంపవాతము మొదలగు 80 వాతము లను హరించడమేగాక పడిశభారము జలుబుసమస్తశీతదోషములు ఒడలు బరువు వాతజ్వరములను ఖండించును. రోగబలమునుబట్టి రోజుకు నాల్గు అయిదు మోతాదులు వాడవచ్చును.

115 అర్కక్షీర తైలము సీసా 1 కి రు 1—0—0

మేహవాత నొప్పులు వాతనొప్పులు తిమ్మిరలు వాతపట్లు జిలలో నగు సమస్త వాతరోగములకు పయిన మర్ధనా జేయుటచేతనే శమించును తేలుకుట్టినచోట కొంచెము తైలము వేసి రుద్ధిన తక్షణముతగ్గును.

వాతరోగములయందు పథ్యములు.

వాతహరమగు తైలములచేత అభ్యంగనము చేసుకొనుట ఆవిరి పట్టి చెమటపుట్టించుట అగ్నికర్మచేయుట (అనగా) రక్షవేయుట కాల్చు ట, వాతమును హరించు ఆకులను వుడికించి కట్టుగట్టుట సశ్యముచేయిం చుట పులుపు వుప్పుగల పదార్థములను సేవించుట పాతబియ్యపుఅన్నము వులవకట్టు మేకమాంసము వుడుము పిచ్చుక కోడి నెమలి పిట్లమాంస ములు పథ్యకరములగు మత్స్యాదుల మాంసములు పొట్లకాయ మునగ కాయ వంకాయ వుల్లిపాయ దానిమ్మకాయ నిమ్మకాయ ద్రాక్షపండ్లు నారింజపండ్లు పాలు, టెంకాయి నీళ్లు ఆముదము ఖండశర్కర తాంబూ లము లంఘణము విరేచనము జేయించుట అగ్నిని దీపింపజేయు ఔషధ

ములు పత్యములు నోసంగుట లోనగునవి సర్వ వాతరోగముల యందు పథ్యకరములుగా యుండును.

అపథ్యములు

చింత నిద్రమేలుకాంచుట మలమూత్ర వేగములను అడ్డుట వాంతిజేయించుట శనగలు కొర్రలు వెదురుబియ్యం ఆరికలు చామలు జొన్నలు మొదలగు తృణధాన్యములు అలసందలు పెసలు బెల్లము ఏటి నీరు చల్లనినీరు అనుములు ఆకుకూరలు పరస్పర విరుద్ధములగు అన్నపానాదులు యెండిన మాంసము చేపలు తేనె వగరు కారము గల పదార్థములు స్త్రీ సంభోగము యెడలేక తిరుగుట యెల్లప్పుడు పరుండియుండుట యివి అన్నియు వాతవ్యాధులకు విరుద్ధములు గావున విడువవలయును.

116 కర్ణరోగ తైలము సీసా 1 కి రు 0—6—0

ప్రొద్దుట సాయంకాలము యీతైలమును పదిచుక్కలు చొ॥ చెవిలో వేశి కొంచము దూదిపెట్టవలెను. చెవియందు చీమువుండినగా జుపిచికారీతో సామాన్యముగా వేడిగాయుండు నీళ్ళలో పెరమాగ్ నేటి ఆస్ పొటాసు రెండుపలుకులు వేశినయెరుపగును. ఆనీళ్ళచే పిచికారీచేయుచుండవలెను. ఇటుల నాలుగు అయిదు దినములు జేసిన చెవియందుండు కురుపులు చీముకారుట పోటు చెవితమ్మినొప్పి మాటవినరాకుండుట చెవులయందు ధ్వని మొదలగు సకలకర్ణ రోగములు మానును.

117 పగుళ్ళ తైలములు డ 1 కి రు 0—4—0

అరికాళ్ళు మడమలు అరచేతులయందు పగుళ్ళకు రోజుకు రెండు పరియాయములు చొప్పున నాలుగు అయిదు రోజులు వ్రాసినతోడనే పగుళ్ళుపోయి మృదుత్వమును కలుగజేయును. మేహారణములకు పుంస్త్రకు రక్తగడ్డలకు కురుపులకు గుడ్డను చాది రోజును రెండుపరియాయములు వేయుచు వచ్చిన నాలుగు అయిదు రోజులలో సకలరణములు నివారణమగును.



118 దంతరంజనము డ 1 కి రు 0—3—0

యీ పొడుము దంతములకు రాశి బ్రెషుతో తోమినను లేక వేప్రలితో తోమినను పండ్లునలుపు పండ్లయొక్క ఇగుళ్లనుండి చీము రక్తము స్రవించుట యిగురువాపులోనగునవి నయమగును ఆమరోముగలవారికి నోటియందు దుర్వాసన మెండుగా నుండును. గనుక అట్టిరోగముగలవారలు యీపొడుమునందు శొంఠి పుప్పు సమముగా నూరుకుని బాగుగా కలపి పండ్లు దోమినయెడల ఆమమువల్ల వచ్చే నోటికంపు శీఘ్రముగా నయమగును.

మూర్ఛరోగమునకు మందులు

119 మూర్ఛమందు 15 దినములకు రు 2—0—0

యీ మందును ప్రొద్దుటపూట అల్లమునిజరసము తులమెత్తు తీసి అందు తులమెత్తు చెరుకుబెల్లమును మందుపొట్లమును గలపి సేవించవలెను. సాయంకాలము తేనెలోకలపి పొట్లమును భుజించవలెను. అల్లము భూమిలో పాతినుంచిన అందుండు రసము ఇగిరిపోక పలుచగా వచ్చును. గాన అల్లమును ఇసుకలోపాతి తడుపుతుండవలెను. ఇటుల నెలదినములు ఈమందును విడువక సేవించిన ఆరువిధములగు మూర్ఛారోగములు మూర్ఛసంబంధమగు హృదయరోగము ఆవలింత ఒడల విరుపు మొదలగు సకల దుర్గుణములను ఖండించును.

120 అపస్మార గజాంకుశము 15 దినములకు రు 3—0—0

ప్రాతస్సాయం కాలములయందు పూటకు చిన్నముయెత్తు చొ॥ జీలకర్ర శొంఠి నిమ్మకాయరసముతో నూరి తులముయెత్తు రసము తీసి అందుకలిపి సేవించినను యింగువ సౌవర్చలవణము వంగభస్మము యివి పావుతులంయెత్తుచూర్ణించి గోమూత్రముతోగాని ఆవునేతితోగాని కలిపి మందుకు అనుపానముగా భుజింపవలయును. 15 దినములుగాని 30 దినములుగాని సేవించినను సరస్వతీ ఘృతము సేవించినను సకలవిధములగు మూర్ఛలు అపస్మారములు శాకిసాపమ్మలు మొదలగు ననేకరోగములను మొదలంట ఖండించును.

121 అపస్మారనస్యము సీసా 1 కి రు 2-0-0

బుడ్డియందు నుండు తైలము పావుతులముయెత్తు తీసుకొని లోహపాత్రియందు వేసి పావుగంటకాలము యుండలోనుంచి రెండుముక్కులయందు నస్యముజేయవలెను వెల్లకిలాపరుండి రెండుముక్కులయందు పోయవలెను పైఅపస్మారగజాంకుశములోపలకు సేవిస్తూయీనస్యమును రోజుకు ఒకటిరెండుసార్లు ముక్కులలో వేయుచుండిన ఆరువిధములగు మూర్ఛారోగములు కాకిసొమ్ములరోగములు అపస్మారరోగములు నిశ్శేషముగా తగ్గిపోవును.

మూర్ఛాదిరోగములయందు పథ్యములు

శరీరముపై చల్లనినీరుచల్లుట స్నానముజేయుట మంచిగంధముమున్నగువానిని బూసుకొనుట వెన్నెలలోపరుండుట పొగనుపీల్చుట అంజనములు నస్యములుచేయుట వమనము విరేచనముచేయుట పేలాపగెంజి పాతబియ్యముఅన్నము పెసలు కందులు కట్టు మేకమాంసము ఆవుపాలు శర్కర గుమ్మడిపండు పొట్లకాయ అరటికాయ దానిమ్మపండు లేంకాయ చిర్రికూర దాక్షిపండు వుసిరికపచ్చడి యివి పథ్యకరములుగాయుండును.

అపథ్యములు

చింతా దుఃఖము భయము క్రోధము ఆశ్చర్యకరములగు వస్తువులను జూచుట కల్లు చాపలు పరస్పరవిరుద్ధములగు నన్నపానాదులు మిక్కిలి వేడికలవియు అజీర్ణకరంబులగు పదార్థములు అధికముగాసంభోగముచేయుట దొండపండు ఆకుకూరలు నిద్రిపాపుట తాంబూలము యెండలోతిరుగుట చమటతీయుట మలమూత్రివేగమును అడ్డగించుట కారము గల పదార్థములను భుజించుట పెరుగు యివి మూర్ఛాదిరోగములు గలవారు విడువవలయును.

శిరోరోగములకు మందులు.

122 అమృతోదయతైలము సీ 1 కి రు 0-8-0

రోజుకు ఒకటిరెండుసార్లు తలకురాచుకొనుచు వారమునకు ఒకసారి తలరుద్దుకొనుచుండిన చిరకాలమునుంచి యున్న తలపోటు తలదిమ్ముతలదిరుగుట స్తిమితము లేక యుండుట కండ్లు యెరుపులు కారకములను కుదిర్చిమెదడుకు చలువజేయును యీతైలము మనస్సుతో పనిజేయు వుద్యోగస్తులు వర్తకులు విద్యార్థులు సదావాడుకజేయుచుండిన జ్ఞాపకశక్తి తగ్గకుండును.

123 సింధూరాదివటికలు బుడ్డి 1 కి రు 1-8-0

ప్రాతస్సాయంకాలములయందు ఒక్కొక్కమాత్రి చొ॥ ఆవునేతితోగాని పటికిబెల్లముచూర్ణముతోగాని సేవించిన నానావిధములగు శిరఃపైత్యములు శిరోకంపము శిరఃభ్రమణము కండ్లు తిరుగుట చెవులు ఘుమిఘుమిపడుట తలనొప్పి అరతలనొప్పి మెడలులాగుట లోనగు సకలపైత్యదోషములను పారదోలును.

124 సకలశిరోరోగహారి 8 దినములకు రు 1-8-0

ప్రాతస్సాయంకాలములందు ఒకఅణాయెత్తు చొ॥ మోతాదు ఆవునేతితోగాని పటికిబెల్లముచూర్ణముతోగాని సేవించిన మేహముపైత్యము వాతము ద్వంద్వముచల్ల జనించె సకల శిరోరోగములకు వజ్రాయుధము తలపోటు తలనొప్పి మెడలు లాగుట మొదలగు సకలమగ్గణములు మూడుపూటలలో తగ్గిపోవును.

125 సకలశిరోరోగహారకషాయము డ 1 కి రు 1-0-0

కషాయద్రవ్యము నాల్గుతులములు తూచి తవ్వెడు లేక పదహారు అవున్సునీళ్లుపోసి రెండవున్సుల వరకుమరుగనిచ్చి వడపోసుకునిఅందుతులమెత్తు చెరుకుబెల్లమును గలుపుకుని ఉదయమున సేవించినయడల ఎంతకాలమునుంచి యున్న శిరోరోగములైనప్పటికి నిశ్శేషముగా తగ్గుటయేగాక దంతములు నలుపు శిరఃపైత్యములు కంఠరోగములు నేత్రిరోగములనుపార్శ్వపునొప్పినిబోకొర్చును.

126 సుఖనిద్ర డ 1 కి రు 1-0-0

ప్రాతస్సాయంకాలములయం దరతులము చొ॥ సేవించిన నష్టముయిన నిద్రిశీఘ్రికలుగుటయేగాక సకల శ్లేష్మరోగములను మూత్రాధిక్యరోగములను బరిమార్చి సుఖమును కలుగజేయును.

127 విశ్వమోహనపౌడరు డ 1 కి రు 1-0-0

యీచూర్ణమును రాత్రియందు పింగానిలో తులముగాని అర తులముగాని వేసి కొంచెము కలియులాగున్న నీళ్లుపోసి యేదైనమూతవేసివుంచుకుని ప్రొద్దుట దంతధావనానంతరము తలకు బాగుగారాచుకుని పదినిమిషములుండి చన్నీటినిగాని వేడినీటినిగాని వాడుకున్న అభ్యాసప్రకారము స్నానమొనరించిన సమస్త శిరోరోగములు కండ్లరోగములు చుండ్రుపేలు యీరుపట్టుట శరీరదౌర్గంధము వెంట్రుకలు రాలుట అకాలమందు వెంట్రుకల నెరయుట లోనగు సమస్తరోగములను బాపద్రోలి తుమ్మెదలతో తులయగు వెండ్రుకలను బారలకొలది పెరుగునటుల జేయును స్త్రీలకు పురుషులకు కూడా మంచి సౌందర్యమును నొసంగును ప్రస్తుతకాలమును చదువుబాలురు వుద్యోగస్తులు లాయర్లు మనస్సుపనిజేయువారల కిది ప్రాణమిత్రుని వంటిది శరీరము కలబందకంపుచెమట వాసనవుల్లికంపులోనగు సకలశరీరదుర్గంధవాసనలు బోయి స్త్రీపురుషుల కన్యోన్యప్రేమను కలుగజేయును.

సకలశిరోరోగములయందు పథ్యములు

శరీరమున చెమట బుట్టించుట నస్యముచేయుట పొగద్రాగుట విరేచనము చేయించుట లంఘణము రక్తమోచనము చేయుట అగ్నికర్మచేయుట పాతనెయ్యి పాతబియ్యముఅన్నము గోధుమలు బియ్యపునూకలతో జేయు గంజి అరణ్యమందు సంచరించు జంతువులమాంసము పొట్లకాయ మునగకాయ ద్రాక్షపండు కాకరకాయ మామిడిపండు వుసిరికపచ్చడి దానిమ్మపండు మాదీఫలము మజ్జిగ తరవాణి చాలు టెంకాయనీరు యివి సకల శిరోరోగములయందు పథ్యకరముగాయుండును.

అపథ్యములు

తుమ్ములు ఆవలింతలు మూత్రవేగము నిద్రవేగము! అడ్డగించుట చెడిననీళ్లు పాచినీరు ద్రావుట పరస్పరవిరుద్ధమగు పదార్థములను సేవించుట నదులయందు స్నానము దంతధావనము పగటినిద్ర వీట్లనన్నిటిని శిరోరోగముగల మనుజుడు వదలవలయును.



పైత్యాది రోగములకు మందులు.

128 పైత్యరాజ చూర్ణము. డ 1 కి రు 2—0—0.

ప్రాత స్సాయంకాలములయందు 4 తులముల ధనియములు నీళ్లతోనూరి గిద్దెడు రసముతీసి అందు తులమెత్తు ఫ్యాక్టరీ పంచదారవైచి 2 అణాలయెత్తు పై చూర్ణమును కలిపి సేవించవలయును. ధనియాల రసము లేకపోతే నీళ్ళయందు పంచదారవైచి పై ఔషధము సేవించ వలెను. ఇట్లు సేవించిన తల దిరుగుట కండ్లు పచ్చబారుట గగుర్పాటు కాళ్లుచేతులు శిరము మండుట పుల్లగను చేదుగను వమనము వెళ్ళుట పైత్యగుబులు వికారము లోనగు పైత్యరోగములను గుదుర్చును.

129 పైత్యభంజని మాత్రలు 25 గల పే 1 కి రు 0-4-0.

ప్రాత స్సాయంకాలములయందు ఒక్కొక్క మాత్ర చొ॥ అల్లము జీలకర్ర కలిపి నూరి రసముతీసి పొంగించి వడియబోసి మాత్రకు అనుపానముగా బుచ్చుకొనిన నోట నీరూరుట పసరు వెళ్ళుట వికారముగా నుండుట పైత్యాజీర్ణము మొదలగు పైత్యముతో సంబంధించిన సకలవ్యాధులను ఖండించును.

---

130 భావన జీలకర్ర తులము 1 కి రు 0—2—0

పూటకు 2 అణాలయెత్తు చొ॥ నమలి మ్రింగిన పైత్యవికారము పసరు తలత్రిప్పు అహితవును తగ్గించి జిహ్వకు రుచి కలుగజేయును. మరియు నలుబది దినములు విడువక సేవించిన శ్లీపదము (లేక) బోదకాలు బోదచేతులకు కలుగుచుండు జ్వరములను పోగొట్టుటయేగాక క్రమముగా కాలవ్యవధిమీద పాదములయందు చేతులయందు నుండు వాపులను హరింపజేయును. అనేకులు బోదకాళ్ళు జ్వరములయందు వాడిచూచి దీనిగుణమును కనిపెట్టియున్నారు.

131 సర్వపైత్యహర ద్రావకము సీసా 1 కి 2—0—0.

నిత్యము ప్రాతస్సాయంకాలములందు అరగిద్దెడు నీటియందు 10 చుక్కలువేసి సేవించుచుండిన సర్వపైత్య రోగములు మలబద్ధము అజీర్ణము హరించుటయేగాక రక్తశుద్ధినిజేసి వీర్యవృద్ధి చేయును.

సకలపైత్యరోగాది ఔషధములకు పథ్యములు.

ప్రాతబియ్యపు అన్నము గోధుమజావ పొట్లకాయ చిర్రికూర పొన్నగంటి కూర పుళిరిక పచ్చడి చాదరాశికూర ద్రాక్షపండ్లు దానిమ్మ పండు పెసరపప్పు పొట్లకాయ దొండకాయ బీరకాయ ప్రాత చింతకాయ పచ్చడినిమ్మకాయ లేతఅరటికాయ సమస్తవిధములయిన పండ్లు.

అ ప థ్య ము లు.

పెరుగు పాలు బెల్లము మినుములు ఆవాలు విదాహకర ద్రవ్యములు గురుకర పదార్థములు సంచారము కోపము పులిహోరము మొదలగు ఉష్ణముగల పదార్థములు విడువవలయును.

మేహరోగములకు ఔషధములు.

132 సకలమేహహర చూర్ణము డ 1 కి రు 2—0—0.

ప్రాత స్సాయంకాలములయందు రెండు అణాలయెత్తు చూర్ణము పటికబెల్లంచూర్ణముతోగాని ఆవునేతితోగాని పంచదారతోగాని తేనెతోగాని సేవించినయెడల 20 మేహములను హరించుటయేగాక అతిమూత్రము బహుమూత్రము వారిమేహము లోనగు మూత్రవ్యాధులను గుదిర్చి రక్తవృద్ధియు రక్తశుద్ధియు కలిగించి మిక్కిలి బలముకలిగి సర్వరోగవిముక్తులయి ఆరోగ్యవంతు లగుదురు.

133 మేహద్రావకము. సీసా 1 కి రు 2—0—0.

ప్రాత స్సాయంకాలములయందు యీ ద్రావకమును 10 - 15 చుక్కలవరకు పంచదారయందు వేసి సేవించిన సకల మేహములను దరిచేరనీయకుండా జేయుటయేగాక రక్తవృద్ధిని రక్తశుద్ధిని వీర్యవృద్ధిని విస్తారము బలమును జేయును. సమస్త వ్యాధులను హరింపజేయు శక్తి గలదు.

134 మేహభంజని మాత్రలు 25 గల పే 1 కి రు 0-4-0.

ప్రాత స్సాయంకాలములయందు ఒక్కొక్క మాత్ర చొ॥ సేవించిన సకల మేహములను అందువల్లవచ్చే వుడుకుజ్వరము అహితవును నీర



సమును కాళ్ళు చేతులు లాగుట, నడుములాగుట అశక్తి లోనగు మేహములవల్ల కలిగే సకల వ్యాధులను ఖండించును.

135 విశ్వసుందర సింధూరము బు 1 కి రు 2—0—0.

ప్రాతస్సాయంకాలములయందు గురిగింజయెత్తు చొ॥ ఆవునేతితోగాని ఆవువెన్నతోగాని ద్రాక్షపండ్ల రసముతోగాని పటికబెల్లం చూర్ణముతోగాని ధనియాల రసముతోగాని సేవించిన శుక్లమేహాది 20 మేహములు స్త్రీలకు గలుగు సమస్త కుసుమరోగములు ఋతుదోషములు హరించుటయేగాక మేహశూలలు మేహజ్వరములు మేహవుడుకులను నిర్మూలముజేసి రక్తశుద్ధిని బలవృద్ధిని కలుగజేయును.

136 సర్వమేహ జంఝూనిలము. సీసా 1 కి రు 1—8—0.

ప్రాతస్సాయం కాలములయందు చిన్నయెత్తు మోతాదును వెన్నతోగాని తేనెతోగాని పాలతోగానిపంచదారతోగాని సేవించినయెడల నానావిధ మేహములు హరించుటయేగాక రక్తశుద్ధియు వీర్యవృద్ధియు కలిగి మేహోద్రేకము వలన నీరుగానయిన యింద్రియమును గట్టిపరచి నిలుపును. సూర్యోదయమును అంధకార మెట్లుహరించునో ఆవిధముగా నానావిధ మేహములను హరించును.

137 అతిమూత్ర నివారణి. మా 40 లు గల సీసా 1 కి రు 4-0-0

ప్రాతస్సాయం కాలములయందు ఒక్కొక్క మాత్రను నలియగొట్టి ఆవుయొక్క గుమ్మపాలుఒకఔన్సుయందు మాత్రయొక్క చూర్ణమునుకలిపి సేవించిన వారి మేహము మధుమేహము మూత్రకృచ్ఛము మూత్రఘాతము మొదలగు సర్వ మూత్రరోగములు అందువల్ల కలిగే దాహము శరీర కృశత్వము మంటలు వగయిరాలను తృణప్రాయముగా ఖండించివైచును.

మేహరోగ ఔషధములకు పథ్యములు.

గోధుమజావ ప్రాతబియ్యపు అన్నము ప్రాతవియగు కందులు పెసలు వీట్లయొక్క కట్టులు పేలాపుగంజి మజ్జిగ వూరపిచ్చుక పావురము

మేక మొదలగు జంతువులయొక్క మాంసములు పొట్లకాయ బీరకాయ దోసకాయ కాకరకాయ అత్తికాయలు పుల్లిపాయలు లేతఅరటికాయ పొన్నగంటికూర దానిమ్మపండ్లు ద్రాక్షపండ్లు టెంకాయనీళ్ళు మొదలగునవి మేహరోగములయందు పథ్యకరములుగా యుండును.

అ ప థ్య ము లు.

మలమూత్ర వేగములను నిరోధించుట పొగ త్రాగుట చెమట వెడలించుట రక్తస్రావము చేయుట క్రొత్తబియ్యపు అన్నము పెరుగు జలప్రాంతములయందు నివశించు జంతువుల మాంసములు అనుములు తెలగపిండి స్త్రీ సంభోగము కల్లు నూనె బెల్లము సొరకాయ లోనగునవి అపథ్యములు.

381 శ్లీపద సంజీవి సీ1 కి రు 2—0—0

బోదకాలు బోదచేయిగల వారలకు కలుగుచుండు జ్వరములను రాకుండాజేయు అమూల్యౌషధము ప్రాతస్సాయంకాలములయందు2మాత్రలు చొ॥ తేనెతో సేవించవలెను. లేదా కరక్కాయ చూర్ణము 2 అణాలయెత్తు ఆముదము అరతులము గోమూత్రము తులం వీట్లను కలుపుకొని మాత్రకు అనుపానముగా పుచ్చుకొనిన దుస్తరమగు శ్లీపదరోగము 15 దినములలో హరించును. బోదయుండు కాలుచేతులకు ఆవువెన్న తేనె సమముగా కలపి మర్దనముగావించిన పాదములయందు దురద పులిసీరుకారుట మంటలోనగునవి హరించును.

శ్లీపదరోగములకు పథ్యములు.

ప్రాతబియ్యముఅన్నముకక్త మోక్షణంజేయుటవాపుగలప్రదేశములయందుఆవిరిపట్టించి చమటదీయుట విరేచనము జేయించుట పులవచారు పుల్లిగడ్డలు పొట్లకాయ వంకాయ మునగకాయలు కాకరకాయలు ముళ్ళంగి దుంపలు ఆవునెయ్యి ఆవుచల్ల బచ్చలికూర ఆముదము కారము వగరు దీపనముగల పదార్థములు పథ్యకరములుగా యుండును.



అపథ్యములు

పిండితోజేయు పదార్థములు పాలతోజేయుపదార్థములు జలప్రాంత్యజంతువుల మాంసము గురుత్వపదార్థములు జలుబుజేసెడి పదార్థములు దేహపుష్టిని కలుగుజేయు పదార్థములు విడువవలయును.

139 అంతరవృద్ధిహారి డ 1 కి రు 3—0—0

వరిబీజములకు అమోఘ క్రియ ప్రాతస్సాయం కాలములయందు ఒక్కొక్కమాత్ర చొ॥ చిట్టాముదపువేరు వావిలివేరు ములుగోరింటవేరు సమభాగములు దంచి కుండలోవేసి తవ్విడునీరువేసి గిద్దెడువరకు మరగనిచ్చి సదరు కషాయమునందు సైంధవలవణము పావుతులము అరతులము ఆముదముకలపి మాత్రవేసుకొని అనుపానముగా పుచ్చుకొనినను ఇంగువ గచ్చపలుకలు వెల్లుల్లిపులవలు తులమెత్తు చొ॥ దంచి ముందువలనే కషాయముగాచి అందు అరతులమువెత్తు ఆవునెయ్యి కలపి మాత్రకు అనుపానముగా పుచ్చుకొనినను తిప్పతీగ 4 తులములు దంచి పైనలెనే కషాయము పెట్టి మాత్రకు అనుపానముగా సేవించినను బీజములు వాపు బీజనరములు లాగుట వృద్ధియగుటలోనగు సర్వదుర్గుణములుపోయి బీజము యథాప్రకార స్థితికి మారగలదు. జీలకర్ర శోపు చంగల్వకోష్టు ఆవుపేడ రేగాకులు వీనిని కలితోనూరి వుడికించి కట్టినను సోమింతాకుగాని గొబ్బిఆకుగాని గొబ్బరి కోరుగాని గచ్చఆకుగాని ఆముదముతో వుడికించి సమశీతోష్ణముగా నంటకట్టినను సమస్తఅండవృద్ధులు తగ్గును

140 అండవాతహారి సీసా 1 కి రు 2—0—0

ప్రాతస్సాయంకాలములయందు ఒక్కొక్క మాత్రచొ॥ వుష్ణోదకముతో సేవించిన అండములువాసి జ్వరమువచ్చు వాతరోగము తత్క్షణమే వుపశాంతి జెందును. 10 దినములు సేవించినమరల నెన్నటికిని జనించదు.

అంతరవృద్ధిరోగములయందు పథ్యములు

విరోచనము జేయించుట చమటను దీయుట పట్లు కట్లు వేయుట

పాతవియగు యర్రిబియ్యపు అన్నము ఆముదము మేకమాంసము మునగకాయ పొట్లకాయ నెల్లికూర తాంబూలము వెల్లుల్లి వమనముజేయుంచుట యర్రివుల్లిగడ్డలు మజ్జిగ వేడినీళ్లు యివి అంతరవృద్ధి రోగములయందు పథ్యకరములుగా యుండును.

అపథ్యములు

జలసమీపములయందు సంచరించు జంతువులయొక్క మాంసములు యెండుచేపలు దుంపకూరలు పెరుగు పుద్దులు పిష్టాన్నము దుష్టమైన అన్నము బచ్చలికూర గురుకరపదార్థములు శుక్రవేగమును నడ్డగించుట మలమూత్రవేగమును నడ్డగించుట గుర్రము మొదలగువానిని యెక్కి సంచరించుట శ్రమజెందుట మైథునముజేయుట మిక్కుటముగా భుజించుట మార్గము నడచుట ఉపవాసముజేయుట వీనిని అండవృద్ధిగల వారలు వర్జింపవలయును.

141 కీలుమర్దనగుళికలు సీసా 1 కి రు 1-0-0

ప్రాతస్సాయంకాలములయందు రెండేసి మాత్రలు చొప్పున తుంగముస్తలు కషాయముతోగాని వాయువిడంగములు రసముతోగాని వాయువిడంగములు తు 1 వావిలియాకు తు 1 కరక్కాయలు తు 1 వెలుగుచెవియాకుగాని దీనివిత్తులుగాని తు 1 వెల్లుల్లిపాయలు తు 1 మునగవిత్తులు తు 1 చిత్రమూలము తు 1 వీనిని సమభాగములుగా దంచి నీరుపోసి అష్టావశేషము మిగులు వరకు కషాయముగాచి 2తులములమొత్తు కషాయముతో సేవించినను నుసిపురుగులు మెలుగ బాములు జనించు క్రిమిరోగములును క్రిమిరోగమువలన కడుపు శూలించుట గుండెలయందు మంట నేత్రములల్లగాయుండుట ఆసనమునుంచి తుట్టలుగా పురుగులురాలుట సర్వదావిరేచన అనుపానముయుండుట లోనగు సర్వదుర్గుణములు మొదలంట నశించును.

142 క్రిమికుఠారము డబ్బా 1 కి రు 2-0-0

ప్రాతస్సాయంకాలములయందు అరతులము చొ॥ ఒక ఔన్సు గోమూత్రములో కలిపి వారముదినములు సేవించిన జ్వరయుక్తమయిన



అప్పటికప్పుడు కోట్లకొలది యెుమిడికలు నుశిపురుగులు పుట్టుచుండినను సర్వమును నశింపజేసి శరీరసుఖము నిచ్చును.

క్రిమిరోగఔషధములకు పథ్యములు

పొట్లకాయ వేపపువ్వు ముల్లంగిదుంపలు పెసరకట్టు పాతబియ్యపుఅన్నము బీరకాయ లేతవంకాయ పాతచింతకాయపచ్చడి వుసిరిపచ్చడి ఆవుమజ్జిగ మొదలయినవి పథ్యకరములుగాయుండును (అపథ్యములు) పాలు మాంసములు బెల్లము నేయి పెరుగు ఆకుకూరలు మినుములు వులుసు తేనె మొదలగు మధురద్రవ్యములును క్రిమిరోగులు వర్జింపవలెను

143 రాజతాంబూలమాత్రలు 25 గల పె 1 కి రు 0-4-0

ఇందు పచ్చకర్పూరము కుంకుమపువ్వు వగయిరా సువాసనద్రవ్యములతో తయారుకాబడు మాత్రలు సుఖభోగులు సదా తాంబూలముతో సేవింపుచుండిన ముఖదుర్గంధము పాడువాసన పండ్లనుండిరక్తముపడుట అరుచి అజీర్ణము శ్లేష్మము ఆమము జోకడచి కాలవిరేచనముజేయించి శరీరమునకు కాంతి హెచ్చును.

144 స్వర్ణప్రభాంజనము సీ 1 కి రు 0-8-0

యీమందును కొంచముగా తలనొప్పి పార్శ్వపునొప్పి రొమ్మునొప్పులు గల చోట్ల రుద్దిన తత్క్షణమే గుణమిచ్చుటయేగాక యిరుకునొప్పులు గవదబిళ్లలు చిడుముగజ్జి దురద గల చోట్ల గూడా రుద్దిన తత్క్షణమే ఖండించును.

145 సువాసనతలనూనె బుడ్డి 1 కి రు 1-0-0

యిది మామూలుగా వాడుకజేసే హైరాయిలు వంటిదికాదు ఆయుర్వేదానుసారముగా అనేకమూలికలతో తయారుచేసిన నిరుపమానమయిన తైలము దీనిని సదా వాడుకచేయుటచే పేలుకొరుకుట బట్టతల అకాలఫలితము కండ్లుమంట పేనుపట్టుట చుండ్రు తలపోటులోనగు సకలశిరోవ్యాధుల బారదోలి తలవెంట్రుకలు తుమ్మెదరెక్కలవలె బారలు కొలది పెరుగజేయును.

146 వృశ్చికబాధనివారణి పే 1 కి రు 0-8-0

ఒకమాత్రను నీళ్లతో అరగదీసి కుట్టినచోట పట్టించి నిప్పు శగ తో కాచిన ఆరేటప్పటికి ఆశ్చర్యముగా కుదురును అనుభవమయిన శుద్ధ క్రియ ప్రతియింట నుండదగినది.

147 సర్వవిషసంజీవి డ 1 కి రు 2-0-0

త్రాచుబాము కరవబడిన మనిషికి నీమందు వుపయోగించిన వి షముదిగి ఆరోగ్యమును కలుగజేయును చాలా ఆశ్చర్యముగాయుండును

148 సకల జంతువిషదోషహరనస్యము సీ 1 కి రు 2-0-0

దీనియొక్క నస్యమువలన వెర్రినక్క ఎలుక సాలెపురుగు సకల విధసర్వవిషములు కోరలు గల యే జంతువవిషమైనను ఒక్కమారు న స్యముజేసినంత ఆశ్చర్యముగా పోవును అనేకులకు యిచ్చి చూచినది అ నుభవయోగము వకడబ్బా నలువది యేబది నస్యములకు వచ్చును.

149 విషదోష కలికము సీ 1 కి రు 1—0—0

దీనిని నీళ్ళతో అరగదీసి కంటియందు కలికము వేసిన సర్వజంతు విషములు దిగిపోవును పై మందులు వాడుకచేయుచు దీనిని కలికముచే యుచుండిన యెట్టిఅపాయకరమగు విషకాటులు అయినను తక్షణమే కుది రిపోవును. దీనిని కరవబడినచోటకూడా పైన వేయవచ్చును. పై మూడు రకములమందులు వుపయోగించే విధానమంతయు మందులతోనే విపు ములుగా తెలియునటుల వ్రాసిన చీట్లుంపబడును. ఆచీటీలో వ్రాసిన ప్రకారము ఉపయోగము చేయుచుండవలెను.

ముఖరోగ ఔషధములు

150 అగ్నిరోగహరి 15 దినములకు రు 4—0—0

ప్రాతస్సాయంకాలములయందు తులమెత్తు తమలపాకుల రసము లో కలిపి సేవించిన యెంతదుర్లభమగు శెగరోగమయినను 6 పూటలలో నయమగును యీమహా ఔషధసేవనవలన పచ్చశెగ మూత్రనాళమందు చురుకు పుండు బట్టగుట అతివేదన కడుపు శెగపోవుటలోనగు పత్సశెగ



వల్ల కలిగే యెట్టివిపరీత గుణములయినప్పటికి నిమిషములమీద మాయ మగును. గ్యారంటీ మందు.

151 చంద్రప్రభాగుళికలు 25 గల సీ 1 కి రు 1—0—0

ప్రొద్దుట సాయంకాలము ఒక్కొక్క మాత్ర చొ॥ సేవించవ లెను. మందు సేవించు రోజులలో మూత్రము విస్తారము నీరుడువెళ్లుచుం డిన శేరు మంచినీళ్ళలో తులమెత్తుపసపు గుండవేసి కాచి సదరునీళ్ళు దాహముగా వుపయోగించవలెను. మూత్రము విస్తారము కానప్పుడు మామూలునీళ్ళే త్రాగేది స్త్రీలు సేవించిన తెల్పు యెర్పులోనగు వ్యాధు లును తెల్పు యెర్పు కలసివెళ్లె మిశ్రమములగు సమస్త కుసుమవ్యాధులు మొదలంట ఖండించును.

152 సకలసెగ నివారణి డ 1 కి 5—0—0

యిది భస్మాదులు మూలికలు చందిని కోపెబాతో తయారగు లేహ్యము దీనిచే అనేకులు బాగుపడినటుల అనేక యోగ్యతాపత్రములు యిచ్చియున్నారు. దీనిని ప్రాతస్సాయంకాలములయందు అరతులం యెత్తు చొ॥ అనుపానము అక్కరలేకనే సేవించిన యెర్పు తెల్పు ఆకు పచ్చలోనగు సర్వసెగవ్యాధులను ఖండించడమేగాక మూత్రమందు చురుకు మంట మూత్రనాళమందు నొప్పి చీము స్రవించుటలోనగు సెగవ్యాధివలన కలిగే సకలవ్యాధులను 2-3 దినములలో ఖండించును. వకడబ్బీతో వ్యాధి నిశ్శేషముగా పోవును. 4, 5, సంవత్సరములనుంచి బాధపడుచుండినయడల 2 డబ్బిలను సేవించవలెను. స్త్రీలుసేవించిన సర్వ సెగలు యెర్పు తెల్పు లోనగు కుసుమవ్యాధులు అస్థిస్రావసోమరోగాది సకలస్త్రీ వ్యాధులను ఖండించును.

153 ప్రమేహాంతక భస్మము తు 2 లు గల సీ 1కి రు 2—0—0

ప్రాతస్సాయంకాలములయందు అణాయెత్తుగాని రోగబలాను గుణముగా ఔషధమును ధనియాలు లవంగాలు జీలకర్ర వస్తువు ఒక టెంటికి అరతులం చొ॥ నీళ్లతోనూరి ఒకఔన్సు రసముతిసి (రసము కాచ

వక్కరలేదు) అందు ఔషధము మోతాదుకలిపి సేవించిన దారుణమయిన అన్నిజాతుల శెగరోగములు 20 మేహములును గరుత్మంతుడు సర్పముల రూపుమాపినచందము సీవ్యాధి రూపుమాసి దేహారోగ్యము కలిగించును.

154 ప్రమేహాంతక చూర్ణము సీ 1 కి రు 1—8—0

ప్రాతస్సాయంకాలములయందు పూటకు చిన్నమెత్తు లగాయితు అణామెత్తువరకు దేహబలానుగుణముగా పటికిబెల్లం చూర్ణానుపానముతోగాని లవంగములు అరతులం బియ్యపుకడుగులోనూరి రసముతీసి పొంగించకుండా పచ్చిరసములో పటికిబెల్లం చూర్ణము తులమెత్తుకలిపి సేవించినను యీతకల్లు వకఔన్సులోవేసి సేవించినను పొన్నగంటివేళ్లరసము ఒకఔన్సునందు పటికిబెల్లం చూర్ణము తులమెత్తున్ను ఔషధచూర్ణము అణామెత్తు కలిపి సేవించినను తెల్లశెగ పచ్చశెగ యర్రశెగలోనగు సర్వశెగలు సూర్యుని చూచినమంచు వగిది పటాపంచలైపోవును.

155 శెగలకు పిచికారి ఔషధము సీ 1 కి రు 0—12—0

కాగి చల్లారిన నీళ్ళయందు రెండువడ్లగింజలయెత్తు పిచికారీచూర్ణము కలపి గాజుపిచికారితో శెగరోగులు పిచికారిమూతి మూత్రనాళములోనికి జొనిపి వుదయసాయంకాలములు పిచ్చికారిజేసిన నాళమందునందు శెగసంబంధమయిన పుండును త్వరితములో గుదుర్చుటయేగాక అధికమగు స్రావమును (లేక) బట్టంటును గాకుండా జేయును. శెగవ్యాధులయందు పిచ్చికారీజేయుచు మందును సేవించిన తత్కాలితమునందే గుణము అగుపించును పిచ్చికారీ చేయలేనివారలు ఔషధమోతాదు కొంచము అధికముగా పుచ్చుకొనిన శీఘ్రముగా వ్యాధులు దొలగుచుండును. పిచికారీ ఔషధము నీటిలోగలపి ఆనీటితో డ్రెస్సింగుచేసినను (లేక) కడిగినను యెటువంటి రణములనయిన 4, 5, దినములలో మానుపుండుగలిగి త్వరలో నివారణమవును.



పైనవ్రాసిన శెగరోగఔషధములకు పథ్యము

పాతబియ్యము అన్నము కందిపప్పు పెసరపప్పు యీతకల్లు ఆవుచల్ల ఆవునేయి పెరుగు తోటకూర బీరకాయ పొట్లకాయ నీరుల్లిపాయముల్లంగిదుంపలు శర్కర కలకండ తాటి కలకండ తాటిముంజిల్లు బెల్లము మేకమాంసము పాతదియగు పుళిరిక చింత దబ్బ నిమ్మ వీట్లుపచ్చళ్లు అరటిపండు శీతాఫలము నారింజకాయ కరుబోజాకాయ మామిడి అల్లం కొత్తిమిరి లోనగు పదార్థములు పథ్యకరములుగాయుండును.

అపథ్యములు

క్రొత్తబియ్యపన్నము పులవచారు గోయదోటకూర ఆవనూనె గుమ్మిడి బచ్చలి బాతు కోడి పంది వీట్లమాంసములు చేపలు మామిడికాయ కరక్కాయ నూతినీరు పైత్యము కాక జేయు సమస్తపదార్థములు విడువవలెను.

(సవాయిరోగములకు)

156 సూర్యప్రభా గుళికలు సీ 1 కి రు 1—0—0

ప్రాతస్సాయంకాలములయందు వక్కొక్క మాత్ర చొ॥ అరతులమెత్తు ఆవునెయ్యిలో ఉంచి సేవించేది ఆవునేయి పేరుకొనినదిగా ఉండవలెను. సామాన్య వ్యాధులయందు వకనెల బగ్గి మచ్చ పొడ మొదలగు పురాణవ్యాధులు అనగా దీర్ఘకాలమునుంచి వున్న రోగములకు 2 నెలలు సేవించవలెను. యీఔషధమునకు పథ్యము సామాన్యముగానాచరించిన చాలును.

157. ఆనంద రసాయనం డ 1 కి రు 1-8-0.

పూటకు ఉస్తికాయంత (లేక) రెండు అణాలయెత్తు చొ॥ ప్రొద్దుట సాయంకాలము అనుపానము అక్కరలేకయే సేవించిన వాతమేహ వాతనొప్పులు సవాయిమేహమువల్ల కలిగే కీళ్లనొప్పులు కాళ్లయొక్క నరములు బిగుయుట నరములు పట్లు నడుము కదలనీయకుండుట నడుము వెల్లకిపడు సలుపుట గొంతెక చంకలు లింగస్థానము మొదల

గు మర్మస్థలముల యందు గలుగు గజ్జీటీట రణములు సవాయి కుష్టులు మేహగ్రంథులు మచ్చలు శెగసవాయి మొదలగు మిశ్రమజాతులను కూడా బ్రహ్మాస్త్రమువలె ఖండించును.

158. సవాయికుల ధ్వాంతభాస్కరం మాత్రలు 35 గల సీ 1కి 5-8-0

ప్రాతసాయంకాలములయందు మూడుమాత్రలు చొ॥ తేనెలో ముంచి గొంతుకులో వేసుకొని మింగవలెను. మాత్రలు వేసికొనిన వెంటనే రెండుకరకాయల బెరడు నోటియందు వేసుకొని 15 తమలపాకులకు సామాన్యముగా సున్నమువ్రాసి తాంబూలము వేయవలెను ప్రొద్దుట సాయంకాలము పోకచెక్కకు మారుగా, కరకాయబెరడుతో నీ తాంబూలము వేయవలెను. ఇట్లు అయిదురోజుల పూట ఆచరించిన 13 విధములగు సవాయి, సవామేహములు, సవామేహములవల్లను కలిగేరణములు,మేహరణములు,కీళ్లనొప్పులు, లోనగుయెటువంటి సవాయిరోగముల నయినా, నిశ్శేషముగా గుదుర్చుటకు, సందియము లేదు. యీ మందు సేవించిన మహానుభావులు యెందరో అనేక బహుమానములు సన్మానపత్రములు యిచ్చియుండిరి. యిది మాకు అభిమానయోగము వైద్యులకు పెన్నిధివంటిది.

159. సర్వోపదంశ నివారణమాత్రలు. 60 గల సీ 1కి రు 3-0-0.

ప్రాతస్సాయంకాలములయందు ఒక్కొక్కమాత్ర చొ॥ అనుపానము నక్కరలేకయే సేవించిన రొచ్చు; పచ్చు, కొరుకు, చిడప, చిట్లపిరంగిలోనగు 13 జాతుల సవాయిలు, యీమందు పేరుచెప్పిన పటాపంచలైపోవును. సందియములేదు. అనేకులు సేవించి దీనియోగ్యతను, గొనియాడిరి. యెటువంటి సవామేహరణములనయి నంబరిమార్చును. యిది పరిశుద్ధమగు దివ్యమగు మందు.

160. బల్లాతకీ తైలము సీ 1 కి రు 2-0-0.

ప్రాతస్సాయంకాలములయందు రెండు తమలపాకులపైని రెండు చిన్నములయెత్తు తైలమును తమలపాకులపై వ్రాసి చుట్టచుట్టి నోటిలో వేసుకొని నమలి మింగిగిన సమస్త చర్మరోగములు, మచ్చ, పొడ, రణములు, బగ్గి, చిడుము, దురద, మొదలగునవి సవాయిమేహములు, సవాయిమేహ కుష్టువులు, కుష్టురోగములు, కుష్టునల్ల జనించె నానావిధ చర్మరోగములు, 40 దినములు సేవించిన తప్పక ఖండించును.



161 కర్పూరం మాత్రలు సీ 1 కి రు 2-0-0,

ప్రాతస్సాయంకాలములయందు రెండేసి మాత్రలు చొ॥ సేవించిన (అనుపానము నక్కరలేదు.) వివిధసవాయి రోగములు సవాయిరోగములవలన జనించు కీళ్లనొప్పులు రణములు మర్మస్థానములయందుండు వావు వుండ్లులోనగునవి వారము రోజులు సేవించిన నివారణమగును.

162. పింగాణీమాత్రలు సీ 1 కి రు 2-0-0.

ప్రాతస్సాయంకాలములయందు ఒక్కొక్క మాత్ర చొ॥ చింతపండుగుంజు కుంకుడుగింజంత తీసి సదరు గుంజలో మాత్రవుంచి సేవించినను పెసరపిండి నీళ్లతో నూరినది గచ్చకాయంత ముద్దలోనుంచి యయినను సేవించిన యడ్లచిట్లపిరంగి కొరుకు బగ్గిసవాయి లోనగు యెంత కఠినమగు సవాయిరోగమయినను బరిమార్చుటయేగాక నరములకు సత్తువనిచ్చి మంచి రక్తమును ఇంద్రియవృద్ధిని బలమును గలుగజేయును

163. ఆవపిండిమందు సీ 1 కి రు 2-0-0.

ప్రాతస్సాయంకాలములయందు అరతులమెత్తుగాని, తులమెత్తుగాని, ఆవకాయ, వూరగాయ, పెట్టిన వూరగాయలోని ఆవపిండిలో మాత్రవుంచి సేవించవలెను యిటుల 9 రోజుల సేవించిన, చిట్లపిరంగికాయ సవాయి, కోడిజుట్టుసవాయిలోనగు సమస్తసవాయిరోగములను గుదుర్చుటయేగాక మేహనొప్పులు, సవాయిమేహం జీర్ణించుటచే కలగిన శుక్లనష్టమును మొదలంటా ఖండించును దీనియందు మందుసేవించినంతకాలము పాలు, బెల్లము, మజ్జిగ, పెసరపప్పు చేపలు స్నానం మాని మిగత సకలపదార్థములు సేవించవచ్చును నోరు ఎంతమాత్రముగాబు చేయదు ఇందుర సాదులు కలియలేదు.

164. యింగిలీకరసం మాత్రలు సీ 1 కి రు 2-0-0.

ప్రాతస్సాయంకాలములయందు ఒక్కొక్క మాత్ర చొ॥ అనుపానమక్కరలేకయే సేవించిన, సమస్తసవాయి రోగములు సుఖ సంబంధములు జీర్ణించుటచే గల్గు శుక్లనష్టము, మేహారణములు, మొదలగు అనేకరోగములను మొదలంటా ఖండించి దివ్యదేహునిగా జేయును. నోరు ఎంతమాత్రము పట్టదు పథ్యము సామాన్యము.

165. ప్రతాపమార్తాండము డ 1 కి రు 2-0-0.

ప్రాతస్సాయంకాలములయందు శనగగింజంత చొ॥ 15 దినములు సేవించవలెను, జీర్ణగతివ్యాధి అయినయడల 20 దినములు సేవించిన నూత్నపూరాతనములగుబిళ్లలుగాని అడ్డగర్రలను గాని శెలలువేసి చీము స్రవించేవిగాని తోముట చేతను దించుట చేతను నవిదిగక కీళ్లయందు చేరి అచ్చట పెద్దవాపుజెనించి మిగుల బాధబెట్టు నీఘోర రోగము వారముర్రోజులు యీమందును పుచ్చుకొనిన సుగుణము యేర్పడి 15 దినములు సేవించిన నిర్మూలమయి సుఖమును గలుగజేయును. బిళ్లకు యిదివరలో లోపలకు మందుయిచ్చి కుదుర్చు గ్యారంటీ యోగములు కావరావు యీ మందును చాలా వ్యయప్రయాసలతో కనిపెట్టి అనేకులకు యిచ్చి వారిచే సన్మానము నందియుంటిమి గ్యారంటీ నేతితో పోపెట్టిన చింతపండుచారు కందిపప్పు యిగురుకూరలు తినవలయును ముఖ్యముగా ప్రతిపూట చారు పుచ్చుకొనవలెను. యీమందు సేవించుట యములో గోంగూరలు తాటిబెల్లము కలివేసివండిన అన్నము లక్ష్మిచారు నూనె మజ్జిగ మానవలెను.

1్6. బిళ్లలకుపట్టీ డ 1 కి 1-8-0

యీ మలాంమును కేమిరేకు గుడ్డపైని వేసి కొంచం నిప్పుశెగనుకాలిచి బిళ్లపైన నటించేది మలాము ఆరిపోయిన యడల కల్వములో వేసి నాలుగయిదు ఆముదము చుక్కలు వేసి గట్టిగా నూరుచుండిన పల్చనగుచుండును. అది కత్తితోటి చివ్వి గుడ్డపై రాయుచు నదరుబిళ్లకు వేయుచుండవలెను. పట్టుపూడువరకు తిరుగపటు వేయనవసరము లేదు పట్టు వూడినప్పుడు తిరుగపట్టు వేయవలెను. 4 దినములకొకతూరి విరేచనములకు అగద తీసుకొనుచుండవలెను.



సవాయిరోగములయందు పథ్యములు.

కందిసీరు, కంద, ఆవుపాలు, ఆవునెయ్యి, ఆవుచల్ల, బీరకాయ, పొట్లగాయ, పొన్నగంటికూర, చాదరాశికూర, ధనియాలుపొడి తాంబూలము మెంతిపొడి పాతవియగు పుళిరికపచ్చడి చింతకాయపచ్చడి చింతచిగురు యెండినది మంగలములో వేయించిన వుప్పు ప్రతికూరలలో తక్కువ వేసుకొనవలెను పథ్యము సామాన్యము అని వ్రాసినమందులకు పథ్యము సామాన్యముగా ఆచరించినను ఆచరించవచ్చును లేదు పథ్యము లేకయే ఔషధమును పుచ్చుకొననచ్చును పథ్యము వ్రాసిన మందులకు పథ్యము యెటులవ్రాసియున్నదో అటులనే ఆచరించవలెను. పథ్యము వ్రాయనిమందులకు యీ పథ్యమును ఆచరించవలెను.

అపథ్యములు.

అరటియాకులో భోజనము అరటికాయ అరటిపండు స్త్రీ సాంగత్యము కందిపప్పు తప్ప తక్కిన పప్పుదినుసులు కంద తప్ప యితర దుంపకూరలు పెరుగు వంకాయ ఆవ బచ్చలి నూనె మేకమాంసము తప్ప యితర మాంసములు చేపలు యివి మానవలెను.

రణాదులకు పాలాస్త్రి వగయిరా మందులు.

167 కోతపాలాస్త్రి రాగిడబ్బి 1 కి రు 1-8-0.

బిళ్లకురుపు రక్తగడ్డ లోనగునవి యేమందువేసిన పక్వామై చితకక బాధపెట్టు కురుపులకు సూదిమొనతో కొద్దిగాదిసి కురుపుల మొనలపై శనగబద్దంత వెడల్పున నుంచి చీమగొబ్బవిత్తులు నీళ్ళలోవేసి చేతితో పిసికిన మెత్తనగును. అందునీరుపిండి పలుచగాచేసి కోతకువేసిన కురుపుపై (కురువంతట) అంటించవలెను. 2 గంటలకాలములో కోసి చీమును పుత్రి రక్తమును బయటకు వెడలించును. ఒకడబ్బా అనేకులకు వుపయోగించును.

168 పాలాస్త్రి డ 1 కి రు 0-6-0.

యీ పాలాస్త్రిని గుడ్డకు పట్టించి రణముపై వేయుచు వచ్చిన అన్నిబాపతుల రణములు నివారణమగును.

169 వ్రణహారి కణికలు సీ 1 కి రు 1-0-0.

యీమందు వేసిన తీరని నవాయికురుపులు మేహారణములు నెత్తిమీద విడువకుండాయుండు పుండ్లను రెండురోజులు నీమందును ఆముదములో కలిపి పైకిపట్టించిన యెంతటిరణము నయినను మాన్పును.

170 కండూతి తైలము సీ 1 కి రు 0-8-0.

దీనిని బూయుటచేత దురద గజ్జి రొంటిగజ్జి తామర లోనగు చర్మవ్యాధులను బోకడచును.

171 తామరమందు డ 1 కి రు 0-6-0.

యీ తామరమందును ఒకటి రెండుసార్లు బూయుటచేత యెంతకఠినమగు తామర చర్మదళము మొదలగునవి పటాపంచలైపోవును.

172 చిడుముమందు డ 1 కి రు 0-3-0.

యీమందు పూయుటవలన ఎంగిలిచిడుము కుక్కగజ్జి దురదకురుపులు లోనగు రోగములయందు గొబ్బరినూనెలోగలిపి ఒకటి రెండురోజులు వ్రాసిన చిడుము మొదలగు చర్మవ్యాధులు నిర్మూలమగుటయే గాక మరల నెన్నటికిని జనించదు.

173 అగ్నిదగ్ధ రణపాలాస్త్రి డ 1 కి రు 2-0-0.

శరీరము నిప్పుచేతను పచనభాండములు వ్రక్కలగుటచేతను కట్టుకొనిన గుడ్డలు తగులబడి శరీరముకాలి రణమయినవారికి యేమందు వేసిన మానని మహారణములకు యీ అగ్నిదగ్ధ రణపాలాస్త్రి వారమురోజులు వేసినయెడల అద్భుతముగా గుదుర్చును. యీపాలాస్త్రి వేయునపుడు ముఖ్యముగా అనములు తినుచుండవలయును. చీముపట్టక పుండును ఆర్చుచు అంచులు మానుచుండును. అనుభవమయిన పాలాస్త్రి.



174 శంఖద్రావకము సీ 1 కి రు 1-8-0.

ప్రాతస్సాయంకాలములయందు యీ ద్రావకమును 10 చుక్కలు లగాయతు 15 చుక్కలవరకు నీటియందు వేసి పుచ్చుకొనిన సకలవిధములగు శూలలు అజీర్ణవ్యాధులు అజీర్ణ వాతములు పుచ్చుకొన్న వెంటనే తగ్గిపోవును. ఆకలి కలిగించును.

175 గుగ్గిల ద్రావకము సీ 1 కి రు 1-0-0.

యీ ద్రావకమును నొప్పులు వాపులుగల స్థలములలో వ్రాసిన తక్షణమే గుణము నిచ్చును. నొప్పులు లాగుటయందు దీనితో తులయగుమందులేదు. దీనిని పూటకు 20 చుక్కలచొ॥ మేకపాలలో గలిపి ప్రాతస్సాయంకాలములయందు వారమురోజులు సేవించిన విరిగిన యెముకలు తక్షణమే అతుకుకొనును. అమితమయిన వీర్యవృద్ధిని గలుగజేయును. అమితమగు బలమును గలుగజేయుటయే గాక మూలవ్యాధులను బోకడచును. సకలమేహములను ద్రుంచును. పథ్యము, పులుసు నూనె వర్జింపవలయును.

176 మైనపు అరఖు సీ 1 కి రు 0-8-0.

యీ అరఖును పూయుటచే నూతన పురాతనమగు కీళ్లనొప్పులు వాపులు పోవును. దుర్నీరు దుర్మాంసముగల స్థలములలో వ్రాసిన వాటిని 10 దినములలో హరింపజేయును.

సర్పిరోగములకు ఔషధములు.

177 సర్పిరోగహారి పైపూతమందు డ 1 కి రు 1-0-0.

యీ మందును వెన్నలోకలిపి బాడితిఆకు పసరు తులసిఆకుపసరు గాడిదిగడపాకు పసరు హంసపాదియాకు రసము గానుగవేరురసము తీగదొండాకు పసరు యివి ఒక్కొక్కటి తులం చొ॥ వెన్న 2 తులములు డబ్బిలో మందంతయు గలిపి పైకి రోజుకు 2 పర్యాయములు పూయవలయును. దీని పూతవలన సర్పివిసర్పము తెల్లగా నల్లగా కాలినపొక్కులవలె లేచి అరసి యెక్కడతాకితే అక్కడ పొక్కులు బయులుదేరు సర్పిరోగములు కండసర్పి కళ్లవాపు హరించును.

178 సర్పిరోగహార కషాయం. డ 1 కి రు 1-0-0.

నాల్గుతులములయెత్తు చూర్ణమును కుండలోవేసి అర్ధశేరు నీరు పోసి అష్టావశేషముగా గాచి వడపోసి ప్రాతస్సాయం కాలములయందు పుచ్చుకొనిన విసర్పి విస్ఫోటకము జ్వరము సోఫ దప్పి వాంతులు తాప ము దురద నశించును.

సర్పిరోగములయందు పథ్యములు.

ప్రాతబియ్యపుఅన్నము గోధుమజావ కొఱ్ఱజావ పెసలు సెనగలు కందులు వీటికట్లు మేకచేరువ వెన్న నేయి దాక్షపండ్లు దానిమ్మపండ్లు కాకరకాయ వేముచిగురు పొట్లకాయ వుశిరిక పచ్చడి యివి సర్పిరోగ ములయందు పథ్యకరములుగా యుండును.

అ ప థ్య ము లు.

దేహపరిశ్రమ పగటినిద్ర స్త్రీసంభోగము అధికమయిన గాలిలో వరుండుట కోపము దుఃఖము వాంతిని వెళ్లనియ్యకుండా నిరోధించుట ఆకుకూరలు పరస్పర విరుద్ధములగు పదార్థములు అజీర్ణకరములగు నానా విధపదార్థములు వుల్లిగడ్డలు వులవలు నువ్వులు చెమటపుట్టించుట దాహ కరపదార్థములు కల్లు యెండ యివి సర్పిరోగములు గలవాడు విడువ వలయును.

వుబ్బు లేక వంజుశోఫలకు మందులు.

179 శోఫసంహారి సీ 1 కి రు 4-0-0.

ప్రాతస్సాయం కాలములయందు 2 అణాలయెత్తు చొ॥ దిగ్గిదాయి నూనె తులమెత్తు కలిపి సేవించిన కీళ్లనొప్పులు ఒడలునొప్పులు గుండెభా రము శుక్ల మేహామువల కలుగు నంజుల్లు 15 దినములలో నిశ్శేషముచేసి రక్తవృద్ధిని జేయును. దీనికి పథ్యం: బీరకాయ పొట్లకాయ తెలగపిండి మేకమాంసము కొయ్యితోటకూర కందికట్టు ధనియాలపొడి నూనెపోపు ఇగురుకూరలు, రాత్రిలు రొట్టె ఆవుపాలు భుజించేది.



180 జీవామృతము సీ 1 కి రు 4-0-0.

ప్రాతస్సాయం కాలములయందు అడ్డిగెత్తు చొ॥ తమలపాకులో నుంచి తేనెవేసి రంగరించి ఆకుతోసహా నమలి మిఙ్గవలెను. కావలసి నయెడల ఒకటి రెండు తమలపాకులు నమలి మిఙ్గవలయును. ఇట్లు ఆ చరించుటచేత వాతనంజులు మేహనంజులు స్తంభీభూతముగానుండు సమ స్తవుబ్బురోగములు 16 దినములు సేవించిన దట్టమగు మంచు సూర్యో దయముచే పటాపంచలయిన చందమున రోగములను బోకార్చును. పథ్యం: రొట్టె పాలు చప్పిడి. 15 దినముల అనంతరమున వేయించిన వు ప్పు బీరకాయ పొట్లకాయ కందికట్టు కొయ్యితోటకూర మేకమాంస మున్ను స్నానమురోజున చిరివేళ్ళు వంగవరుగు వేసి కాచిన చారు వేసుకొనవలెను. అటుపిమ్మట సకలవస్తువులు తినవచ్చును.

181 జ్యోతిష్మతి గుళికలు సీ 1 కి 3-0-0.

ప్రాతస్సాయం కాలములయందు ఒక్కొక్కమాత్రచొ॥ మూడు రోజులుగాని అయిదురోజులుగాని చెవులవెంబడి వేడి వచ్చుపర్యంతము సేవించవలెను, అటుతర్వాత సేవించరాదు. యెంతటి కఠిన వుబ్బురోగ మునయిన బారదోలుటయేగాక వాతము శరీరమునొప్పి ఆమావము మొదలగు వ్యాధులను మొదలంట ఖండించును. పథ్యం; గంజిఅన్నము పాలుఅన్నము గోధుమరొట్టె వుప్పువేయకుండా సేవించవలెను. మందు మానినతర్వాత యిచ్ఛాపథ్యం 4 దినములు ఆచరించేది.

182 జ్యోతిష్మతితైలము సీ 1 కి 3-0-0

ప్రాతస్సాయంకాలములయందు తమలపాకుపై ని 5 చుక్కలువే సి చుట్టచుట్టి నమలి మిఙ్గవలయును పథ్యం కందిపప్పు గోధుమరొట్టె మేకమాంసము పాలు బీరకాయ పొట్లకాయ యీవిధముగా 7 దినము లు సేవించిన వాతనంజులు మేహనంజులు ద్వంద్వజనితనంజులు శ్లేష్మనం జులు దారుణమగు సమస్త వుబ్బురోగములు పటాపంచలైపోవును.

183 వుసిరికాయమందు డ 1 కి రు 2-0-0

ప్రాతస్సాయంకాలములయందు ఒక ఔన్సు పెద్దవుసిరికాయరసమునందు పావుతులముయెత్తు చొ॥ కలపి సేవించిన దారుణమేహావాత వుబ్బులు ద్వంద్వజనిత వుబ్బురోగములు శూల గుల్మములను బోకడిచి రక్తశుద్ధిని జేయును వుసిరికాయలు దొరకనిటయములో 4 తులములయెత్తు వుసిరివొరగు కషాయములో యీమందు కలపి సేవించవచ్చును.

184 లోహామృతము బుడ్డి 1 కి రు 2-0-0

ప్రాతస్సాయంకాలములయందు రెండు గురిగింజలయెత్తు చొ॥ వక పింగానిలో గోమూత్రము నాల్గు అవున్సులుగాని యెనిమిదవున్సులుగాని పోసి అందు వొమ్మ నాల్గు తులములు వేసి వక గంట నాననిచ్చి గుడ్డను వడపోసి వొమ్మ తీసివైచి ఆగోమూత్రమునందు లోహామృతం రెండు గురిగింజలెత్తు కలపి సేవించవలెను గోంగూర దేశవాళీరకము మంగళాన వేపించిచాలినంతవుప్పయెండుమిరపకాయలు వేసి రాతిరోటిలో వేసి బాగుగా దంచిన పచ్చడి మందు వేసుకుంటూవుండగనే పచ్చడితో అన్నముకావలసినంత కడుపుకు తినవలెను కావలసినయడల తాటిబెల్లము నీరుల్లిపాయిలు నంచుకు తినవచ్చును యితరములు యేమీతినకూడదు ఇటుల వారమురోజులుగాని 15 రోజులుగాని సేవించిన వాతినంజులు మేహానంజులు దారువవలె ఉబ్బి ఏమందువల్లను సాధ్యపడని వ్యాధులుకూడ దీనిసేవవలన పటాపంచలైపోవును యీమందు సేవాకాలములో రోజుకు రెండుమూడు విరేచనములు అగుటయేగాక శరీరములోనున్న నీరంతయు మూత్రమార్గముగా 3 రోజులలో వెడలును రక్తశుద్ధిని జేయును

135 నల్లఔషధము సీ 1 కి రు 4-0-0

ప్రాతస్సాయంకాలములయందు గురిగింజయెత్తు చొ॥ తేనెతో గాని తేనె అల్లపురసముతోగాని మిరియపురసముతోగాని సేవించిన పంచపాండువులు శోఫరోగములు సర్వవిధములగు నంజువ్యాధులు సర్వాజీర్ణములు కడుపువుబ్బరము కామిలారోగము శ్వాసకాసలు క్షయరోగము



వుదరవ్యాధులు జ్వరము వాతరక్తము మూలవ్యాధులు క్రిమిరోగము మొదలగు అనేక రోగములను బరిమార్చుటయేగాక తిమ్మిరిగల రోగములను కుదిర్చి రక్తశుద్ధిచేసి మంచిబలమును యిచ్చును.

నంజువ్యాధులకు పథ్యములు

[?]TM వమనవిరేచనములకు దీసికొనుట ప్రాతవియగు బియ్యము అన్నము గోధుమజామ పెసలు కందులు వీట్లయొక్క కట్టులు బీరకాయ పొట్లకాయ లేతఅరటికాయ పొన్నగంటికూర చిర్రికూర దొండకాయలు కాకరకాయలు మజ్జిగ నేయి వెన్న నెమలి కోడి వుడుము తాబేలు అడవిజంతులయొక్కయు మాంసములు కల్లు వుల్లిగడ్డలు దోసలేతముల్లంగివుసిరకాయపచ్చడి గొబ్బికూర అగ్నిదీపనము జేయు పదార్థములు యివి సర్వవిధములగు నంజు వ్యాధులయందు శోఫరోగములయందు పథ్యములుగాయుండును

అపథ్యములు

గాలిలోనుండుట అధికజలపానము మలమూత్రవేగము సడ్డగించుట హెచ్చుతగ్గులుగాదినుట జలప్రదేశములయందు నివసించు జంతుమాంసములు వరుగులచే చేయబడిన కూరలు కొత్తబియ్యము అన్నము పిష్టపదార్థములు బెల్లముచే చేయబడిన పదార్థములు నువ్వులు మినపపప్పు పులుపుపదార్థములు అజీర్ణకర పదార్థములు సంభోగముచేయుట రక్తముస్రవింపజేయుట ఆకుకూరలు తాంబూలము చెడినపదార్థములు భుజించిన పదార్థము జీర్ణముగాని యప్పుడు మరల దినుట విదాహాకరమగు పదార్థములను విడువవలయును.

తిమురురోగములకు ఔషధములు

186 తిమురురోగసంహారి సీ 1 కి రు 4-0-0

ప్రాతస్సాయంకాలములందు ఒక్కొక్క పొట్లము చొ॥ ఆవుపాలు తవ్విడు గోధుమలు నూక గిద్దెడు దంచిన వెల్లుల్లిరేకలు పంపు పంచదార 4 తులములు పాలు కాగుచుండగా గోధుమనూక కడగి పాల

యందు వైచి వెల్లుల్లి రేకలు కూడా వేసి వుడికిన తరువాత పంచదారయు మందుపొట్లము వేసి కలపి దింపి చల్లారుసమయములో గోరువెచ్చగానుండగా యీపదార్థము యావత్తు భుజించెడి వుదయం గం 8 లకు భుజించవలెను పొద్దుటపూటయే యీమందును సేవించేది సాయంత్రము మందు అవసరములేదు మధ్యాన్నము సాయంకాలము భోజనముచేయవచ్చును ఆవనూనెగుమ్మడిబచ్చలి పులుసు మజ్జిగ మానివేసి మిగత సకలపదార్థములతోను తెలగపిండి వెల్లుల్లిపాయలు వేసి వండిన పదార్థముతోను భుజింపవచ్చును దాహమునకు పాలుగాని వేడినీరుగాని పుచ్చుకొనవలెను ఇట్లు 9 రోజులుగాని 15 రోజులుగాని సేవించిన మోకాళ్లు లగాయతు పాదములవరకు మోచేతులు లగాయతు ముంజేతులవరకు వుండు తిమ్మిరి రోగమును దేహాద్యంతమువరకు తిమురుచే జలజలలాడుచుండుట మొదలగు సకల విధ తిమ్మిరిరోగములు సూర్యునిజూచిన మంచుభంగి పటాపంచలైపోవును.

187 గంధామృతము సీసా 1 కి రు 3-0-0

ప్రాతస్సాయంకాలములయందు ఆవునేతిలోగాని ఆవువెన్నలోగాని చిన్నమెత్తు చొ॥ సేవించిన మేహవాతమువల్ల జనించు తిమురురోగములు తిమిరి వాయువులు మేహవాయువులు మేహశూలలు సుఖవ్యాధులు జీర్ణించుటచేత కలుగు తిమిరిరోగములు సర్వాయిరోగములు 40 దినములుగాని 20 దినములుగాని సేవించిన అద్భుతముగా నివారణమగును పత్యము ఆవకాయచారు అన్నము పులుసు వగయిరాలు పుచ్చుకొనవచ్చును

188 అమృతాదివటికలు సీ 1 కి రు 4-0-0

ప్రాతస్సాయంకాలములయందు ఒక్కొక్క మాత్ర చొ॥ మాత్ర నలిపి వేడినీళ్లలోగాని కాచిన ఆవుపాలలోగాని కలిపి పుచ్చుకొనవలెను పత్యం శొంకిపిసినకూర యింగురుగా వండుకొనిగాని తెలగపిండిలో వేసి వండుకొనిగాని వెల్లుల్లిచేర్చి కలుపుకొనిగాని పుచ్చుకొనవలెను కూరలో కారము వుప్పు వగయిరాలు వేసుకొనవచ్చును 9 దినములు ఖురాకూ



కతోనే అన్నము తినవలెను పులుసు పనికిరాదు దాహం వేడినీరుగాని పాలుగాని మొదలు రోజున దేనితో ఆరంభించుదురో అవుషధము సేవించునంతకాలము పాలు అయితే పాలు వేడినీరు అయిన వేడినీరే పుచ్చుకొనవలయును 3 దఫాలు మధ్యను 30 దినములు విడచి సేవించుచుండిన ఒడలు జల్లుజల్లుమనుట తిమిరిరోగము వాతాదిదూష్యములచే పాదములను ఆశ్రయించియుండు తిమ్మిరిరోగములు మొద్దురొమ్ము పెదవులు నాలుకను యున్న తిమ్మిరిరోగములు శరీరాద్యంతమును తిమ్మిరిచే మొద్దుబారియుండుట లోనగు సకల విధ తిమ్మిరిరోగములు గ్యారంటిగా కుదుర్చును.

189 కామిలారోగహారి డ 1 కి రు 1-0-0

ప్రాతస్సాయంకాలములయందు వక్కొక్క పొట్లము చొ॥ తులముయెత్తు గుంటగలగరాకురసమున కలిపిగాని కరక్కాయ తాడికాయ వుసిరికవరుగు వేపచెక్క నేలవేము అడ్డసరము తిప్పతీగె యివితులమెత్తు చొ॥ దంచి తవ్వెడు నీరుపోసి అష్టావశేషముగా కషాయముబెట్టి సదరు కషాయము [illegible] ములుజేసి సగముభాగము పొద్దుట సగము సాయంత్రము పొట్లంచర్చ సేవించవలెను5 దినములుగాని 7 దినములుగాని సేవించిన కామిల ఎండుకామిల పత్సకామిల కుంభకామిల కామిర్లవల్ల వచ్చే అరచేతులు కండ్లు పత్సగానుండుట కామిలాజ్వరము కండ్లు వగయిరాలు నీలవర్ణముగానుండుట శరీరమువాచుట శోఫ యివి 3 దినములలోనే తగ్గిపోయి ఆరోగ్యమును గలుగజేయును కామిలారోగమునకు పథ్యములు విరేచనమునను అగదాది మందులు తీసుకొనుట గోధుమజావ పాతబియ్యము అన్నము పెసలు కందులు వీట్ల కట్టులు బూడిదగుమ్మిడికాయ లేతఅరటికాయ పొన్నగంటికూర చిర్రికూర తుమ్మికూర వుసిరికపచ్చడి గేదెమజ్జిగ నెయి పులిగడుగు వగరుగాయుండు పదార్థములు పుచ్చుకొనవలయును.

190 హిక్కారోగహారి సీ 1 కి రు 1-0-0

3 గంటలకాలమునకు ఒక్కొక మాత్ర చొ॥ చన్నీళ్లతోగాని జీలకర్రరసముతోగాని గంటుభారంగి శొంఠి కషాయముతోగాని సేవించి

సను (లేక) వకమాత్రి సేవించిన పిమ్మట పొగలేని నిప్పులమీద శనగగింజంత యింగువ వేసి అందు నుంచి వచ్చే పొగను మ్రింగినను తత్క్షణమే దుర్ఘటమయిన యెక్కిళ్లరోగమును బరిమార్చును (పథ్యం) చమట పుట్టించుట వమనముచేయించుట నస్యము పీల్చుట జీలకర్రి పసపు ఆకులు వక్క మణిశిల ఆవుకొమ్ము పాము కుబుసము నెమలియీక మంచిగంధంపొట్లు అగరుచెక్క వీట్టిలో దేనినయినను ఆవునేతిలో దడపి నిప్పులయందు వేసి అందుండి వచ్చు పొగద్రాగుట విరేచనము జేయించుట నిదురించుట ప్రాతవియగు వులవలు గోధుమలు బియ్యం యవలు వేడినీరు మాదీఫలము వెలగపండు వుల్లిపాయ ముల్లంగి పొట్లకాయ వుల్లబచ్చలి వాతకఫములను హరించు సమస్త పదార్ధములను హరించును (అపథ్యములు) అపానవాయువును మలమూత్రవేగమును వమనమును అడ్డగించుట పరస్పర విరుద్ధాన్నము మినుములు తెలగపిండి అనుములు చేపలు జలప్రదేశములయందు సంచరించు మాంసములు ఆవాలు పులుపు పదార్ధములు బచ్చలికాడ కంద సొరకాయ అజీర్ణపదార్ధములను వాత పదార్ధములను విడువవలయును.

191 ఛర్దిరోగహారి ద్రావకం సీ 1 కి రు 1—0—0.

రోజుకు రెండుమూడు మోతాదుల చొ॥ సీసాయందు కనపర్చు మోతాదుప్రకారం ఒక మోతాదు వకటి గ్లాసులోకి తీసుకొని సేవించుచుండిన సమస్తవిధములయిన వాంతిరోగములు, దుస్సాధ్యములయి కలరా మొదలయిన వ్యాధులయందు సేవించిన 1-2 మోతాదులతో యెటువంటి వాంతిరోగములనయినను బరిమార్చును. దీనియందు పాతబియ్యం అన్నము, పెసలుకట్టు, గోధుమజావ, కుందేలు మొదలగు అడవిపక్షులు మాంసములు, ధనియాలుపొడి, లేతటెంకాయి నీరు, నిమ్మపండ్లు, పులిశరికపచ్చడి, మామిడిపండు, రేగు ద్రాక్ష, దాడిమ, వెలగ, నారింజ లోనగు సర్వఫలములు, చక్కెర, యివి పథ్యకరములుగా యుండును.

పిచ్చరోగములకు ఔషధములు.

192. ఉన్మాదాంతక లేహ్యము డ 1 రు 5—0—0.

ప్రాతస్సాయంకాలములయందు పూటకు అరతులం యెత్తు చొ॥ సేవించవలయును.



193 ఉన్మాదాంజనము డ 1 కి రు 5—0—0.

పై లేహ్యం సేవిస్తూ రెండురోజుల కొకపర్యాయమున అంజనమును గురిగింజయెత్తు దీసి అందు ఒకటిరెండు చుక్కలు తేనివేసి, కలపి, సాయంకాలసమయమున రెండుకండ్లయందు అంజనము వేయుచుండవలెను.

194 ఉన్మాదాంతక ధూపము డ 1 కి రు 4—0—0.

నిత్యము ఉదయము రోగిని నులకమంచముమీద పరుండబెట్టి, శరీరమాద్యంతము, కంబళిగాని, శాలువాతోగాని కప్పి పొగలేని నిప్పులయందు యీచూర్ణమును వేసి, చమట పట్టులాగున ధూపము వేయుచుండవలెను.

195 ఉన్మాదరోగహార నస్యము డ 1 కి రు 2—0—0.

2 దినముల కొకసారిగాని, 4 దినముల కొకపర్యాయముగాని, యీచూర్ణము 5 సంవత్సరములు లోపలి వయస్సుగల పిల్లలయొక్క అల్పాచమానము ఒక తులము యెత్తులో గలపి, అందు దిరిసినఆకులు పచ్చవి, పావుతులం యెత్తు కల్వముమీద వేసి, నూరి పై దానిలో కలిపి, తెల్లటి గుడ్డయందు వేసి, పిచ్చిరోగిని వెల్లకిలా పరుండబెట్టి రెండు ముక్కురంధ్రములలోను పూర్తిగాపోసి, అయిదు నిముషములు తల కదపకుండా పట్టుకోవలెను. పిమ్మట విడిచిపెట్టిన ముక్కులనుండియు, నోటనుండియు జిగురు పడిపోవును. తరువాత 4 నిమ్మపళ్లు రసం నెత్తిమీద పోసి, కాలువవద్దగాని, నూతివద్దగాని, 50 బిందెలు నీరుపోసి, స్నానము చేయించవలెను. ఇటుల 40 దినములు లేహ్యమును సేవిస్తూ అంజనము వేయుచు, ధూపంబిడుచు నస్యము జేయుచూనుండిన సమస్త పిచ్చిరోగములు గుదురును. లేహ్యము మాత్రము 20 దినములకు వచ్చును. తక్కిన 3 మందులు 40 దినములకు సరిపోవును. ఉన్మాదరోగములయందు (పథ్యములు) వమనవిరేచనములు చేయించుట, నస్యము కలికము, భయపెట్టుట, ధూపము వేయుట, అభ్యంగనము చేయించుట, వక

చోట కూరచుండబెట్టుట, నిద్రబుచ్చుట, గోధుమజావ, పెసరకట్టు మెరడాపుబియ్యపు అన్నం, గుమ్మపాలు, క్రొత్తనేయి, తాబేలుయొక్క అరణ్యజంతువులయొక్క మాంసములు, బూడిదగుమ్మడి, పండుపొట్లకాయ, చంచలకూర, చిర్రికూర, గొబ్బరిబొండము నీరు ద్రాక్షపళ్ల రసము, వెలగపండ్లు, పనసపళ్ళు, చెరుకురసము, తేనె, పాలు, పొన్నగంటి కూర, పులిరికపచ్చడి, దానిమ్మపండు యివి ఉన్మాదరోగములయందు పథ్యకరములుగా యుండును. (అపథ్యములు) కల్లు మొదలగు నిషావస్తువులు పరస్పర విరుద్ధములగు అన్నపానాదులు, వేడినిజేయు పదార్థములను తినుట, నిద్ర, ఆకలి, తుమ్ము, దప్పి, మలమూత్రములు వీటి అడ్డగించుట, కాకరి, పుచ్చింత, మొదలగు చెడుకూరలను దినుట ఇవి (అపథ్యములు).

196 గుల్మరోగహారి డ 1 కి రు 2—0—0.

పుదయము మాత్రమే, పావుతులం యెత్తు చూర్ణమును, రాత్రి తెచ్చిన నీళ్లు వక ఔన్సులో కలపి, సేవించవలయును. ఇటుల 20 దినములు సేవించిన, సమస్త గుల్మరోగములు గుదుర్చుటయేగాక అగ్నిదీపమును రక్తవృద్ధిని, మనోల్లాసమును కలిగించును. (గుల్మరోగములయందు పథ్యములు) చమటదీయుట, విరేచనము జేయించుట, పాతబియ్యపు అన్నము, మెరడాపుబియ్యపు అన్నము, కండశర్కర, పులవకట్టు, అరణ్య జంతుమాంసములు, కల్లు ఆవుపాలు మేకపాలు, ద్రాక్షపండ్లు, నారింజపండు పులిరికపచ్చడి, మజ్జిగ, ఆముదము, వుల్లిగెడ్డలు, ముల్లంగి తోటకూర, చక్రవర్తికూర, మునగకాయలు, పొన్నగంటికూర, యవక్షారము, మొదలగునవి పథ్యములు. (అపథ్యములు) మినుములు పాతవి వాతమును వృద్ధిబొందించు పదార్థములు, యెండుచేపలు, మాంసము తీపుగల వగరుగల సమస్తపదార్థములు, వమనము లంఘనము మూత్ర పురీష వేగములను అడ్డగించుట, అధికమగు జలపానము యివి అపథ్యములు గాన విడువవలయును.



197 ఉదరరోగహారి సీ 1 కి రు 4—0—0.

ప్రాతస్సాయంకాలములయందు చిన్నవారలు, గురిగింజయెత్తు చొ॥ పెద్దవారలు రెండు గురిగింజల యెత్తు చొ॥ పంచదారలో కలపి పుచ్చుకొనిన, జలోదరము, వాతోదరము, పిత్తోదరము, మొదలగు సమస్త వుదరరోగములు. చంటిబిడ్డలకు కడుపులలో బయలుదేరు జ్వర బిళ్ళలు నిశ్శేషముగా కుదుర్చును. (పథ్యములు) చిక్కుడుకాయ,కొయి తోటకూర మునగకాయ, వంకాయి పచ్చికందిపప్పు, పాతబియ్యపు అన్నము, వుల్లిగెడ్డలు, ఆముదము, అల్లము, కాకరకాయ, పొట్లకాయ తేలికగా జీర్ణమయే పదార్థములు, వారమునకు రెండుసారులు విరేచనములకు తీసికొనుట తేలికపదార్థముల తినుట, వేడినీళ్ళు దాహము యివి పథ్యకరములుగా యుండును. (అపథ్యములు) పొగచుట్ట ద్రావుట, పులుసుకూరలు తినుట, పగలు నిద్రించుట, పిండివంటలు, దుంపకూరలు, చేపలు ఆకుకూరలు నువ్వులు విదాహకరములగు అజీర్ణకరములగు పదార్థముల దినుట, చమటపోయుట, వ్యాయామము వీట్లను వదలవలయును.

198 పీనసరోగహారి డ 1 కి రు 1—8—0.

ప్రాతస్సాయంకాలములయందు గురిగింజయెత్తు చొ॥ తేనెతో పుచ్చుకొనిసను చెరుకుబెల్లం అరతులం మిరియముల చూర్ణం పావుతులం పెరుగు గిద్దెడు, అందు గురిగింజయెత్తు పీనసరోగహారి కలపి సేవించినను సర్వములగు పీనసలు హరించును. (పథ్యం) పాతబియ్యం అన్నం, పులవలు, పెసలు, కందులు, వీట్ల కట్టులు. వంకాయి, పొట్లకాయి, మునగకాయి, దోసకాయి, ముల్లంగి, వుల్లిగెడ్డలు, పెరుగు, వేడినీళ్ళు నస్యము పీల్చుట, గాలిలేని ప్రదేశములయందు నివసించుట, తలకు విడువకుండా గుడ్డ జుట్టుకొనుట, యివి హితకరంబులుగా యుండును. పొగద్రాగుట, పులుసుకూరలు అజీర్ణపదార్థములు, స్నానము, మలమూత్రాది వేగమును నిరోధించుట, నేలపైని పరుండుట యివి మానవలయును.

సన్నిపాత రోగములకు ఔషధములు.

199 సన్నిపాత కులాంతకము, మాత్రలు 50 గల సీ 1కి రు 3—0—0

ప్రాతస్సాయంకాలములయందు అల్లపు రసముతోగాని, పిప్పలి మోడి రసముతోగాని, సేవించవలయును. రోగము హెచ్చుగాయుండిన ఝాముకొక మో తాదు చొ॥ నిచ్చుచుండవలెను. యిటుల నిచ్చిన, త్రయోదశ సన్నిపాతములు, మహావాయువులు, సూతికాదోషములు, విషమజ్వరములు మొదలగు అసాధ్యములగు వ్యాధులు పటాపంచలై పోవును.

200 సన్నిపాత కలికము రు 1—0—0.

దీనిని నిమ్మకాయరసముతో సానమీద నరగదీసి రెండు కండ్ల యందు కందిగింజంత చొ॥ కాటుకవలె వేయవలెను. రోగమధ్యమున రెండుమూడు దఫాలు వేయవచ్చును.

201 సన్నిపాత నస్యము బు 1 కి రు 1—0—0.

యీ చూర్ణమును ముక్కురంధ్రములయందు వడ్లగింజంతలేసి లోపలకు వెళ్ళులాగున నోటితోగాని, చిన్న గొట్టముతోగాని, వూదవలెను. రోగమధ్యమున ఇట్లు 4,5 దఫాలు యీనస్యము చేసిన, యెటువంటి సన్నిపాతరోగములు అయినను పటాపంచలై పోవును. యీ 3 మందులును, సన్నిపాత జ్వరములయందు వాడుకజేసి యెటువంటి కష్టసాధ్యమయిన సన్నిపాతరోగములయినను సుసాధ్యమగును.

సన్నిపాత రోగములయందు పథ్యములు.

సన్నిపాత జ్వరము హరించువరకు లంఘణముకట్టుట, వమనము జేయించుట, ఆమమును కఫమును హరించు క్రియలను జేయుట, కలికము వేయుట, నస్యముపీల్చుట, వేయించిన నల్లవులవల పిండి రుద్దుచుండుట, ఇటు చేయుచూవచ్చిన జ్వరము తగ్గును. సన్నిపాతజ్వరము తగ్గిన తరువాత తేలికగా జీర్ణమగు పదార్థములను యిచ్చుచుండవలెను. రోగి వద్ద వైద్యుడు కడుజాగరూకతతో నుండి చికిత్సలు జేయవలయునేగాని, ఉపేక్ష జేయంజనదు. ఆయా సమయములనుబట్టి కఫహరములగు ఔషధములనుగూడా నిచ్చుచుండవలెను. విరేచన మందముగ నున్నయపుడు అగద ఒక మాత్రను తేనెలోముంచి యిచ్చుచుండవలెను. సన్నిపాత రోగమందు, దోషములు ప్రబలమై శ్లేష్మమెదురుకొనిన, గోరోజన మాత్రలు చనుపాలతో ఉపయోగించుచుండవలెను.



—: భస్మాదులకు అనుపానములు :—

202. బంగారు భస్మము తు 1 కి రు 50-0-0.

ప్రాతస్సాయంకాలములయందు, వడ్లగింజయెత్తు చొప్పున, తేనెతో బుచ్చుకొనిన కఫవాతరోగములు మేహవాతములు, శరీరము నొప్పులు, వెన్నతో పుచ్చుకొనిన మేహపైత్యములవల్ల జనించే అత్యుషములు, పశిమి, తెలుపురోగములు, దగ్గుమేహ జ్వరములు, హరించును. కార్డులివర్ ఆయలులో కలపి పుచ్చుకొన్నను, చేపకొవ్వులో కలపి పుచ్చుకొన్నను, తత్కాలతాపములు, గుంటకలగర రసంతోసేవించిన, వీర్యవృద్ధి, గుమ్మపాలతో సేవించిన, మహాబలము, గలిజేరు రసముతో సేవించిన, సకలనేత్రరోగములు, నేతితో, సేవించిన వయస్సస్థాపనము, వసరసముతో శేవించిన బుద్ధివికాసము, కుంకుమపువ్వుతో సేవించిన, శరీరకాంతి, నీలివేళ్లచూర్ణము చిన్న మెత్తు భస్మము వడ్లగింజయెత్తు గుమ్మపాలయందు గలపి సేవించిన, సమస్తక్షయరోగములు, శొంఠి లవంగము, మిరియములు, పిటికషాయముతో సేవించిన సకలోన్మాదములు, పుశిరికవర్గచూర్ణము రెండణాలుయెత్తులో భస్మమును కలపి తేనెతోసేవించిన, ప్రాణహానికరములగు గ్రహణ్యాతిసారాది, సఖిలవ్యాధులు, నేలగుమ్మడు గడ్డలరసముతో సేవించిన, పుత్రోత్పత్తిని, కల్గుగజేయును. మరియు నీభస్మ సేవాకాలములో భస్మము చిన్న మోతాదగుటచే తంగేడు పంచాంగచూర్ణముగాని, వకటినెంబరు అనుపాన చూర్ణముగాని, త్రిసుగంధ చూర్ణముగాని, చాతుర్జాతక చూర్ణముగాని, గుంటకలగరాకు చూర్ణముగాని, రెండణాలయెత్తుగాని, భస్మమున చేర్చి

కలుపుకొని పై అనుపానములతో సేవించుచుండిన, అనేకరోగములను, గుదిర్చి, వృద్ధత్వమును, రాకుండగను, కామాభివృద్ధిని వాక్పటుత్వమును మనస్సంతోషమును కలుగజేసి సర్వరోగములను హరించును.

203. రజతభస్మము తు 1 కి రు 4-0-0.

ప్రాత స్సాయంకాలములయందు రజతభస్మం అభ్రకభస్మము సీమూటిని సమముగా జేర్చి దీనికి సమము త్రికటుకచూర్ణము చేర్చి అడ్డిగెత్తుపాలు ఆవునేతితో సేవించిన క్షయపాండు వుదర అర్శ శ్వాస కాస తిమిరి పిత్తరోగములను నశింపజేయును. పంచదారతో సేవించిన తాపమును మేహవుడుకు త్రిఫలకషాయముతో సేవించిన వాతపిత్తము త్రిసుగంధ చూర్ణముకలపి సేవించిన వింశతిమేహములు గంటుభారంగి శొంఠిరసములతో సేవించిన వూర్ధ్వశ్వాసలు వెన్నతో పుచ్చుకొనిన, శుక్లనష్టము సెగరోగము సుగంధి నేలతాడి పిల్లతేగలు చూర్ణముకలపి సేవించిన, శరీరకాంతి బలము యింద్రియవృద్ధి కలుగజేయును.

204. అయస్కాంత సింధూరము తు 1 కి రు 4-0-0.

చాతుర్జాతచూర్ణముగాని, నె 1 రు చూర్ణముగాని, యీ అయస్కాంత సింధూరమునకు రెండింతలుచేర్చి బాగుగా కలియనూరి అణన్నరయెత్తుచొ॥ పొట్లములుకట్టి సూర్యోదయ సూర్యాస్తమయకాలములయందు తేనె పంచదార ద్రాక్షపండ్లు నేయి వీట్లలోదేనితోనయిన సేవించిన రక్తశుద్ధిని జేసి శరీరకాంతిని గలుగజేయును వాతరోగములను కృశత్వము శుక్లమేహము శీఘ్రముగా బాపును, శొంఠిరసముతోనిచ్చిన అజీర్ణము శూల గుల్మము నివర్తించును దీనికి సమం పగడపుచూరుభస్మము జేర్చి రాత్రి తాంబూలములతో సేవించిన శుక్లదోషములను మేహరోగములను బోగొట్టి వీర్యమును గట్టిపరచును. దీనికి సమం పసపుచూర్ణముగాని కొండపిండివేళ్ల చూర్ణము చేర్చి తేనెతోనిచ్చిన సుఖవ్యాధులవల్ల కలిగిన పాండువ అతిమూత్రము తొలగించి సెగరోగములను బాపును జీర పిప్పలి చూర్ణముతో చేర్చి ఆవునేతితోగాని



తేనితోగాని సేవించిన జీర్ణజ్వరము పురాణజ్వరము శల్యగతి జ్వరములు బోకార్చును. వేయేల అనుపాన విశేషముతో నిచ్చిన సమస్తరోగములను బోకార్చును.

205 శతపుటఖడ్గలోహ భస్మం 1 కి 4—0—0

ప్రాతస్సాయంకాలములయందు యీలోహ భస్మమును అడ్డిగెత్తు చొ॥ శుద్ధిచేసిన పాదరస భస్మము సమముగా కలపి తేనెతోగాని ఆవునేతితోగాని కలపి సేవించిన సమస్తరోగములు నివర్తించును. శొంఠి గంటుభారంగి రసముతో సేవించిన శ్వాస కాసలు తేనెతో సేవించిన ధాతుజన్యవికారములు నె 2 రు అనుపాన చూర్ణముతో చేర్చి త్రిఫల కషాయముతో సేవించిన పంచపాండువులు వుబ్బురోగములు తాంబూలముతో సేవించిన ఆకలి దేహకాంతి సంభోగేచ్ఛ స్థాలీచూర్ణానుపానముతో సేవించిన సమస్తవుబ్బురోగములు జీరపిప్పలి చూర్ణముతో సేవించిన శల్యగత జ్వరములు పురాణజ్వరములు చక్కెరతో పుచ్చుకొనిన పిత్తరోగము పిప్పలీచూర్ణముతో పుచ్చుకొనిన కఫవాతరోగములు త్రిఫలచూర్ణము అనుపానముతో పుచ్చుకొనిన వలీపలితములు అనగా అకాలములయందు వెంట్రుకలు మెరయుట, త్రిసుగంధచూర్ణము చేర్చి చక్కర అనుపానముతో గాని ద్రాక్షరసముతోగాని సేవించిన రక్తపైత్యము వేలాపుపిండిలోజేర్చి ధనియాలరసముతో నిచ్చిన అత్యుగ్రమయినవాంతి సిలాజిత్తు భస్మమును సమముగాజేర్చి పల్లేరువేళ్ళ రసముతో నిచ్చిన సకలవిధములయిన మూత్రరోగములు హరించును.

206 శతపుట చిట్లమాండూరము తు 1 కి రు 2—0—0

దీనికి సమము స్థాలీచూర్ణము చేర్చి తేనెతోనిచ్చినయడల దారుణమగు వుబ్బురోగములు పాండువులు శోఫ అజీర్ణము గుండెదడ నివారించును అల్లపురసముతోనిచ్చిన మలమూత్రములను జారీచేయును దీనికి సమము అయస్కాంతభస్మము జేర్చి యిచ్చినయడల కీళ్ళనొప్పులు తిమ్మిరలు క్షయ రక్తహీనము నివర్తింపజేయుటయేగాక వీర్యవృద్ధిని రక్తవుష్టిని గలుగజేయును.

207 అయలోహ భస్మము తు 1 కి రు 2—0—0

ప్రాతస్సాయంకాలములయందు అడ్డిగెత్తు చొ॥ మోతాదు యిందుకు సమము త్రిసుగంధచూర్ణము జేర్చి ధనియాలయొక్క హిమమందు పంచదార తులమెత్తు గలపి అందు మూడును కలపి సేవించిన సకలవిధ పైత్య వుడుకులు పైత్యజ్వరములు పైత్య తిమ్మిరలు నివారించి రక్తశుద్ధిని జేయును తేనె అనుపానముతో నిచ్చిన శ్లేష్మరోగములు వెన్నతోనిచ్చిన శుక్లనష్టము మిరియాల రసముతోనిచ్చిన శ్వాశకాసవ్యాధులు తగ్గును.

208 కాంతలోహ భస్మము తు 1 కి రు 4—0—0

ప్రొద్దుట సాయంకాలము అడ్డిగ లేక రెండుగురిగింజలయెత్తు చొ॥ దీనికి రెండురెట్లు చాతుర్జాతక చూర్ణమును చేర్చి తేనితోనిచ్చిన మేహవాత జన్యములగు కీళ్లనొప్పులు తిమ్మిరి గుండెనొప్పి దడ నివర్తించును. దీనికి సమము తిప్పసత్తు శిలాజిత్తు భస్మము చేర్చి వెన్నతోగాని ద్రాక్షరసముతోగాని యిచ్చిన కాళ్లు చేతులు కండ్లుమంటలు తిమ్మిరి రోగములు మహాపైత్యములను శమింపజేసును దీనికి రెట్టింపు త్రికటిక చూర్ణములో చేర్చి తేనితో సేవించిన గర్భవాతము నాభిశతకము కడుపులోపోటు కామిలశల్య గతజ్వరములు పురాణజ్వరములు అజీర్ణము నివారించును. దీనికి సమము పంచలోహరసాయనమును జేర్చి వెన్నతో నిచ్చిన సమస్తమూత్రవ్యాధులు నివారణజేయుటయేగాక శోఫ మేహనీరు మేహపిటుక త్రిదోషములు శూలలును హరించి మిక్కిలి కాంతి వీర్యవృద్ధి రక్తశుద్ధిని జేయును.

209 శతపుట కృష్ణాభ్రిక భస్మము. తు 1 కి రు 4-0-0.

ప్రాతస్సాయం కాలములయందు రెండుగురిగింజలెత్తు మోతాదు చొ॥ దీనికి సమము పిప్పలీచూర్ణముజేర్చి తేనెతోనిచ్చిన మేహరోగములు, శ్వాస, కఫము, క్షయము, గ్రహణి, పాండువ, కామిల, గుల్మము హరింపజేయును. అభ్రిక భస్మము, రసభస్మము సమముగ గలిపి తేనె



తో సేవించిన సన్నిపాత రోగములు, దీనికి సమము కరక్కాయ చూర్ణముజేర్చి మాదిఫలరసముతోగాని నిమ్మకాయ రసముతోగాని యిచ్చిన సర్వవిధములగు శూలలు యీ భస్మమునకు సమము కొడిశపాలాది చూర్ణమునుజేర్చి ఆవునేతితో బుచ్చుకొనిన గ్రహణ్యాతి సారములు, అడ్డసరపాకు రసముతోనిచ్చిన శ్వాసకాస రోగములు, అభ్రిక భస్మమునకుసమము రజితభస్మముగాని స్వర్ణభస్మముగాని గలిపి సేవించినయెడల అపారమగు వీర్యవృద్ధిని, దీనికి సమము తిప్పసత్తుజేర్చి వెన్నతో నిచ్చిన నిక్కాకలు, ఎండిపోవుట, పురాణ జ్వరములు, కడుపులో వుడుకు, మంటకాళ్ళు చేతులు కండ్లు మంటలు, కాళ్లు లాగుట, పొడిదగ్గు, అధికమగు శరీరవేడి తగ్గును. నెం 1 రు అనుపానచూర్ణము రెట్టింపు జేర్చి సుగంధీకషాయముతో నిచ్చిన చర్మవ్యాధులు, రణములు, కురుపులు, చిడుములోనగు వ్యాధులను బోకార్చి మంచిరక్తమును బుట్టించి మిక్కిలి బలము గలుగజేయును.

210 కాంతాభ్రిక సింధూరము. తు 1 కి రు 4-0-0.

ప్రాతస్సాయం కాలములయందు రెండుగురిగింజలెత్తు చొ॥ సేవించవలెను. పెన్నేరు చూర్ణమును యీ భస్మమునకు రెండురెట్లు చేర్చి గుమ్మపాలతో సేవించిన అమితమగు వీర్యవృద్ధిని బలమును గలుగజేయును. దీనికి రెట్టింపు చాతుర్జాతక చూర్ణముజేర్చి తేనె అల్లపురసముతో నిచ్చిన కఠినమగు పైత్యరోగములు, గుండెనొప్పి, అజీర్ణములను తొలగించును. నెం 1 రు అనుపానచూర్ణము రెట్టింపుచేర్చి పటికబెల్లపు చూర్ణముతో నిచ్చిన పొత్తికడుపు నరములు బిగదీయుట, ఆసనము మంట మూత్రరోగములు, శుక్లనష్టము, 20 మేహములను బరిమార్చును. జీరపిప్పలీ చూర్ణము దీనికి రెండింతలుజేర్చి తేనెతో నిచ్చిన నీళ్ళవిరేచనములు గట్టి అగ్నిదీపనము జేసి అన్నహితవును కలుగజేయును. సాలామిశ్రిచూర్ణము రెట్టింపుకలిపి పరుండబోవునపుడు పంచదారతోజేర్చి ఆవుపాలలో వేసి పుచ్చుకొనిన మిగుల రేతోవృద్ధి కలవాడయి స్త్రీలయెడ మన్మథునివలె నుండును.

211 లోహాభ్రిక సింధూరము. తు 1 కి రు 6—0—0.

ప్రాతస్సాయంకాలములయందు రెండు గురిగింజలయెత్తు చొ॥ సేవించవలెను. దీనికి రెట్టింపు, త్రిసుగంధముచూర్ణముగాని, నాగకేసరముల చూర్ణముగాని, చేర్చి, తేనె అల్లపరసముతో సేవించిన, మేహపైత్యములు, మేహములు, పైత్యవికారములు, నాలుక యిగురు, తల త్రిప్పు, అరుచి, మధుమేహము, శుక్లమేహము, బలహీనము, మిక్కిలి శుష్కించుట, కాళ్లు చేతులు నడుము లాగుట, పాండువ, నివారించును. యీ సింధూరము ఒక భాగము, పచ్చకర్పూరం భాగం, లవంగాలు భాగం, కస్తూరి నాలుగవభాగం, ఖర్జూరపుకాయ ఒక భాగం, యాలకు గింజలు ఒక భాగం ఇవి తమలపాకుల రసముతో నూరి, కందిగింజలంత మాత్రలుజేసి, తాంబూలముతో సేవించుచుండిన శరీరమునకు కాంతి, రక్తశుద్ధి, అమితమగు ఇంద్రియవృద్ధి బలమును కలిగించును.

212 శ్వేతాభ్రిక భస్మము. తు 1 కి రు 1—8—0.

ప్రాతస్సాయంకాలములయందు చిన్నమెత్తు చొ॥ సేవింపుచుండవలెను. పెసరగింజంత నల్లమందుగలపి చక్రికేళీ అరటిపండుతో నిచ్చిన మేహజనితములగు గ్రహణి అతిసారములు, రక్తవిరేచనములు. దీనికి సమము జీలకర్రచూర్ణము చేర్చి, తేనెతో నిచ్చిన, మేహపైత్యము, గుండెలయందు మంట, వుడుకు, తాపము, కాళ్ళు చేతులు కండ్లు మంట, శరీరము వేడిగానుండుట, నివర్తించును. దీనికి రెట్టింపు త్రిసుగంధ చూర్ణము చేర్చి ధనియాలయొక్క హిమముచే సేవించిన నిక్కాక, నీర్సము, శెగజాడ్యము నిమ్మళించి మేహశాంతి జేసును.

213 ముత్యపుచూరు భస్మము తు 1 కి రు 16—0—0.

ప్రాతస్సాయంకాలములయందు రెండు గురిగింజల యెత్తు చొ॥ సేవించవలయును. త్రికటుకచూర్ణము రెట్టింపుచేర్చి, అల్లపు రసముతో సేవించిన, సకలాజీర్ణములు బోకడచి, అపరిమితమగు జఠరదీప్తిని గలుగ



జేయడమేగాక, దారుణమైన వాంతిని స్వరభంగమును, సప్తశూలలను బోకడచును. దీనిని నిత్యము తాంబూలమునందు సున్నమునకు మారుగా యీభస్మమును నుపయోగించిన యెడల కఠినమగు క్షయరోగములు నివర్తించును.

214 తామ్రభస్మము తు 1 కి రు 2-0-0

ప్రాతస్సాయంకాలములయందు రెండువడ్లగింజలయెత్తు సేవించుచుండవలెను దీనికి రెట్టింపు పిప్పలీచూర్ణము జేర్చి తేనెతో సేవించిన సర్వరోగములు హరింపుజేయును చాతుర్జాతకచూర్ణమును దీనికి రెట్టింపు జేర్చి పాలతోగాని పంచదారతోగాని నేతితోగాని సేవించి పులుసు విసర్జించిన పథ్యంబడిన వీర్యవృద్ధి శరీరపుష్టిఅగ్నిదీపనము శరీరదారుఢ్యము నిర్మల దృష్టియు కలుగజేయును మరియు యీతామ్రభస్మము బుద్ధిమంతులగు వైద్యులు ఆయా రోగాను కూలముగా అనుపానములు నిర్ణయించి యిచ్చిరేని సర్వరోగములయందు వాడదగిన దివ్యౌషధము.

215 నాగభస్మము తు 1 కి రు 2-0-0

ప్రాతస్సాయంకాలములయందు రెండు గురిగింజలయెత్తు సేవించవలెను త్రిజాతకచూర్ణమును దీనికి రెట్టింపుచేర్చి నేతితో నిచ్చిన పైత్యము అరుచి మందాగ్నియు నివర్తించును దీనికి రెట్టింపు త్రిప్ప సత్తుశిలాజిత్తుభస్మముతో చేర్చి పటికిబెల్లం చూర్ణముతో పుచ్చుకొనిన తాపములు నూటొక్క శెగరోగములుమానును 1 నెంబరు చూర్ణము రెట్టింపుచేర్చి తాటిబెల్లముగాని తాటి కలకండతోగాని పుచ్చుకొనిన స్త్రీలకు గలుగు కుసుమాదిరోగములు బరిమార్చును దీనికి రెట్టింపు నేరెడుగింజలచూర్ణము ఎరడాబియ్యం తవుడు చేర్చి బూడిదగుమ్మడికాయరసముతో పుచ్చుకొనిన అతిమూత్రము అందువల్ల కలిగే అతిదాహము నివారించును అనుపానవిశేషములతో నిచ్చిన అనేక రోగముల బరిమార్చును.

216 వంగభస్మము తు 1 కి రు 2—0—0.

ప్రాతస్సాయంకాలములయందు రెండు గురుగింజల యెత్తు చొ॥

సేవించవలెను. చాతుర్జాతకచూర్ణము దీనికి రెట్టింపుజేర్చి పటికిబెల్లము చూర్ణముతో సేవించిన సకలవిధములయిన మేహములు, శుక్లనష్టములు నిక్కాక, పైత్యము, మేహావుడుకు, కాళ్ళు చేతులు నడుము లాగుట, కండ్లుమంట, లోనగు అనేకరోగములను బరిమార్చును. దీనికి సమము ఆవునేతితో వేపిన జాజికాయచూర్ణమును జేర్చి పటికిబెల్లంచూర్ణము సేవించిన, సకలవిధ కుసుమరోగములు బోగొట్టి పుష్టిని గలుగజేయును. దీనికి రెట్టింపు పసపుచూర్ణము గలపి, తేనెతో సేవించిన రక్తపిత్తము, వూర్ధ్వశ్వాసమును నివారించును. యీభస్మము ఒక భాగము, కస్తూరి సగభాగము, జాజికాయ భాగము, యాలకగింజలు భాగము, లవంగాలు భాగము, యివి అన్నియు తమలపాకుల రసముతో మర్ధించి కందిగింజ లంత మాత్రిలుకట్టి నిత్యము తాంబూలముతో సేవించిన, మిగుల రేతోవృద్ధి గలవాడయి, మదించిన స్త్రీలయెడ మన్మధునివలెనుండి వీర్య స్తంభన గలవాడయి నుండును.

217 వైక్రాంత భస్మము తు 1 కి రు 4—0—0.

ప్రాతస్సాయంకాలములయందు గురిగింజయెత్తు చొ॥ సేవించేది. వడ్లగింజెత్తు స్వర్ణభస్మముచేర్చి నేతితో సేవించిన, జ్వరము, పాండు రోగము, గుదరరోగము, శ్వాస, కాస, కఠినమగు గ్రిహణి, నివర్తించుటయేగాక, శరీరమునకు పుష్టిని గలుగసేయును. దీనికి రెట్టింపు చాతుర్జాతకచూర్ణము చేర్చి, తేనెతో సేవించిన రొమ్మునొప్పి, గొంతుమంట॥ అరుచి నశించును. దీనికి సమము యాలకచూర్ణము చేర్చి తేనెతో నిచ్చిన దాహరోగములు పైత్యజ్వరములు నివారణమగును.

218 హేమమాక్షిక భస్మము తు 1 కి రు 1—0—0.

ప్రాతస్సాయంకాలములయందు రెండు గురిగింజల యెత్తు చొ, సేవించుచుండవలెను. దీనికి రెట్టింపు పిప్పలిచూర్ణమును జేర్చి తేనెతో సేవించిన, క్షయరోగములు, కాసరోగములు, పంచపాండువులను గుదిర్చి రక్తవృద్ధిజేయును. దీనికి రెట్టింపు త్రిఫల చూర్ణమును జేర్చి, నేతితో



సేవించిన శోఫ, ప్రిమేహము, మూలవ్యాధి, గ్రిహణి, శూల, కామిల, పైత్యవాతరోగములు నివర్తింపజేయును. తమలపాకుల రసముతో సేవించిన సర్వరోగము, అతివస, త్రికటుకలు త్రిఫలములు, వీటి చూర్ణము రెట్టింపుజేర్చి, నేతిలో గలపి, సేవించిన దుస్తరములయిన భగంధరాది రోగములు నివర్తించును.

219 పగడభస్మము తు 1 కి రు 0—8—0.

ప్రాతస్సాయంకాలములయందు చిన్నమెత్తు చొ॥ సేవించవలెను. దీనికి రెట్టింపు పిప్పలిచూర్ణము జేర్చి, తేనెతో సేవించిన కోష్ఠగతవాయువులు, పురాణజ్వరము, నోరుచేదు హరించును. దీనికి రెట్టింపు చాతుర్జాతకచూర్ణము చేర్చి, పటికిబెల్లము చూర్ణము, నెయ్యి వీట్లతో సేవించిన, శరీరపుష్టిని కలుగజేయును. పాలు శర్కర వీటితో సేవించిన సమస్త మేహరోగములు నశించును. బియ్యముకడిగిన నీరుతో సేవించిన సమస్త మూత్రిరోగములను బోకడచును. దీనిని నిత్యము తాంబూలమునందు సున్నమునకు మారుగా చేర్చుకొని సేవించిన దగ్గు వగరుపు రోగములు శరీరము ఎండుట, రొమ్ములో నొప్పి, మలబద్ధము నివర్తించును.

220 శంఖభస్మము తు 1 కి రు 0—4—0.

ప్రాతస్సాయంకాలములయందు అణాయెత్తు చొ॥ సేవించవలెను దీనికి సమము త్రికటుకచూర్ణము జేర్చి, వేడినీళ్ళతో సేవించిన, శూల రోగములు, నివర్తియగుటయేగాక, మంచి ఆకలిని బుట్టించును.

221 శిలాజితు భస్మము తు 1 కి రు 0—8—0.

ప్రాతస్సాయంకాలములయందు అణాయెత్తు చొ॥ సేవించేది. దీనికి సమము త్రిసుగంధచూర్ణము గలపి, వుశిరికపప్పు కషాయముతో సేవించిన, మేహరోగములు శెగరోగముమీద బుట్టిన మూత్రికృచ్ఛ్ర ప్లీహ, ధనియాలయొక్క హిమమందు తులమెత్తు పంచదార చేర్చి సేవించిన. సకలవిధ శుక్లనష్టములు, నిక్కాక, అశ్మరిరోగము నివారించును.

222 కాశీస భస్మము తు 1 కి రు 0—8—0.

ప్రాతస్సాయంకాలములయందు మూడు గురిగింజలెత్తు చొ॥ సేవించవలెను. దీనికి రెట్టింపు శొంఠిచూర్ణమును జేర్చి తేనెతో బుచ్చుకొనిన సకలాజీర్ణములు స్త్రీలు సేవించిన ఋతుశూలలు, వాము కషాయముతో నిచ్చిన శూలరోగము, తేనెతో సేవించిన పాండురోగములు నివర్తించును.

223 త్రిప్పసత్తు తు 1 కి రు 0—8—0

ప్రాతస్సాయంకాలములయందు చిన్నమెత్తు చొ॥ సేవించవలెను. దీనికి రెట్టింపు త్రిసుగంధచూర్ణము చేర్చి ధనియాల హిమములోచేర్చి అందు కొంచం పటికిబెల్లము చూర్ణముగలపి సేవించిన కడుపులో వుడుకు గుండె దడుకు గొంతుక యెండుట ఆమము వికారము నిక్కాక కాళ్ళుచేతులు వేడివల్ల లాగుట సకలమేహరోగములు బోకార్చును. మిరియాల కషాయముతో సేవించిన ఆకలి పుట్టించును అబ్రికముతో కలపి పుచ్చుకొనిన ఆమ్లపైత్యము తగ్గును శొంఠిరసముతో సేవించిన ఆమ్లవాతరోగము నెమ్మదించును. పంచదారతో సేవించిన పైత్యములు తేనితో సేవించిన శ్లేష్మరోగములు నివర్తించును.

224 జసద భస్మము తు 1 కి రు 1—0—0

ప్రాతస్సాయంకాలములయందు అర్ధనామెత్తు చొ॥ సేవించవలెను. తమలపాకుల రసముతో సేవించిన ప్రమేహాదిరోగములు దీనికిరెట్టింపు జీలకర్రచూర్ణము చేర్చి చక్కరతో సేవించిన గ్రహిణి అతిసారము వాంతి లవంగాలు ఓమము జీలకర్ర వీటికషాయముతో సేవించిన శూలరోగము దీనికిరెట్టింపు పిప్పలిచూర్ణము జేర్చి తేనెతోసేవించిన శ్వాసకాసరోగము నివర్తించును.

225 త్రివంగచూర్ణము తు 1 కి రు 2—0—0

ప్రాతస్సాయంకాలములయందు చిన్నమెత్తు చొ॥ సేవించవలెను. దీనికి సమము త్రిజాతకచూర్ణముచేర్చి వెన్నతోసేవించిన నానావిధములగు మేహవ్యాధులు దీనికి రెట్టింపు లొద్దుగచెక్కచూర్ణమునుచేర్చి పటికబెల్లం చూర్ణముతో సేవించిన స్త్రీలకు గలుగు సమస్తకుసుమవ్యాధులు దీనికిసమము గుంటగలగరాకు చూర్ణముచేర్చి తేనెతోసేవించిన పాండువ అజీర్ణము శుక్లనష్టము గుండెబరువు శమించును. కొడిశపాల చూర్ణము రెట్టింపుచేర్చి తేనెతోసేవించిన సర్వాతిసార గ్రహిణులను బోగొట్టి రక్తశుద్ధిని వీర్యవృద్ధిని దీర్ఘాయువు కామోద్దీపనమును గలుగజేయును.



226 శృంగిభస్మము తు 1 కి రు 1—0—0

ప్రాతస్సాయంకాలములయందు చిన్నమెత్తుచొ॥ సేవించవలెను. పంచదారతోనిచ్చిన సెగరోగము వెన్నతోనిచ్చిన కుసుమరోగము మేహవాయువు రొమ్మునొప్పి కీళ్ళనొప్పులు చాతుర్జాతకచూర్ణము రెట్టింపు చేర్చి తేనితో పుచ్చుకొనిన వడలునొప్పులు కీళ్ళనొప్పులు నిమ్మపళ్ళ రసములోకలపి సేవించిన మేహపైత్యశూలలు నివారణమవును.

227 గురుభస్మము తు 1 కి రు 4—0—0

కుష్ఠరోగౌషధములలో నెం 95రున వ్రాసిన అనుపానములతో సేవించవలెను.

228 పాదరసభస్మము తు 1 కి రు 4—0—0

ఇది మూలికలతో తయారగు స్వచ్ఛమగు రసభస్మము ప్రాతస్సాయంకాలములయందు రెండుగురిగింజలెత్తు చొ॥ సేవించవలెను పిప్పలిమిరియాలు గంటుభారంగి శొంఠి వీట్ల చూర్ణము రెట్టింపుచేర్చి తేనెతో సేవించిన దగ్గు వగురుపు శూలరోగము దీనికి సమము మాని పసపు చూర్ణముగలపి శర్కరతో సేవించిన రక్తవికారము త్రిఫలములు అడ్డసరపు ఆకులు వీటికషాయముతో సేవించిన కామిలాపాండువులు యేలకచూర్ణము శిలాజిత్తుభస్మము శర్కరవీటితో సేవించిన మూత్రకృచ్ఛము సౌవర్చలవణము లవంగము యాలకులు కరక్కాయ వీట్ల చూర్ణము రెట్టింపుచేర్చి నేలవేము కషాయముతో నిచ్చిన సర్వజ్వరములు నేలగుమ్మిడి

చూర్ణముతో సేవించిన అమితమగు వీర్యవృద్ధిని కరక్కాయ ఓమము వీట్ల చూర్ణముతో సేవించిన వమనము వోకిరింత నాగకేసరములరసముతో సేవించిన క్రిమిరోగము లవంగము కరక్కాయ నల్లమందు కందిగింజంత చేర్చి సేవించిన సమస్త రక్తాతిసారములు నివర్తించును తిప్పసత్తుతో సేవించిన ఆకలిని గలుగజేయుటగాక శరీరపుష్టిని జేయును.

229 గంధకభస్మము తు 1 కి రు 2-0-0

కుష్టురోగౌషధములలో చేరియున్న నెం 97 రు గంధకభస్మముయొక్క అనుపానములు చూచి సేవించవలయును.

230 గంధకపుష్పము తు 1 కి రు 3-0-0

కుష్టురోగౌషధములలో నెం 98 రు న వ్రాసిన గంధకపుష్పానుపానములే వుపయోగించవలయును.

231 తాళకభస్మము తు 1 కి రు 4-0-0

ప్రాతస్సాయంకాలములయందు గురుగింజయెత్తు చొ॥ సేవించేది తిప్పతీగె కషాయముతో సేవించిన వాతరక్తము అష్టాదశకుష్టులు నివర్తించును అతివస జీలకర్ర వీటిచూర్ణము రెట్టింపుచేర్చి త్రిఫలకషాయముతో సేవించిన అపస్మారరోగము దీనికి రెట్టింపు త్రిఫలచూర్ణముజేర్చి శక్కరతో సేవించిన పాండురోగము శొంఠి చూర్ణముతో సేవించిన ఆమవాతరోగము చిర్రికూర వేళ్లతో సేవించిన అష్టవిధజ్వరములు దీనికి రెట్టింపు పిప్పలీచూర్ణముజేర్చి తేనెతో సేవించిన సకల క్షయరోగములు నివర్తించును.

232 తాళకపుష్పము సీ 1 కి రు 5-0-0

ప్రాతస్సాయంకాలములయందు రెండు వడ్లగింజలయెత్తు చొ॥ సేవించవలయును పిప్పలీచూర్ణము రెండుఅణాలయెత్తులో పై తాళకపుష్పమును చేర్చి తేనెతో సేవించి పయిగా ఒకటి రెండు తులములు తేనెను పుచ్చుకొనిన చిరకాలమునుంచియున్న కడుపులోని పోట్లు శూలలు పరిణామశూలలు ప్రసవానంతరం స్త్రీలకు జనించు మక్కల్లయనురోగము



అందుచే జనించు శూలం పోటు వగయిరావ్యాధులును శ్లేష్మవాతరోగములను సకల జ్వరములను 11 పూటలలో నిశ్శేషముజేయును.

233. మణిసిలభస్మము తు 1 కి రు 4-0-0.

ప్రాతస్సాయంకాలములయందు రెండు వడ్లగింజలయెత్తు చొ॥ సేవించేది పిరంగిచెక్క తులం తెల్లజిల్లేడు అరతులము చిత్రమూలం అరతులం వీటిచూర్ణమును రెండు అణాలయెత్తు చేర్చి తేనెతో పుచ్చుకొనిన సవాయిరోగములు మేహారణములు సకలవిధములయిన పుండ్లు కంఠమునందు వాపుహరించును తేనెతో పుచ్చుకొనిన, సుడివాయువు, గుండెనొప్పి, పీనసరోగములు, తుమ్ములరోగములు లోనగునవి నివర్తించును పటికబెల్లంచూర్ణముతో పుచ్చుకుంటె జలోదరములు వుదరములు. కడుపులో జ్వరబిళ్లలు హరించును జ్వరబిళ్లలకు వుదరరోగములకు యీ మందు సేవించుకాలములో వారమునకొకసారి అగదగాని భావనవాముగాని పుచ్చుకొనుచుండిన సదరురోగములు నిశ్శేషముగా హరించి పోవును

234 సింధూరభస్మము తు 1 కి 2-0-0.

ప్రాతస్సాయంకాలములయందు అడ్డిగెత్తు చొ॥ సేవించేది దీని రెట్టింపు పిప్పలిచూర్ణము జేర్చి, తేనెతో సేవించిన శీతమేహములు దీనికి రెట్టింపు త్రిఫలచూర్ణము చేర్చి చెక్కరతో సేవించిన పైత్యమేహము మేహపైత్యము గంటుభారంగి త్రికటుకములు చూర్ణముచేర్చి తేనెతో సేవించినకాసశ్వాస, శూల, రోగములను రెట్టింపు పసుపుచూర్ణముచేర్చిపటికబెల్లంచూర్ణముతో సేవించిన రక్తదోషము త్రికటుకములువీటిచూర్ణము రెట్టింపుచేర్చి, తేనెతోగాని ఆవునేతితోగాని సేవించిన, కామిలపాండువు అగ్నిమాంద్యము హరించును. దీనికి సమము శిలాజిత్తుభస్మము యేలకచూర్ణము చేర్చి, పంచదారతో సేవించిన మూత్రకృచ్ఛ్రరోగము జాపత్రి లవంగాలు నల్లమందు గంజాయి పిప్పళ్లు, కుంకుమపువ్వు పచ్చకర్పూరము వీట్లచూర్ణము రెండురెట్లు చేర్చి, గుమ్మపాలతోగాని పంచదారతోగాని సేవించిన, విశేషముగా ధాతువృద్ధిని జేయును.

లవంగాలు, సౌవర్చలవణము కరక్కాయ వీటిచూర్ణముతో సేవించిన సర్వజ్వరములు బరిమార్చును. లవంగాలు కుంకుమపువ్వు వీట్లచూర్ణము రెట్టింపుచేర్చి, తమలపాకుయందు నునిచి నమలి మ్రింగిన, విశేషమగు వీర్యవృద్ధిని బలమును గలుగజేయును. పర్పాటకచూర్ణముచేర్చి, బెల్లములో కలపి సేవించిన క్రిమిరోగములు లవంగాలు గంజాయి నల్లమందుతో సేవించిన సర్వాతిసారములు తిప్పసత్తుతో సేవించిన శరీరపుష్టియు పటికబెల్లముచూర్ణముతో సేవించిన పిత్తరోగమును త్రికటుకములు చిత్రమూలం వీట్లచూర్ణముతో సేవించిన దారుణమగు కఫరోగములు నశించును, వెన్నతో సేవించిన, కడుపులో పుడుకు శుక్లనష్టము హరించును.

235. అండభస్మము తు 1 కి రు 1-0-0.

పూటకు రెండు గురిగింజలయెత్తు చొ॥ ఆముదముతో యిచ్చిన చిన్నబిడ్డలకు గలుగువాతము శ్లేష్మము వగరుపు దగ్గు, జ్వరములోనగు సమస్తబాలరోగములు బోకడచును.

236. పటికార భస్మము తు 1 కి రు 0-8-0.

ప్రాతస్సాయంకాలములయందు రెండు అణాలయెత్తు చొ॥ ధనియాలు లవంగాలు జీలకర్ర యివినీళ్లలో నూరి రసంతీసి పైమందును కలపిసేవించవలయును. (రసముకాచనక్కరలేదు.) దారుణమైన శుక్లమేహములు అన్నిజాతుల శెగరకములు 20 మేహములు పటాపంచలై పోవును.

237. వరాట భస్మము తు 1 కి రు 0-8-0.

ప్రాతస్సాయంకాలములయందు ఒక అణాయెత్తుచొ॥ సేవించవలెను. శొంఠిచూర్ణము రెట్టింపుచేర్చి, వేడినీళ్లతో సేవించిన శూల పరిణామశూల, అహిఫత్య చూర్ణానుపానముతో సేవించిన, సకలవిధములయిన అజీర్ణరోగములు అన్నహితవులేకపోవుట సమస్తపైత్యములు వెన్నతోనిచ్చిన, వాతదేహులయొక్క శుక్లనష్టము, పటికబెల్లము చూరము



తోనిచ్చిన, స్త్రీలకుగల్గు సమస్తకుసుమరోగములను బోకడచుటయేగాక, మిక్కిలి ఆకలిగలుగజేయును.

238 సూరేకారభస్మము తు 1 కి రు 0-8-0

ప్రాతస్సాయంకాలములయందు రెండు అణాలయెత్తు చొ॥ పంచదారతో సేవించిన మూత్రమందు చురుకు మూత్రము జారి కాని రోగమందు యిచ్చిన వెంటనే మూత్రమును జారి జేయించి సౌఖ్యము గలుగజేయును నీరుల్లిపాయ రసమందు పంచదార చేర్చి అందులో భస్మమును కలపి సేవించిన నిక్కాక మూత్రమందు సుద్దపడుట రక్తశెగరోగములను గుదుర్చును.

239 గోమూత్రి శిలాజిత్తు భస్మము తు 1 కి రు 1-0-0

ప్రాతస్సాయంకాలములయందు చిన్నమెత్తు చొ॥ వెన్నతోనిచ్చిన నీరుడుపాలవలె వెల్లుట మూత్రముతో కండలు కండలుగా పడుట మూత్రమందు రాళ్లుపడుట సకల శెగరోగములను హరింపజేయును.

240 ముత్యపుచిప్పలభస్మము తు 1 కి రు 2-0-0

ప్రాతస్సాయంకాలములయందు చిన్నమెత్తు చొ॥ నెం 213 రు ముత్యపుచూరుభస్మమునకు జెప్పిన అనుపానములతో సేవించిన ముత్యపుచూరుయొక్క భస్మముగుణములే కలిగియుండును గాని చూరుభస్మమునకన్న కొంచము తక్కువగుణముకలదైయుండును.

వటకౌషధ అనుపానములు

241 వసంతకుసుమాకరం తు 1 కి రు 16-0-0

ప్రాతస్సాయంకాలములయందు రెండు గురివిందలయెత్తు చొ॥ సేవించేది శర్కరతోనయినా తేనెతోనయినా ఆవునేతితోనయిన సేవించిన యేమందువలనితీరని 20 మేహములు ఆమ్లపైత్యములు సకల క్షయరోగములు సమస్త విధములయిన శుక్లనష్టములు దాహరోగము రక్తపిత్తాది అనేక రోగములను గుదిర్చి పుష్టికరముగాను సంతానప్రదముగను ఆయుర్వృద్ధికరముగను బలకరముగను రక్తశుద్ధికరముగను సమస్తరోగనివా

రణకరముగను నుండును దీనికి రెట్టింపు శిలాజిత్తుభస్మము త్ర్యూషణ
చూర్ణము చేర్చి తేనెతో సేవించిన సమస్తమగు క్షయరోగములు
పసపు చూర్ణము దీనికి రెట్టింపుచేర్చి అందు శర్కరకలపి తేనెతో సేవిం
చిన సకలవిధములగు శెగరోగములు మంచిగంధపుచూర్ణముతో తెల్లచ
క్కెరచేర్చి సేవించిన దుస్తరమగు రక్తపిత్తరోగములు త్రిజాతకములు గ
జపిప్పలి చందనము వీటి చూర్ణమును రెట్టింపుచేర్చి సదరు కషాయము
తోసేవించిన సంతోషము శరీరవృద్ధి కామవృద్ధి రక్తశుద్ధిని కలుగజేయు
ను పిల్లితేగలరసమునందు శర్కర తేనె చేర్చి సేవించిన ఆమ్లపిత్తరోగము
నశించును అక్కలకర్రి కషాయముతో సేవించిన జ్ఞాపకశక్తిని నాగకేస
రముల కషాయముతో సేవించిన రక్తమందు నుండు అతివేడిమినితగ్గించి
ఇంద్రియబలమును కలుగజేయుచు దీనికి రెట్టింపు కొడిశపాలాదిచూర్ణ
మును జేర్చి బిల్వశొంఠి దాల్చినచెక్కతుంగముస్తలు కషాయముతో
పుచ్చుకొనిన 12 పూటలలో దుస్సాధ్యమయిన గ్రహణులుకట్టును లవం
గము కళింగరాష్ట్రములచూర్ణము దీనికి రెట్టింపుచేర్చి తేనెతోసేవించిన
సకల క్షయరోగములు తిప్పసత్తు యాలకులు పసపు వీటి చూర్ణమును
రెట్టింపుజేర్చి పల్లేరువేళ్ల కషాయముతో నిచ్చిన మూత్రనాళమందు
మంట ప్రమేహము లేక (శెగరోగము) నివారణమగును మిరియాలరస
ముతోనిచ్చిన స్త్రీలకు సమస్త కుసుమరోగములు దీనికి రెట్టింపు త
క్కలపుట్లు లొద్దుగపువ్వులు లవంగాలు చూర్ణముచేర్చి బియ్యపుకడిగి
ననీరుతోనిచ్చిన తెల్లకుసుమ యఱ్ఱకుసుమ రక్తపైత్యము సర్వప్రదరము
లు పెన్నేరు పిల్లితేగలు బేదానాలుసీమగొబ్బివిత్తులు చూర్ణము మందు
కు నాల్గురెట్లు కలపి చక్కెరతో మూడుమాసములు సేవించిన నపుంస
కులకుపుంసత్వము మధ్యకాలమందు కలిగిన నపుంసకత్వమునివారణయ
గును గొడ్రాలు సేవించిన సంతానవంతురాలు అగును శెగ మొదలగు
సుఖరోగములు జీర్ణించుటచే గలిగిన సంతానలోపమును నివారించును
దీనిని రాత్రిపరుండబోవునపుడు తాంబూలముతో నుపయోగించుచుం
డిన పాండువ కాసశ్వాస ఉన్మాదము రక్తదోషములు శూలలు మూత్ర



రోగములు రొమ్మునొప్పి ఇంద్రియమందు నుండు వేడి నిద్రలేకపోవుట
అతిమూత్రము కాళ్లుచేతులు నడుము లాగుట కండ్లు కాళ్లుచేతులు
మంటలు నడుమనొప్పి నివారణమగును యెండిపోయినవృక్షము తిరిగి వ
సంతరుతువునందు రమణీయముగా చిగుర్చు చందమున యీవసంతకుసు
మాకరమును సేవించువారలు సకలరోగములనుండియు విముక్తులగుట
యేగాక వృద్ధత్వమును నెన్నటికిరానీయక నవయౌవ్వనవంతులుగాజేయును.

242 పూర్ణచంద్రోదయము తు 1 కి రు12—0—0

ప్రాతస్సాయంకాలములయందు రెండుగురిగింజలయెత్తు చొ॥
సేవించవలెను. తులమెత్తు చంద్రోదయములో రెండుగురిగింజలయెత్తు
కస్తూరి, జాజికాయ మిరియాలు లవంగాలు యివి బేడెత్తు చొ॥ పావుతు
లము పచ్చకర్పూరం చేర్చి బాగుగా కలియనూరి వకఅణాయెత్తు చొ॥
రెండుతమలపాకులలో నునిచి నమల మ్రింగినను (లేక) తాంబూలము
తో సేవించినను తేనితో సేవించినను శుక్లనష్టములు శ్వాసకాసలు మే
హజ్వరములు సకలవిధ దారుణ మేహములు శగరోగము నిక్కాక గుం
డెదడ సర్వవిధములగు క్షయరోగములు వీర్యము పలుచనై సంభోగేచ్ఛ
లేకుండుట పొడిదగ్గు మొదలగు అనేకరోగములను నిర్మూలించుటయే
గాక అమితమగు వీర్యవృద్ధిని మనస్సంతోషమును కలుగజేయును పైచూ
ర్ణమును తమలపాకుల రసముతోగాని ,పన్నీరుతోగాని నూరి శనగలవలె
మాత్రలుగట్టి తాంబూలముతో మధ్యాహ్నమందు రాత్రియందు
సేవించుచుండినయెడల ఇంద్రియనష్టము శుక్లము స్రైరై సంభోగేచ్ఛ
వమియులేకుండుట శీఘ్రస్కలనమును బోగొట్టి అపార మయిన వీర్య
వృద్ధి కలిగి చటకపక్షివలె అమితసంభోగశక్తిని కలిగించును ప్రత్తిగింజ
లలోపప్పు పేలాపుసత్తువీటితోయిచ్చిన అన్నివిధములగు ఛర్దిరోగములు
నెం 1 రు చూర్ణానుపానము రెట్టింపుచేర్చి ఆవునేతితోగాని పటికబెల్ల
ము చూర్ణముతో వెన్నచేర్చిగాని సేవించిన నానావిధములగు పైత్య
రోగములు పిత్తరోగములు మేహరోగములు నివారించును వుశిరికవర్గు
చూర్ణము రెట్టింపుచేర్చి పంచదారతో సేవించి మేహకారకములవల్ల

కండ్లు ఎరుపు మెరుగుట పొట్లులోనగు సమస్త నేత్రరోగములను బోకార్చి మంచిదృష్టిని కలుగజేయును. చాతుర్జాతక చూర్ణము రెట్టింపు జేర్చి వెన్నతో సేవించిన కాళ్ళు చేతులు మంటలు నిక్కాకవల్ల కాళ్లు చేతులు నడుము పీకుట శిరస్సు వేడిమొదలగు అతివేడిమీాద పుట్టిన సమస్తవ్యాధులు తొలగును త్రిసుగంధ చూర్ణము రెట్టింపుచేర్చి ధనియాల యొక్క హిమమునందు కొంచము పంచదార వేశి సేవించిన కడుపులోను గుండిలయందు కంఠమందు వుండు మంటలు అత్యుగ్రమయిన తాపములు వుడుకు వికారములోనగు అనేకరోగములు బాపును దేశములు రాజు తనప్రజలను సంరక్షించు చందమున సమస్తరోగములనుండియు రక్షింపబడుదురు. వీనిని సదా సేవించువారలు ఆవునెయ్యి పాలు మీాగడ పెర్గు మధురపదార్థములు నేతితోనుగోధుమవ్రైరాలుతోనుచేయబడిన పిండివంటలు మినపగారెలు మృదుకరములగు మాంసాదులు మిఠాయిలు మొదలగు తనకిష్టమగు సకలపదార్థములు భుజింపవచ్చును.

243 రజిత చంద్రోదయము తు 1 కి రు 4—0—0.

ప్రాతస్సాయంకాలములయందు రెండు గురిగింజలెత్తు చొ॥ సేవించవలెను. దీనికి రెట్టింపు చాతుర్జాతకచూర్ణము జేర్చి వెన్నతో సేవించిన, శుక్లనష్టము, వుడుకు, పురాణజ్వరము ఇరువది మేహరోగములు హరించును. తమలపాకుల రసముతో నిచ్చిన, శ్వాసకాస, అజీర్ణము, అరుచిన్ని, దాల్చినచెక్క గసగసాలుచూర్ణము రెట్టింపుజేర్చి, బిల్వశొంఠి రసముతోగాని కొడిశపాల రసముతోగాని, సేవించిన గ్రహణి రక్తగ్రహణి, ఏలకుకాయలులోని గింజలు, జాజికాయ, లవంగాలు, కుంకుమపువ్వు, వీనిచూర్ణము రెట్టింపుచేర్చి, తేనితో బుచ్చుకొనిన, రక్తశుద్ధిజేసి, ఇంద్రియవృద్ధిని బలమును కలుగజేయుటయేగాక సమస్త క్షయరోగములను బోకార్చును. ధనియాల రసముతోగాని, యాలకుకాయలు రసముతోగాని యిచ్చినయడల వాంతులు, తలతిప్పు పైత్యవికారము తగ్గును, చనుబాలతో బాలురకిచ్చిన మంచి బలమును ఆయుర్వృద్ధినిజేసి సమస్తరోగములునుంచి బాయగలరు.



244 త్రిపాద చంద్రోదయము తు 1 కి రు 3—0—0.

ప్రాతస్సాయంకాలములయందు చిన్నమెత్తు చొ॥ సేవించేది. నె 1 రు చూర్ణము దీనికి రెట్టింపుచేర్చి, వెన్నతోగాని, పటికిబెల్లం చూర్ణముతోగాని, సేవించిన నిక్కాక, మేహము, పొడిదగ్గు, అరుచి పైత్యజ్వరము నివారించును. చనుబాలతో నిచ్చిన చంటిబిడ్డలు పాలుగ్రక్కుట విరేచనములగుట ఉడుకుజ్వరములు గట్టును చాతుర్జాతక చూర్ణము రెట్టింపుచేర్చి పటికిబెల్లం చూర్ణముతోగాని, వెన్నతోగాని, పుచ్చుకొనిని సకలక్షయలు నివర్తించును. ధనియాలు జీలకర్ర రసముతోనిచ్చిన, పైత్యజ్వరము, వడలుతిప్పు, అరుచి, వాంతి నివర్తించును. చంటిబిడ్డలకు మోతాదు తక్కువగా వాడవలెను.

245 వంట శాల సూర్యోదయము తు 1 కి రు 3—0—0.

ప్రాతస్సాయంకాలములయందు రెండు గురిగింజల యెత్తు చొ॥ సేవించేది. నె 1 రు చూర్ణమును దీనికి రెట్టింపుచేర్చి, అల్లము జీలకర్ర రసముతో సేవించిన, వాతపైత్యము, పైత్యవాతము, మేహపైత్యము, శ్లేష్మపైత్యము, మొదలగు ద్వంద్వరోగములను బోకార్చును. శొంఠి తిప్పతీగె కషాయమున నిచ్చిన, ఆమవాతము, ఆమ్లపైత్యము నివారించును. దీనికి రెట్టింపు చాతుర్జాతకచూర్ణము చేర్చి, తేనెతోనిచ్చిన, తాపయుక్తమగు ఉడుకుజ్వరము, పైత్యజ్వరము, మేహజ్వరము మొదలగు సర్వజ్వరములను నివారించును. జీరపిప్పలీచూర్ణము దీనికి సమము జేర్చి తేనెతో నిచ్చిన అహికజ్వరము, పురాణజ్వరము, చలిజ్వరము, మన్నెజ్వరమును నివారించుటయేగాక, పాండువ, కామిల, క్షయశ్వాస, కాస, మొదలగు అనేకరోగములను బోగొట్టి రక్తశుద్ధిని, వీర్యవృద్ధిని జేయును.

246 షడ్గుణము తు 1 కి రు 4—0—0.

ప్రాతస్సాయంకాలములయందు అడ్డిగెత్తు చొ॥ సేవించవలెను. నె 1 రు చూర్ణముగాని, చాతుర్జాతక చూర్ణమునుగాని, త్రిసుగంధ

చూర్ణమునుగాని, దీనికి రెట్టింపుచేర్చి వెన్నతోనయినా, పటికిబెల్లం చూర్ణముతోనయినా, ఆవునేతితోనయినా, తేనెతోనయినా గలపి సేవించిన సమస్తవిధములయిన పిత్తరోగములు, మేహరోగములు, పైత్యరోగములు రక్తక్షయ అగ్నిమాంద్యము, మేహకఫములు, వింశతిమేహములు, మేహతిమ్మిరి, మేహపైత్యవుడుకు వ్యాధులను నివర్తించుటయేగాక, శరీరపుష్టిని, కాంతిని, రక్తవృద్ధిని వీర్యవృద్ధిని కలుగజేయును.

## 247 సర్వ్వరాంజన-చంద్రోదయము తు 1 కి రు 15—0—0.

ప్రాతస్సాయంకాలములయందు రెండు గురిగింజల యెత్తు చొ॥ సేవించేది. పిప్పళ్ళు, జీలకర్ర, దాల్చినచెక్క, యాలకుగింజలు, రసశింధూరం, మిరియాలు, సమభాగములు చూర్ణముచేసి ఔషధమునకు మూడురెట్లుచేర్చి, తేనెతోగాని, ఆవునేతితోగాని సేవించిన సకల క్షయరోగములు, కీళ్ళనొప్పులు, నానావిధములగు కఫరోగములు, ఉబ్బసము అజీర్ణము, శ్లేష్మవాతజ్వరములు, పురాణజ్వరము, శల్యగతజ్వరము, జీర్ణజ్వరము, మృత్యుజ్వరము, చలిజ్వరము, అహికజ్వరము మొదలగు సర్వజ్వరములను క్రమమయిన శుద్ధులుగాని, పాషాణాదులు రసములు, మణిశిల తాళకము వగయిరా సేవించుటచేతను వచ్చే సమస్త దుర్గుణములు రసనొప్పులు రసముచే కాళ్లు చేతులు మోకులుదిగుట, కడుపులో యెడతెగని మంట, శుష్కించిపోవుట, నేత్రములు యెరుపెక్కి యెండను జూడనీయకపోవుట, మంటవాపు మూత్రమందు సుద్దపడుట, కుష్టాదిరోగములు కలుగుట, శరీగము మామూలుఛాయగాక, యెర్ర, పసపు,నలుపు రంగులలోనికి మారుట సహించరాని రొమ్మునొప్పి, తుదకు దేహనాశనమును గలుగ జేయునట్టి శుద్ధులు గాని, రసపాషాణ శిలాద్యౌషధములవల్ల కలిగే సమస్తదుర్గుణములను మొదలంట కుదుర్చుటయేగాక, శెగసవాయి మొదలగు సకల సుఖరోగములను తద్రోగములవల్లజనించే సమస్త దుర్గుణములను బోగొట్టి రక్తశుద్ధి ఆయుర్వృద్ధి ఇంద్రియవృద్ధిని గలిగించి మదించినస్త్రీల మనోభీష్టమును దీర్చువాడగును.



## 248. లఘుచంద్రోదయము తు 1 కి రు 4-0-0

ప్రాతస్సాయంకాలముల యందు రెండు గురిగింజలయెత్తు చొ సేవించేది నె 1 రు చూర్ణము దీనికి రెట్టింపు చేర్చి యాలకకాయలు కషాయముతో సేవించిన, మేహవుడుకు మేహజ్వరము మేహముతోసంబ॥ధించిన దగ్గులు నివారించును చాతుర్జాతకచూర్ణము దీనికి రెట్టింపుచేర్చి అల్లపురసముతోనిచ్చిన ఒళ్లుత్రిప్పు, కడుపులో వికారము పైత్యవుడుకు తగ్గును దీనికి రెట్టింపు అహిపత్యచూర్ణముచేర్చి పంచదారతోనైనా తేనెతోనయిన అనుపానము బెట్టియిచ్చిన దగ్గు ఒగరపు అజీర్తి అన్నహితవు లేకపోవుట దారుణమగు పైత్యవికారములను బోగొట్టి రక్తశుద్ధిని జేసి శరీరపుష్టిని నొసంగును.

## 249 బాలచంద్రోదయము తు 1 కి రు 1-0-0.

ప్రాతస్సాయం కాలములయందు గురిగింజయెత్తు చొ॥ సేవించవలయును. చంటిపిల్లలకు వుగ్గుబెట్టి ఆముదములోను లేక చనుబాలతోను యిచ్చిన పాలుగ్రక్కుట శ్లేష్మరోగము జ్వరములు కట్టును యీ ఔషధములో పెసరగింజంత నల్లమందు చేర్చియిచ్చిన చంటిబిడ్డల నీళ్లవిరేచనములు కట్టును. జలుబు నంజులు ఆయాసము రొంప ముసముసలాడుచుండుట మొదలగు బాలురకు గలిగే సమస్త వ్యాధులు ఖండించును పెద్దవారలకు చిన్నమెత్తు చొ॥ తేనె వెన్న వీట్లతో పుచ్చుకొనిన వడలునొప్పులు శరీరము జలుబు వడలు త్రిప్పుట అరుచి మొదలగు రోగములను నశింపజేయును. పిప్పలిమోడి రసముతో సేవించిన సూతికాస్త్రీలయొక్క ఒడలునొప్పులుజ్వరము మొదలయినవి బోకొట్టును.

## 250 మహావాతరాక్షసము తు 1 కి 8-0-0

రెండణాలయెత్తు ఔషధమునందు 11 మిరియాలువేసి చిత్రమూలరసముతో నూరి కందులవలె మాత్రలుగట్టి పిప్పలి మోడి రసముతోగాని మిరియాల రసముతోగాని కాళ్లుచేతులు చల్లబడి స్మృతి తప్పి మాటలేకున్న సమయముననే గంటకు రెండేసి మాత్రాదులు చొ

యిచ్చిన నారోగిని జీవింపజేయును. మరియు సూతికావాతము పురుస్తంభవాతములు మొదలగు 80 వాతములు వాతజ్వరములు సన్నిపాతజ్వరములను అనతికాలములో నివారించును. రోగము యెక్కువగా నుండి శ్లేష్మ మెదుర్కొనినపుడు చిత్రమూలము రసముతోగాని ములగచెక్కరసముతోగాని వెల్లుల్లి రసముతోగాని నాలుగుమోతాదులనిచ్చిన వేడిజేసి రోగిని మాట్లాడించును. వాయువిడంగముల రసముతో నిచ్చిన కలరా జాడ్యము గట్టును చనుపాలలో గురుగింజెత్తు అరగదీసి యిచ్చిన చంటిబిడ్డలయొక్క బాలబాపచిన్నెను బాపును అణాయెత్తు ఔషధమునందు బేడెత్తు స్థాలీచూర్ణము జేర్చి అయిదు పొట్లములుగ గట్టి తేనెతో సేవించిన ఒడలునొప్పులు కీళ్ళనొప్పులు కీళ్ళు స్వాధీనము తప్పిపోవుట వాతమునల్ల కాళ్ళు చేతులు లాగుటయు నివర్తించును. దుంపరాష్ట్రము కళింగరాష్ట్రము వీటికషాయముతో ఒకచిన్నమెత్తు అరగదీసి సేవించిన దగ్గు వగర్పు కఫరోగములు పటాపంచలై పోవును. విడువక 20 దినములు తేనెతో పావుచిన్నము (గురిగింజయెత్తు) చొ॥ సేవించిన వాతముతో సంబంధించిన సమస్తరోగములను మొదలంట నశింపజేయుటయేగాక బుద్ధిబలమును నొసంగును,

251 వాతరాక్షసము తు 1 కి రు 4-0-0

పావుతులం యెత్తు మందులో బేడెత్తు మిరియములుచేర్చి అల్లపు రసముతోనైనా మునగచెక్క రసముతోనయినా నూరి కందిగింజంత చొ॥మాత్రలుగట్టి అల్లపురసముతోనయినామిరియములరసముతోయినా ప్రాతస్సాయంకాలములయందు సేవించిన ఒడలునొప్పులు జ్వరములు నివర్తించును. కళింగరాష్ట్రము దుంపరాష్ట్రము ఓమము వీట్లకషాయముతో సేవించిన సూతికా వాయువులు సన్నిపాత జ్వరములు శ్లేష్మజ్వరములు మొదలంట ఖండించును. ఒకఅణాయెత్తు ఔషధములో జీరపిప్పలిచూర్ణము బేడెత్తువేసి కలియనూరి అయిదు పొట్లములుగట్టి తేనెతో నిచ్చిన నీళ్ళవిరేచనములు అజీర్ణ విరేచనములు జ్వరములు బోగొట్టి అన్నహితవును గలుగజేయును.



252 నవలోహ రసాయనము తు 1 కి రు 8-0-0

యీ ఔషధం ప్రాతస్సాయంకాలములయందు గురిగింజయెత్తు చొ॥ సేవింపవలయును. దీనికిరెట్టింపు స్థాలీచూర్ణము జేర్చి తేనెతో నిచ్చిన శ్వాస కాస రొమ్మునొప్పి ఆయాసము నివర్తించును. అడ్డసరపు ఆకులు మిరియాలుకషాయముతో నిచ్చిన అసాధ్యపు శ్వాసరోగములను బోగొట్టును దీనికి రెట్టింపు త్రికటుక చూర్ణమును చేర్చి అల్లపరసముతో నిచ్చిన కడుపుబ్బి తేనుపులతో నుండిన దారుణమగు అజీర్ణరోగమును శరీరమాన్యంతము వ్యాపించియుండే తిమ్మిరరోగమును బాపును దీనికి రెట్టింపు అహిపత్య చూర్ణముచేర్చి అల్లపరసము తోనె కలపి దానితో సేవించిన కీళ్లు స్వాధీనము తప్పిన జాడ్యము వుబ్బుజాడ్యములను పాండురోగములను బోగొట్టి రక్తశుద్ధిచేసి మంచిఆకలిని పుట్టించి శరీరమునకు మంచి ఆరోగ్యమును జేయును.

253 పంచలోహరసాయనము తు 1 కి రు 4-0-0

ప్రాతస్సాయంకాలములయందు గురిగింజయెత్తు చొ॥ వెన్నతో సేవించిన శుక్లమేహాది 20 మేహములు గుండెబరువు కఫరోగములను బోగొట్టును దీనికి రెట్టింపు స్థాలీచూర్ణము చేర్చి తేనెతో సేవించిన శ్వాసకాసలు గుల్మాదిరోగములు నివర్తించును అల్లపరసముతో సేవించిన తిమ్మిర కాళ్లునొప్పులు లోనగు నవి నివర్తించును చాతుర్జాతుకచూర్ణము రెట్టింపుచేర్చి పటికిబెల్లముచూర్ణముతో పుచ్చుకొనిన వుబ్బుజాడ్యము శోఫ పాండువనశించి మంచిరక్తము పట్టించును.

254 రజతలోహరసాయనము తు 1 కి 4-0-0

ప్రాతస్సాయంకాలములయందు చిన్నమెత్తు చొ॥ సేవించేది స్థాలీచూర్ణము రెట్టింపుచేర్చి తేనెతో సేవించిన గుండెభారము గుండెలు బిగబట్టుట గుండెలయందు నొప్పి దగ్గు వగర్పు నివర్తించును త్రిఫలచూర్ణము దీనికి రెట్టింపుచేర్చి తేనె తమలపాకులరసముతోనిచ్చిన మేహానంజు మేహాతిమ్మిర ఎగశ్వాస కట్టును దుంపరాష్ట్రము కళింగరాష్ట్రము

అడ్డసరపు ఆకులు మిరియాలు వీట్ల కషాయముతోనిచ్చిన కంఠమందు వుండవలెనుండుట పుప్పుసపు దగ్గు అగ్నిమాంద్యము కీళ్లనొప్పులు నివర్తి చేసి రక్తమును ఇంద్రియమును వృద్ధిపరచి శరీరదారుఢమును గలుగ చేయును.

255 తాంమ్రలోహరసాయనము తు 1 కి రు 4-0-0

తేనెతోగానిఅల్లపరసముతోగాని తులసిఆకురసముతోగాని తమలపాకులరసముతోగాని గురిగింజయెత్తు ప్రాతస్సాయంకాలములయందు అరగదీసి యిచ్చిన శ్లేష్మవాతరోగములు పుప్పుసపు దగ్గులు సకల అజీర్ణములు నశించును దీనికి రెట్టింపు స్థాళీచూర్ణము చేర్చి తేనెతోనిచ్చిన యడల శరీరము కీళ్లునొప్పులతోనుండు పుబ్బురోగము నివర్తించును త్రిఫలములు త్రికటుకములువీట్లచూర్ణము రెట్టింపుచేర్చి త్రిఫలకషాయముతోనిచ్చిన పాండువశోఫ పశిమరోగములను గుదిర్చి రక్తశుద్ధినిజేయును.

256 లోహరసాయనము తు 1 కి రు 2-0-0

ప్రాతస్సాయంకాలములయందు చిన్నమెత్తు చొ॥ తేనె తమలపాకులరసముతోనిచ్చిన శ్లేష్మరోగములు వాతరోగములు దగ్గు వగర్పురోగములు నివర్తించును దీనికి రెట్టింపు నెం 2 రు అనుపానచూర్ణమును చేర్చి తేనెతో సేవించిన కీళ్లనొప్పులు పుబ్బుజాడ్యము గుండెలుబరువు కాసశ్వాసవ్యాధులను బోగొట్టుటయేగాక రక్తశుద్ధిని వీర్యవృద్ధిని జేసి శరీరమునకు బలమును కలుగజేయును.

257 రసరాట్టు తు 1 కి రు 2-0-0

ప్రాతస్సాయంకాలములయందు చిన్నమెత్తు చొ॥ తేనెతోగాని తమలపాకులరసముతోగాని అరగదీసి సేవించినసకల విధములగుకఫరోగములు శ్వాసకాస గుండెభారము నివర్తించును అల్లపరసముతోనిచ్చిన సకల విధపైత్యశ్లేష్మరోగములు గుండెదడ శరీరముత్రిప్పు జోకార్చును మిరియములకషాయముతో సేవించిన కీళ్లనొప్పులు శరీరమునొప్పి రొమ్మున్న భారము గొంతుకలో వుండవలెనుండుట నివారణమవును దీనికి రెట్టింపు



పిలివేళ్లు చూర్ణముచేర్చి గుమ్మపాలతో పుచ్చుకొనిన యక్షరోగములను బాపును దీనికి రెట్టింపు స్థాళీచూర్ణముచేర్చి అడ్డసరపుఆకులు మిరియము కషాయముతోనిచ్చిన ఎగరొప్పు వాతసంబంధమగు ఉబ్బురోగమును నివారణజేసి జఠరదీప్తిని కలుగజేయును.

258. నారాయణకవచము తు 1 కి రు 6-0-0.

ప్రాతస్సాయం కాలములయందు రెండు గురిగింజలయెత్తు చొ॥ సేవించేది. తమలపాకురసమునందు కళింగరాష్టము సీమకరక్కాయ పొంగించిన లవంగములు కొద్దిగా అరగదీసి అందు మందు కూడా అరగదీసి తేనెచేర్చి యిచ్చిన కఠినమగు దగ్గు. ఒగర్పు పూపిరిరానియ్యానిశ్వాస, గొంతుకలో వుండవలె నుండుట హరించును. ఆకుజెముడుఆకులరసములో అరగదీసియిచ్చిన సన్నిపాతమందు శ్లేష్మపుమ్రితము నశించును. దీనికి రెట్టింపు స్థాళీచూర్ణముచేర్చి, తేనెతో సేవించిన, సమస్తవిధములగు కఫవాతరోగములు కీళ్లనొప్పులు సకలాజీర్ణములు నివర్తిచేసి రక్తశుద్ధిని బలమును గలుగజేయును.

259. మహాలక్ష్మీవిలాసరసము తు 1 కి రు 10-0-0

ప్రాతస్సాయం కాలములయందు రెండు గురిగింజలయెత్తు సేవించవలెను. దీనికి రెట్టింపు నె 1 రు అనుపాన చూర్ణముచేర్చి, అల్లము జీలకర్ర రసముతో నిచ్చిన సర్వవిధములగు పైత్యజ్వరములు, జీర్ణజ్వరములు వామురసముతో నిచ్చిన వాతజ్వరములు కళింగరాష్ట్రము అడ్డసరపుఆకులు మిరియాలు వీటికషాయముతోనిచ్చిన సకలవిధములగు శ్లేష్మజ్వరములు శీతపైత్యజ్వరములు నివర్తించును. దీనికి రెట్టింపు చాతుర్జాతకచూర్ణము చేర్చి మారేడుచెక్క కషాయముతో యిచ్చిన నోటనీరు వూరుట వెక్కిళ్లింతలు అన్నహితవులేకుండుట రొమ్మున్నమంట సకలాజీర్ణములు నివర్తింపజేసి మంచిఆకలిని బుట్టించును కస్తూరికుంకుమపువ్వు దీనికి సమముగాజేర్చి తమలపాకులరసముతో నూరి మినపగింజలంత మాత్రలుగట్టి జామునకొకమాత్ర చొ॥ సేవించిన వాతపైత్య శ్లేష్మ

రోగము లణచి సమమయిన వేడిని కలుగజేసి బలమును రక్తవృద్ధిని జేయును. తిప్పసత్తు చలవమిరియాలు నేలగుమ్మిడి పెన్నేరు నేలతాడి వీట్ల చూర్ణమును రెట్టింపుచేర్చి వెన్నతోగాని పంచదారతోగాని సేవించిన సకలవిధ శెగరోగములు నిక్కాక వేడి అధికమయి వీర్యము పలచనగుట శుక్లనష్టము మొదలగు అనేకరోగములు నివారణజేసి సంభోగశక్తిని కలుగజేయును. దీనిని ధనియాలయొక్క హిమముతో నయినా జీలకఱ్ఱ రసముతోనయినా అల్లపరసముతో నయిన సేవించిన శోఫ, పాండువులు కామిల, జ్వరములు, గ్రిహణ్యతిసారరోగములుఛర్ధిరోగములునివర్తించుటయేగాక రక్తశుద్ధిని బుద్ధి బలము నిచ్చును శరీరమునకు కాంతిని బలమును గలుగ జేయును.

260. స్వర్ణభూపతి తు 1 కి రు 8-0-0.

ప్రాతస్సాయం కాలములయందు చిన్నమెత్తు చొ॥ సేవించేది పిప్పళ్లు శొంఠి మిరియములు వీటిచూర్ణము ఔషధమునకు రెట్టింపు చేర్చి అల్లపురసముతో నిచ్చిన జ్వరములు వాతరోగములు శూలరోగములు శ్లేష్మరోగము దీనికి సమము పిప్పలీచూర్ణముజేర్చి తేనెతోసేవించిన క్షయరోగము దీనికి రెట్టింపు స్థాళీచూర్ణముచేర్చి తేనెతో నిచ్చిన, ఆప్లువాతము ధనుర్వాతము మొదలగు 80 వాతములు అల్లపు రసముతోనిచ్చిన సన్నిపాతరోగములు దీనికి రెట్టింపు తిప్పసత్తుచేర్చి, పంచదారతోగాని తేనెతోగాని సేవించిన శెగరోగములు నిక్కాక, శుక్లనష్టము శుక్లరోగములను నివారించును దీనికి సమము త్రిఫలచూర్ణము జేర్చి, తేనేతోసేవించిన పాండుజ్వరము కామిలారోగము త్రిదోషములను హరించుటయేగాక రక్తశుద్ధిని బలమును శరీరపుష్టిని కాంతిని కలుగ జేయును.

261. కాంతవల్లభరసము తు 1 కి రు 4-0-0.

ప్రాతస్సాయం కాలములయందు అర్ధగాయమెత్తు చొ॥ సేవించేది దీనికి రెట్టింపు స్థాళీచూర్ణమునుచేర్చి తేనెతో నిచ్చిన పంచపాండువులు



శోఫరోగములు వుబ్బరోగములను బోగొట్టును. శొంఠి తిప్పతీగె కషాయముతో నిచ్చిన శ్వాస, కాస, ఆమవాతరోగము నెం 1 రు చూర్ణము రెట్టింపుచేర్చి పటికబెల్లం చూర్ణముతోగాని, ఆవునేతితోగాని, సేవించిన వీర్యవృద్ధి. శరీరపుష్టి, శరీరకాంతి బలమును కలుగజేయుడమేగాక రక్తశుద్ధిజేసి క్షయరోగములను బోగొట్టును. నెం 2 రు చూర్ణము రెటింపుచేర్చి తేనెతో సేవించిన, శరీర ఆద్యంతము వ్యాపించిన, తిమ్మిరిరోగము మేహ వాతములు కీళ్లనొప్పులు శుక్లనష్టము హరింపజేసి దేహారోగ్యము కలుగజేయును.

262 మహావాత విధ్వంసి తు 1 కి 4-0-0.

ప్రాతస్సాయంకాలములయందు పావుతులం మందు మిరియాల చూర్ణము రెండు అణాలయెత్తు చేర్చి తమలపాకు రసములోనయినా చిత్రమూలపు రసముతోనయిన నూరి కందులవలె మాత్రలు కట్టి అల్లపురసముతో సేవించిన పైత్యరోగములు, మిరియాల రసముతో సేవించిన వాతరోగములు, శొంఠిరసముతో సేవించిన సకల అజీర్ణములు, కళింగరాష్ట్రిము, దుంపరాష్ట్రిము, మిరియాలు కషాయముతో సేవించిన సకలవిధమగు శ్లేష్మరోగములు, వుబ్బసములు కొడిశపాలచెక్క రసముతో సేవించిన గ్రిహణి అతిసారములు అల్లపురసముతో సేవించిన సన్నిపాతాది ఘోరరోగములు, అపస్మారములు శీతపైత్యము ప్లీహరోగము పిప్పలిమోడి రసముతో సేవించిన, సూతికారోగములు సర్వజ్వరములను బోకార్చును. రోగబలమునుబట్టి రోజుకు 4, 5 మోతాదులు యివ్వనచ్చును.

263 బాలసూర్యోదయము తు 1 కి రు 4-0-0.

ప్రాతస్సాయంకాలములయందు గురిగింజ యెత్తు చొ॥ సేవించేది. దీనికి రెట్టింపు స్థాళీచూర్ణమును చేర్చి తేనెతో సేవించిన ద్వంద్వరోగములు, వింశతి మేహములు, సకలవిధ మేహజ్వరములు, పురాణజ్వరములు. దీనికి రెట్టింపు చాతుర్జాతకచూర్ణము చేర్చి వెన్నతోనిచ్చిన శుక్ల

నష్టము, నిర్కాక పైత్యము, అజీర్ణశూల, అరుచి, ఛర్దితాపము, వుడుకు మొదలయిన అనేక రోగములను బోకార్చి రక్తమును, వీర్యమును, వృద్ధి జేసి బలమును కలుగజేయును. అనుపానవిశేషముతో నిచ్చిన సకల రోగములు నిర్మూలమవును.

264 మహా బాలసూర్యోదయము తు 1 కి రు 5-0-0.

ప్రాతస్సాయంకాలములయందు రెండు గురిగింజలయెత్తు చొ॥ సేవించేది. దీనికి రెట్టింపు అహిపత్యచూర్ణమును జేర్చి, తేనెతో సేవించిన సకలవిధ పైత్యములు, పైత్యజ్వరములు, వాతపైత్యములు, శ్లేష్మ పైత్యములు నె 1 రు చూర్ణము రెట్టింపుచేర్చి; పటికబెల్లం చూర్ణము తో సేవించిన, ఇంద్రియనష్టము, శరీరకృశత్వము, నీలిమందుచెట్లువేళ్లు చూర్ణము దీనికి రెట్టింపుజేర్చి, గుమ్మపాలతో పుచ్చుకొనిన, యేకాదశ క్షయరోగములు, కాసశ్వాస, వుబ్బసము మొదలగు కఫరోగములు, ధనియాల కషాయముతో నిచ్చిన ఛర్దివుడుకు తాపము స్త్రీలకు గలుగు కుసుమాదిరోగములు, శొంఠి వాము కషాయముతో సేవించిన సకల అజీర్ణములు, అష్టశూలలును, గుదిర్చి రక్తశుద్ధిని, వీర్యపుష్టిని, కామో ద్దీపనము మనస్సంతోషమును కలిగించును.

265 మేహాంతకరసము తు 1 కి 4-0-0.

ప్రాతస్సాయంకాలములయందు రెండు గురిగింజలయెత్తు చొ॥ సేవించవలెను. దీనికి రెట్టింపు స్థాళీచూర్ణము జేర్చి తేనెతో నిచ్చిన, శోఫ, పాండువు, తిమ్మిరిరోగములు త్రికటుకచూర్ణము రెట్టింపుచేర్చి, అల్లపరసముతో పుచ్చుకొనిన అజీర్ణము అగ్నిమాంద్యము శూల, దీనికి పసుము తిప్పసత్తుజేర్చి, వెన్నతో సేవించిన శుక్లనష్టము, వింశతి, మేహ ములు నె 1 రు చూర్ణము రెట్టింపుచేర్చి దానిమ్మపండ్లు రసముతో పుచ్చుకొనిన మేహకాక, పైత్యకాక మేహపైత్యజ్వరములు నివర్తించి ఇంద్రియబలమును శరీరపుష్టిని గలుగజేయును.



266 మృతసంజీవని రసము తు 1 కి రు 4-0-0.

ప్రాతస్సాయంకాలములయందు గురిగింజయెత్తు చొ॥ సేవించేది. రోగ బలానుసారముగా ఝామునకు 2, 3 మోతాదుల చొ॥ అల్లపరస ముతో నిచ్చిన, దారుణ సన్నిపాతరోగములు, సప్తవిధ దోషములు, మిరియాల రసముతోనిచ్చిన శ్లేష్మరోగములు ప్రాణాపాయ స్థితియందు దీనిని రోగబలమునుబట్టి యుక్తానుపానములతో నిచ్చినరోగములను బరి మార్చి ప్రాణదానము జేయును.

267 నవగ్రహి తు 1 కి రు 6-0-0.

అల్లపరసముతో నూరి కందులవలె మాత్రలుగట్టి రోగబలాను సారముగా అపాయకరముగా యున్నపుడు ఝామునకు మూడు మోతా దుల చొ॥ అల్లపరసముతో నిచ్చిన ప్రాణమును రక్షించును. ఆకుజము డుఆకుల రసముతోగాని, మిరియముల రసముతోగాని చనుబాలతోగాని కఫము యెదుర్కొని ప్రాణాపాయ స్థితిలో నున్నపుడు యిచ్చిన శ్లేష్మ మునుదించి ప్రాణభీతిని దొలగించును. త్రికటుకములు కషాయముతో నిచ్చిన సూతికావాతములు ఘోరమగు సన్నిపాత జ్వరములు హరించు ను. విస్తారము వుపయోగించిన అతివేడి జేయును గనుక వైద్యులు చూచుకొని వాడుక జేయవలెను.

268 రసభూపతి తు 1 కి రు 3-0-0.

ప్రాతస్సాయంకాలములయందు రెండు గురిగింజల యెత్తు చొ॥ సేవించవలెను. దీనికి రెట్టింపు నె 2 రు చూర్ణముగాని, స్థాళీచూర్ణ ముగాని చేర్చి అల్లపరసముతోగాని, తేనెతోగాని సేవించిన వుబ్బురోగ ము, శోఫరోగము, పాండువ జీర్ణజ్వరము అగ్నిమాంద్యము నివర్తించు ను. దీనకి రెట్టింపు చాతుర్జాతకచూర్ణము చేర్చి తేనెతో సేవించిన సకల అజీర్ణములు శూలలు బోకార్చును.

269 హేమసుందర రసము తు 1 కి రు 2-0-0.

ప్రాతస్సాయంకాలములయందు రెండు గురిగింజల యెత్తు చొ॥

సేవించేది. చలవమిరియములు రేవలచిన్ని తిప్పసత్తు వీని చూర్ణమును, రెట్టింపుచేర్చి చందినీఅత్తరువు లేక వెన్నతో సేవించిన శెగరోగములు, యిరువది మేహరోగములు దీనికిమూడురెట్లు సుగంధిచూర్ణమును జేర్చి వెన్నతో పుచ్చుకొనిన సవాయిమేహములు నె 1 రు చూర్ణము రెట్టింపుచేర్చి వెన్నతోనయినా పంచదారతోనయినా సేవించిన కాళ్ళు కండ్లు మంటలు, నిక్కాక పైత్యవుడుకు మూత్రమందు సుద్దపడుట వింశతి మేహములు నివారించి బలపుష్టి తేజస్సులను కలుగజేయును.

270 మేహవంగరాజీయము తు 1 కి రు 4-0-0

ప్రాతస్సాయంకాలములయందు రెండు గురిగింజలయెత్తు చొ॥ సేవించేది దీనికి రెట్టింపు నె 1 రు చూర్ణమునుచేర్చి వెన్నతోగాని పంచదారతోగాని సేవించిన సవాయి మేహములు శెగమేహములు శుక్లనష్టము మూత్రములో సుద్ధపడుట జీర్ణించిన శెగరోగములు నివారణమగును దీనికి సమము సుగంధి పిరంగి చెక్క పెన్నేరు వీటి చూర్ణమును రెట్టింపుచేర్చి నేతితో సేవించిన సవాయిమేహరణములు సవాయివల్ల జనించు కీళ్లనొప్పులు మేహవుడుకులు మేహజ్వరములు నివారణమగును.

271 రజితరాజీయము తు 1 కి రు 4-0-0

ప్రాతస్సాయంకాలములయందు చిన్నమెత్తు చొ॥ సేవించేది నె 1 రు అనుపానచూర్ణము దీనికి రెట్టింపుచేర్చి వెన్నతో సేవించిన శుక్లదోషము బోకడచి బలమును కలిగించును దీనికి రెట్టింపు చాతుర్జాతకచూర్ణము జేర్చి పటికిబెల్లముచూర్ణముతో సేవించిన కఫరోగములు పొడిదగ్గు శ్లేష్మవుడుకులు నివర్తించును.

272 సూతికాభరణము తు 1 కి రు 20-0-0

ప్రాతస్సాయంకాలములయందు గురిగింజయెత్తు చొ॥ సేవించవలెను పావుతులము ఔషధములో 15 మిరియములువేసి వుప్పిచిగుళ్ళువేసి నూరి లేక చిత్రమూలమురసముతోనయినా నూరి మిరియమంత మాత్రగట్టి రోగబలానుసారముగా కాలమును నిర్ణయించి పిప్పలిమోడిరస



ముతో సేవించిన సూతికారోగములు ఆరోగమువల్లకలిగే సమస్తదుర్గుణములను ఖండించును దీనిని ఆయా అనుపానమునతో సేవించిన 80 వాతములు 13 సన్నిపాతరోగములు సర్వవిధమాంద్యములు స్పృహతెలియని అపస్మారాదిరోగములను గుదుర్చును.

273 తామ్రసింధూరము తు 1 కి రు 6-0-0

ప్రాతస్సాయంకాలములయందు గురిగింజయెత్తు చొ॥ సేవించవలెను దీనిని తమలపాకులరసముతో నూరి మిరియములవలె మాత్రలుగట్టి శీలివేళ్ల కషాయమునందు గిద్దెడు కాచిన ఆవుపాలను జేర్చి మాత్రవేసుకొనిన పిమ్మట అనుపానముగా సేవించిన ఘోరమగు 11 క్షయలు నిశ్శేషముగా కుదుర్చును శొంఠి వాము కషాయముతో సేవించిన అగ్నిమాంద్యము సకలాజీర్ణములను బోగొట్టి విస్తారము ఆకలిని గలుగజేయును దుంపరాష్ట్రము కళింగరాష్ట్రము సీమకరక్కాయలు వీట్లకషాయముతో సేవించిన శ్వాసకాస యగరొప్పు అత్యుగ్రమయిన కఫరోగమును కుదుర్చును అల్లపరసముతో సేవించిన అసాధ్యసన్నిపాతరోగములు ఆమ్లపైత్యములను బోకార్చును మిరియాలకషాయముతో సేవించిన సమస్తవాతరోగములను వాతజ్వరములను శొంఠి తిప్పతీగె కషాయముతో సేవించిన ఆమ్లవాతరోగములు త్రికటుకకషాయముతో సేవించిన జలోదరములు ధాతుక్షీణరోగము విషమజ్వరములు కొడిశపాలచెక్కరసముతో సేవించిన సంగ్రహణి అతిసారరోగములు త్రిఫలకషాయముతో సేవించిన పాండురోగము శోఫరోగము భగంధరరోగము నివారించి బలపుష్టి తేజస్సులకు నిరువైయుండును అనుపానవిశేషముతోనిచ్చిన సమస్త రోగములను దునుమాడును.

274 కఫకేసరి తు 1 కి రు 4-0-0

ప్రాతస్సాయంకాలములయందు గురిగింజయెత్తు చొ॥ సేవించేది ఆకుజెముడాకురసముతోగాని అడ్డసరపాకు రసములో తేనె కలపిగాని తమలపాకురసముతోగాని యిచ్చిన ప్రాణోపద్రవకరమగు కఫరోగము

లు సన్నిపాతరోగములు శ్లేష్మజ్వరములు బోగొట్టును చంటిబిడ్డలకు రెండువడ్లగింజలయెత్తు చనుపాలుతో అరగదీసి ఆముదముతో కలపిపోసిన బాలురకు గలుగు నానారోగములు ఒకటి రెండు మోతాదులతో నిశ్శేషమగును.

275 అమృతశ్రీరామ బాణము తు 1 కి రు 6-0-0

ప్రాతస్సాయంకాలములయందు గురిగింజయెత్తు చొ॥ పాలతో నయినా పంచదారతోనయినా పాలలో పంచదారవేసి యయిన సేవించిన ఏకాహిక ద్వియాహిక చాతుర్థిక జ్వరములును చలిజ్వరములు విషమజ్వరములు ఘోరమగు సన్నిపాతరోగములు వాతరోగములు పటాపంచలై పోవును.

276 నాగసింధూరము తు 1 కి రు 4-0-0

ప్రాతస్సాయంకాలములయందు చిన్నమెత్తు చొ॥ సేవించేది. నె 1 రు చూర్ణము దీనికి రెట్టింపుచేర్చి తేనెతో సేవించిన సకలక్షయ రోగములు శ్వాసకాసలు వెన్నతో సేవించిన సకలమేహములు శుక్లనష్టములు పటికిబెల్లము చూర్ణముతో సేవించిన స్త్రీలకుగలుగు కుసుమాది రోగములు గుదిర్చి కర్తశుద్ధిని బలవృద్ధిని ఆయుర్వృద్ధిని గలుగజేయును.

277 లోకనాధరసము తు 1 కి రు 4-0-0

ప్రాతస్సాయంకాలములయందు చిన్నమెత్తు చొ॥ సేవించేది ధనిమూలకషాయమునందు శక్కరకలపి అందు మందుచేర్చి సేవించిన అరుచి ధనియాలు తిప్పతీగె కషాయమున సేవించిన జ్వరము వట్టివేళ్ళు అడ్డసరపు ఆకులు దీనికషాయముబెట్టి అందు శక్కర తేనె నైచి యీ అనుపానముతో సేవించిన రక్తపిత్తము కఫము శ్వాసకాస నిద్రానాశము అతిసారగ్రహణులు అజీర్ణములను బోకడచును నె 2 రు చూర్ణము రెట్టింపుచేర్చి తేనెతో సేవించిన శోఫ పాండువ వుబ్బురోగము యివి నివర్తించి రక్తశుద్ధిని జేసి బలమును గలుగజేయును.



278 మహాదగ్నికుమారము తు 1 కి రు 4-0-0

ప్రాతస్సాయంకాలములయందు చిన్నమెత్తు చొ॥ తేనెతో అరగదీసి సేవించిన పాండువు శోఫ వగర్పు దగ్గు రక్తవిహీనము యివి నివారించును. అల్లపరసముతో సేవించిన వుబ్బురోగము వాతరోగములను నివర్తించును.

279 నాగేశ్వరము తు 1 కి రు 4-0-0.

ప్రాతస్సాయం కాలములయందు చిన్న మెత్తు చొ॥ యిందుకు సమము పిప్పలీచూర్ణము చేర్చి తమలపాకులో నునిచి నమలిమ్రింగిన మిక్కిలి వీర్యవృద్ది బలమును గలుగజేయుడమేగాక, ప్రమేహము కామిల ఉన్మాదరోగము శ్వాస కాస, పాండువు, అగ్నిమాంద్యము మొదలగు అనేకరోగములను బోగొట్టును.

280. వంగేశ్వరం తు 1 కి రు 4-0-0

ప్రాతస్సాయం కాలములయందు చిన్నమెత్తు చొ॥ ఇందుకు సమము పిప్పలీచూర్ణముచేర్చి తమలపాకులోనుంచి నమలిమ్రింగిన, కఫము స్వాస, కాస, క్షయరోగములు పిత్తరోగములు మేహజ్వరము గ్రహణిశూల కుష్టు పాండువ క్షీణత్వము మొదలగు అనేక రోగములను బోగొట్టును.

281. వంగతామ్రము తు 1 కి రు 2-0-0.

ప్రాతస్సాయం కాలములయందు రెండుగురిగింజలయెత్తు చొ తమలపాకుల రసముతోగాని, మిరియాల రసముతోగాని, అరగదీసి సేవించిన, వగర్పు, దగ్గు, సర్వవిధములగు కఫరోగములు, గొంతుకలో, పుండువలె నుండుట, గుండెనొప్పి, బరువుగానుండుట, నివారించును. మరియు దీనికి రెట్టింపు చాతుర్జాతక చూర్ణముచేర్చి మెత్తగానూరి పటికబెల్లముచూర్ణముగాని, వెన్నతోగాని, సేవించిన, కీళ్లనొప్పులు, శుక్లనష్టము క్షయ మొదలగు రోగములను బోగొట్టును. చంటిబిడ్డలకు చను

పాలలో రెండు వడ్లగింజలయెత్తు అరగదీసి యిచ్చిన నానావిధకఫరోగములు నివర్తించును.

282 సూతరాజరసము తు 1 కి రు 3—0—0.

మిరియములకషాయముతోగాని, ఆకుజెముడు, ఆకులరసముతోగాని, తమలపాకురసముగాని, నల్లేరురసముగాని, రెండుగురిగింజలయెత్తు అరగదీసి పుచ్చుకొనిన శ్వాస, కాస, దారుణకఫరోగము, వాతరోగము గుండెబరువుగా నుండుట, నివారణమగును, చంటిబిడ్డలకు రెండు వడ్లగింజలయెత్తు ఆముదములో అరగదీసి యిచ్చిన కఫవాతాది రోగములు నివారణ మగును.

283 దరదచింతామణి తు 1 కి రు 4-0-0

ప్రాతస్సాయంకాలములయందు గురిగింజయెత్తు చొ॥ సేవించేది దీనికి సమము త్రిజాతకచూర్ణముజేర్చి తేనెతోగాని వెన్నతోగాని సేవించిన మేహరోగములు శ్వాసరోగములు మొదలగు నానారోగములను బోకార్చుటయేగాక కామవృద్ధి అగ్నిదీప్తి బలమును నొసంగును తమలపాకుల రసముతో సేవించిన శ్వాసకాస సకలజ్వరములు నివర్తించును బుద్ధి విశేషముతో అనుపానములను నిర్ణయించి యిచ్చిన సమస్తరోగములను బరిమార్చును.

284 పాశుపదాస్త్ర మహారసము తు 1 కి రు 8-0-0

ప్రాతస్సాయంకాలములయందు గురిగింజ యెత్తుచొ॥ సేవించేది నేలతాడిగడ్డల రసముతో సేవించిన వుదరరోగములు అరటిదుంప రసముతో సేవించిన అతిసారము మజ్జిగలో సైంధవలవణము చేర్చి సేవించిన గ్రహిణి శూల అర్శస్సు దీనికి రెట్టింపు పిప్పలిచూర్ణము చేర్చి సేవించిన క్షయరోగము, మిరియాలరసముతో సేవించిన, వాతరోగమునివారించును.

285 రాజమృగాంక రసము తు 1 కి రు 10-0-0

ప్రాతస్సాయంకాలములయందు రెండు గురిగింజలయెత్తు చొ॥ దుంపరాష్ట్రము కళింగరాష్ట్ర సీమకరక్కాయ తమలపాకుల రసములో



కొంచము కొంచము అరగదీసి మందుగలపి సేవించిన రాజరోగము లేక క్షయ శ్వాసకాస అల్లపురసముతో అరగదీసి యిచ్చిన అజీర్ణము కఫము అగ్నిమాంద్యము శొంఠి తుంగముస్తలు కషాయముతో నిచ్చిన కామిలారోగము నివారణమగును.

286 స్వర్ణసూర్యావర్తి తు 1 కి రు 10-0-0

ప్రాతస్సాయంకాలములయందు గురిగింజయెత్తు చొ॥ జీలకర్రరసముతోగాని అల్లపురసముతోగాని సేవించిన ఆమ్ల పైత్యము అరుచి పుక్కిలింతలు ఛర్ధి ఒడలుతిరుగుట దద్దురులు వికారము కడుపులోమంట మొదలగు 20 పైత్యముల వల్ల జనించే సమస్త దుర్గుణములను ఖండించడమేగాక బుద్ధీంద్రియములకు బలమొసంగును. దీనికి రెట్టింపు త్రిసుగంధచూర్ణము జేర్చి ధనియాలరసముతో నిచ్చిన పైత్యజ్వరములు పైత్యకాకలు నివారించును పటికిబెల్లం చూర్ణముతో నిచ్చిన దగ్గు వగర్పు మానును యిష్టిమధుకము చూర్ణమును రెండురెట్లు కలపి పర్పాటక కషాయముతో నిచ్చిన దాహరోగము శిరోరోగము నివర్తించును, జీలకర్ర వేలపపిండి దీని చూర్ణము రెట్టింపుచేర్చి తేనెతో సేవించిన రక్తపైత్యము దుర్భరమగు వాంతి తలనొప్పి నివర్తించును లవంగాలు శొంఠి కషాయతో నిచ్చిన అగ్నిమాంద్యము అజీర్ణము పైత్యజ్వరములు నివారించుటయేగాక శేతోదోషములను నివారించును.

కజ్జలీ ఔషధములు

287 అమోఘాస్త్ర మహారసము తు 1 కి రు 10-0-0

వావిలిఆకు రసముతోగాని తులసిఆకు రసముతోగాని నూరి చిన్నపెసరగింజవలె మాత్రిలుగట్టి అల్లపురసముతోసేవించిన వాతరోగములు విషమదోషములు దారుణ సన్నిపాతరోగములు నివారించును ప్రాణాపాయ కరస్థితిలోనుండు వారికి మిరియముల రసముతోగాని తమలపాకుల రసముతోగాని అరగదీసి రోగబలమునుబట్టి మోతాదు నిర్ణయించి యిచ్చిన రోగమును హరింపజేసి వెంటనే మాట్లాడించి ప్రాణదాన మొ

సగును ప్రసవమయిన స్త్రీలు సూతికా వాతముచే ప్రాణాపాయ కరస్థితిలో నున్నపుడు గంటకొకసారి పిప్పలిమోడి రసముతో వడ్లగింజంత మోతాదు చొ॥ అరగదీసి యిచ్చినవెంటనే రోగము నివారించును. యే అవుషథమువల్లను శ్లేష్మము దిగక అపాయకరస్థితిలో వున్నప్పుడు ఆకుజెముడుఆకు రసముతోగాని నల్లేరు రసముతోగాని చనుబాలతోగాని యిచ్చిన కఫమును వజ్రాయుధమువలె ఖండించి తక్షణమే మాటలాడించును. అల్లము జీలకర్ర రసముతోగాని పిప్పళ్ళు జీలకర్ర రసముతోగాని సేవించిన సకలవిధ జ్వరములు నివారించును.

288 విష కోలాహలము తు 1 కి రు 2—0—0

ప్రాతస్సాయంకాలములయందు గురిగింజయెత్తు చొ॥ అల్లపురసముతో నిచ్చిన, సన్నిపాతరోగములు, సర్వజ్వరములు, శ్వాసకాసలు, నివర్తించును. తేలు కుట్టినచోట పయికివ్రాసి తమలపాకులో మోతాదువుంచి, నమలిమ్రింగిన తక్షణమే విషముదిగును. ఉత్తరేణిఆకు రసముతో లోపలికి యిచ్చిన సమస్తవిషములు పాముకాటులు దిగును. లవంగాలు రసముతో నిచ్చిన శ్వాసకాస కఫము తగ్గును. అనుపాన విశేషములతో నిచ్చిన సర్వరోగములు నివారణమగును.

289 వాతగజాంకుశము తు 1 కి రు 2—0—0.

యీఔషధమునునిమ్మకాయరసముతోగాని మిరియము రసముతోగాని నూరి కందిగింజలవలె మాత్రలుకట్టి రోగబలమునుబట్టి ప్రాతస్సాయంకాలములయందు ఒకటిగాని, రెండుగాని, మాత్రలను మిరియపు రసముతోనయినా, లేక మిరియపుచూర్ణము పావుతులమెత్తు నేతితో కలపినైన మాత్రవేసుకొని సేవించిన వురుస్తంభవాతము, కీళ్ళవాతములు శరీమునొప్పులు కాళ్లుచేతులు లాగుట వాతజ్వరము అజీర్ణవాతము మొదలగు సమస్త వాతరోగములను బోకార్చును.

290 కజ్జలీ నవగ్రాహి తు 1 కి రు 2—0—0.

ప్రాతస్సాయంకాలములయందు వడ్లగింజయెత్తు చొ॥ అల్లపురస



ముతోగాని మిరియముల రసముతోగాని పిప్పలిమోడి రసముతోగాని, సేవించిన దారుణ సన్నిపాతరోగములు శూలరోగములు 80 వాతములు సర్వజ్వరములను కఫరోగములను హరించును.

291 సన్నిపాతభైరవి తు 1 కి రు 1—0—0.

గురిగింజంత మాత్ర చొ॥ అల్లపరసముతోగాని, వట్టిమాత్రగాని రోగము బలముగా నున్నప్పుడు గంటకొకతూరి సాధారణముగా నున్నయప్పుడు ఝామునకొకతూరి కాలమును నిర్ణయించి యిచ్చినయెడల, సన్నిపాతజ్వరములు దోషజ్వరము మొదలగు సర్వజ్వరములు నివర్తించును. నీళ్ళతో నరగదీసి కండ్లకు కలికమువేసిన శిరోభారము సన్నిపాతజ్వరము విషజ్వరము నివారించును. ఇందుకొద్దిగా నల్లమందుచేర్చియిచ్చిన నీళ్ళవిరేచనములు, గ్రహణిరోగములు గట్టును.

292 స్వచ్ఛన్నము తు 1 కి రు 2—0—0.

ప్రాతస్సాయంకాలములయందు గురిగింజంతచొ॥ వుష్ణోదకముతో సేవించిన, అజీర్ణములు, అజీర్ణవిరేచనములు. గ్రహణి, అతిసారములు నీళ్ళవిరేచనములు పడిశభారము శరీరమునొప్పి కాళ్ళు చేతులు లాగుట జలుబు, సర్వజ్వరములు ఖండించును.

293 సూర్యావర్తి తు 1 కి 4—0—0.

ప్రాతస్సాయంకాలములయందు గురిగింజయెత్తు చొ॥ ధనియాలు రసముతోగాని, వెన్నతోగాని, సేవించినమేహ పైత్యములు, నిక్కాక, పొడిదగ్గులు, శరీముత్రిప్పు, సకలవిధ పైత్యములు నిమ్మకాయ రసముతోగాని జీలకర్ర రసముతోగాని సేవించిన వాంతి పసరుగ్రక్కుట లోనగు సర్వపైత్యరోగములు హరించును.

294 మాల్యవసంత రసము తు 1 కి 2—0—0.

ప్రాతస్సాయంకాలములయందు రెండు గురిగింజలయెత్తు చొ॥ దీనికి సమము పిప్పలీచూర్ణము జేర్చి తేనెతో సేవించిన ధాతుగతజ్వరము, పురాణజ్వరము, జీర్ణజ్వరము, శల్యగత జ్వరము నివారించును.

దీనికి సమము తిప్పసత్తు చేర్చి శర్కరతో సేవించిన సమస్త సెగరోగములు అల్లపురసముతోగాని మాదీఫలరసముతోగాని సేవించిన మూత్రరోగములును బోగొట్టును. దీనికి సమము జీరపిప్పలిచూర్ణముచేర్చి తేనెతో సేవించిన ఆంబవిరేచనములు నీళ్ళవిరేచనములు గ్రహణి అదిసారములు కట్టును.

295 శీతాంశురసము తు 1 కి రు 1—0—0.

ప్రాతస్సాయంకాలములయందు గురిగింజయెత్తుచొ॥ అల్లపరసముతోగాని దాచినచెక్క రసతోగాని జీలకర్ర రసముతోగాని సేవించిన సమస్తజ్వరములు అజీర్ణములు పసరువ్యాధులు నివారణమగును. పావుతులమెత్తు జీలకర్రతో నమలిమ్రింగిన కడుపులో మంట వాంతి నోట నీరూరుట త్రిప్పుట లోనగు సర్వదోషములు హరించును. నీళ్ళతో అరగదీసి కలికమువేసిన తలనొప్పి, శిరోభారము, నూతనపత్యమందు నిద్రించినదోషము బోగొట్టును. వేపాకురసముతో నూరి వ్రాసిన దద్దురులు తామర మొదలగు చర్మరోగములను బోగొట్టును. కాకిదొండకాయ కుమ్ములోగుక్కి రసముతీసి అందు యీమందును అరగదీసి నాలుకకు వ్రాసిన జిహ్వాదోషము హరించును.

296. ఆనందభైరవి. తు ॥ కి రు 1—0—0

ప్రాతస్సాయంకాలములందు గురుగింజంత మాత్ర చొ॥ శొంఠిరసముతోగాని మిరియపురసముతోగాని యిచ్చిన, కడుపునొప్పి, అజీర్ణము, సర్వజ్వరములు, శరీరనొప్పులు దీనిలో నల్లమందుచేర్చి యిచ్చిన అజీర్ణవిరేచనములు నీళ్ళవిరేచనములు నీళ్ళతో అరగదీసి కళ్లకు కలికము వేసిన వాతపైత్యజ్వరములు శిరోభారములు నివారణమవును.

297 కాలకూటము తు 1 కి రు 3—0—0.

చిత్రమూలము రసముతోగాని వెల్లుల్లిరసములోగాని తులసిఆకురసముతోగాని ములగచెక్క రసముతోగాని నూరి మిరియపు గింజలవలె మాత్రలుకట్టి రోగబలము తెలుసుకొని అల్లపరసముతోగాని మిరియపు



రసముతోగాని యిచ్చిన అసాధ్య సన్నిపాతరోగములు సూతికావాయువులు మాంద్యము జ్వరము వాతరోగములను మొదలంట ఖండించును.

298 క్రవ్యాదిరసము తు 1 కి రు 4-0-0

ప్రాతస్సాయంకాలములయందు రెండు గురిగింజలయెత్తు చొ॥ తేనె అల్లపురసముతోనిచ్చిన ఛర్దిపైత్యము వాంతి త్రిప్పు పైత్యాజీర్ణము అరుచి సమస్తాజీర్ణములను బోకడచి అన్నహితవును కలుగజేయును.

299 ప్రతాపలంకేశ్వరము తు 1 కి రు 2-0-0

ప్రాతస్సాయంకాలములయందు గురుగింజయెత్తు చొ॥ మిరియాలురసముతోగాని అల్లపురసముతోగాని సేవించిన సూతికావాతము సకలవాతజ్వరములు సన్నిపాతరోగములను బరిమార్చును.

300 జోగినీరసము తు 1 కి రు 2-0-0

గుంటగలగరాకురసముతో నూరి గురిగింజలవలె మాత్రలు గట్టి ప్రాతస్సాయంకాలములందు అల్లపురసముతో ఒక్కొక్క మాత్ర చొ॥ సేవించిన సకల జ్వరములు శ్లేష్మరోగములు పసరుతలత్రిప్పు వాతరోగములను బోగొట్టును దీని సేవవలన కొన్ని తత్వములందు విరేచనములు యెక్కువ యగుచుండునుగాన వుదయముపూట యివ్వవలయును.

301 లఘుపైత్యాంతకరసము తు 1 కి రు 1-0-0

ప్రాతస్సాయంకాలములయందు శెనగగింజంత చొ॥ ఉష్ణోదకముతో సేవించిన తలత్రిప్పుట అహితవు నోట నీరూరుట పసరువెళ్లుట లోనగు పైత్యవికారములయందు బాగుగ పనిజేయును.

302 మహాపైత్యాంతకరసము తు 1 కి రు 6-0-0

ప్రాతస్సాయంకాలములయందు రెండు గురిగింజలయెత్తు చొ॥ పంచదారతోగాని తేనెతోగాని యిష్టమధుకకషాయమునందు పంచదారవేసిగాని సేవించిన 24 పైత్యములు పైత్యజ్వరములు క్షయరోగము వాంతి అరుచి దప్పి శోష, హరించును దీనికి రెట్టింపు కోతులబుడమచూర్ణముచేర్చి చన్నీళ్లతో సేవించ్ని పైత్యదద్దురులు ఒడలుత్రిప్పు కండ్లు

కాళ్ళు శిరము చేతులు మండుట జిహ్వాచాపల్యము లేకుండుట మొద లగు సకల దుర్గుణములను ఖండించును.

303 మహాజ్వరాంకుశము తు 1 కి రు 2-0-0

ప్రాతస్సాయంకాలములయందు గురిగింజయెత్తు చొ॥ అల్లపురస ముతో సేవించిన అగ్నిదీప్తికలుగుటయేగాక వాతపిత్తశ్లేష్మజ్వరములు ద్వంద్వజ్వరములు పురాణజ్వరములు ఆహికజ్వరములు జలదోషములు మొదలగు సమస్త జ్వరములను సూర్యుడు చీకటిని బోకడచు చంద్రము వ బోకడచును.

304 లక్ష్మీవిలాసరసము తు 1 కి రు 1-0-0

ప్రాతస్సాయకాలములయందు రెండు గురివిందలయెత్తు చొ॥ యాలకుకాయలకషాయముతోనయినా ధనియాలకషాయముతోనయిన దాచినచెక్కరసముతోనయిన సేవించిన మేహావుడుకులు కడుపులోను గుండెలలోను మంట మేహపైత్యజ్వరములు వాంతి అరుచినిబోకడచును.

305 మహాతరుణార్కము తు 1 కి రు 8-0-0

ప్రాతస్సాయంకాలములయందు కందులవలె మాత్రలుచేసి మిరి యపురసముతోగాని అల్లపురసముతోగాని రోగబలానుసారముగా కాలమును నిర్ణయించి ఝాముకొక మాత్ర చొ॥ యిచ్చిన స్మృతితప్పి ప్రపంచజ్ఞాన రహితముగానున్న రోగి 1-2 మోతాదులు యిచ్చుటచే తనే స్మృతిగల్గి మాటలాడును ఘోరసన్నిపాతములు సర్వవాతరోగము లు జ్వరరోగములు నివారణజేసి వేడినినిలుపును పసివాండ్రకు పెద్దఆవ గింజత చనుపాలతోనిచ్చిన నజ్జు రొంప జర్వాదిరోగములు నివర్తించును కర్పూరము, రసభస్మము వేసినవారికి యీమందునియ్యరాదు.

306 సింధూరభూషణము తు 1 కి 2-0-0

ప్రాతస్సాయంకాలములయందు రెండుగురిగింజలయెత్తు చొ॥ తై తబెంకాయ నీరుతోగాని యాలక్కాయల కషాయముతోగాని నిమ్మ కాయరసముతోగాని సేవించిన దారుణమైన వాంతి వుడుకుజ్వరముతాప జ్వరము పైత్యజ్వరము సకలమేహములు బోగొట్టి శరీరపుష్టి గలుగ జేయును.



307 రసనంగము తు 1 కి రు 2-0-0.

ప్రాతస్సాయం కాలములయందు సెనగగింజంత చొ॥ వెన్నతో సేవించిన వుడుకు జ్వరములు దారుణ వాంతిరోగము నిక్కాక తాపము శుక్లనష్టము మూత్రనాళములో మంట సకలమేహములను మేహానీరును. బోగొట్టును.

308 నాగార్జున రసము. తు 1 కి 2-0-0.

ప్రాతస్సాయం కాలములయందు సెనగగింజంత చొ॥ ఆవునేతితో నిచ్చిన సర్వఅజీర్ణములు జ్వరములను బోగొట్టి వీర్యవృద్ధిని జేయును, తేనెతో సేవించిన పైత్యరోగములు మేహరోగములు బాపును. తిప్ప తీగె కషాయముతో సేవించిన శుక్ల మేహము గట్టును. బూడిదిగుమ్మడి కాయ రసముతో నిచ్చిన వుదరరోగములు గుల్మరోగములు హరించును. నిమ్మకాయి రసముతో సేవించిన దంతవాతములు హరించును. రావిచె క్క కషాయముతో నిచ్చిన గ్రహణి రోగములు మూలశంఖలు హరిం చును. పురుగుడువేళ్ళ కషాయముతో సేవించిన శ్వాసకాస కఫరోగము లు కడుపులో రోగములు హరించును. మంకినవేళ్ళ రసముతో కడుపు పెరిగినవాండ్రు సేవించిన కడుపు వెన్నున అంటుకొనును. వేపాకు రసము తో పుచ్చుకొనిన 18 కుష్టువులుబాపును. పైకి వ్రాసిన కుష్టురణములు బాపును. తామరపువ్వుల రసముతో సేవించిన సమస్త మూత్రరోగము లను బోకార్చును. మిరియపు రసముతోసేవించిన పీనసరోగము హరిం చును. నీలియాకు రసముతో సేవించిన చలిజ్వరములు బోకార్చును. వా మురసముతో ఒకతులమెత్తు వేసిన గుఱ్ఱపు తెగుళ్లు పశువుల తెగుళ్ళు బాపును. తెల్లజిల్లేడువేరు కషాయముతో నిచ్చిన 13 సన్నిపాతములు జ్వరములు పటాపంచలై పోవును. అనుపాన విశేషముతో నిచ్చిన నానా రోగములు హరించును.

309 ఇంద్రవజ్రాయుధరసము తు 1 కి రు 2-0-0.

ప్రాతస్సాయం కాలములయందు గురిగింజయెత్తు అల్లపురసముతో

సేవించిన 20 మేహములు పంచగుల్మములు సర్వజ్వరములు శూలరోగము పైత్యములు మొదలగు రోగములను గుదుచ్చుటయేగాక సర్పదష్టునకు నీటితో అరుగదీసి కలికముగాను, తేలుపోటునకు నీటితో ఛాదిమైన వేసినతక్షణము విషము దిగిపోయి ఆరోగ్యమును కలిగించును.

310 పోంగి తు 1 కి రు 2-0-0.

ప్రాతస్సాయం కాలములయందు సెనగగింజంత చొ॥ కరక్కాయ కషాయముతో నిచ్చిన సర్వజ్వరములు మూలవ్యాధులకు రక్తమూలములకు మేకపాలతోను మిరియాల కషాయముతోనిచ్చిన ఉదరరోగములు అతిమూత్రము చురుకు పాండువ గుండెజబ్బు లోనగు రోగములు తేనెతోగాని అల్లపు రసముతోగాని వేడినీళ్ళతోగాని యిచ్చిన మూర్ఛరోగములు, వావిలిఆకు రసముతో సేవించిన రాచపుండ్లు మాదరోగములు చిల్ల అడ్డగడ సవాయిరోగములు రణాలు కుష్టువ్యాధులు హరించును. నీరుల్లి రసముతోగాని ముషిణిచెక్క కషాయముతోగాని సేవించిన శూలరోగములు మూర్ఛరోగములు కుష్టురోగములు కుష్టురోగములకు నీయవుమధ మిచ్చునప్పుడు కండ్లకు వేపనూనె పెట్టుచుండవలెను. మారేడుచెక్క రసముతోగాని ములగచెక్క రసముతోగాని యిచ్చిన వుదరవాయువులు, ఎనుబదివాతరోగములు, కరక్కాయ కషాయముతోనిచ్చిన శ్వాస కాస వుబ్బస వ్యాధులు, తమలపాకుల రసముతో లోపలికియిచ్చి పైకివ్రాసిన పాము, తేలు, వెఱ్ఱికుక్క మొదలగు సమస్త విషములను బోకార్చును.

311 యింగిలీకమయినము తు 1 కి రు 1-0-0.

ప్రాతస్సాయంకాలములయందు గురిగింజంత చొ॥ వుష్ణోదకముతోగాని, దాచినచక్క రసముతోగాని, సేవించిన, మిగులవేడిచేసి అన్యోవిరేచనములు, అజీర్ణవిరేచనములు, వాంతిఅయ్యే విరేచనముయ్యే రోగములను ఖండించును, దీనిలో పెసరగింజంత నల్లమందుచేర్చి సేవించిన, గ్రహణిరక్త గ్రహణి అతిసారరోగములను నిర్మూలించును.



312 తాంమ్రమయినము తు 1 కి రు 4-0-0.

ప్రాతస్సాయం కాలములయందు, కందిగింజంత చొ॥ మిరియాల కషాయముతోగాని, వుష్ణజలముతోగాని సేవించిన యెడల, శ్వాస, కాస, అజీర్ణము, వాతరోగములను బోకార్చును.

313. సర్వీరమైనము తు 1 కి రు 2—0—0.

ప్రాతస్సాయంకాలములయందు పెద్దఆవగింజంత చొ॥ అల్లపురసముతోగాని, మిరియపు కషాయతోగాని, ఉష్ణోదకముతోగాని సేవించిన అష్టవిధజ్వరములను తొలగించి ఆకలి గలుగజేయును.

314. బడబానల రసము తు 1 కి రు 6-0-0.

ప్రాతస్సాయం కాలములయందు గురిగింజంత చొ॥ వావిలాకుకషాయముతోగాని, మిరియపు కషాయతోగాని, సేవించిన దుస్సాధ్యములగు సకలవిధరోగములు సన్నిపాతజ్వరము పక్షవాతములు సూతికావాయువులు, ధనుర్వాయువులు, మొదలగు 80 వాతములను నాలుక శరములు బిగదీయు రోగము మొదలగు ఘోరరోగములు సూర్యుని గాంచిన, చీకటిభంగి నశించును.

315. నారికేళాంజనము తు 1 కి రు 2—0—0.

ప్రాతస్సాయం కాలములయందు ఇండుగగింజంతచొ॥గాని, శెనగగింజంతగాని, అనుపానము యేమియు అక్కరలేకయే వారముదినములు సేవించిన, సర్పోపదంశములు (లేక) సవాయిరోగములు బగ్గిమచ్చ, పొడ కీళ్లుపడిపోవుట లేక నొప్పులు వగయిరా సవాయివల్ల వచ్చే సకలదుర్గుణములు సూర్యుని చూచిన మంచుభంగి పటాపంచలై పోవును. పత్యం అవసరములేదు—.

316. సర్వవ్యాధిహరణ రసాయనము తు 1 కి రు 3-0-0

ప్రాతస్సాయం కాలములయందు అల్లపురసముతో శెనగలవలె మాత్రలుగట్టి అల్లపురసముతోగాని సుగంధికషాయముతోగాని సేవించిన సవామేహములు శెగమేహములు యీవ్యాధులవల్ల వచ్చే శరీరమునం

దు అనేకవిధములయిన మచ్చలు శిశ్నము వాపు నొప్పి దురద సూదులతో పొడిచినట్లుండుట కోడిజుట్టు అసాధ్యకొరుకు తూట్లు పడియుండుట చెదపుట్టలవలె సిథిలంబైయుండుట. సుఖవ్యాధులవల్ల గలిగే సమస్తదుర్గుణములను మొదలంట ఖండించును.

317. లవణ శింధూరము తు 1 కి రు 2-0-0.

ప్రాతస్సాయకాలములయందు అణాయెత్తు చొ॥ అల్లపురసానుపానముతో యిచ్చిన శూల కడుపులో పోట్లు అజీర్ణవ్యాధులు మొదలగు అనేకరోగములను గుదుర్చును. తేనెతో సేవించిన మిక్కిలి వీర్యవృద్ధి ధాతుపుష్టికలుగును నపుంసకులు 40 దినములు సేవించిన తిరిగి పుంస్త్వము కలును.

318. రతివల్లభరసము తు 1 కి రు 4-0-0.

ప్రాతస్సాయం కాలములయందు రెండు గురిగింజల యెత్తు చొ॥ తేనెతోగాని, వెన్నతోగాని, తేనె, వెన్న కలపిగాని, నేయి, తేనె కలిపిగాని, గుమ్మపాలతోగాని, సేవించిన మహాక్షయలు శుష్కించిపోవుట వింశతి మేహములు బలక్షయము ఇంద్రియక్షయములోనగు క్షయరోగమువల్ల కలిగే సమస్తదుర్గుణములను ఖండించుటయేగాక మధ్యను వచ్చిన నపుంసకత్వము బోకడచి మంచియవ్వనమును రూపమునునిచ్చి తేజోవంతులుగా జేయును.

319 మకరధ్వజము తు 1 కి రు 20—0—0.

ప్రాతస్సాయంకాలములయందు ప్రత్యహము రెండు గురిగింజలయెత్తు ప్రమాణము తేనెతో సేవింపుచుండిన పాండు, క్షయ, గుల్మ, కాస, శ్వాస మొదలగు ననేకరోగములను బోకార్చును. తులమెత్తు అవుషధమునకు పావుతులం పచ్చకర్పూరము, లవంగాలు మిరియాలు జాజికాయ యివి జేడెత్తు చొ॥ తమలపాకుల రసముతో బాగుగ కలియనూరి గురిగింజలవలె మాత్రలుచేసి రెండు మాత్రలను తమలపాకులో నుంచి భక్షించి కాచిన ఆవుపాలనందు శర్కరకలిపి పుచ్చుకొనిన అగ్ని



బలము, మేధ, కాంతి, ఆయుష్యము, కామోద్దీపనము, అమితమగు సంభోగశక్తిని గలుగజేయును. దీనిని రత్యంతమందుగాని రత్యాదియందుగాని సేవింపవలయును. అటులు సేవించిన అనేక స్త్రీలను రమించినను శుక్లధాతుక్షయములు కలుగకుండును. ఇందు సువర్ణాది ధాతువులు చేరియున్నవి. వారము దినములు వండే వంట అవుషధము.

చూర్ణములు.

320 మహాద్రాక్షాది చూర్ణము.

అరమండలము 20 రోజులుకు సరిపడు చూర్ణము రు 3-0-0.

దీనిని ప్రాతస్సాయంకాలములయందు పావుతులముయెత్తు చూర్ణములో అరతులముయెత్తు పంచదార కలపి ఆవునేతితోగాని గుమ్మపాలతోగాని గాచిన ఆవుపాలతోగాని నాలుగు మాసములు ప్రాతస్సాయంకాలములయందు సేవించిన రక్తపైత్యము కాళ్లుచేతులు మంటలు అస్రుగ్ధరము శగరోగములు, సోమరోగము మూత్రముతో గలసి తీపిపోవుట మధుమేహము మూత్రాఘాతము మూత్రకృచ్ఛము అత్యుగ్రమయిన వాంతి అరుచి, శ్వాస, కాస, జ్వరము, పీనస, పడిశము, వుదరరోగము, రసాది ధాతునాశనము ముదిమి సకలవిధములగు మూలవ్యాధులు, కామిల, రొమ్మునొప్పి, తలనొప్పి, కడుదారుణమైన కడుపుబ్బరము, శరీరము దురద, దద్దురులేచుట శీతపైత్యము మలమూత్రబద్ధము వీట్లను హరింపజేయును. దీని సేవవలన వృద్ధుడుసహితము పుత్రోత్పత్తిని కలుగజేయదగినంత వీర్యవృద్ధి కలవాడు అగును.

మరియు మృతశిశువును గను స్త్రీలు, గర్భస్రావముగల స్త్రీలు సేవించిన, సర్వగుణయుక్తుడై రోగవిహీనుడై నారాయణ భక్తిగలవాడయి నూరు సంవత్సరములు జీవింపగల పుత్రుని గనును. మరియు జన్మవంధ్యలు అనగా (గొడ్రాళ్లు) సేవించిన పుత్రులను బడయుదురు. మరియు దీని సేవవలన వృద్ధులుసహా యవ్వనము గలవారయి గుర్రముతో సమానమయిన గర్వము, యేనుగతో సమమయినబలము పరాక్రమము

గలవారలయ్యెదరు. దీనిని సదా సేవించుచుండిన హనుమంతునితో సమానమయిన బలముగలవాడగును. యీ మహాదాడిమాది చూర్ణము అనేక రోగములను బరిమార్చును.

321 శ్లేష్మాంతక చూర్ణము బు 1 కి రు 2—0—0.

పూటకు రెండు అణాలయెత్తు చొ॥ చక్కెరతో కలపి సేవించిన శ్లేష్మజ్వరములు, శ్వాసకాసరోగములు, వుబ్బసము, అగ్నిమాంద్యము, గ్రహణి మొదలగు రోగములను బోకార్చును.

322 అగ్నిముఖ చూర్ణము డ 1 కి రు 1—0—0.

ప్రాతస్సాయంకాలములయందు రెండణాలయెత్తు చొ॥ శొంఠి రసముతోగాని, వుష్ణోదకముతోగాని, ఆవునేతితోగాని కలపి సేవించిన సకల అజీర్ణములు, కడుపు వుబ్బరము, శ్వాసకాసలు, ఎక్కిళ్ళు రొమ్ము నాభి, పొత్తికడుపు వీట్లయందు పోట్లు, అగ్నిమాంద్యము హరింపజేసి, పలువిధాన్నములు భక్షించినను తక్షణము జీర్ణముజేయును.

323 అహిఫెన్య చూర్ణము డ 1 కి రు 1—8—0.

ప్రాతస్సాయంకాలములయందు రెండు అణాలయెత్తు చొ॥ అర తులంయెత్తు పంచదార గలపి సేవించిన విరేచనంబయి అగ్నిమాంద్యము మూలరోగము ప్రమేహము క్రిమిరోగము వాత పిత్త కఫ పాండువులు హృద్రోగము వీట్లను బోకొడచును.

324 చందనాది చూర్ణము డ 1 కి రు 1—8—0.

ప్రాతస్సాయంకాలములయందు రెండు అణాలయెత్తు చొ॥ చన్నీళ్ళతో సేవించిన శిరోభ్రమణ, పైత్యము, కామిలాపైత్యము లోనగు వింశతిపైత్యములు పైత్యపిత్తాది జ్వరములు సకల శగవ్యాధులు నిర్మూలన మగును.

325 లవంగాది చూర్ణము డ 1 కి రు 2—0—0.

ప్రాతస్సాయంకాలములయందు రెండు అణాలయెత్తు చొ॥ దీనికి సమము పంచదారచేర్చి ఉష్ణోదకముతో సేవించిన అరోచకము, శ్లేష్మ



జ్వరములు శూలరోగములు మేహశూలలు బలిష్టమగు వగర్పు అజీర్ణములు గ్రహణిరోగములును బోకార్చును.

326 ఖర్జూరాది చూర్ణము డ 1 కి రు 2—0—0.

ప్రాతస్సాయంకాలములయందు పావుతులం చొ॥ సమము పంచదారకలపి ఉష్ణోదకముతోగాని సున్నపు తేటతోగాని బియ్యముకడిగిన నీళ్ళతోగాని సేవించిన మూత్రకృచ్ఛ్రలు అంగములో జనించు రణములు నీరుచురుకు శగవ్యాధులు మేహరోగములు గుదరోగములు శుక్లమేహము మూత్రమందు రాళ్ళుపడుట మొదలగు అనేకరోగములను జోగొట్టి మిక్కిలి వీర్యవృద్ధిని జేయును.

327 మహాశ్వగంధాది చూర్ణము డ 1 కి రు 3—0—0.

ప్రాతస్సాయంకాలములయందు పావుతులంయెత్తు చొ॥ సమము శర్కరకలపి నేతితోగాని తేనెతోగాని కలపి సేవించిన పురాణజ్వరములు అజీర్ణములు సకల క్షయలు మందాగ్ని పాండువులు మొదలగు అనేక రోగములను దునిమి మిక్కుటముగా వీర్యవృద్ధిని జేయును.

328 వృద్ధదారు చూర్ణము డ 1 కి రు [illegible]—0—0.

ప్రాతస్సాయంకాలములయందు రెండణాలయెత్తు చొ॥ ఆవునేయి తోగాని తేనెతోగాని వేడినీళ్ళతోగాని సేవించిన రసము శుద్ధులొనరించక సేవించిన దానివల్లవచ్చు సమస్త దుర్గుణములు 18 సవాయిరోగములు మేహరణములు పాండువులు గుండెశూలలు సకలాజీర్ణ జ్వరములు పక్షఘాత ధనుర్వాతాది సకలవాతములు ఆశ్చర్యముగా 20 దినములు సేవించిన నిశ్శేషముగా తగ్గిపోవును.

329 యోగరాజ చూర్ణము డ 1 కి రు 4-0-0.

ఉదయము మాత్రమే అరతులం యెత్తు చొ॥ ఉష్ణోదకముతో సేవించిన జలోదరాది అష్టోదరములు కడుపులో గ్రంథులు జ్వరబిళ్ళలు సకల గుల్మవ్యాధులు జలకూర్మాలు పాండువులు శోఫలు శిరోభ్రమలు పంచకాసలు శ్వాసరోగములు చలిజ్వరములు పురాణజ్వరములు సకలా

జీర్ణములు వమన దోషములు రక్తవాతములు అన్నద్వేషము పక్షవాతాదులు గొంతునొప్పులు నలిపురుగు ఏలుగుపాములు గలుగు క్రిమిజ్వరములు పిచ్చరోగములు మూర్ఛారోగములు క్షయరోగములు కామిలారోగములు సకల శూలరోగములను దెగటార్చును.

330 మహాతాళీశ్యాది చూర్ణము డ 1 కి రు 2-0-0.

ప్రాతస్సాయం కాలములయందు రెండుఅణాలయెత్తు చొ॥ ఉష్ణోదకముచే సేవించిన శ్వాసకాసలు జ్వరములు క్షయలు అహితవు అగ్నిమాంద్యాది అనేకరోగములను బాపును.

331 గ్రహణిరాజ చూర్ణము డ 1 కి రు 1-0-0.

ప్రాతస్సాయంకాలములయందు అణాయెత్తు చొ॥ ఉష్ణోదకముచే సేవించిన గ్రహణ్యతిసార రోగములయందు అద్భుతముగా పనిచేయును

332 మదనేశ్వర చూర్ణము సీ 1 కి రు 3-0-0.

ప్రాతస్సాయం కాలములయందు అణాయెత్తు చొ॥ ఆవునేతితో సేవించిన మదించిన స్త్రీలయొక్క మద మడంపజాలునంత రతిదారుఢ్యమును కలుగజేయుటయే గాక మంచియవ్వనమును రూపమును కలుగజేయును.

333 గంగాధర చూర్ణము డ 1 కి రు 1-0-0.

ప్రాతస్సాయంకాలములయందు రెండణాలయెత్తు చొ॥ పంచదారతోగాని తేనెతోగాని సేవించిన ప్రవాహముగా నయ్యే గ్రహణ్యతిసారరోగములు ఆశ్చర్యముగా గట్టును.

334 బలవర్ధనాది చూర్ణము డ 1 కి రు 2-8-0.

ప్రాతస్సాయంకాలములయందు రెండణాలయెత్తు చొ॥ తేనెతో సేవించిన సకల మేహరోగములను బోగొట్టి దేహమునకు రక్తశుద్ధి బలమును యిచ్చును. కాంతిని గలుగజేయును.

335 ఆమ్లాది చూర్ణము. డ 1 కి రు 1-8-0.

ప్రాతస్సాయంకాలములయందు రెండణాలయెత్తు చొ॥ రెట్టింపు



పంచదారకలిపి శీతలోదకముచే సేవించిన సకలవిధ అమ్లపైత్యములు రక్తవాంతులు రక్తమూత్రాదులు గర్భిణీశూలలు రక్తపిత్తవ్యాధులు తగ్గును.

336 మేహాంతక చూర్ణము డ 1 కి 1-8-0.

ప్రాతస్సాయంకాలములయందు పావుతులం చొ॥ మజ్జిగతో కలిపి సేవించిన యిరువది మేహములు శుక్లనష్ట వ్యాధులు గుదర్చడమేగాక మహాబల సంపన్నులనుగా జేయును.

337 మహాపిరంగాది చూర్ణము డ 1 కి రు 4-0-0.

ప్రాతస్సాయంకాలములయందు రెండుఅణాల యెత్తు చొ॥ ఆవునేతితోగాని తేనెతోగాని వేడినీటితోగాని సేవించి పాలుఅన్నం నెయ్యిభుజించుచు ఉప్పు పులుసు వర్జించి యీలాగున సేవించిన తొడలలోనుంచి పుట్టిన జిలవాయువులు సర్వాంగవాయువులు పక్షవాత వాయువులు ధనుర్వాతములు కుదర్చడమేగాక 18 కుష్ఠురోగములు సవాయిరణములు బోకార్చును.

338 జంతునాశన చూర్ణము డ 1 కి రు 2-0-0.

ప్రాతస్సాయంకాలములయందు రెండుఅణాలయెత్తు చొ॥ శీతలోదకముచేగాని బెల్లముచేగాని చెరకురసముతోగాని సేవించిన యెమిడకలు నుసిపురుగులు జచ్చి విరేచనమార్గముగా పడిపోవును.

339 తాళీసాది చూర్ణము డ 1కి రు 1-8-0.

ప్రాతస్సాయం కాలములయందు పావుతులం యెత్తు చొ॥ ఉష్ణోదకముతోగాని, వట్టిది చప్పరించి మ్రింగిన అరుచి, హృద్రోగము కాస శ్వాస, పాండువ, హి[క్క], వమనము, గ్రహణి కుదుర్చుటయేగాక నిఖిలాజీర్ణ రోగములను గ్యారంటిగా కుదుర్చునని రూఢిగ జెప్పగలము.

340 మూలరోగహరచూర్ణము డ 1 కి రు 2-0-0.

ప్రాతస్సాయంకాలములయందు రెండు అణాలయెత్తుచొ॥ శీతోదకముతో 15 దినములు సేవించిన ఎంత దుర్ఘటమగు మూలవ్యాధులయినప్పటికి నిశ్శేషముగా పోవుటయేగాక గండమాలలు గుదరణములు గ్రహణ్యతిసారము లోనగు అనేకరోగములను మాన్పును. అనుభవయోగము.

☞ భస్మములు, వంగౌషధములు, ఖజ్జీరౌషధములు. చూర్ణములకు అనుభవజ్ఞులగువారలు తమ అనుభవ ప్రకారము, అనుపానములను మోతాదులను రోగసాధ్యాసాధ్యములను బట్టియు, దేశకాలపాత్రలనుబట్టియు, అప్పటిస్థితినిబట్టియు, నిర్ణయించి యిచ్చినను యివ్వవచ్చును. అనుపానపథ్యాదులు విస్తరించి గ్రంథవిస్తరభీతిచే, వ్రాయలేదు. ఒక్కొక్క ఔషధము అనుపానభేదముచే, అనేకరోగములను, బోగొట్టుటనుబట్టి ఒక్కమందునకే అనేకములగు పథ్యములు వ్రాయవలసివచ్చినందున, పథ్యములు రోగములకేగాని, మందులకు ఎచటనోగాని చెప్పియుండనందున, మందులనుబట్టి పథ్యములాచరించవలసివచ్చినప్పుడు, అట్టిమందులయొక్క పథ్యములు ఆమందులయొక్క దిగువనేవ్రాసియుంటిమి. మిగతమందులు ఏరోగమునుగురించి మందు సేవించెదరో, ఆయారోగములవిషయమై, పథ్యములు ముందువ్రాసిన ప్రకరణములోనే నిమిడియున్నందున అవిచూచి, ఆయారోగములకు చెప్పిన పథ్యములాచరించదగినది. ఏవైనాకొన్నిరోగములకు పథ్యాదివిధులులేనిచోట, తనకిదివరలో సరిపడనిపదార్థములు, ఆవ. నూని గుమ్మడి, బత్సలి, చింతపండుపులుసు, దుంపకూరలు, ఎండినచేపలు, మాంసాదులు చెడినవియు కుళ్ళినవియునగు పదార్థములు జీర్ణముకాని గురుత్వపదార్థములను, విసర్జించి మిగతసమస్తపదార్థములను భుజించుచుండవలెను.

☞ సవాయి ఔషధములకు వ్రాసిన మందులు సేవించు కాలములో, అందుండు మూలికలయొక్కయు, రసాదులయొక్క ఘాటువలన, కొన్నితత్వములకు నోరుగాబుచేసి ఇగుళ్లు వాచి సలిపినరొండల, గుంటకలగరాకురసము, గుమ్మపాలు, తేనె, రావిచెక్కకషాయము, మొదలగునవి పుక్కిటబట్టి రోజుకు రెండుమూడు సారులు ఉమియుచుండవలెను. కవిరితో తమలపాకులుగాని, తులశి ఆకులుగాని, తాంబూలము వేయుచుండవలెను. కప్పువగైరాలతో పండ్లుతోముకొనుచుండిన, నాల్గుమూడురోజులలో ఉపశాంతించును.

